ఓం

# శ్రీమలయాళ సద్గురు గ్రంథావళి

## రెండవ సంపుటము

## శ్రీస్వబోధసుధాకరము

ప్రకాశకులు

శ్రీ వ్యాసాశ్రమ వజ్రోత్సవ సంఘము

**శ్రీవ్యాసాశ్రమము**

చిత్తూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్

2001

# నివేదన

శ్రీవ్యాసాశ్రమం ప్రచురిస్తున్న ఆధ్యాత్మిక గ్రంథాలు పాఠకలోకానికి సుపరిచితాలే. ఈ గ్రంథాలను భక్తులు మిక్కిలి శ్రద్ధతో పఠిస్తున్నారు. ఆధ్యాత్మిక సారస్వత ప్రచారం ద్వారా సాటి లేని సేవ చేసే సంస్థగా ఆశ్రమం ప్రసిద్ధి వహించింది.

మహర్షి - సద్గురు శ్రీ మలయాళస్వాములవారు స్వయంగా రచించిన గ్రంథాలు ఆశ్రమప్రచురణలలో అత్యంత విశిష్టమైనవి. అవి పలు సార్లు ముద్రణ పొంది అనన్య సామాన్యమైన ప్రచారం పొందాయి. జిజ్ఞాసు జనానీకంలో జడత్వాన్ని తొలగించి చైతన్యం కల్గించడంలో విజయం సాధించాయి.

శ్రీవారి రచనలు ప్రస్తుతం వివిధ పరిమాణాలలో నానాగ్రంథాలుగా ముద్రింపబడివున్నాయి. వీటినన్నింటిని ఒకే పరిమాణం కల గ్రంథ రాశిగా ''శ్రీమలయాళ సద్గురు గ్రంథావళి'' అన్న పేరుతో ముద్రించడం మంచిదని అభిజ్ఞులు సూచించారు. ఈ సూచనను పూజ్యశ్రీ విద్యానందగిరి స్వాములవారు ఆమోదించారు.

శ్రీవారు గోగర్భములో తపస్సు చేసే సమయం 1919లో రచించిన శుష్కవేదాంత తమోభాస్కరం ఇందులో మొదటి సంపుటమవుతుంది. ఇంచుమించు ఆగ్రంథాన్ని పోలిన పరిమాణంలోనే తక్కిన సంపుటా లుంటాయి. ఇలా ప్రచురిస్తే ఒక్కొక్కటీ సుమారు నాలుగువందల పుటలు గల సంపుటాలు ఇరువదికి పైగా సిద్ధమవుతాయి.

2001వ సంవత్సరంలో జరుగనున్న శ్రీవ్యాసాశ్రమవజ్రోత్సవ

శుభసందర్భంలో పై సంపుటాలను విడుదల చేయాలని శ్రీస్వాములవారి సమ్మతితో వజ్రోత్సవ నిర్వాహక సంఘం వారు నిర్ణయించారు. ఈ సంపుటాల క్రోడీకరణ, ముద్రణ శ్రీ సముద్రాల లక్ష్మణయ్య గారి సంపాదకత్వం క్రింద జరుగుతున్నది.

భగవదనుగ్రహంతో, శ్రీసద్గురుదేవుల ఆశీర్వాదంతో, భక్తుల ప్రోత్సాహంతో ఈ గ్రంథ ప్రచురణ ప్రణాళిక విజయవంతం కాగలదని ఆశిస్తున్నాము.

శ్రీ వ్యాసాశ్రమం
1-3-2000 ప్రకాశకులు

ఓం తత్ సత్ ఓమ్

# మున్నుడి

## శ్రీ శ్రీ శ్రీ విద్యానందస్వాములవారు

శ్రీవ్యాసాశ్రమ పీఠాధిపతులు

సర్వమాత్మమయం విశ్వమితిజ్ఞానిష్వనుత్తమః ।
మహర్షిసత్తమో మాన్యో మలయాళయతీశ్వరః ॥ 1

చరాచరసుఖార్థీ చ లోకానుగ్రహకాంక్షయా।
రచయామాస సద్గ్రంథా నాత్మజ్ఞాన ప్రబోధకాన్॥ 2

శ్రీస్వబోధసుధేత్యాదినామా తేషు విలక్షణః।
పఠంత్వేతం జనాస్సర్వే భావయంతు తదర్థకాన్॥ 3

పరిపూర్ణపరబ్రహ్మస్వరూపులగు ప్రియాత్మ బంధువులారా !

ఈ బ్రహ్మాండమంతయు పరబ్రహ్మ స్వరూపము. ఈ యాత్మయు పరబ్రహ్మమే యగును సుమా! కనుకనే మహాత్ములు సమస్తము స్వస్వరూపమనియే భావింతురు. అందుచేత వారు దేనిని కూడ ద్వేషింప జాలరు. సర్వమును బ్రహ్మాత్మరూపముతో ప్రేమింతురు. ఇట్టి భావముచే సమస్తసంకుచిత హృదయ గ్రంథులు సంపూర్ణముగా క్షయించును. కావున వారు రాహువిముక్తచంద్ర దివాకరులవలె సర్వసంసారబంధవిముక్తులై పరమానందముతో విరాజిల్లుదురు. మఱియు లోకానందసంధాయకులై లోకోద్ధారకు లగుదురు.

అట్టి సువిశాలస్వభావముగల మహానుభావులలో మహర్షి పుంగవులైన శ్రీ శ్రీ శ్రీ మలయాళ సద్గురువరేణ్యు లొకరు. వీరు బ్రహ్మనిష్ఠులై లోకోపకార కార్యములలో నిమగ్నులై యుండెడి వారు. మఱియు ఓం సర్వేషాం స్వస్తిర్భవతు! ఓం సర్వేషాం శాన్తిర్భవతు! ఓం సర్వేషాం పూర్ణం భవతు! ఓం శాన్తిః శాన్తిః

శాన్తిః అని గీతాపారాయణాది నిత్యకార్యక్రమములయందు సంయితము స్వయముగా జెప్పుచు, భక్తులచే జెప్పించుచు నుండెడివారు.

ఈ విధముగా లోకోపకార పరాయణులు గనుకనే సర్వజన హితకరములగు సద్గ్రంథముల నెన్నింటినో విరచించిరి. వానిలో శ్రీ స్వబోధసుధాకర మొకటి. శుభస్కరమైన ఆత్మజ్ఞానమనెడి యమృతమునకు గని యైనదని దీని యర్థము. దీనిలో ౩౮ విషయములు గలవు. దీనిలో సంస్కృతవిద్య, వివాహసువిచారము, ధ్యానము, సమత్వము, విశ్వప్రేమ, సమరసజ్ఞానము, పూర్ణసుఖము మొదలగు మహోత్కృష్టములు,, హితప్రబోధకములు, ఆత్మజ్ఞానోపయోగములును అగు సద్విషయము లెన్నో ఉన్నవి. భక్తులు జిజ్ఞాసువులు ప్రేమతో పఠించి బహుముఖ ప్రయోజనముల బడయుదురు గాక! ఓమ్.

లోకాస్సమస్తా స్సుఖినోభవన్తు.

ఓం శాన్తిః శాన్తిః శాన్తిః

ఓం తత్సత్ ఓమ్.

# ఉపోద్ఘాతము

ఓ దైవాత్మస్వరూపులగు ఆత్మసోదరీ సోదరులారా! భారతఖండములో జన్మించిన వారందరును పరమఋషుల సంతానము లనియే మహాపురుషుల నిశ్చితాభిప్రాయము. దీనివల్ల ఇతరదేశీయులు ఋషివంశీయులు కారని నా అభిప్రాయము గాదు. అయితే విదేశీయులు వారి వంశమును జెప్పునప్పుడు మరియొక విధముగా చెప్పుచుందురు. కాని అందరును మనువంశీయులగుట చేతనే, ప్రపంచములో గల సర్వజనులకును మానవులనియో, లేక మనుష్యులనియో పేరు గల్గినట్లు అమరకోశాది నిఘంటువులు చెప్పుచున్నవి. మనము ఈ భావమునే గ్రహించవలయును. ఇదే విశాలభావమునకు మార్గమిచ్చునది. అప్పుడు మాత్రమే ప్రపంచ సోదరభావమున కును, ప్రసన్న హృదయమునకును అవకాశము గల్గును.

ఇట్టి హృదయవైశాల్యభావములోనికి వెళ్ళుటకు మనశ్శక్తి లేకపోయినచో భారతీయులను మాత్రమైనను సోదరభావముతోను, ఇతరులను మిత్రభావముతోను జూచుట కొరకే పైనుదాహరింపబడిన భారతీయులను ఋషి సంతానములని చెప్పుటకు కారణమైనది. పైనుదాహరించిన రెండు సంగతులచే మాత్రమే హృదయ సంకుచిత గ్రంథులు సంపూర్ణముగా క్షయించినవి అని గాని, సంపూర్ణమైనహృదయవికాసము గలిగినదని గాని తలంచుట కవకాశము గలుగదు. పూర్ణమైన ఆత్మవికాసము గల్గినచో, సమస్త ప్రాణికోట్లలోను దయగలిగి తన యాత్మవలెనే యితర ఆత్మకోట్లను గూడ జూచేలాగున నుండవలయును. ఇట్టి స్థితిలో మాత్రమే పూర్ణప్రబోధము గల్గియుండును. ఇట్టివారే పూర్ణప్రజ్ఞగల మహాపురుషు లగుదురు. ఈ అవస్థ గలుగని వారందరును ఏదో యొకవిధమగు హృదయావరణము గలవారే. పూర్ణిమచంద్రుడు మాత్రమే నిరావరణముగా, షోడశశోభాయమానకళలతో ప్రకాశించుచుండును. చంద్రబింబమునకు కొంచెమైన ఆవరణము గల్గియుండినచో పూర్ణిమ దినము కాలేదని తెలిసికొనునట్లు సర్వభూతములలో సమభావన గలుగని హృదయము ఇంకను పూర్ణావస్థను పొందలేదని గ్రహించవలెను.

ఈ స్వబోధసుధాకరము అనునది ఇంతవరకు యథార్థభారతిలో ముద్రించుకొనివచ్చిన వ్యాసము లన్నియు కూర్చుకొని ఒక గ్రంథముగా చేయుడమైనది. అనేక భక్తులు నెల నెలకు వచ్చుచుండు వ్యాసములను వ్రాసిపెట్టుకొనుచు వచ్చిరి. ఇది గ్రంథరూపముగా, ఎవరైనా ముద్రించినచో లోకమున కెంతో మేలు గలుగునని యనేకులు తెల్పుటచే దైవకృపచేత ఇప్పుడు గ్రంథరూపము దాల్చినది. సజ్జనుల సంకల్పములు వ్యర్థము గాజాలవుగదా! కనుకనే, ఇది పుస్తక రూపముగా పరమకారుణికుడగు సర్వేశ్వరుండు చేసి భక్తకోట్లకు ఇవ్వడమైనదని తలంచుచున్నాను. అంతేగాని, నాశక్తి దీనియం దేమియు లేదు. దీనిలో అక్షరముల పొరబాట్లు గాని ఇతరములగు తప్పిదములు గాని, గల్గియుండిన పరమదయతో పాఠకులు సవరించి చదువగోరుచున్నాను. మఱియు నట్టి దోషములు ఏవైన ఉండినచో కృపతో దెలుపగోరుచున్నాడను. ఆలాగున తెలుపువారికి కృతజ్ఞులమై యుండుటయే గాక, మరియొకసారి ముద్రించునప్పుడు సవరణ చేయుటకు గూడ కుతూహలము గలవారము. మహాపురుషులకు స్వయముగా గాని అన్యులచే గాని, లోకకల్యాణము గల్గియుండిన చాలునను తలంపు ఉండునే గాని, ఆ విషయములో వారు మరియేమియు యోచింపరు.

సర్వేఽత్ర సుఖినస్సంతు సర్వే సంతు నిరామయాః ।
సర్వే భద్రాణి పశ్యంతు మా కశ్చిద్దుఃఖమాప్నుయాత్॥

లోకాస్సమస్తా స్సుఖినో భవంతు,

ఓమ్ శాంతిః శాంతిః శాంతిః,

ఇట్లు మీ చరాచర సుఖాభిలాషి

మలయాళస్వామి.

ఓమ్

## శ్రీస్వబోధసుధాకరము

# విషయసూచిక

ఓం

# శ్రీస్వబోధసుధాకరము

❋❋❋

## ప్రార్థన

శ్రుతి॥ యశ్ఛందసా మృషభో విశ్వరూపః। ఛన్దోభ్యోఽధ్యమృతాత్సంబ భూవ। స మేన్ద్రో మేధయా స్పృణోతు। అమృతస్య దేవధారణో భూయాసం। శరీరం మే విచర్షణం। జిహ్వా మే మధుమత్తమా। కర్ణాభ్యాం భూరి విశ్రువం। బ్రహ్మణః కోశోఽసి మేధయా పిహితః। శ్రుతం మే గోపాయ॥

ఛందసాం = వేదములలో, ఋషభః = శ్రేష్ఠమైన, విశ్వరూపః= సర్వస్వరూప మగు, యః= ఏది, (ప్రణవము), ఛన్దోభ్యః =వేదములనెడి, అమృతాత్= అమృతస్వరూపమగు బ్రహ్మవలన, అధిసంబభూవ = కలిగెనో, ఇంద్రః= పరమేశ్వరరూపమగు, సః = ఆ ప్రణవము, మా = నన్ను, మేధయా= ప్రజ్ఞతో, స్పృణోతు = సంతోష పెట్టునుగాక, (ప్రజ్ఞాబలములను గలుగ జేయునుగాక!) హే దేవ = ప్రకాశస్వరూపమగు ఓ ప్రణవమా! అమృతస్య = బ్రహ్మ జ్ఞానముయొక్క, ధారణః = ధరించు వాడనుగా, భూయాసం= అగుదునుగాక, మే = నాయొక్క, శరీరం = దేహము, విచర్షణం = విచక్షణమైనది, (యోగ్యమైనది) భూయాత్ = అగును గాక, మే = నాయొక్క, జిహ్వా = నాలుక, మధుమత్తమా = మాధుర్యముగలది. (భూయాత్ = అగును గాక,) కర్ణాభ్యాం = శ్రోత్రములచేత, భూరి = విశేషముగా, విశ్రువం = వినువాడను అగుదును గాక (త్వం = నీవు,) బ్రహ్మణః =పరమాత్మకు, మేధయా = లౌకిక ప్రజ్ఞచేత, పిహితః= కప్పబడినవాడవై, కోశః = నివాసస్థానమన్ను, అసి=,

అగుచున్నావు. మే = నాయొక్క, శ్రుతం = శ్రవణజ్ఞానమును, (శ్రవణపూర్వకమైన ఆత్మజ్ఞానాదికమును), గోపాయ = రక్షించుమా !

అమృతస్వరూపమగు వేదములవలన పుట్టి, వేదములలో శ్రేష్ఠమై సర్వ స్వరూపమును, పరమేశ్వర స్వరూపము నగు ఓంకారము, నన్ను మఱపులేని బుద్ధితో స్పృశించును గాక! ప్రకాశ స్వరూపమగు, ఓ ప్రణవమా! బ్రహ్మజ్ఞానము యొక్క ధారణ నాకు అగునుగాక! నాశరీరము పరిశుద్ధమగును గాక! నాజిహ్వ మాధుర్యము గలది యగును గాక! శ్రోత్రములచేత నేను అనేకములు వినినవాడ నగుదునుగాక ! ఓంకారమా! నీవు బ్రహ్మకు స్థానమై, మఱపులేని బుద్ధిచేత కప్పబడిన దానవైతివి. ఇటువంటి నీవు నేను వినిన ఆత్మజ్ఞానము మొదలగు విజ్ఞానమును రక్షింపుమా!

## హరిః ఓమ్

ఉపనిషత్తు అనునది వేదాంతము, వేదశిరస్సు, వేదసారము, బ్రహ్మవిద్య అని పెక్కు నామములతో వ్యవహరింపబడును. ఇయ్యది శ్రీమన్నారాయణాంశ సంభూతుడగు వేదవ్యాసమహాముని చే ఋగ్యజుస్సామాథర్వములను నాలుగువేదములందు గల జ్ఞానకాండము ఉపనిషత్తను పేరుతో ప్రత్యేకముగా విభజింపబడియెను. ఈ ఉపనిషత్తులలో 108 ముఖ్యములని వ్యవహరింప బడును. మరియు కొన్ని యుపనిషత్తులు గలవు. పైనిజెప్పిన 108 ఉపనిషత్తులలో మిక్కిలి ప్రసిద్ధములైనవి దశోపనిషత్తులు. అవి వరుసగా 1. ఈశ, 2. కేన, 3. కఠ, 4. ప్రశ్న, 5. ముండక, 6. మాండూక్య, 7. తైత్తిరీయ, 8. ఐతరేయ, 9. ఛాందోగ్య, 10. బృహదారణ్యకములు అనునవి. ప్రస్థానత్రయ మనబడు ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, భగవద్గీతలు అను నీ మూటికిని భాష్యములను రచియించిన శ్రీమదాది శంకరాచార్యస్వాములవారు శ్వేతాశ్వతరోపనిషత్తు, నృసింహతాపిన్యుపనిషత్తు అను నీ రెంటికిని భాష్యమును రచియించి యున్నారు. ఈ ఉపనిషత్తుల పఠనమునకు ఆదిలోను,

అంత్యముననను శాంతిమంత్రములు పఠించవలయును. ఇది శిష్టాచారమై యున్నది. ఈ శాంతి మంత్రపఠనమువల్ల విఘ్నములు నివృత్తియగుటయేగాక, పాఠపఠనములోగల దోషమెద్దియైన యుండినచో, అదియు శమించును. మరియు మూడుసార్లు ఏల శాంతి చెప్పుచుందు రనగా! ఆధ్యాత్మిక, ఆధిదైవిక, ఆధిభౌతిక దోషములు అనగా దుఃఖములు శమించుటకు అది కారణ మగుచుండును. దీనికే తాపత్రయమను పేరు గల్గుచున్నది. మరియు మనోవాక్కాయకర్మలచే గలిగెడు దోషరాహిత్యముకొరకును, ధ్యాతృ ధ్యానధ్యేయముల నిర్విఘ్నముకొరకును, స్థూలసూక్ష్మకారణశరీర దోష నివృత్తికొరకును, భూతభవిష్యద్వర్తమానదోష నివారణకొరకును, దృగ్దృశ్యదర్శనములనెడు త్రిపుటుల ఐక్యమునకు గల దోషనివారణకొరకును, సంచితాగామి ప్రారబ్ధ కర్మత్రయంబుల దోషనివృత్తికొరకును, సత్త్వరజస్తమోగుణ దోషరాహిత్యముకొరకును ఈ శాంతి మంత్రమేర్పడినది. ఈలాగున ఇక యెన్ని త్రైగుణ్యములు గలవో, వాని అన్నిటికిని ఇది శాంతి గలుగ జేసి మంగళముగా నొనర్చును.



# పంచశాన్తయః

1. ఓమ్ వాఙ్మే మనసి ప్రతిష్ఠితా, మనో మే వాచి ప్రతిష్ఠితం, ఆ విరావీర్మ ఏధి, వేదస్య మ ఆణీస్థః, శ్రుతం మే మా ప్రహాసీః, అనేనాధీతేన అహోరాత్రాన్ సందధామి, ఋతం వదిష్యామి, సత్యం వదిష్యామి, తన్మామవతు, తద్వక్తార మవతు, అవతు మాం, అవతు వక్తారమ్,

ఓమ్ శాన్తిః శాన్తిః శాన్తిః - హరిః ఓమ్.

వాక్ = బ్రహ్మవిద్యను ప్రతిపాదించు గ్రంథపాఠమునందు ప్రవర్తించు నావాక్కు, మే = నాయొక్క, మనసి = మనస్సునందు, ప్రతిష్ఠితా = సర్వదా ప్రతిష్ఠింపబడినది. (అస్తు = అగుగాక) మమ=నా యొక్క. మనః =మనస్సు, మే= నా యొక్క, వాచి = వాక్కు నందు, ప్రతిష్ఠితం = ప్రతిష్ఠింపబడినది. (అస్తు=

అగుగాక) మనస్సు సావధానముగ లేనియెడల సుప్తోన్మత్త ప్రలాపమువలె అసంగతముగా మాట్లాడును. వాక్కుకు పాటవము లేనియెడల గద్గదధ్వనితో మాట్లాడును. కాన వాఙ్మనస్సులకు అన్యోన్యానుకూల్యము ప్రార్థింపబడెను. (హే) ఆవిః = ఓ ఆవిర్భూతమగు బ్రహ్మచైతన్యమా? మే = నాకొరకు, ఆవిరేధి= నాయవిద్యను బోగొట్టుచు ప్రకటమగుము. (ఆవీః, యని దీర్ఘము కొన్ని పాఠము లందున్నది. అదియే క్రమమయిన పాఠమైన యెడల ఛాందసమై యుండును.) (ఒక ఆవిశ్శబ్దము బ్రహ్మవాచకమైన నామవాచకము. రెండవ ఆవిశ్శబ్దము ఉపసర్గము) పూర్వోక్తప్రకారము పరస్పరానుకూలము లగు ఓ వాఙ్మనస్సులారా! మే = నాయొక్క, వేదస్య = బ్రహ్మవిద్యను బ్రతిపాదించునట్టి నే చదివెడి గ్రంథమునకు, ఆణీ = ఆనయన సమర్థములై, స్థః = ఉండుడు! మే=నాయొక్క, శ్రుతం = గ్రంథము అనగా నాచేత వినబడిన గ్రంథ తదర్థజాతము, మా ప్రహాసీః = మరువబడినది గాకపోవుగాక, అనేన = ఈ, అధీతేన = అధ్యయనము చేయబడిన గ్రంథము చేతను, అహోరాత్రాన్ = రాత్రింబగళ్లను, సందధామి = సంయుక్తముగా జేయుదును. సోమరితనమును వదలి రాత్రింబవళ్లయందు అధ్యయనము జేయుదునని తాత్పర్యము. ఋతం = నేను జదివెడి గ్రంథములో పరమార్థమునే, వదిష్యామి = చెప్పెదను. సత్యం = యథార్థమునే, వదిష్యామి = చెప్పెదను. ఇచ్చట ఋతసత్యములకు మానసత్వవాచికత్వములచేత భేదము గాన పునరుక్తి లేదు. మనస్సుచేత వస్తుయాథార్థ్యమును విచారించి వాక్కు చేత పలుకుదును అని తాత్పర్యము. తత్ = ఆ చెప్పబోవు బ్రహ్మతత్వము, మాం = శిష్యుడనగు నన్ను, అవతు = రక్షించుగాక! తత్ = ఆబ్రహ్మతత్త్వము. వక్తారం = బోధకు లగు ఆచార్యులను, అవతు = రక్షించుగాక! మాం = శిష్యుడనగు నన్ను, అవతు = బ్రహ్మము రక్షించుగాక! వక్తారం = నా యాచార్యునిన్ని, అవతు= రక్షించుగాక, ఇచట తన్మామవతు తద్వక్తారమవతు, అనునవి సాధనకాలమందు విద్యోత్పత్తికి ప్రతిబంధకములగు విఘ్నములయొక్క పరిహారమును ప్రార్థించు వాక్యములు. అవతు మాం, అవతు వక్తారం, అనునవి విద్యోత్పత్త్యనంతరమునందు అసంభావనావిపరీతభావనాజనక విఘ్నములయొక్క పరిహారమును ప్రార్థించు

వాక్యములు. అవతు వక్తారం అను రెండవపర్యాయము చెప్పబడిన వాక్యము అధ్యాయసమాప్తి సూచన కొరకని తెలిసికొనదగినది. ఓం శాంతిః శాంతిః శాంతిః అని ముమ్మారు చెప్పుట ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవిక తాపత్రయ నివారణముకొరకును, ఇతర విఘ్నముల యుపశాంతికొరకు నని తాత్పర్యము.

నాయొక్క (ఈయుపనిషదధ్యయనమునందు ప్రవర్తించిన ) వాక్కు నిరంతరమును మనస్సునందు స్థిరమగునుగాక. నా మనస్సు వాక్కునందు నెలకొని యున్నది. ( వాక్కును మనస్సును పరస్పరము సహాయముగ నుండునుగాక యని ప్రార్థన) ఓ జ్యోతిః స్వరూపమైన పరమాత్మా! నాయజ్ఞత్వమును బోగొట్టి ప్రకాశము గలుగునట్లనుగ్రహింపుము. ఓ మనోవాక్కులారా! నాకు దిగువ నుదాహరింపబడు గ్రంథము నొసంగుటలో సమర్థులగుదురుగాక! నాచే వినబడిన గ్రంథమును దానియర్థమును మఱువక యుందును గాక! అధ్యయనము చేసి మఱువక యుండు గ్రంథమును నేను రేయియు, బగలును అనుసంధానము చేయుదును గాక! ( అధ్యయనము చేయబడిన గ్రంథమునందు ) యథార్థవస్తువును ( పరమాత్మను) అనువదించెదను. నీవే సత్యము. మనస్సుచే ( వాస్తవపదార్థమును విచారించి వాక్కుచేత సత్యమును జెప్పెదను.) మీద జెప్పిన బ్రహ్మము, నన్ను నా గురువును రక్షించును గాక! ఇచట మనోవాక్కులకు ఐక్యము గల్గి ప్రవృత్తి గలిగేలాగున ప్రార్థింపబడినది. ఇదే శిష్య లక్షణము, మనస్సన్యముగా, వచస్సన్యముగా ప్రవర్తించుట యుండ కూడదని భావము.

2. ఓమ్ పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణముదచ్యతే ।
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణ మే వావ శిష్యతే ॥
ఓమ్ శాన్తిః శాన్తిః శాన్తిః - హరిః ఓమ్.

అదః = పరోక్షముగ నున్నదియు, పూర్ణం = బ్రహ్మముచే పూర్ణమైనది, ఇదం= ప్రత్యక్షముగ నున్నదియు, పూర్ణం = బహ్మముచే పూర్ణమైనది, పూర్ణాత్= పూర్ణముకన్న, (పూర్ణముగా నున్నదని యూహింపబడిన జగత్తుకన్న) పూర్ణం=

పరిపూర్ణమైన బ్రహ్మము, ఉదచ్యతే = అతిక్రమించు చున్నది, పూర్ణస్య= పూర్ణమైన బ్రహ్మముయొక్క, పూర్ణం = పూర్ణమును, (అహం బ్రహ్మోస్మియను భావమును,) ఆదాయ= గ్రహించి (పొంది), పూర్ణమేవ = అసంగమైన కూటస్థస్వరూపబ్రహ్మమే, అవశిష్యతే= శేషించుచున్నది.

ఓమ్. అది (బ్రహ్మము) పూర్ణము ఆకాశమువలె సర్వత్ర వ్యాపించినది). ఇదియు ఉపాధులతో గూడినదియును, వ్యవహారములకు లోబడినదియును, కార్యాత్మకమై యుండునదియును అగు జీవాత్మయు పూర్ణము. ఆ పూర్ణవస్తువునుండి యీ పూర్ణవస్తువు గలిగినది. ఈపూర్ణవస్తువు (జీవుడు) విద్యచేత పూర్ణత్వమును గ్రహించిన యెడల పూర్ణమైన పరమాత్మగా శేషించును. (అనగా పరమార్థరూప వస్తువు నుండి వేఱే వస్తువువలె కనబడు జీవుని, ఆ పూర్ణమైన పరబ్రహ్మముని తెలిసికొని, అవిద్యచే గలిగిన నామరూపాదులను నివృత్తి చేసి, ''నేనే బ్రహ్మము'' అని తెలిసికొనినచో అప్పుడు తానే బ్రహ్మమగుచున్నాడు.

3. ఓమ్. సహనావవతు, సహనౌ భునక్తు, సహవీర్యం కరవావహై
తేజస్వి నావధీతమస్తు, మా విద్విషావహై ॥
ఓమ్ శాన్తిః శాన్తిః శాన్తిః - హరిః ఓమ్.

నౌ = శిష్యాచార్యులమగు మా యిద్దరిని, సహ = కూడ, అవతు = రక్షించునుగాక, నౌ = శిష్యాచార్యుల మగు మా యిద్దరిని, సహ = కూడ, (బ్రహ్మ= పరబ్రహ్మమును,) భునక్తు = అనుభవింప చేయునుగాక, సహ = కూడ, వీర్యం= సామర్థ్యమును (విద్యానిమిత్తకమైన సామర్థ్యమును,) కరవావహై= చేయుదుముగాక, అధీతం = అధ్యయనము చేయబడినది (మాయిద్దరి చేతను చదువబడినది) నౌ= మాయిద్దరికిని, తేజస్వి = తేజోవంతమైనది, అస్తు = అగునుగాక, (అర్థజ్ఞాన యోగ్యమైనదగు గాక) ఆవాం = శిష్యాచార్యుల మగు మే మిద్దరమును, మా విద్విషావహై = విరోధమును పొందకపోదుముగాక! (మా యిద్దరికిని ఏదైనను ప్రమాదము వలన ద్వేషము గలిగెనేని అది లేకుండపోవు గాక!).

మమ్ము (గురుశిష్యులను) రక్షింపనిమ్ము. (పరమాత్మా!) మాకు పోషణము గలుగనిమ్ము. మాకు విద్యావిషయమునందు సామర్థ్యము గలుగనిమ్ము. మేము నేర్చిన బ్రహ్మవిద్య తేజోవంత మగుగాక, మాలో పరస్పరము ద్వేషము లేకుండనిమ్ము.

4. ఓమ్. ఆప్యాయన్తు మమాఙ్గాని, వాక్ప్రాణశ్చక్షుః శ్రోత్ర మథోబల మిన్ద్రియాణి చ సర్వాణి, సర్వం బ్రహ్మోపనిషదం, మాహం బ్రహ్మ నిరాకుర్యాం, మా మా బ్రహ్మ నిరాకరో దనిరాకరణ మస్త్వనిరాకరణం మే అస్తు తదాత్మని నిరతే, య ఉపనిషత్సు ధర్మాస్తే మయి సన్తు తే మయి సన్తు ॥

ఓమ్ శాన్తిః శాన్తిః శాన్తిః - హరిః ఓమ్.

మమ = నా యొక్క, అంగాని = అవయవములును, వాక్ = వాక్కును, ప్రాణః = ప్రాణమును, చక్షుః = నేత్రమును, శ్రోత్రం = చెవియును, అథోబలం= అధో ముఖవృత్తియందు సామర్థ్యము గల మనస్సును, సర్వాణి = అన్ని, ఇంద్రియాణి చ = ఇంద్రియములును, ఆప్యాయంతు = తృప్తిపొందుగాక! ఉపనిషదం= వేదాంత ప్రతిపాద్యమైన, బ్రహ్మ = బ్రహ్మస్వరూపము, సర్వం = సకలమగును, అహం = నేను, బ్రహ్మ = పరమాత్మను, మా నిరాకుర్యాం= నిరాకరించకుందును గాక, మా= నన్ను, బ్రహ్మ = పరమాత్మ; మానిరాకరోత్= నిరాకరించక యుండుగాక, అనిరాకరణం = ఆదరము; అస్తు = కలుగుగాక, మే నాకు; అనిరాకరణం = విశ్వాసము (లక్ష్యభావము); అస్తు = అగుగాక, తత్ = ఆ, ఆత్మని = బ్రహ్మమందు; నిరతే = ఆసక్తిగల; మయి = నాయందు; యే= ఏవి; ఉపనిషత్సు = వేదాంతములందు చెప్పబడిన; ధర్మాః = ధర్మములో; తే = అవి, సంతు = ఉండుగాక (ద్విరుక్తి ఆదరమును సూచించును.) ఓమ్ = ప్రణవ స్వరూపమగు పరబ్రహ్మమా! శాంతి శ్శాంతి శ్శాంతిః = విఘ్నములు పరిహరించుదువుగాక!

ఉపనిషత్తుచే ప్రతిపాదింపఁబడిన బ్రహ్మము, నాయొక్క అంగములు, వాక్కు, నేత్రము, ప్రాణము, కర్ణము, బలము, ఇంద్రియములు మొదలగువానిని తృప్తిపఱచునుగాక! బ్రహ్మము నన్ను నిరాదరణ చేయకుండునుగాక! నేను

బ్రహ్మమును నిరాదరణ చేయక యుండునట్లు అనుగ్రహించును గాక! నావిషయమునందు ఆదరము కలుగును గాక! ఆత్మ నెరింగినమీద ఉపనిషత్తులలో చెప్పబడిన ధర్మములు నా యందు నెలకొని యుండునుగాక!

ఓం భద్రం కర్ణేభి శ్శృణుయామ దేవా
భద్రం పశ్యేమాక్షభిర్య జత్రాః, స్థిరై రఙ్గైస్తుష్టువాం సస్తనూభి
ర్వ్యశేమ దేవ హితం యదాయుః ।
స్వస్తి న ఇంద్రో వృద్ధశ్రవాః స్వస్తి నః పూషా విశ్వవేదాః
స్వస్తి నస్తార్క్ష్యో అరిష్టనేమిః, స్వస్తి నో బృహస్పతి ర్దధాతు ॥
ఓమ్ శాంతిః శాంతిః శాంతిః - హరిః ఓమ్.

దేవాః = ఓ దేవతలారా! వయం = గురుశిష్యులమగు మేము, కర్ణేభిః = కర్ణములచేత, భద్రం = మంగళమును అనగా మంగళకరమైన వాక్యములను శ్రుణుయామ = విందుము గాక! ( ఓ దేవతలారా! మీ మంగళవాక్కులను చెవులార వినుచున్నామని యర్థము. ) యజత్రాః = పూజ్యులైన యజ్ఞ దేవతలారా! అక్షభిః= కన్నుల చేత, భద్రం = మంగళమైన మీ రూపములను, పశ్యేమ = చూచెదము గాక! ( అనగా మీ మంగళమైన రూపములను కన్నులార చూతుము గాక యని అర్థము. ) స్థిరైః = దృఢమైనట్టి, అఙ్గైః = అవయవముల చేతను, తనూభిః = శరీరములచేతను, తుష్టువాంసః = స్తోత్రమును చేయుచున్న వారమగుచు, యదాయుః= ఏమాజీవితమైన ఆయుర్దాయము గలదో, తదాయుః= అయాయుస్సును, దేవహితం = దేవతలకు ప్రియమగునట్లు, వ్యశేమ = పొందెదముగాక! (అనగా మా జీవితకాలమంతయు, దేవతలకు కృతజ్ఞులముగా నుందుమని భావము. వృద్ధశ్రవాః = సర్వదిగంత విశ్రాంతమైన కీర్తి గలిగిన, ఇంద్రః= దేవేంద్రుడు, (సకలయాగభోగకర్త) నః = మాకొరకు, స్వస్తి = శుభమును, దధాతు= ఇచ్చుగాక, విశ్వవేదాః = సర్వజ్ఞుడైన, పూషా = సూర్యుడు, స్వస్తి = శ్రేయస్సును, దధాతు = ప్రసాదించుగాక, అరిష్టనేమిః = శుభములకు ఆధారుడైన, తార్క్ష్యః= గరుత్మంతుఁడు, నః = మాకొరకు, స్వస్తి = శుభమును, దధాతు = ఇచ్చుగాక, బృహస్పతిః = దేవగురువైన బృహస్పతి, నః = మాకొరకు, స్వస్తి = మంగళమును, దధాతు = కలిగించుగాక!

మనము దేవతలుగా (ప్రకాశము గలవారుగా) నుండి మంగళమును చెవులతో విందుముగాక! యజనశీలురై యుండి కల్యాణమును కనులతో జూతుముగాక! అంగములతో గూడిన మంత్రములచే దేవతలను స్తుతించి (సకలసుఖములను) పొందుదుముగాక! ఈ ఉపనిషత్తునందు ప్రస్తావింప బడువస్తువును (దేవతను) స్తోత్రముచేయుటకు దగిన ఆయుస్సును పొందుదుముగాక! సువిశాలమైన కీర్తిగల ఇంద్రుడు మనకు స్వస్తిని (నాశములేని ఆయువును) అనుగ్రహించును గాక! సకల దేవతాస్వరూపియగు సూర్యుడు మనకు స్వస్తిని (ఉపాసనయందలి ప్రధానమును) అనుగ్రహించునుగాక! వజ్రాయుధముచే గొట్టువడని గరుత్మంతుడు మనకు స్వస్తిని (పూజించుట యందు యోగ్యతను) ప్రసాదించునుగాక! బృహస్పతి భగవంతుడు మనకు స్వస్తిని (శుభమును) ఇచ్చునుగాక, ఓం శాంతిః శాంతిః శాంతిః అని ముమ్మాఱు పఠించుట ఉపనిషదనుష్ఠానమునందు (బ్రహ్మవిద్యయందు) విఘ్నము గలుగకయుండు నిమిత్తమని తెలియునది.

ఓమ్ శాంతిః శాంతిః శాంతిః.



# ఋషి యజ్ఞము

(శ్రీసనాతన ధర్మపరిపాలన సేవాసమాజ చతుర్థవార్షికోత్సవమునందు శ్రీమలయాళ స్వాములవారి ఉపన్యాసము.)

ఓం తత్ సత్.

**ఓం సచ్చిదానంద రూపాయ వ్యాపినే పరమాత్మనే ।**
**నమో వేదాంత వేద్యాయ గురవే బుద్ధిసాక్షిణే ॥**
**ఓం నమః శ్రీవేంకటేశాయ శుద్ధజ్ఞాన స్వరూపిణే ।**
**వాసుదేవాయ శాంతాయ శ్రీనివాసాయ మంగళమ్ ॥**

ఓ మహాశయులారా ! మహర్షుల వంశములో ఉద్భవించిన కరుణాళువులారా! ముందు చెప్పబడిన వ్యాసముచే శ్రీసనాతనధర్మ సమాజము

యొక్క సారమును మనమందరమును ఎరింగితిమి. ఇక శ్రీసనాతనధర్మమును గురించి మనము గ్రహించి అనుష్ఠించవలసిన కొన్ని విషయములు గలవు. సనాతనముగా ఋషిపరంపరగా వచ్చుచుండు అనుష్ఠానచతుష్టయమను ఒక ఆర్షేయపద్ధతి గలదు. అది 1. నిష్కామకర్మయోగము, 2. భక్తియోగము, 3. ధ్యానయోగము. దీనికి అభ్యాసయోగ మని నామాంతరము గలదు. నాల్గవది జ్ఞానయోగము. ప్రపంచపరిపాలనమునకు చతురంగమెట్లత్యవసరమో ఆలాగున దైవలోకపరిపాలనములో గూడ నాలుగంగములు గలవని పురాతన పుణ్యపురుషుల మతమై యున్నది. నాల్గుస్తంభములపై స్థాపితమైన సౌధమునకు ఏ స్తంభము మంచిది? ఏది యెక్కువ? ఏది ప్రధానము? ఏది శ్రేష్ఠమని చెప్పజాలము. సౌధభారమును వహించుటలో నాల్గును సమానములై యుండును. ఆలాగున ముక్తి అనెడు కామధేనువునకు పాదచతుష్టయ మెట్లవసరమో; దానియొక్క యే పాదము ఉత్కృష్టము; ఏ పాదము తక్కువ; ఏ చరణము ఎక్కువయని ఎట్లు వచింపజాలమో; అదేరీతిగా పై జెప్పిన అనుష్ఠాన చతుష్టయము, స్వతంత్రమై ముక్తిని గలుగజేయుటనుటలో సందేహము లేదు. ఈరహస్యము నెరింగియే గొప్ప దేవాలయములకును; గొప్ప రాజధానులకును నాల్గు దిక్కులలో నాల్గు గోపురములుగాని; నాల్గు ద్వారములుగాని ఏర్పరచుట జరిగియున్నది. సౌధముయొక్క స్తంభచతుష్టయములో దేనికైన కీడు గల్గిన మండపము చక్కగ నిలువజాలనట్లును; గోవుయొక్క పాదములలో దేనికైన కీడుగల్గినచో నది చక్కగ నడువజాలనట్లును, పై జెప్పిన అనుష్ఠానచతురంగములలో దేనికైనను లోపము గలిగినచో దైవలోకమునకు అనగా అధ్యాత్మస్థితికిని పూర్ణత్వము గలుగజాలదు. ఈతత్త్వము గ్రహించియే గొప్పగొప్ప రాజ్యపరిపాలనములలో మంత్రి చతుష్టయమును ఏర్పరచిరి. ఆరోగ్యశాఖవారు, ఆర్థికసంఘమువారును, విద్యాప్రచారక సంఘమువారును; సైనికులును వేరువేరు కార్యములతోను, వేషములతోను, ఆఫీసులతోను, గ్రంథములతోను, అనుష్ఠానములతోను భిన్నభిన్నముగా కానుపించినను వీరందరును ఏలాగున రాజకీయ కార్యనిర్వాహకులై సమానగౌరవము గలవారై సమవేతనమును పొందుచున్నారో; ఆలాగున ఆత్మజ్ఞానములో అందరును నిజముగా అనుష్ఠించిన ఒకేస్థానమునే

బొందుచుందురు. అనుష్ఠానపద్ధతిలో వేరువేరుగా మార్పు కానుపించినను వారందరును ఒకే దైవకార్యములో ప్రయత్నించెడు వారలని గ్రహించతగిన బుద్ధిగలవారలే వేదాంతరహస్యము చక్కగనెరింగినవారని మేధాసంపత్తిగలవారు తలంతురు. ఋక్; యజుస్సు; సామ; అధర్వణములను నాలుగు వేదములును జనులకేలాగున అత్యవసరమో; బ్రహ్మచర్య గృహస్థ వానప్రస్థ సన్న్యాసాశ్రమములు నాలుగును మనకేలాగున ఉపయోగకరమో; ఆలాగున నిష్కామకర్మయోగము మొదలుగాగల యోగములు నాలుగును మన కత్యవసరములు. ఈ తత్త్వము జనులు గ్రహించుటకొరకు చతుస్సాగరములును; చతుర్విధవర్ణములును ఏర్పడినవి. దీనికి సంబంధించిన శాస్త్రములును పెక్కులు గలవు. అయినను నిష్కామకర్మ యోగముచే గల్గు అంతఃకరణశుద్ధియు; నిర్మల భక్తిచే గల్గు చిత్తైకాగ్రతయు; ఆత్మసంయమము గలిగి ధారణాధ్యానబలముచే ఆత్మసాక్షాత్కారమగు జ్ఞానము గల్గుటకు పరంపరాసాధనలనియు, జ్ఞానమొక్కటియే సాక్షాత్ సాధనమనియు కొందరు చెప్పుదురు. ఇదియు కొంతవరకు అంగీకారమైనను శ్రీ భగవద్గీతాది సర్వోత్కృష్ట గ్రంథములు; పై జెప్పినవి నాల్గును స్వతంత్రములనియు, మరియొక్కదాని అపేక్షలేకయే విపులముగా ముక్తిని గలుగచేయుననియు దృఢముగా చెప్పుచుండును. ఇప్పుడు మన భరతఖండములో నిష్కామకర్మయోగమునకు చాల లోపము గల్గినది. ఇది యొక్క వేళ ప్రాథమికదశ యని కొందరు తలంచినను నాల్గు అంతస్థులలో కట్టబడిన హర్మ్యమునకు మొదటిది యగు పునాది చెడినచో అచిరకాలములో మేడ క్రుంగునట్లు; నిష్కామకర్మయోగమునకు హాని గల్గిన తక్కిన మూడు యోగములును తప్పక పతనమునొందియే తీరును. శ్రీ భగవద్గీతా ప్రాణమంతయు ఈ నిష్కామకర్మయోగముపై ఆధారపడి యున్నది. చతురాశ్రమములలో ప్రాథమికాశ్రమమగు బ్రహ్మచర్యము లోపించినచో, గృహస్థ వానప్రస్థ సన్న్యాసాశ్రమములు మూడింటిని ఏలాగున చక్కగ నిర్వహింప శక్తిచాలదో; జీవితము సుఖప్రదముగా గడిపి దైవసుఖమునొంద నర్హత యెట్లుండదో; అదేరీతిగా నిష్కామకర్మయోగము దుర్బలతనొందిన క్షయరోగియొక్క జీవితమునకువలె తక్కిన మూడు యోగములకును క్షయము

తప్పకగల్గును. ఇప్పుడు గిల్టునగలు ఏలాగున స్వల్పమూల్యమునకు దొరకునో; అదేరీతిగా కర్మయోగము, భక్తియోగము, ధ్యానయోగము పనిలేదనియు ; అది ప్రయాసమార్గమని తలంచి జ్ఞానమొక్కటియే చాలుననియు; దానికి మనస్సే ప్రధానమనియు బోధించెడు నవీనవేదాంతము ఎప్పుడు ప్రచారములోనికి వచ్చెనో అప్పటినుండియే లోకమునకును; ఆత్మలాభమునకును హాని కల్గినది. స్వల్పమూల్యమునకు దొరికెడు గిల్టు ఆభరణములు ఎంతవరకు ప్రయోజనపడునో; అట్టివారి జ్ఞానమును అంతవరకే ప్రయోజనపడునని తలంచువారు ధన్యాత్ములగుదురు. మనస్సే ప్రధానమనియు, జ్ఞానమే హెచ్చనియు చెప్పెడు మాటలు నిజము. అయినను ఇప్పుడు మనస్సే ప్రధానమని చెప్పువారికి, అట్టి స్థితి గలిగియుండునో లేదో యని మాత్రమే సందియము గలుగుచున్నది. మనస్సు ప్రధానమని తలంచువారు తమయొక్క మనస్సుతో ఏ భావన చేయుచుందురో, ఆలాగున జరుగుచుండ వలయును. అట్టి ప్రయత్నము గలిగియుండవలయును. మరియు మనస్సే ప్రధానముగాగల ఋషులు కొందరిని సద్యోజాతులుగా చేసిరి. శ్రీపరాశరులు, విశ్వామిత్రులు మొదలగు ఋషుల చర్య అచింత్యశక్తి గలదియగుటచే అట్టి కార్యములో ప్రయత్నించువారు చాలా మేధాసంపత్తి కలిగియుండవలయును. మనస్సే ప్రధానమని చెప్పెడు భావములోను, శాస్త్రములలోను మనము లోతుగా దిగి విచారించినచో మాలిన్యము గల మనస్సగుటచే మలినకార్యములగు విషయాదులలో ప్రవర్తించుటకు కారణమనియు, శుద్ధమగు మనస్సైనచో నిర్మలదైవికకార్యములో ప్రవర్తించి ముక్తిగలుగ జేయుటకు కారణమగుచున్నదని మాత్రమే మనకు స్పష్టముగా గోచరించును.

రెండవది జ్ఞానమే ముఖ్యమనియు, తక్కిన భక్తి కర్మయోగాదులు అముఖ్యము లనియు జెప్పునది నిజము. అముఖ్యములని చెప్పుటచే ఉపయోగము లేనివని యర్థము కాదు. చీకటి నశించి ప్రకాశము గలుగుటకు దీపమే ప్రధానమైనను ప్రమిద, తైలము, వత్తి యేలాగున అవసరములో, అదేరీతిగా విజ్ఞానమను ఆత్మజ్ఞానజ్యోతియే మనకు ముఖ్యముగా కావలసి యుండినను తక్కిన సాధనములు వ్యర్థము లని తలంపరాదు. నీలిమందే మనకు కావలసి

యుండినను నీలిచెట్టును పోషింపకపోయిన ఎట్లు లభింపజాలదో, అదే రీతిగా చక్కెర మనకు ఉపయోగమైనను చెఱకును సంరక్షించక పోయిన పంచదార యే లాగున లభింపజాలదో, ఆలాగున సాధనానుష్ఠానములో మంచి నిష్ఠగలుగనిచో ఆత్మానుభవము గలిగి అమృతత్వము నొందజాలము.

అయినను దీనియం దొక్క రహస్యము గలదు. అదేమన చెఱకునుండి సకాలమున రసము గ్రహింపక చెఱకును పెంచుటయే పనిగా పెట్టుకొనిన రసము నశించి అది వట్టి బెండై పోవును. అదే రీతిగా నీలిచెట్టు నుండి తగిన సమయమున నీలిమందు తీయనిచో చెట్టు ముదిరి వట్టి కట్టెలై పోవునట్లు కేవలము కర్మఠు లైపోవరాదు. కర్మానుష్ఠానములో నైష్కర్మ్య సిద్ధిని మనము పొందవలయును. కర్మఠులకు కరుణ చాల తక్కువ. కావున మీరు అధ్యాత్మ జ్ఞానోపలబ్ధి గలుగు బుద్ధితో నిష్కామ కర్మయోగము అనగా బ్రహ్మనిష్ఠాదిసాధనలు చేయువలసినదే గాని ఆత్మబోధము నొందక కేవలము కర్మఠు లైనచో శోకశాంతియు, ఆనందప్రాప్తియు గలిగి నిత్యసుఖ మొందజాలరని మాత్రము జ్ఞప్తిలో నుంచవలెను. అనుష్ఠాన మెంతవర కుండవలె ననగా పండ్లు వగైరా యొక్క లోపలగుజ్జు చెడకుండ సంరక్షించుటకు వాటియొక్క తోలు ( బెరడు) ఎంతవరకు ఉపయోగపడునో అంతవరకే మీరు అనుష్ఠానములతో నుండిన చాలును. బీజములపొట్టు, పండ్లు వగైరాయొక్క తోలు (బొప్పి) మొదలైనవి యెంతవరకు దానికి సహాయపడునో అంతవరకే అనుష్ఠానములో మనస్సుంచవలెను. ఇది మరువరాని దివ్యోపదేశమని తలంచువారు ధన్యులగుదురు.

ఋషిపుత్రికలారా! పుత్రులారా! దైవాత్మస్వరూపులారా! ఇక ఋషిసంఘములో ఒక్క అభిప్రాయము గలదు. కర్మ భక్తి జ్ఞానయోగము లనెడు నాల్గును స్వతంత్రములని గ్రహించిన వారలై నాల్గింటిలోను సంపూర్ణ అనుష్ఠానముగలవారై నాల్గింటిని సమానముగా బోధించువారలు బ్రహ్మవేత్తలలో ఉత్తమోత్తములని పరిగణింతురు. ఇట్టి శక్తి దైవాంశులై, కారణగురువులై, లోకోద్ధారకు లగు మహాపురుషులకు మాత్రమే గలిగి యుండును. తక్కినవారికి పై జెప్పిన భక్తియోగాది జ్ఞానములలో ఏదైన ఒక్కటి ఎక్కువగా నుండి తక్కినవి

మూడును గౌణములుగా నుండును. ఇట్టివారలే ప్రపంచములో నెక్కువ మంది మహాత్ములై యుందురు. వీరు తమ కేది ముఖ్యముగా నుండునో అదియే శ్రేష్ఠమనియు, తక్కినవి గౌణములనియు చెప్పుదురు. వీరిని బ్రహ్మవేత్తల సంఘములో ఉత్తములని తలంతురు. మరి కొందరికి పై జెప్పిన యోగాదులలో ఒకటి సర్వోత్కృష్టమైయుండి, తక్కినవి మూడును చాల లోపించియుండును. వీరి ఉపదేశమును అట్లే యుండును. వీరు మధ్యము లని తలంచవలయును. మరి కొందరికి పై జెప్పిన యోగ జ్ఞానాదులలో దేనియందైన ఒక్కదానిలో మంచి నిష్ఠ గలిగియుండి తక్కినవి బొత్తిగా నుండవు. వీరి బోధయు అట్లే యుండును. ఏదైన కర్మ, భక్తి, యోగ, జ్ఞానాదులలో ఒక్కటి యుండిన చాలుననియు, తక్కినవి పనిలేదనియు చెప్పుదురు. భక్తియైనచో శ్రీశివకేశవ శ్రీరామాదులలో ఒక్కటి మాత్రమే యుండును. వీరు కనిష్ఠులని మహర్షులు తలంతురు. ఇక పై జెప్పిన కర్మ భక్తి, యోగాది అనుష్ఠానములలోగాని, శివకేశవ శ్రీరామాది భక్తిలోగాని, లేక శైవ వైష్ణవాది మతములలోగాని, లేక హిందూ బౌద్ధ క్రైస్తవాది మతములలోగాని ఒకటిమాత్ర ముండి తక్కిన వాటిని దూషించుచుండువారు కనిష్ఠులకన్న క్రింది తరగతిలో నుండెడి వారలు. మూలసూత్రములో ఏకత్వము కనుగొనవచ్చును.

అయినను దేశకాల పరిస్థితి ననుసరించి మతములో కొన్ని మార్పులు గలిగి యుండినను సోదరోత్తములారా! సోదరీమణులారా! పైజెప్పిన ఉత్తమోత్తముల నిష్ఠలో సదాబుద్ధిని నిలిపి శీలింపుడు. ఇదే దైవాంశుల గణములో పుట్టినవారి గుణమని మరువకూడదు. దృష్టాంతముగా శ్రీజగద్గురు శంకర భగవత్పాదాచార్యులు, శ్రీరామానుజాచార్యులు శ్రీమధ్వాచార్యులు, శ్రీకృష్ణచైతన్యులు, శ్రీ క్రీస్తుదేవుడు. శ్రీమహమ్మదునబి, శ్రీబుద్ధదేవుడు మొదలైనవారి జీవితాంశములను పరిశీలించిన వారి జీవితములో ఒక్కనిమిషమైనను, శరీరములో ఒక్క అణువైనను, మనస్సులో ఒక్కసంకల్పమైనను వదలక పైజెప్పిన నాల్గుకార్యములను సదా అనుష్ఠించి యుండినవారని గోచరింపక మానదు. ఓహో! వారి భక్తి యేమని చెప్పవచ్చును!

నిర్వికల్ప సమాధి యేమని చెప్పవచ్చును! సదా పుణ్యకర్మములు చేయుచుండు వృత్తి యేమని చెప్పవచ్చును! బ్రహ్మసాక్షాత్కార అపరోక్షజ్ఞానము వారికి కరతలామలకము గాదా? ప్రపంచములోగల సర్వజనులు అట్టి దివ్యపురుషుల, కరుణామూర్తుల, ప్రేమ స్వరూపుల, శాంతినిధుల పరంపరలో చేరినవారై యుండియు అట్టి మూలతత్త్వమును మరచిపోవుట మన భారతదేశముయొక్క అదృష్టహీనత యనియే తలంచవలెను. లేనిచో భారతభూమియగు ఈ పుణ్యరాజ్యమునకు ఇంత దురదృష్టము గల్గియుండదు.

ఆత్మస్వరూపులారా! మనము క్రొత్తగ ఒక సంఘముగాని, సమాజము గాని చేయ నక్కరలేదు. దీనివల్ల సమష్టి యగు భారతదేశమునకు దుర్బలత్వము గలుగునేగాని, ఉన్నతబలము గలుగజాలదు. వివిధ మతములు, వివిధ సంఘములు భారతదేశములో వేరు వేరుగా చీలిపోవుటయే దేశము పరుల పాలగుటకు కారణమని యిప్పుడిప్పుడు మేధాసంపత్తి గలవారు కనుగొని ఆ దోషనివారణకు ప్రయత్నించుచున్నారు. శరీరమునుండి ఒక్కొక్క అంగము వీడిపోయినచో ఏలాగున దుర్బలత్వము గలుగునో సంఘముల యొక్కయు, మతముల యొక్కయు, వర్ణముల యొక్కయు చీలిక అటువంటిదను భావము సర్వజనుల హృదయాంతరాళములో నిట్టూర్పు వలె నెడతెగక ఎప్పుడు గల్గుచుండునో అప్పుడు మాత్రమే భారతీయులు స్వరాజ్యమును బడయుటకు అర్హులగుదురు. ఈమధ్యలో నొక్క రహస్యము చెప్పెదను. అదేమన మీ క్రింద ఒక్కరుండవలయునని తలంపు మీ కెంత వరకుండునో అంతవరకు మీరు మరియొక్కరి క్రింద నుండే తీరవలయును. ఇది ప్రకృతి యొక్క అలంఘనీయశాసనము. ఈ తత్త్వము జనులలో విరివిగా వ్యాపించియుండిన భరతఖండములో చేయవలసిన సంస్కారములు చాల గలవు. భారతమతములో సర్వజనులకు గుణకర్మముల ననుసరించి స్వాతంత్ర్యము లేకపోవుటే నవీనముగ కొన్నికొన్ని శాఖలు సనాతన మగు భారత కల్పవృక్షము యొక్క శాఖలను తెగనరికి వేరుపరచుటకు కారణమైనది. ఒక వేళ అట్లు వర్ణముల చేతను, మతములచేతను వేరుపడిపోయినను ఆత్మలో ప్రేమ యను సూత్రము తెగకుండ నుండిన అనేకమణులను ఒక్క దారమందు కూర్చినట్లు ఈ భారతదేశము

ప్రపంచమునకు ముత్యాలహారమై యుండును కదా! మతములు వేరుపడుటతో ప్రేమయు భేదింపబడుచున్నది. ఇది సామాన్యజనులకు గలిగెడు స్వభావమే. అయినను మతములనుగాని, వర్ణములనుగాని ఏకపరచుటకు మనకు శక్తిచాలదు. ఇక మనము చేయవలసిన పని యేమన, ఈ సర్వజనుల దేహ మనస్సులు మణులవంటి వనియు, ఆత్మ సూత్రమువంటి దనియు గ్రహించి ప్రయత్నించితి మేని మనయొక్క ఉద్దేశము అచిరకాలములోనే ఫలించి సంతృప్తులు గాగలుగుదుము. ఇట్టి స్థితి యేది గలదో దానినే సనాతనధర్మ మందురు. భూతభవిష్యద్వర్తమాన కాలములలోను, సృష్టిస్థితిలయములలోను, జాగ్రత్స్వప్నసుషుప్తులలోను, బాల్యయౌవన వార్ధక్యములలోను, ఏలాటి మార్పుగలుగక దివ్యమై, అమృతమై, శివమై, ఆనందమై, దైవమై యుండునది యే యొక్క పరతత్త్వము గలదో, అదే సనాతనము. దానిని సర్వజనులు పొందెడు మార్గమును సనాతనధర్మమని మనము గ్రహించవలెను. కావున ఇచ్చట నుండు సర్వజనులును వారి వారి పద్ధతి ననుసరించి లోకవ్యవహారములలో ప్రయత్నించినను, ఆత్మయందు అనగా దైవమును పొందుటకు అందరికిని సమానముగా హక్కు గలదు. ఒక మంచి డాక్టరు దగ్గర సర్వజనులు ఏలాగున వారి వర్ణాశ్రమ ధర్మములకు భంగము గలుగక ఔషధము తీసికొని అనుకూలమైన గృహములో వసించి ఆరోగ్యము నొంది సుఖించుచున్నారో, అట్టి అనుష్ఠాన పద్ధతియే మన కుండవలయును. అట్లైన లోకములో పోరాటము సలుపకనే మనయొక్క నిర్దిష్టకార్యమును సులభముగా సాధింప వచ్చును. వర్ణాశ్రమధర్మములు మాయచే కల్పితములు, దీనియందు మనము ఏకత్వము చేసికొనజాలము. అనేక అవతారపురుషులు, జగద్గురువులు గూడ ప్రయత్నించియు ఒక్క మతముగాగాని, ఒక వర్ణముగా గాని చేయు శక్తిగలిగియుండలేదు. అట్లు చేయ లేక పోవుట చేతనే పై జెప్పిన లోకోద్ధారకుల బోధకు లోపడినవారు ప్రత్యేక సంఘము వారును, మతమువారును అగుటకు కారణ మైనది. సర్వేశ్వరా! అట్టిమతము ఇక అవసరము లేదు. ఇకలోక కల్యాణమునకు కావలసినది దైవమతమే, విశ్వమతమే. శాంతిమతమే, కరుణామతమే, ఆత్మయందు ఏకత్వము కనుగొనిన దివ్యమతమే యుండవలెనని

కోరుచున్నాను. దాని నామరూపములను కొంత వరకు హృదయాంతరాళము నుండి బయటికి నెట్టివేసి, స్వస్వరూపావలోకనము అనగా ఆత్మయందు దైవమును కనుగొనెడి పద్ధతి యేది గలదో అదే మనము అనుష్ఠించవలసిన ముఖ్యమతము, ఈ మతమే సర్వమతాచార్యుల మనస్సునకు అవతలిదైయుండు దివ్యమతము. ఇచ్చట మన కందరికిని విరోధము లేక సుఖింపవచ్చును. అట్టి స్థితి బొందనివారికి శాశ్వతశాంతి గలుగజాలదని శ్రుతి చెప్పుచున్నది.

**మత్తః పరతరం నాన్య త్కించి దస్తి ధనంజయ ।**
**మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ ॥**

ఓ అర్జునా! నాకన్న, అనగా బ్రహ్మమునకన్న మరి యొక చైతన్యవస్తువు లేదు. ఇదంతయు ఆ పరబ్రహ్మమయ మని పూర్ణజ్ఞానము గల్గినప్పుడు తెలిసికొనగలవు. లేక యీ సమస్త చరాచరభూతము లన్నియు సూత్రమునందు అనగా దారమునందు మణులవలె నాయందు గూర్చబడియున్నవి, అనగా నేను సర్వప్రాణి కోట్ల హృదయాంతరాళములో వెలుగుచుండువాడనని తెలిసి కొన్నప్పుడే అభేదజ్ఞానము గలుగు ననియు, భేదబుద్ధి నశించుననియు గ్రహింపుము జనులారా! ఇప్పుడు యథార్థమైన దైవజ్ఞానమును కృష్ణపరమాత్మ బోధించినది చూచితిరా? ఇట్టి జ్ఞానము మీ అందరి యొక్క జన్మహక్కై యున్నది.

ఏలాగున స్వరాజ్యవాదులు భారతదేశము తమ జన్మహక్కని నిర్భయముగ చెప్పుచున్నారో, ఆలాగున మీరందరును ఆత్మరాజ్యము మీ జన్మహక్కని దృఢముగా వాదించవలయును. రాజ్యము జన్మహక్కని చెప్పునప్పుడు దాని ననుసరించిన ఉపకరణములు గూడ ఏలాగున జన్మహక్కై యుండునో, అదేరీతిగా ఆత్మప్రాప్తికి మీకు హక్కుగల దని తలంచితిరేని తత్సంబంధానుష్ఠానము లన్నిటిలోను, మనుష్యమాత్రు లందరికిని పూర్ణమైన హక్కుగలదని హృదయాంతరాళములో రూఢిపరచుకొనుడు. భారతీయులకు స్వాతంత్ర్య భంగము గలుగజేసి అభివృద్ధికి రానియ్యని ప్రభుత్వ మేలాగున అన్యాయపు ప్రభుత్వమని స్వరాజ్యము బడయుట కభిలాషగల సర్వమత స్త్రీ

పురుషులు రాజవీధిలో నిండు సూర్యుడు ప్రకాశించుచున్నప్పుడు జనస్తోమమున ఉచ్చైః స్వరముతో పలుకుచున్నారో, అదేప్రకారము మీరందరును మీయొక్క ఆత్మరాజ్యమును పొందుటలో స్త్రీ పురుషులకందరికిని హక్కు గలుగచేయని మతవుంగాని, శాస్త్రవుంగాని, అధర్మమైన వని తలంచుటయు మీధర్మమైయున్నది. అట్టిది మానవకల్పితమతమేగాని దైవమతము గాదని ముమ్మారు నమ్ముడు. అయినను స్వరాజ్యరంగములో ప్రవేశించువారికి నిష్కర్షయైన కొన్ని కఠిననియమము లెట్లు గలవో, ఆలాగున ఆత్మ రాజ్యప్రాప్తి పొందుటకు తలంచువారు గూడ కొన్ని విధినియమములకు లోబడియే తీరవలయును. అది సాధనచతుష్టయ సంపత్తి యనియు, యమాది అష్టాంగయోగ మనియు, నిర్మలమైన భక్తియనియు, పూర్ణమైన కరుణ యనియు, ప్రశాంతమైన చిత్త మనియు గ్రహించవలయును. సర్వభూతములలో ఏకత్వమును కనుగొనెడు జ్ఞానమే సాత్త్వికము అనగా దైవికజ్ఞాన మనియు శ్రీకృష్ణపరమాత్మ శ్రీ భగవద్గీతయందు ఉపదేశించియున్నారు. చూడుడు.

**సర్వభూతేషు యేనైకం భావమవ్యయ మీక్షతే ।**
**అవిభక్తం విభక్తేషు తద్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్ ॥**

సమస్త ప్రాణికోట్ల దేహాదులు వేరువేరుగా నుండినను వాటియన్నిటిలోను ఒకే ఆత్మయే అనగా ఒకే దైవమే వ్యాపకమై వెలుగుచుండు ననియు, అదే నిజమైన బ్రహ్మజ్ఞాన మనియు నే యొక్క నిర్మలజ్ఞానముచేత బ్రహ్మవేత్తలు తెలిసికొన గలుగుదురో అట్టి జ్ఞానమే సాత్త్వికజ్ఞాన మని తెలిసికొనుము. అనగా సత్త్వగుణముగల వారు సర్వప్రాణికోట్లలో ఒకే ఈశ్వరచైతన్యమునే చూచుచుందు రని భావము. ఎల్ల ప్రాణికోట్లలో ఈశ్వరభావముతో మెలగవలయు నని చెప్పుచుండగా, పరిశుద్ధ ఆచారనిష్ఠగల మానవులలో అందరి యందైనను అట్టి భావమునుంచనివారి జ్ఞానము దయ్యపుజ్ఞాన మని చెప్పుటలో ఏమి భావభేదము గలదు? అట్లున్న వారిని దైవజ్ఞానము గలవారని జనులు ఎట్లు తలంచగలుగుదురు? ఇక రజోగుణముగలవారి జ్ఞానముయొక్క భావము క్రింద తెలుపబడుచున్నది. దీనికి రాజసజ్ఞానమని గూడ పేరు గలదు.

**పృథక్త్వేన తు యత్ జ్ఞానం నానా భావాౙ పృథగ్విధాౙ ।**
**వేత్తి సర్వేషు భూతేషు తద్జ్ఞానం విద్ధి రాజసమ్ ॥**

ఎల్ల భూతములయందు భేదభావము చేత వేరు వేరు ప్రకారములైనది గాను, పరబ్రహ్మమును జనుల కల్పిత భేదముచేత ఆత్మను గూడ భేదజ్ఞానముతో నెవడు చూచుచున్నాడో, వానిజ్ఞానము రాజసజ్ఞాన మని తెలియుము. అనగా మనుష్యులచేత ఏర్పాటు చేయబడిన వర్ణాదులను మాత్రము చూచుకొని గుణకర్మముల జూడక యేర్పాటు చేయు జ్ఞానము రాజసస్వభావ మని గ్రహించవలయును.

**యత్తు కృత్స్నవదేకస్మి న్కార్యే సక్త మహైతుకమ్ ।**
**అతత్త్వార్థవ దల్పంచ తత్తామస ముదాహృతమ్ ॥**

ఆత్మయైనను, లేక యీశ్వరు డైనను, ఒక్కొక్క స్త్రీ పురుషాది దేహములలో కల్పిత మైన వర్ణాశ్రమగుణముల ననుసరించి, వేరువేరుగా కలదనియు, అట్లే ప్రవర్తించవలయు ననియు గలిగెడు జ్ఞానమేది గలదో అట్టి జ్ఞానము తామసజ్ఞాన మని గ్రహించవలయును. దీనినే పైశాచికజ్ఞానమని తెలియందగినది. అట్టి జ్ఞానము ఏలాటి యుక్తులు లేనిదనియు, నిజమైన జ్ఞానము కాదనియు, స్వల్పబుద్ధిగల సంకుచితహృదయులకు గలిగెడు స్వభావజ్ఞాన మనియు గ్రహించుకొన వలయును. జనులారా! ఈ మూడుశ్లోకములను ఉదాహరించుటకు కారణమేమన, ఇప్పుడు ప్రపంచము నడతలోగల జ్ఞానము సాత్త్వికజ్ఞానమా? రాజసజ్ఞానమా? తామసజ్ఞానమా? అని యెల్లరును గ్రహించుటకొరకు ఎత్తి చూపబడినదే గాని మరియేలాటి భావముచే గలిగిన బోధ గాదని మీరు జ్ఞప్తిలో నుంచవలయును. సత్వగుణము గలవారి జ్ఞానమే అట్టి ఉన్నతస్థితిగా నున్నప్పుడు విశుద్ధగుణము గలవారికి మాత్రమే ముక్తిగలుగుననియు, అట్టిజ్ఞానమే సమ్యక్ జ్ఞాన మనియు శాస్త్రము చెప్పుచుండగా ప్రేమస్వరూపులారా! సత్వగుణము గలజ్ఞాన మైనను మనము సంపాదింపం బని లేదా ? ఈ చెప్పబడిన భావము అధ్యాత్మనిష్ఠకు మాత్రము అన్వయించునదేగాని ప్రపంచవ్యవహారమునకు సంబంధించినది కాదని మీరు తెలిసికొనవలెను. దొరతనమువారు చేసిన శాసననిర్మాణము క్రింది

ఉద్యోగులద్వారా జనులకు వెల్లడిచేయ పంపబడినప్పుడు అట్టి శాసనములను విరివిగా జనులకు బోధింపక అవి దొరకిన వారందరును తమతమ పెట్టెలలో మూటలలో దాచుకొనువారు రాజ భక్తిగల వారగుదురా? ఈ కృత్యము గౌర్మెంటు ఎరింగిన వీరికి సరియైన శిక్ష చేయక మానునా? అదేరీతిగా ఈశ్వరజ్ఞానము సర్వజనులకు విరివిగా చక్కగా బోధించుటకు ఏర్పడిన జనులు, అట్లు బోధింపక పోవుట దైవద్రోహము గదా! వీరికి ఈశ్వరకరుణ యెట్లు సిద్ధించును? కావున యథార్థజ్ఞానము సామాన్యజనులకు బోధించవలసిన ధర్మము విద్వాంసులపై, సాధువులపై, లోకసేవకులపై ఆధారపడి యున్నది.

**సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాఽఽత్మని ।**
**ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః ॥**

యోగముతో గూడిన, అనగా సమ్యక్ జ్ఞానముతో గూడిన మనస్సు గలవాడు ఆత్మలన్నిటియందును జ్ఞానైకాకారము లనెడి సమబుద్ధిగలవాడై తనయాత్మను అందరి ఆత్మలలోను అనగా అన్ని భూతములలోను ఉన్నవానిగాను, అన్ని భూతములను తన యాత్మయందున్న వానినిగాను చూచుచున్నాడు.

**యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి ।**
**తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి ॥**

ఎవడు సమస్తభూతములయందు నన్నును , అనగా భగవంతుని, నాయందు సమస్తభూతములను జూచుచున్నాడో, వానికి నేను నాకు వాడు ప్రత్యక్ష స్వరూపులుగా నుందుము. వానికిని నాకును ఆత్మ భావ మొక్కటి యగుటచేత, వానికన్న అన్యుడుగా నేనును, నా కన్న వాడు అన్యుడుగాను లేడు. అనగా ఉపాధిద్వయరహిత జ్ఞానము గలుగుటయే జీవ బ్రహ్మైక్యజ్ఞాన మని గ్రహించవలయును. అప్పుడు దైవమందు తన్ను, తనయందు దైవమును జూడగలిగెడు మహాభాగ్యము గలుగును.

**సర్వభూత స్థితం యో మాం భజత్యేకత్వ మాస్థితః ।**
**సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే ॥**

ఆత్మవేత్తయగు ఏయోగి అపరోక్షజ్ఞానము గలిగినవాడై యుండునో అట్టివాడు ప్రాకృతభేదములను విడిచినవాడై సర్వభూతములయందు నన్నును అనగా దైవమును, నాయందు సర్వభూతములను దర్శించినవాడై అన్నిభూతములను దైవభావముతో జూచునో అట్టివాడు ఏప్రకారముగా వర్తించిన వాడైనను ఎల్లప్పుడును నాయందే యున్నాడు. ఏప్రకారముగా వర్తించినవాడైనను అని చెప్పుటచే ముందు చెప్పబడిన నిష్కామకర్మయోగమందుగాని, లేక భక్తియోగమందుగాని, లేక ధ్యానయోగమందు గాని, లేక జ్ఞానయోగ మందు గాని యుండినవాడైనను, సదా ఆవరణము గలుగని సమ్యక్ జ్ఞానము గలిగియుండిన, తప్పకదైవత్వము నొందగలుగు నని భావము. లేక బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్న్యాసాశ్రమములలో నున్నప్పటికిని విరోధము లేదనియు, అవి బాహ్యదేహమునకు సంబంధించినవే గాని ఆత్మకు సంబంధించినవి గావనియు, సమ్యక్ జ్ఞానము గల్గిన ఎచ్చోట నుండినను, ఏ ఆశ్రమములో నుండినను మోక్షమునకు కొరతగలుగ దని తెలుపుటకొరకు అపారకరుణతో భగవానులు ఈ పరమరహస్యము ఉపదేశించియున్నారు. లేక బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులైనను, స్త్రీలైనను, లోకయాత్ర ననుసరించి వారివారి కులకర్మముల ననుసరించి ఆత్మజ్ఞానము గలిగి యుండినచో ముక్తి గలుగుటలో సందేహము లేదని తెలిసికొనుట కొరకు ఇట్టి ఉపదేశము చేసి యుండవచ్చును. మరియు ''సర్వథా వర్తమానోఽపి'' అని చెప్పుటచే నెల్లప్పుడు సమాధినిష్ఠలో నుండిన వాడైనను లేక ఉత్థానదశయందు లోకోపకార మైన కార్యములు చేయుచుండినను, ఆత్మకావరణము గలుగజాలదనియు, బ్రహ్మవేత్తలు బాహ్యవృత్తిచే వివిధ ప్రకారములుగా కానిపించినను ఆత్మదృష్టిలో ఒకేవిధముగా నుండువారనియు తెలుపుటకొరకు కరుణానిధియగు కృష్ణపరమాత్ముడు ఈ శ్లోకమును ఉపదేశించి యున్నారు. ఇక నీ విషయమై ప్రమాణము లెన్నియో గలవు. కాలము స్వల్ప మగుట చేతను, వివేకజ్ఞానము గలవారికి దీనివల్ల నే తత్త్వము గోచరము గాగలదని తలంచి ముగించడమైనది. నిప్పు వృద్ధి చేయుటకు ఇచ్ఛగల వారికి కొంచెము దొరకినను ఎంతో వృద్ధిచేయవచ్చును. అట్లుగాని వారికి నిప్పు ఎంత అధికముగా దొరికినను చక్కగ చూడకపోయిన బొగ్గై, బూడిదయై

పోవునుగదా! ధర్మోపదేశమును అటువంటిదే, ఇప్పుడు కఠోపనిషత్తులో గల సమ్యక్ జ్ఞానము కొంచెము చెప్పెద.

**ఏకో వశీ సర్వభూతాంతరాత్మా**
**ఏకం రూపం బహుధా యః కరోతి ।**
**తమాత్మస్థం యేఽనుపశ్యంతి ధీరా**
**స్తేషాం సుఖం శాశ్వతం నేత రేషామ్ ॥**

ఏకుడై అనగా అద్వితీయుడై, చరాచర భూతములన్నిటిని స్వాధీనములో నుంచినవాడైన ఏయొక్క సర్వాంతర్యామి యైన సర్వేశ్వరుడు గలడో, అట్టి జగదీశ్వరుడు ఏకుడైనను అనేకరూపములుగల వానిని వలె చేసినను అట్టియీశ్వరుని ఆత్మస్థితునిగా ఏ పరిశుద్ధాత్ములై సూక్ష్మబుద్ధిగల ధీరులు చూచుచుందురో, వారు శాశ్వతమైన సుఖమును పొందగలుగుదురు. అట్లు సర్వాంతరాత్మ యగు దైవమును ఏకభావనతో జూడజాలని భేదబుద్ధి గలవారు శాశ్వతమైన దైవసుఖము నొందజాలక నశ్వర మగు సంసార సుఖమును పొందుదురే గాని నిత్య శాంతి నొందనేరరు.

**నిత్యోఽనిత్యానాం చేతన శ్చేతనానా**
**మేకో బహూనాం యో విదధాతి కామాన్।**
**తమాత్మస్థం యేఽనుపశ్యంతి ధీరా**
**స్తేషాం శాంతిః శాశ్వతీ నేతరేషామ్ ॥**

అనిత్యములైన వస్తువులలో నిత్యుడుగా నుండువాడును, చైతన్యముగల పదార్థము లన్నిటిలోను చేతనాస్వరూపుడుగా నుండు వాడును, ఏకుడుగానుండు వాడైనను, ప్రాణికోట్లబహువిధము లగు కర్మములకు వివిధములగు ఫలమును గలుగ జేయువాడును అగు నే యొక్క సర్వేశ్వరుడు గలడో, అట్టి యీశ్వరుని శ్రవణమనన నిదిధ్యాసనలచే నిర్మలజ్ఞానముగల ఏ మహాత్ములు తమ ఆత్మస్థుడై యుండు నట్లు దర్శింతురో, అట్టివారికి మాత్రమే ప్రకృతి యొక్క చలనము లేని శాశ్వతమైన ఆత్మశాంతి గలుగును. అట్లు చేయక మలినహృదయులై ప్రాణికోట్ల నామరూపముల మాత్రము చూచి వేరువేరు బుద్ధితో వర్తించువారు

అట్టి శాశ్వతమైన శాంతి నొందక నశ్వరమైన సంసారములోనే పడియుందురు. ఇట్టి ఉపనిషత్ మంత్రముచేతను ఆత్మైక్యము గలవారికి మాత్రమే నిత్యసుఖము లభింపగల దని తెలియం దగినది. అట్టైన నానా విధములగు రూప, రస గుణములతో కానుపించెడు ఈజగత్తులో ఏలాగున ఏకత్వము సిద్ధింపగలుగు నని శంకించువారికి ఈక్రింద సమాధానము చెప్పబడుచున్నది.

**అగ్నిర్యథైకో భువనం ప్రవిష్టో రూపం రూపం ప్రతిరూపో బభూవ।**
**ఏక స్తథా సర్వభూతాంతరాత్మా రూపం రూపం ప్రతిరూపో బహిశ్చ॥**

ఏలాగున శుక్లకృష్ణనీల పీతాదిధాతువుల ననుసరించి ప్రకాశించునప్పుడు వివిధరూపములుగా కానుపించినను అగ్ని యేకరూపమై యుండునో, ఆలాగున ఆత్మ అనేక భూతములలో వ్యాపించి యుండుటచే నామరూపములతో గూడిన బాహ్యదృష్టికి భిన్నముగా కానుపించినను, అంతరాత్మతో ఐక్యపరచి పరిశోధన సలుపువారికి ఏకరూపముగా కానుపించును. దృష్టాంతమునకు (ఎలెక్ట్రిక్) విద్యుచ్ఛక్తి తంతులలో అమర్చబడిన యంత్రములు అనేక విధములుగాను, అనేక కార్యములు చేయునవిగాను, చిన్నవిగాను, పెద్దవిగాను, ఆలాగున దీపము ఎరుపు పసుపు నీలవర్ణములతో చిన్నదిగాను, పెద్దదిగాను, కానుపించినను వాటి అన్నిటిలోను విద్యుచ్ఛక్తి ఏలాగున ఒకే విధముగా నుండునో, అదేరీతిగా దేహములకును, మనఃకృత్యములకును భిన్నముగ కానుపించినను, అభిన్నుడై వెలుగుచుండు సర్వేశ్వరు డొక్కడే యని గ్రహించవలెను. ఇట్టి దృష్టియే ఆంతర దృష్టియనియు, నామరూపములతో గూడి గుణకర్మములను చూచెడు దృష్టి బాహ్యదృష్టి యనియు గ్రహించవలెను. అంతేగాక యెల్లప్పుడును స్వస్వరూపానుసంధానములో అమరిన దృష్టియై యుండియు బాహ్యభేదములచే బాధనొందెడు దృష్టి దృశ్య దృష్టి యేగాని దివ్య దృష్టి గాజాలదు. మరియు అనేకత్వములో ఏకత్వమును కనుగొనెడి యీక్రింది శ్లోకమును ఎల్లరు పఠించుచుందురు.

**మృత్పిండ మేకం బహుభాండరూపం**
**సువర్ణ మేకం బహుభూషణాని।**

**గోక్షీర మేకం బహుధేనుజాతం**
**ఏకః పరాత్మా బహుదేహవర్తీ ॥**

మట్టి యొక్కటియైనను పాత్రములు అనేకములు. బంగారు ఒకటైనను భూషణముల నామరూపములు బహువిధములు. క్షీరమొకటి యైనను గోవులు శుక్లకృష్ణరక్తవర్ణములతో గూడినవి అనేకవిధములు. అదేరీతిగా మానవులు అనేకవిధములుగా నుండినను వారందరిలోను వెలుగుచుండు దైవవస్తువు ఒకేవిధముగానే యుండు నని తలంచవలయును. మరియు అనేకపాత్రలలో ప్రతిబింబించియుండు సూర్యప్రతిబింబ మెటువంటిదో ఆలాగున నామరూప గుణగణవములతో అనేకవిధవములుగా కానుపించు ప్రాణికోట్ల హృదయాంతరాళములో ప్రకాశించుచుండు సర్వేశ్వరుడు ఒక్కడని కలిగెడు జ్ఞానమే ఆత్మ జ్ఞానమగును. దేహేంద్రియాది గుణకర్మములకు సంబంధించిన వాటిపై మాత్రము ఆధారపడి కలిగెడు జ్ఞానము అజ్ఞానమగునే గాని సుజ్ఞానము గాజాలదు.

**తంతు మాత్రో భవేదేవ పటో యద్వద్విచారతః ।**
**ఆత్మ తన్మాత్రమే వేదం తద్వద్విశ్వం విచారితమ్ ॥**

మరియు అష్టావక్రమునీంద్రుడు జనకునకు సమరస జ్ఞానము బోధించునప్పుడు ఈశ్లోకమును ఉదాహరించిరి. వస్త్రముల పైగల రంగులు పొట్టిది, పొడుగుగా నుండునది, దళముగా నుండునది, మృదువైనది, ఇక చొక్కాయి, షరాయి, కుళ్ళాయి మొదలైన వాటిలో దృష్టినుంచిన అనేకత్వమే కానుపించునుగాని వాటి అన్నిటికిని కారణమగు సూత్రములో, అనగా దారములోగాని, దూదిలోగాని దృష్టి యుంచిన ఏకత్వము కనుగొనవచ్చును. వస్త్రములకు గల వర్ణములన్నియు ఆగంతుకములేగాని స్వభావములుగాదు. కావున ద్రావకాదులలో వేసిన రంగులు వీడిపోవును. నైజమగు తెలుపు మాత్రము శేషించునట్లు, నామరూపములను విడిచిన మిగిలియుండునది ఆ సాక్షాత్‌దైవవస్తు వొక్కటే యని గ్రహించెడు జ్ఞానమేది గలదో అదే సాత్త్విక జ్ఞానమని గ్రహించవలయును.

ముందుగా చెప్పబడిన విషయములచే అనేకత్వములో ఏకత్వము గనుగొనగలిగితిమి. ఇప్పుడు ప్రపంచములో అవతరించిన సర్వమతాచార్యుల చర్యలోనికి మనస్సును కొంచెము ప్రవేశపెట్టి విచారించితిమేని వారందరు తమ జీవితమును జీవకోట్ల ఆత్మబోధకొఱకై వినియోగపరచి యుండిరని గోచరించును. అంతేగాక మనపూర్వీక ఋషులు, యోగీశ్వరులు, సిద్ధపురుషులు ప్రపంచములోగల జనుల ఆత్మోద్బోధనకొరకుగదా యిన్ని ఉపనిషత్తులు, యోగశాస్త్రములు, వేదాంతగ్రంథములు, వైద్యశాస్త్రములు, వ్యాకరణ శాస్త్రములు మొదలుగాగల అనేక దివ్యగ్రంథములును, స్మృతులును, పురాణములును వ్రాసి జనులకు బోధించిరి! ఆలాగున శ్రీజగద్గురు శంకరభగవత్పాదాచార్యులు ముప్పదిరెండు సంవత్సరములు జీవించిన తన దివ్యజీవితములో భరతఖండమంతయు దిరిగి సద్బోధలు గరపి అనేకగ్రంథములు రచించి అనేక మతములను స్థాపించిన విషయము తలంచినచో ఎవరి హృదయము నీరుగా కరుగక మానదు! అట్టి దివ్యపురుషుల సంప్రదాయములో చేరిన మనము లోకపావన కార్యము ఏమి చేయుచున్నాము? అదేరీతిగా శ్రీరామానుజాచార్యులు శ్రీమధ్వాచార్యులు; శ్రీకృష్ణచైతన్యులు, శ్రీదయానందసరస్వతీస్వాముల వారు, శ్రీరాజారాం మోహనరాయ్ గారు, భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంసలు, శ్రీవివేకానందస్వాములు, శ్రీరామతీర్థులు మొదలైన మహాపురుషు లందరును వారియొక్క జీవితమును పుణ్యకర్మానుష్ఠానములో వినియోగపరచి లోకోద్ధారణములో ప్రయత్నించలేదా? అదేరీతిగా శ్రీబుద్ధదేవుడు, శ్రీమహమ్మదునబి, శ్రీయేసుక్రీస్తుదేవుడు మొదలైన వారి అమోఘప్రయత్నము లోకోద్ధారకముగ వినియోగపరచుటేగదా ప్రపంచమంతట ఇంతదివ్యత్వము గలుగుటకైన కారణమైనది! అట్టివారి శిష్యులును వారిగురువులు అనుష్ఠించిన దివ్యచరణగమనపద్ధతిలో జీవితమంతయు వినియోగపరచిరి. ఇది గదా నిజమైన గురుపాద శుశ్రూష యనందగును! గురువులయొక్క దివ్యభావమును కనుగొని అట్టికార్యములో ప్రయత్నించుట గదా భావశుశ్రూష యనందగును!

శ్రీబుద్ధ, శ్రీయేసు, శ్రీమహమ్మదునబి మొదలైన ప్రవక్తలందరును వారి జీవితదశలో వారి మతమును జనులకు బోధించుటయే శిష్యులు చేయవలసిన ధర్మమని బోధించిరేగాని లోకులకు ధర్మతత్త్వము బోధింపక స్వకుక్షిపూరితులై లోకులు చేయుచుండు నిందలకును, అవమానములకును, బాధలకును భయపడి భీరువులై యుండుటయే సన్న్యాసుల ధర్మమని చెప్పినట్లు యెచ్చటైన ఒక్క శబ్దమైన గనబడునా? ఆహా! అట్టి దివ్యమార్గమునకును, ఇప్పుడు సామాన్యజనులకు గల అభిప్రాయమునకును ఎంత భేదము గలిగినది! ద్విజులకు సంతానోత్పత్తి దేనికొరకు ఉండవలయునని శాస్త్రములలో చూచిన స్వశాఖావేదమును నిలబెట్టుటకును, అగ్నిహోత్రాది కర్మలు చెడకుండ సంరక్షించుటకును, పరంపరగా వచ్చుచుండు సనాతన ధర్మమును సంరక్షించుటకు మాత్రమని గోచరించుచున్నది. కావుననే గాయత్ర్యాది మంత్రములు పితృముఖమునుండి ఉపదేశము ఇప్పటికిని పొందుచుండు విషయమై యున్నది. అదే రీతిగా మహాత్ములు పరంపరగా వచ్చుచుండు బ్రహ్మజ్ఞానము చెడనీయక సంరక్షించుటయు, ఆశ్రమధర్మములకు భంగము కలుగక నెలకొల్పుటకు ప్రయత్నించుటయు ముఖ్యధర్మమై యున్నది. సాధువులకు దీనికన్న శ్రేష్ఠమైన ధర్మము మరియొకటి లేదు. అట్లు చేయనివారు గురునాజ్ఞను ఉల్లంఘించినవారే యగుదురు. నైమిశారణ్యములో శౌనకాది మహర్షులందరును ఇట్టి దైవికజ్ఞానమును జనులకు బోధించుటకొరకు యజ్ఞ మను నెపముతో ద్వాదశాబ్దమహాసత్త్రమును చేసి శ్రీసూతమహర్షిచే అష్టాదశ పురాణములును వినిరి. ఇప్పుడు హరిద్వారము, ప్రయాగ, పంచవటి, నాసికాది స్థలములలో పండ్రెడు సంవత్సరముల కొక్కతూరి జరుగుచుండు కుంభమేళయొక్క రహస్యము ఇదే యని అట్టి కాలములో అచ్చోటను దర్శించిన వారందరికిని తోపక మానదు. ఆలాటి స్థలములలో సుమారు మూడు మాసములవరకు అనేకాశ్రమములను మహాత్ములు ఏర్పాటు చేసికొని ధర్మతత్త్వమును బోధించుచుందురు. వారికి కావలసిన సదుపాయము లన్నియు రాజులును, ధార్మికులగు గృహస్థులును సమకూర్చుచుందురు. అట్టి దివ్యభావ మిపుడు మనదేశములో లేనందుచే క్రొత్తగా అట్టి కార్యములు చేయువారికిని;

ఆశ్రమ పద్ధతులను ఏర్పాటు చేసికొని ధర్మరహస్యమును బోధించువారికిని మొట్టమొదట కొన్ని యిబ్బందులు గలుగవచ్చును. అయినను దీనివల్ల గలిగెడు ప్రయోజనము సామాన్యజనులకు గోచరించువరకు మాత్రమే ఆకాశ మండలమున వర్షాకాలపు మేఘమువలె వీరి హృదయాకాశమున అట్టి సంశయగ్రస్త సంకల్పభావ కళంకముండునేగాని శరత్ హేమంతాదికాలములలో శుభ్రాకాశమున ప్రచండ భాస్కరుడు ప్రకాశించునట్లు వీరికిని దీనియొక్క పరమతత్వము తెలియక మానదు. అంతవరకు నూతన ప్రవర్తకులగు సన్యాసులు ఇట్టి కార్యము చేయుటలో సహనము వహించి ప్రయత్నించ వలయును. మనుస్మృతిలో చెప్పినట్లు--

**సమ్మానా ద్బ్రాహ్మణో నిత్య ముద్విజేత విషాదివ।**
**అమృతస్యేవ చాకాంక్షే దవమానస్య సర్వదా॥**

బ్రహ్మనిష్ఠుడైనవాడు ఇతరులు చేయు సమ్మాన సత్కార పూజాది గౌరవకార్యములలో విషమువలె ఏవగించుకొను బుద్ధిగలిగి యుండవలయును. అవమాననిందా దూషణాదికార్యములలో అమృతమువలె ప్రేమించెడు గుణము గలిగి వర్తించవలయును. సమ్మానముచే తనయొక్క పుణ్యక్షయమును, అవమానముచే పుణ్యవృద్ధియు గలుగుచుండును మరియు,

**అసమ్మానా త్తపోవృద్ధిః సమ్మానా త్తపసః క్షయః।**
**అర్చితః పూజితో విప్రో దుగ్ధా గౌరివ సీదతి ॥**

సమ్మాన సత్కార పూజాదులచే తపస్సు క్షయించు ననియు, అట్టిదానికి లోపడక యితరులు చేయు అవమానాది కార్యములకు సంతోషపడువాని తపస్సు శుక్లపక్ష చంద్రునివలె వృద్ధియగు ననియు సమ్మాన సత్కారాది పూజలకు వశపడిన వాని తపస్సు కృష్ణపక్షచంద్రునివలె క్షయమునొందు ననియు శాస్త్రములు చెప్పుచున్నప్పుడు జనులారా! మీరేల సత్యధర్మ సత్కార్మానుష్ఠానాదులు లోకమునకు బోధించుటలో సంశయ పడవలయును? మరియు జనుల హృదయములో గల అట్టి కళంకము తొలగించుటయు, వారిని పవిత్రులుగా జేయుటయు సాధువుల యొక్క ముఖ్యధర్మమైయున్నది.

నైమిశారణ్యములో శౌనకాదిమహర్షులు చేసిన యజ్ఞమునకు లోకములోగల మహాత్ములును, భక్తులును, జిజ్ఞాసులగు అనేక జనులును వచ్చి యుండిరి. ఈ విషయమై పద్మపురాణమున గల విషయము ఈక్రింద వివరింపబడుచున్నది. మనమును అట్టి యజ్ఞము యొక్క అంశమునే ప్రారంభించియున్నాము. మనశక్తికొలది మనము చేసిన చాలును. ఏనుగు భుజింపతగిన ఆహారము చీమకు పని లేదుగదా! కడుపు నిండిన సౌఖ్యము, గజపిపీలికులకు ఒక్కవిధముగానే యుండును. శ్రీరాముల సేతుబంధనమున ఉడుతజేసిన అపారభక్తికి సంతుష్టాంతః కరణులై శ్రీరామచంద్రులు దివ్య హస్తముచే తడవినప్పుడు యేర్పడినవట ఉడుతపై కనబడు మూడురేఖలని పెద్దలు చెప్పుచుందురు. జప యజ్ఞము యజ్ఞములలో శ్రేష్ఠమైనదని శ్రీకృష్ణపరమాత్మలు గీతలో నుపదేశించియున్నారు. ''యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి'' అని గీతావచనము గలదు గదా! గీత నాల్గవ అధ్యాయములో పదు నాలుగు విధము లగు యజ్ఞములు చెప్పబడి యున్నవి. కనుక మన ప్రార్థనయు, పారాయణముగూడ యజ్ఞములో చేరినవే. అది శక్తి కొలది అనగా ఒక్కరోజుగాని, రెండురోజులు గాని, ఎక్కువకాలము గాని, చేయుటలోను విరోధము లేదు. నైమిశారణ్యములో మహర్షులు చేసిన యజ్ఞమును గురించిన భాగము వినుడు.

ఆరబ్ధం నైమిశారణ్యే సత్రం ద్వాదశ వార్షికమ్ ।
ఆజగ్ము రఖిలాసత్ర మునయో బ్రహ్మవాదినః ॥

అసితో దేవలశ్చైవ సుమంతుః పైల ఏవ చ ।
సుమతి ర్వామదేవశ్చ జాబాలిః కాశ్యపో భృగుః ॥

పర్వతశ్చర భంగశ్చ సుతీక్ష్ణోఽగస్త్య ఏవ చ ।
ఆపస్తంబోఽథమాండవ్య స్సత్యః కాత్యాయన స్తథా ॥

రథీతరోంఽగిరాశ్చైవ కపిలో రైభ్య ఏవ చ ।
ముద్గలో గౌతమశ్చైవ కణ్వః కాణోఽత్రి రేవ చ ॥

ధూమ్రో హారీతకశ్శంకుః పృథుర్మంకుశ్చ సంకృతిః ।
కౌండిన్యో విధ్రువశ్చైవ కాణాదో గర్గఏవ చ ॥

కౌశికో గాలవో బభ్రు ర్వ్యాసశ్శక్తిః పరాశరః ।
శనిర్విభాండకః పంకో బుధో బోధాయనో వసుః ॥

జమదగ్ని ర్భరద్వాజో ధూమపో భార్గవస్తథా ।
శౌనకో నారదశ్చైవ శతానంద శ్శతాతపః ॥

విష్ణువృద్ధో విశాలాక్షో జరత్కారూ మహామునిః ।
పక్వపాశ ధరః పారః పారగః పండితోత్తమః ॥

మహాకాయో మహాగ్రీవో మహా బాహుర్మహోదరః ।
ఉద్దాలకో మహాసేన ఆర్త ఆమలక ప్రియ ః॥

ఏక పాదో ద్విపాదశ్చ ఉర్ధ్వ బాహుర్జలాశనః ।
ఉగ్రశీలో మహాశీలః పిశంగో మంత్రవిత్పటుః ॥

శాండిల్యః కరుణః కాలఃకైవల్యశ్చ కలాధరః ।
కల్పాంతః కంకణః కండుః కంఠః కాలాగ్ని రుద్రకః ॥

శ్వేతబాహు ర్మహాప్రాజ్ఞః శ్వేతాశ్వతర సంజ్ఞికః ।
ఏతే శిష్యైః ప్రశిష్యైశ్చ బ్రహ్మిష్ఠా వేదపారగాః ॥

లోకానుగ్రహకర్తారః పరోప కృతిశాలినః ।
పరప్రియరతా నిత్యం జపయజ్ఞ పరాయణాః ॥

ఆగత్యనైమిశారణ్య మశేష గుణసంయుతమ్ ।
కర్తుమారేభిరే సత్రం గోమతీ తీరవాసినః ॥

ముందొకప్పుడు నైమిశారణ్యమునందు శౌనకాదిమహామునులు పంద్రెండు సంవత్సరములకు పూర్తియగునది యైన ఒక యాగమును చేయనారంభించిరి. అప్పుడు ఆ యజ్ఞమునకు సమస్త దేశములందుండు వేదవే

త్తలగు ఋషులందరు వచ్చిరి. ఆ వచ్చిన వారిలో బ్రహ్మ తేజస్స్వరూపులును, వేదములు కడవరకు చదివిన వారును, లోకులకోరికలను ఫలింపజేయుటకు కర్తలును, పరోపకారము చేయువారును, ఎల్లప్పుడును పరులకు ప్రియము చేయుటయందు ఆసక్తి గలవారును, జపము చేయుటయందును, యాగము చేయుట యందును ఆసక్తిగలవారును నైన అసితుడును, దేవలుడును, సుమంతుడును, పైలుడును, సుమతియును, వామదేవుడును, జాబాలియును, కాశ్యపుడును, భృగువును, పర్వతుడును, శరభంగుడును, సుతీక్ష్ణుడును, అగస్త్యుడును, ఆపస్తంబుడును, మాండవ్యుడును, సత్యుడును, కాత్యాయనుడును, రథీతరుడును, అంగీరసుడును, కపిలుడును, రైభ్యుడును, ముద్గలుడును, గౌతముడును, కణ్వుడును, కాణుడును, అత్రియును, ధూమ్రుడును, హారీతకుడును, శంకుడును, పృథువును, మంకువును, సంకృతియును, కౌండిన్యుడును, విధ్రువుడును, కాణాదుడును, గర్గుడును, కౌశికుడును, గాలవుడును, బభ్రువును, వ్యాసుడును, శక్తిమహామునియును, పరాశరుడును, శనిమహాఋషియును, విభాండకుడును, పంకుడును, బుధమహామునియును, బోధాయనుడును, వసువును, జమదగ్నియును, భరద్వాజుడును, ధూమపుడును, భార్గవుడును, శౌనకుడును, నారదుడును, శతానందుడును, శతాతపుడును, విష్ణువృద్ధుడును, విశాలాక్షుడును, మహాముని యగు జరత్కారుడును, పక్వుడును, పాశధరుడును, పారుడును పారగుండును, మహాకాయుడును. మహాగ్రీవుడును, మహాబాహుడును, మహోదరుడును, ఉద్దాలకుడును, మహాసేనుడును, ఆర్తుడును, ఆమలక ప్రియుడును, ఏకపాదుడును, ద్విపాదుడును, ఊర్ధ్వబాహుడును, జలాశనుడును, ఉగ్రశీలుడును, మహాశీలుడును, పిశంగుడును, మంత్రవిదుడును, వటువును, శాండిల్యుడును, కరణుడును, కాలుడును, కైవల్యుడును, కలాధరుడును, కల్పాంతుడును, కంకణుడును, కండువును, కంఠుండును, కాలాగ్ని రుద్రుడును, మిగుల బుద్ధిమంతుడగు శ్వేతబాహుడును, శ్వేతాశ్వతరుడును అను ముఖ్యులగు మహాఋషులందరు వారివారి శిష్యుల తోడము, శిష్యులకు

శిష్యుల తోడనం, బయంలువెడలి వచ్చి సమస్త సుగుణములతో గూడుకొన్నటువంటినైమిశారణ్యములో గోమతి యనుపేరుగల యేటిగట్టున యజ్ఞశాలను గట్టుకొని యాగమును చేయుటకు మొదలుపెట్టిరి.

పరమశివుండు మహర్షులకు ఆత్మ జ్ఞానము బోధించిన తర్వాత ఈ క్రింది శ్లోకము నుదాహరించిరి. ఇది శ్రీస్కాంద పురాణమున సూతసంహితయందు జ్ఞానయోగ మనెడు సమాధి విషయమును తెలిపెడు వింశాధ్యాయమున గలదు.

**ఆనందాక్లిన్న సర్వాంగ ఆత్మానంద వశోఽభవత్।**
**భవంతోఽపి మహాత్మానో మత్తః ప్రాప్తాత్మవేదనాః ॥**
**అభవన్కృత కృత్యాశ్చ మా శంకిధ్వం కదాచన।**
**స్థాపయధ్వమిమం మార్గం ప్రయత్నేనాపి హే ద్విజాః ॥**
**స్థాపితే వైదికే మార్గే సకలం సుస్థితం భవేత్।**

ఈశ్వరుండు బోధించిన వేదాంతమృతమును పానము చేసిన ఋషులు ఆనందముచే గగుర్పాటు గలిగిన శరీరము గల వారై అందరును ఆనందపరవశులైరి. అట్టి మహర్షుల చూచిన ఈశ్వరుడు మహాత్ములారా! మీరందరును నాచే గ్రహింపబడిన ఆత్మ జ్ఞానము గలవారలైతిరి. మీరు కృతకృత్యులైతిరి. ఇంక నెప్పటికిని సంశయింపకుడు. ఓ బ్రహ్మనిష్ఠులారా! ప్రయత్నపూర్వకముగా నిట్టి బ్రహ్మనిష్ఠామార్గమును ప్రపంచములో స్థాపించితిరేని లోకము శభమునొంద గల్గును.

**యో హి స్థాపయితుం శక్తో నకుర్యాన్మోహితో నరః।**
**తస్య హంతా స పాపీ స్యా దితి వేదాంత నిశ్చయః ॥**

ఎవండు ఇట్టి పవిత్ర దైవమార్గమును, ప్రపంచములో స్థాపించుటకును బోధించుటకును, స్థాపనలు చేయుటకును శక్తి గలిగినవాడై కారణాంతరములచే, అట్టి కార్యము చేయక యుండునో, వాడు ఆ దైవమార్గమును నశింపజేసినవాడే యగును. అంతేగాక పాపియనిగూడ గ్రహించవలయును. ఇది వేదాంతము యొక్క నిశ్చయము.

**యస్త్వాపయితు ముద్యుక్త శ్శ్రద్ధయ్మై వా క్షమోపి నః।**
**సర్వపాప వినిర్ముక్తః సాక్షాద్జ్ఞాన మవాప్నుయాత్ ॥**

ఎవండు ఇట్టి దైవమార్గమును ప్రపంచములో స్థాపించుటకును, బోధించుటకును శ్రద్ధగలవాడైయుండునో అట్టివాడు సమస్త పాపములనుండి విముక్తుడై సాక్షాత్ జ్ఞానమగు బ్రహ్మత్వమును బొందును. ఇట్లు ఈశ్వరుడుం ఋషులకు బోధించియుండగా వారి వారి శక్తికొలది దైవమార్గమున మంచి నిష్ఠగలవారై జనులకు బోధించుట యీశ్వరాజ్ఞయై యున్నది. శ్రీభగవద్గీతలోను ఈరహస్యము శ్రీకృష్ణపరమాత్ముడు ఉపదేశించి యున్నాడు.

**య ఇదం పరమం గుహ్యం మద్భక్తేష్వభిధాస్యతి ।**
**భక్తిం మయి పరాం కృత్వా మామేవైష్యత్య సంశయః ॥**

ఏ మానవుండు పరమోత్కృష్టమై పరమరహస్యమైన వేదాంతసార మగు ఈ గీతాశాస్త్రమును నాయందు భక్తిగలవారికి బోధజేయుచుండునో వాడు నాపై పరమభక్తి చేసినవాడై నాస్థానమగు అనగా విష్ణుపద మగు మోక్షమును అనగా పరమపదమును పొందగలడు. దీనిలో యచ్ఛబ్దప్రయోగ ముండుటచే ఎవ్వరైనను సరియనియు, ''మద్భక్తేషు'' అని ప్రయోగించుటచే భగవద్భక్తిగల యెవరికైనను ఈగీతాశాస్త్రము ఉపదేశింపవచ్చు ననియు స్పష్టపడుచున్నది.

**న చ తస్మా న్మనుష్యేషు కశ్చిన్మే ప్రియకృత్తమః ।**
**భవితా న చ మే తస్మా దన్యః ప్రియతరో భువి ॥**

అట్లుపదేశము చేయువానికంటె మనుష్యులలో నాకు పరమప్రియము చేయువాడు వేఱొకడు లేడు. భవిష్యత్కాలమునను నాకు వానికంటె ప్రియుడు భూలోకమందు ఇప్పుడున్న వారిలో లేడు. ఇక కలుగబోడు అని సాక్షాద్భగవద్వచనము కలదు కదా! ప్రేమ స్వరూపులగు సోదరీజనులారా! సోదరోత్తములారా! శ్రీకృష్ణపరమాత్ముడు తనయొక్క అంతరభిప్రాయమును తెలిపినది విన్నారా? ఇట్లుండియు ఇంకను ఈ భగవద్గీతాది దివ్యగ్రంథములు

అందరును చదువగూడదని కొందరి హృదయములో నిగూఢమై యుండు గాఢమైన తమస్సును గురించి యేమిచెప్ప గలుగుదుము? ఇక సమయము కొంచ మగుటచేతను, మరికొందరు ఆత్మవేత్తలు సద్బోధ చేయుటకు నిరీక్షించు చుండుటచేతను ఇంతటితో విరమించెదను. మీరు వీరుచెప్పు పవిత్రోపదేశములను శ్రద్ధతో విని తరించ గోరుచున్నాను.

**సర్వేఽత్ర సుఖినస్సంతు సర్వే సంతు నిరామయాః ।**
**సర్వే భద్రాణి పశ్యంతు మా కశ్చి ద్దుఃఖమాప్నుయాత్ ॥**

ఈ ప్రపంచములో సర్వప్రాణికోట్లును సౌఖ్యము నొందును గాక! సమస్త ప్రాణికోట్లును భయశోకపీడారహితులై యుందురు గాక! సర్వజనులును మంగళస్వరూపుడగు సర్వేశ్వరుని దర్శింతురు గాక! అనగా నిత్యముక్తిని బొందుదురు గాక! ఒక్కప్పుడును ఒక్కరైనను దుఃఖమును బొందక యుందురు గాక!



ఓమ్.

# మానసాది తీర్థప్రభావము

(ఈ సంవత్సరము (1927 సం॥) మాఘమాసములో ఈ మానసాది స్నానఫలమును గురించి శ్రీస్వాములవారు శ్రీవ్యాసాశ్రమమున భక్తులకు బోధించిన పరమతత్త్వము యొక్క మూలము మాత్రము ఇచ్చట ముద్రించడమైనది.)

**మానసా న్యపి తీర్థాని వక్ష్యామి శృణు పార్థివ ।**
**యేషు సమ్యఙ్నరః స్నాత్వా ప్రయాతి పరమాం గతిమ్ ॥**

**సత్యం తీర్థం క్షమా తీర్థం తీర్థ మింద్రియ నిగ్రహః ।**
**సర్వభూతదయా తీర్థం తీర్థమార్జవ మేవ చ ॥**

దానం తీర్థం దమస్తీర్థం సంతోషస్తృప్తి రేవ చ ।
బ్రహ్మచర్యం పరం తీర్థ మక్రోధ స్తీర్థముచ్య తే ॥

మనశ్శుద్ధిః పరం తీర్థం తపస్తీర్థ మనుత్తమమ్ ।
ఆచార్యోపాసనం తీర్థం శౌచం తీర్థ మనుత్తమమ్ ॥

వైరాగ్యం పరమం తీర్థ మసక్తం విషయేషు చ ।
సుతీర్థం సమచిత్తత్వం తీర్థమాత్మని దర్శనమ్ ।

సత్సంగతిః పరం తీర్థం తీర్థానా ముత్తమోత్తమమ్ ॥

ఓ దిలీపమహారాజా! మానసాదితీర్థములను చెప్పెదను వినుము. వాటియందు చక్కగా స్నానముచేసిన మనుష్యుడు మిగుల శ్రేష్ఠమగు గతిని పొందును ఇది ముముక్షువులు ముఖ్యముగా తెలిసికొనందగిన విషయము. ఈ పరమతత్త్వము తెలిసికొనిన మరల భ్రమ యుండదు. తీర్థశబ్దము యొక్క నిర్వచనమేమన? దేనివల్ల జననమరణ భయమగు భవసాగరము తరింపబడునో, దానికే తీర్థమని పేరు. తరింప జేయునదగుటచే తీర్థశబ్దము వచ్చినది, అది దీనియందు చెప్పబడిన శ్రీ వసిష్ఠవచన మని గ్రహించవలయును. ఈ క్రిందివి తీర్థములు.

1. సత్యము పలుకుట, 2. ఓర్పు, 3. ఇంద్రియముల నిగ్రహించుట, 4. సమస్తప్రాణులయందును దయగలిగియుండుట, 5. నిర్మల ప్రవర్తనము, 6. దానము, 7. దుఃఖమును ఓర్చుకొనుట, 8. సంతోషము గలిగియుండుట, 9. తృప్తిగలిగియుండుట, 10. బ్రహ్మచర్యమును నడుపుట, 11. క్రోధము లేకుండుట, 12. మనశ్శుద్ధి గలిగియుండుట, 13. తపస్సు, 14. గురుపూజ చేయుట, 15. శుచిగానుండుట, 16. సమస్తవస్తువులయందు ఆశలేక యుండుట, 17. విషయాసక్తి లేక యుండుట, 18. సమస్తప్రాణులయందును సమచిత్తము గలిగియుండుట, 19. తన్నుతాను చూచుకొనుట, 20. సత్పురుషుల సహవాసము మొదలగునవి మిగుల శ్రేష్ఠములగు తీర్థములు.

## 1. సత్యమే తీర్థము

సత్యాదీనాంచ తీర్థానాం లక్షణం శృణు పార్థివ ।
యస్య శ్రవణ మాత్రేణ సర్వస్నాన ఫలం లభేత్ ॥

అనుద్వేగ కరం హృద్యం సజ్జనానంద కారణమ్ ।
ఏవం లక్షణ సంయుక్తం సత్యం ప్రాహుర్మనీషిణః ॥

సత్యం బ్రూయాత్ప్రియం బ్రూయాన్న బ్రూయాత్సత్యమప్రియమ్।
ప్రియం చ నానృతం బ్రూయా దేష ధర్మస్సనాతనః ॥

ఓ రాజా! సత్యము మొదలగు తీర్థములయొక్క లక్షణములు చెప్పెదను వినుము. సత్యాదితీర్థముల కథనమును విినినమాత్రముననే సమస్తసుతీర్థముల యందును స్నానముచేసిన ఫలము లభించును. మరియు మనస్సులో కలవరము కలుగజేయ నిదియును, మనస్సునకు ఇంపైనదియును, సత్పురుషులకు ఆనందము కలుగజేయునదియు నైన దెద్దియో అది సత్యమని మహాత్ములు చెప్పెదరు. ఓ రాజా! ఎల్లప్పుడును సత్యమునే పలుకవలయును. ఆ సత్యము ప్రియముగా నుండవలెను. ప్రియముగాని సత్యము నెప్పుడును చెప్పరాదు. ప్రియముగా నున్నప్పటికిని అబద్ధము చెప్పరాదు. ఇది అనాదిధర్మమని చెప్పబడును.

## 2. క్షమయే తీర్థము

తష్యంత మేకతో బాహుం చందనేన సముక్షితమ్ ।
ఉభయం తత్సమం పశ్యేత్ క్షమేయం పరికీర్తితా ॥

సత్యవాక్ బలవానాఢ్యో మాన్యో లోక గురుర్మహాక్।
ప్రతివక్తుం ప్రహర్తుం చ శిక్షితుం సాధితుం చ యః ॥

నిందిత స్తాడితో వాఽపి దుర్బలేన కృశేన చ ।
న గృహ్ణాతి రుషోద్వేగం సా క్షమా పరికీర్తితా॥

ఒకచేయి నిప్పులోను, మరియొకచేయి శ్రీగంధమునందును ఉంచి ఆ యుష్ణ శీతలములను, రెంటిని సమముగా సహించుటయే క్షమయని చెప్పబడును. ఓ రాజా! సత్యవంతుడును, బలవంతుడును, దక్షుడును, లోకపూజ్యుడును, లోకగురుడును, మహాత్ముడును అయ్యుండియు, కేవలము బలహీనునిచే ఎదిరింపబడియును దుర్బలుడగు వానిచేత కొట్టబడియును, కోపమును వహింపకయు, బదులు తిట్టకయు, తన్ను కొట్టినవానిని బదులుకొట్టకయు నుండుటయే క్షమ యనబడును. అనగా బదులు తిట్టుటకుగాని, కొట్టుటకుగాని, శక్తిమంతుడై యుండియు వానిని పాటించక ఓర్పుతో తన్ను కాదని త్రోసివేయుటయే క్షమ యనబడును. అనగా ద్వంద్వములను సహించెడు గుణముగల్గియుండెడు నతడే బలవంతుడు. దేహబలముగల్గి మనోనిగ్రహము లేనివాడు బలవంతుడు గాడు.

## 3. ఇంద్రియనిగ్రహమే తీర్థము

**ఇంద్రియాణాం ప్రవృత్తిర్హి విషయేషు స్వభావజా।**
**నానుయాతి మనస్తాని నిగ్రహస్తూచ్యతే బుధైః ॥**

ఆయా ఇంద్రియములు వానివాని విషయములయందు ప్రవర్తించుట వానికి సహజమై యుండియు నట్టి యింద్రియవ్యాపారమును మనస్సునకు తెచ్చుకొనకుండుటయే అనగా మనస్సునకు గోచరింపనీయక తరమివేయుటయే నిగ్రహమని మహాత్ములు వచింతురు.

**ధ్యానం స్థాణు సమాబద్ధం బుద్ధ్యాకాశం మనోహృది।**
**తిష్ఠత్యచలతాం యావత్తావ త్స్వస్థో భవేన్నరః ॥**

స్థాణువువలె అనగా చలనము లేక రాయివలె, సమస్తేంద్రియములను బంధించి, తదేకనిష్ఠాగరిష్ఠుడై ధ్యానసమాధియందున్నవాడై, మనస్సునందును, హృదయమునందును, బుద్ధియను ఆకాశమును పొందియుండుట అచలత యనబడును. అట్లు అచలుడుగా నుండు పురుషుడు స్వస్థుడనబడును. ఇదే నిజమైన అచలమతమని గ్రహించవలయును. ఇట్టి అవస్థ గలుగక

యింద్రియార్థములకు వశపడి తిరుగుట అచలము గాజాలదు. అది అచలము గాదు సచలము.

మన ఏవం నిగృహ్ణీయా దింద్రియానుగతం చలమ్ ।
విషయేభ్య స్సమాహృత్య స తీర్థ ఫలమశ్నుతే ॥

చంచలము లైన యింద్రియములను అనుసరించి పోవుచుండెడి మనస్సును త్రిప్పి విషయములందు తగులకుండ నుంచుకొనువాడు సమస్తతీర్థయాత్రలు చేసిన ఫలమును పొందును.

## 4. దయ

సర్వభూతేషు యో భూమౌ స్థావరేషు చరేషు చ ।
దుఃఖీ స్యాద్దుఃఖితం దృష్ట్వా సుఖీస్యా త్సుఖితం నరమ్ ॥

క్షుధితః క్షుధితం వాపి పూర్ణం పూర్ణమనా భవత్ ।
తాడిత స్తాడితం దృష్ట్వా ఋషీ భూత మృషిర్భవేత్ ॥

సర్వభూతేషు చైవం తు దయావద్భిః ప్రకీర్తితమ్ ।
ఏవం దయావాన్పురుషో విశేషేణ విశుద్ధ్యతి ॥

అతోఽన్యథా వర్తమానః కోటి సంవత్సరావధి ।
గంగాజల నిమగ్నోఽపి నైవ శుద్ధ్యాత్కదాచన ॥

ఈ లోకమునందు గల స్థావరజంగమము లగు, అనగా పుట్టినచోటనే యుండునవియును, పుట్టినచోటు విడిచి స్థలాంతరములకు పోవునవియు నగు ఎల్లప్రాణులలో వ్యసనపడువానిని చూచి వ్యసనపడుచును, సుఖము ననుభవించు వానినిజూచి తాను సుఖమునొందుచును, ఆకలి గొనిన వానిని చూచి తానును ఆకలి గొనినవానివలె నుండుచును, సమస్తవిషయములచేత నిండియున్నవానిని జూచి తానును సమస్తవిషయములచేత పరిపూర్ణుడైనవానివలె నుండుచును, దెబ్బలు పడ్డ వానిని జూచి తానును దెబ్బలు పడిన వానివలె నుండుచును, ఋషివలె నున్న వానినిజూచి తానును ఋషివలె నుండుచును ప్రవర్తించు మానవుడు

సర్వభూతములయందును దయగలవాడని ప్రసిద్ధి నొందునని దయారూపము నెరిగినవారు చెప్పుదురు. ఈ విధముగా దయావంతుడగు మానవుడు మిగుల పరిశుద్ధుడగును. ఇటువంటి నడవడిక లేక వేరువిధముగా అనగా దీనికి వ్యతిరిక్తముగా నడచుకొను మానవుడు కోటిసంవత్సరములు అనగా లెక్కలేని సంవత్సరములు బ్రతికియుండి గంగాజలమునందు ప్రతిదినమును మునుగు చున్నప్పటికిని ఎంతమాత్రమును ఒకానొకప్పుడైనను పరిశుద్ధుడు గానేరడు.

## 5. ఆర్జవము

యథా మనస్తథా వాణీ యథా వాణీ తథా క్రియా ।
ఏతదార్జవ మిత్యుక్తం సర్వతీర్థ ఫలప్రదమ్ ॥
అన్యథా సంతమాత్మానం మన్యతే సత్సు భాషతే ।
కిం తేన న కృతం పాపం చోరేణాత్మాపహారిణా ।
మిత్రే సుహృది విశ్వస్తే యో మనస్యహితం స్మరేత్ ।
ముఖే మందస్మితం వాచి మృదువా క్రూర కర్మకృత్ ॥
పుత్రపౌత్ర గృహక్షేత్ర ధనధాన్య సమృద్ధిమాన్ ।
అచిరా ద్దుఃఖతో భూత్వా నిర్వంశో జాయతే తతః ॥

మనోవాక్కాయ కర్మములయందు కొంచమైనను వ్యత్యాసము లేక యుండుట ఆర్జవ మనబడును. అనగా మనస్సు తలచినట్టే నోటబలుకుటయును నోటితో చెప్పినరీతిగానే కార్యము చేయుటయును ఆర్జవ మనబడును. ఈ ఆర్జవమును తప్పక అభ్యసించుట చేత సమస్త తీర్థయాత్రలను చేసిన ఫలమును మానవుడు పొందును. అట్లు మనోవాక్కాయ కర్మములయందు వ్యత్యాస భావము జెందిన వాడు యోగ్యుల సభయందు తన్ను తాను గొప్పవాడని చెప్పుకొను వాడగును తన్ను తాను దొంగలించినవాడునగును. అట్టివాడు చేయని పాప మేదిగలదు? అనగా అట్టివాడు సకలపాపములను చేయునని భావము. మరియు తన్ను నమ్మిన స్నేహితుని విషయములో మనస్సునందైనను అపకారము తలచు మనుష్యుడును నవ్వుముఖముతో నుండి మిగుల నమ్రతగ

మాటలాడుచు క్రూర కార్యములను చేయువాడును, బిడ్డలు అనగా కొడుకులు, మనుమలు, ఇండ్లు, భూములు, ధనము, ధాన్యము విశేషముగా కలిగియున్నప్పటికిని స్వల్పకాలములోనే అవన్నియును నశించిపోయి మహావ్యసనమును పొందును. మరియు అట్టివాని వంశము క్రమముగా నిర్వంశమగును. ఇందు కెంతమాత్రమును సందియము లేదు.

## 6. దానము

యః ప్రయచ్ఛత్యనుదినం భిక్షా మన్నంచ పుష్కలమ్ ।
తిలధేన్వన్న హేమాంబు భూగవాశ్వాది షోడశ ॥

యథా విభవ విస్తారం స తీర్థ ఫలమశ్నుతే ।
అభయం సర్వభూతేభ్యో యో దదాతి దయాపరః ॥
స స్నాతి సర్వతీర్థేషు న హింసా పరవాన్నరః ॥

ప్రతిదినమును భిక్షుకులకు భిక్షమును, అతిథులకు అన్నమును పుష్కలముగ పెట్టుచు నువ్వులదానము, గోదానము, అన్నదానము, బంగారుదానము, దాహము గొన్నవారికి ఉదకదానము, భూదానము, వృషభదానము, అశ్వదానము మొదలుగాగల షోడశ మహాదానములు, తనకుగల కలిమికి తగినట్లు సత్పాత్రమెరిగి దానము చేసినవాడు సమస్త తీర్థయాత్రలు చేసినఫలము నొందును. మరియు ఓ రాజా! దయతో గూడుకొన్నవాడై, సమస్తప్రాణులకు భయము లేకుండునట్లు నడచుకొనువాడు హింసచేయకుండుట యందు ఆసక్తి గలవాడు. కాబట్టి అట్టివాడు సమస్త తీర్థములయందును స్నానము చేసినవాడగును.

## 7. దమము

మనో మృత్యుర్మనుష్యాణాం మనశ్శత్రు ర్మనో భయమ్ ।
తన్మనోదమనం ప్రాహుః దమం తత్త్వవిదో నృప ॥

విషయేషు యథా భూయా న్మనసో వాసనాక్షయః।
తథా మనో భవేన్ముక్త్యై బంధాయ్మై వాన్యథా నృప॥

మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః।
మనోనిగ్రహవాన్ యోగీ యత్రకుత్రాశ్రమే రతః।
స తీర్థ భూతో లోకానాం దర్శన స్పర్శనాదిభిః॥

ఓ రాజా! మానవులకు మనస్సే మృత్యువు. మనస్సే శత్రువు. మానవులకు సకల భయములకు కారణము మనస్సే యగును. కాబట్టి అట్టి మనస్సును స్వాధీనములో నుంచుకొనుటయే దమము అని అట్టి మనస్సును స్వాధీనములో నుంచుకొన్న మహాత్ములు వచింతురు. ఓ రాజా! జన్మములెత్తుచు బంధమునందు తగులుకొని యుండుటకు గాని, మోక్షమునొందుటకు గాని కారణము మనస్సే. పూర్వజన్మ వాసనలవలన మనస్సు విషయాదులయందు తగులుచుండును. ఏ ఆశ్రమములోనున్నను, అట్టి వాసనలను నశింపచేయునట్లు విషయాదులయందు తగలకుండ, ఆ మనస్సును లోబరచుకొనువాడు యోగి యగును. అట్లు చేసిన మానవుడు వాసనలను నశింపచేసినవాడై బంధములనుండి విడువబడి ముక్తుడగును. అట్టి పురుషుని చూచుటచేతగాని, తాకుట మొదలగువానిచేతగాని, లోకములోని మానవులకు సమస్త తీర్థములలో స్నానము చేసిన ఫలము లభించును., అట్టి మహాత్ముడు బ్రహ్మచర్య గృహస్థ వాన ప్రస్థ యత్యాశ్రమములలో దేనియందుండినను లేక యే స్థలములో ఆశ్రమము నిర్మించి యుండినను విరోధము లేదు. వాడు మహాత్ముడు.

## 8. సంతోషము

సంతోషామృతతృప్తస్య సంతుష్టం యస్య మానసమ్।
దాసీభూతం జగత్సర్వం తస్య శత్రుర్న విద్యతే॥

ధరణీ కశిపూ హ్యైవ చీనాంబర దిగంబరే।
కదన్నేవా రసాన్నేవా పుత్రాదీనాం సుఖే మృతౌ॥

అర్థానాం సిధ్యసిధ్యోశ్చ తథా మానావ మానయోః ।
లాభాలాభే సుఖేదుఃఖే యస్య చిత్తం సమం భవేత్ ॥

స సంతోషయుతో విద్వాన్ సర్వత్ర సుఖమాప్నుయాత్ ॥

అమృతమును పోలియుండెడు సంతోషముచేత తృప్తి నొందిన మనస్సుగలవానికి ఈ ప్రపంచమంతయు సేవకునివంటిది అగును. అట్టివానికి విరోధి యుండడు. ఓ రాజా! వట్టినేలపై పండుకొనుటయందును, మెత్తని పాన్పుపై పండుకొనుటయందును, మేలైన పట్టుబట్టలు కట్టుకొనుటయందును, బట్టలు కట్టుకొనక దిసమొలతో నుండుటయందును, నీరసమైన అన్నమును తినుట యందును, షడ్రసోపేతమయిన అన్నము అనగా ఉప్పు, పులుసు, కారము, తీపు, వగరు, చేదు అను ఈ ఆరురసములతో గూడిన అన్నమును భుజించుటయందును, బిడ్డలు మొదలయినవారు సుఖముగానుండుట యందును, వారు చచ్చుటయందును, కోరిన కోరికలు సిద్ధించుటయందును, అనగా నెరవేరుటయందును, ఆ కోరికలు నెరవేరకపోవుటయందును, తనకు గౌరవము గలుగుటయందును, నష్టము గలుగుట యందును, సుఖము గలుగుటయందును, దుఃఖము కలుగుటయందును , సమచిత్తముతో నుండు మానవుడు సర్వదా సంతోషముతో గూడుకొన్న మహాత్ముడగును. అట్టివానికి ఎచ్చటను సుఖమే కలుగును.

## 9. తృప్తి

తృప్తి తీర్థం ప్రవక్ష్యామి యస్మిన్ స్నాయీ సదాశుచిః ।
ధనధాన్య గృహక్షేత పుత్రపౌత్రార్థసంపదః ॥

యా తృప్తి ర్నశ్వరా సా స్యాత్ క్షణికా క్షణభంగురా ।
ఇతి నిశ్చిత్య మతిమాన్ జ్ఞాన తృప్తి మవాప్నుయాత్ ॥

జ్ఞానమృతేన తృప్తస్య ద్విరక్తస్య బహిస్సుఖాత్ ।
బ్రహ్మాదీనాం సుఖం యావత్తావ త్తద్గోష్పదాయతే ॥

ఓ రాజా! తృప్తి అనెడి తీర్థమును చెప్పెదను వినుము. ఆ తృప్తి తీర్థమునందు స్నానము చేయువాడు నిరంతరము శుచిగా నుండును. మరియు ధనము, ధాన్యము, ఇల్లు, భూమి, బిడ్డలు, మనుమలు మొదలుగాగల సంపదలు క్షణభంగురము లని తెలిసికొని వానియందలి తృప్తిని స్మరింపరాదు. వానిని మనసున తలపనేరాదు. బుద్ధిమంతు డగువాడు ఇవన్నియు క్షణభంగురము లని, మనసున నిశయించి, జ్ఞానము వలన గలిగెడి తృప్తిని పొందవలెను. జ్ఞానమనెడి అమృతమును త్రాగుట వలన కలిగెడి సుఖముతో తృప్తి నొందినవాడై బాహ్య సుఖములయందు కొంచెమైనను ఆశలేని వాడు కావలెను. అట్టివానికి బ్రహ్మ మొదలగువారు పొందెడు సుఖమంతయు గోష్పదమాత్రమై యుండును. అనగా మిగుల స్వల్పముగా తోచునని భావము. ఆత్మసుఖము పొందినవానికి బ్రహ్మాదుల స్థానము తృణముగా తోచును.

## 10. బ్రహ్మచర్యము

బ్రహ్మచర్యం ప్రవక్ష్యామి తీర్థం పరమపావనమ్ ।
లక్షణం బ్రహ్మచర్యస్య శృణు వక్ష్యామి తే నృప ॥

శ్రవణం కీర్తనం కేళిః ప్రేక్షణం గుహ్యభాషణమ్ ।
సంకల్పోఽధ్యవసాయశ్చ క్రియా నిర్వృతి రేవ చ ॥

ఏతన్మైథున మష్టాంగం ప్రవదంతి మనీషిణః ।
శోభాలంకార వస్త్రైశ్చ వసితం భూషితం ధృతమ్ ॥

వివిక్తే స్మరతః పుంసః స్త్రీయోగం మైథునాత్పరమ్ ।
ద్యూతం పాణికృతం సాకం దారుపీఠే వరాటికామ్ ॥

చతురంగ తయా కేళిః సక్తన్మైథున సాధనమ్ ।
మాత్రా స్వస్రా దుహిత్రా వా నైకశయ్యాసనో వసేత్ ॥

బలవా నింద్రియగ్రామో విద్వాంస మపి కర్షతి ।
హస్తాభి నయసంజ్ఞాభి ర్నయనా లోకచేష్టితైః ॥

నర్మాలాప స్మితయుతం ప్రేక్షణం మైథునాత్పరమ్।
వ్యంగ్యోక్తి ర్జనతాలోకే వివిక్తే గుహ్యాభాషణమ్ ॥

ఉభయాభి మతవ్యక్తి వచనం గుహ్యాభాషణమ్।
తయాత్మాభి మతే దత్తే మనసా మైథున క్రియామ్॥

నిద్రావిరహితం కుర్యా త్సంకల్పో మైథునాత్పరమ్ ।
హానిం మృత్యుం క్షయం నాశ మనవేక్ష్య ధియాత్మనః ॥

ప్రారభే న్నిశ్చయాత్కార్మ వ్యవసాయ స్సమీరితః ।
తుంగౌ స్తనౌ సుసంపీడ్య వక్షసా పరిరభ్య చ ॥

స సంయోగః క్రియాప్రీతి స్సానిర్వృతి రుదాహృతా ।
ఏతన్మైథున మష్టాంగం యః పరిత్యజ్య వర్తతే ॥

తద్బ్రహ్మచర్యం పరమం సర్వకామైక సాధనమ్ ।
ఏకభుక్త మధశ్శయ్యా బ్రహ్మచర్య మహింసనమ్ ॥

వ్రతచర్యా తపశ్చర్యా కృచ్ఛ్ర చాంద్రాయణాదికమ్ ।
దేవపూజా మంత్రజపో దశైతే నియమాస్స్మృతాః ॥

ఓ రాజా! మిగుల పావనమగు బ్రహ్మచర్యమను తీర్థమును వివరించెదను. ఆ బ్రహ్మచర్య లక్షణమును చెప్పెదను వినుము. 1. శ్రవణము అనగా విషయాదిప్రేరిత వచనములను వినుట, 2. కీర్తనము అనగా విషయాదిసంబంధ వచనములను ఉచ్చరించుట, లేక పాడుట లేక వర్ణనము చేయుట, 3. ఆట అనగా స్త్రీలతో ఆడుట, 4. చూచుట అనగా ముఖాదిఅంగములను చూచుట 5. రహస్యముగ మాటలాడుట, 6. మనస్సునందు విషయమును తలంచుట, 7. విషయోత్సాహము కలుగుట, 8. విషయకృత్యములు చేయుట అను నీ యెనిమిది మిథునకర్మకు అష్టాంగములు అనగా ఎనిమిది అంగములని మహాత్ములు చెప్పెదరు. అనగా పై చెప్పిన యెనిమిది దోషములు బ్రహ్మచారికి నుండరాదు. మరియు మిగుల ప్రకాశము లయిన సొమ్ములను, వస్త్రములను ధరించుట, స్త్రీపురుషులు రహస్యమగు చోట మన్మథప్రేరితులై కూడుటయు,

మిథునకర్మకు అంగములు. గవ్వలు చేతపట్టుకొని కొయ్యపీటపై పందెమువేసి జూదమాడుటయు, చదరంగము ఆడుటయు మిథునకర్మమునకు అంగము లగును. ఇది గాక వసిష్ఠమహర్షి తన అభిప్రాయమును చెప్పుచున్నాడు. తల్లితో గూడనైనను, తోబుట్టినదానితో కూడనైనను, కూతురితో గూడనైనను ఒక పడకమీద పండుకొనుటయైనను, ఒకపీటమీద కూర్చుండుటయైనను కూడదు. ఏలనగా ఇంద్రియసమూహము మిగుల బలముగలది కావున మహాత్మునినైనను విషయములకు లాగును. చేసంజ్ఞలుచేయుట, కనుసంజ్ఞలుచేయుట, మన్మథ ప్రేరితములగు పరిహాసపుమాటలాడుట, చిరునవ్వు నవ్వుట, ఇవి మిథునకర్మకు అంగములు. ఈ బ్రహ్మచర్యము పురుషులకు చెప్పినట్లే స్త్రీలకు పురుషుల నుండి సంభవింపకుండ నుండవలెను.

**మాత్రా స్వస్రా దుహిత్రా వా న వివిక్తాసనో భవేత్।**
**బలవా నింద్రియగ్రామో విద్వాంస మపి కర్షతి ॥**

అని పాఠాంతరము. ఇచ్చోట తల్లి, తోడబుట్టు, కుమార్తె వీరితో కూడ నైనను, విరక్తుడైన బ్రహ్మనిష్ఠుడు ఒక్కచోట నుండరాదు. ఆలాగున విరక్తురాలగు స్త్రీయు, తండ్రి, సోదరుడు, కుమారుడు వీరితోకూడనైనను, ఒక్కచోట నుండరాదని ఋషులు చెప్పుటచే తదితరులతో కూడియుండుట యెంత అపాయకరమో ఊహ్యము. ఏలన ఇంద్రియముల సమూహము అతి బలమైనది. బ్రహ్మవేత్త యయిన మహాత్ముని మనస్సును కూడ క్షోభింప శక్తిగలిగి యుండును. ఏ కాలములో ఎట్లు జరుగునో అని ముందుగా ఈ విషయములో ఎవరికిని చెప్పతరము కాదు. ఇవి గాక కీడు మూడుటయు, చావు వచ్చుటయు, క్షీణము కలుగుటయు, నాశము వచ్చుటయు, ఈ మొదలగువానిని మనస్సున తలపక తాను చేబూనిన కార్యమును పట్టు వదలక చేయుటయే వ్యవసాయ మనబడును. ఈ పైజెప్పిన ఎనిమిది విధములగు కార్యములు మిథునక్రియకు అష్టాంగములు, అనగా ఎనిమిది అంగములని చెప్పబడును. ఈ ఎనిమిది విధములగు పనులను విడిచిపెట్టి నడచుటయే, అన్నికోరికల నిచ్చుటకు ఒక్కటే సాధనమైన బ్రహ్మచర్యవ్రతమని చెప్పబడును. మరియు ఒంటి పూట

భోజనము చేయుట, ఉత్తనేలపైపరుండుట, బ్రహ్మచర్యవ్రతమును క్రమముగా నడపుట, ప్రాణులను హింసచేయకుండుట, వ్రతములను ఆచరించుట, తపముచేయుట, కృచ్ఛ్రము చేయుట, చాంద్రాయణము చేయుట, దేవతార్చనము చేయుట, మంత్రములను జపించుట అనునట్టి యీ పదియును బ్రహ్మచర్యవ్రతమునకు నియమములు.

## 11. అహింస

సర్వేషా మేవ జీవానాం కర్మణా మనసా గిరా ।
బుద్ధ్యా హింసాం న కుర్వంతి అహింసైవం ప్రకీర్తితా ॥

పనులచేతగాని, మనస్సునందు తలచుటచేతగాని, మాటలచేతగాని సమస్తప్రాణులకు బాధ కలుగజేయకుండుటయే అహింస యని చెప్పబడును.

## 12. అక్రోధము

పితృమాతృ సుహృద్వర్గే గుర్వాచార్యేషు బంధుషు ।
మాతుల శ్వశురాదేషు యేష్వసచ్చరితేష్వపి ॥
క్రోధశీలో భవేన్నైవ సో ఽక్రోధస్సూచ్యతే బుధైః ॥

తల్లి, దండ్రి, స్నేహితులు మొదలగు వారియెడలను, మంత్రోపదేశము చేసిన గురువు, చదువుచెప్పిన ఆచార్యుడు లేక బంధువులు మొదలగువారి యెడలను, మేనమామ, పిల్ల నిచ్చిన మామ, పెద్దలు మంచి నడవడికగలవారి యెడలను వారు తప్పుచేసినప్పటికిని కోపము పూనక శాంతము వహించియుండుట అక్రోధమని మహాత్ములు చెప్పుదురు.

## 13. మనశ్శుద్ధి

పుణ్యా పాపానభిజ్ఞత్వం మనసా చింతయన్నఘమ్ ।
పరాపవాదం పైశున్యం పరద్రోహ పరాయణః ॥

కాఠిన్యం చింతయర్గ చిత్తే హృదిపారుష్య వాక్సదా ।
ఏవం విధ దురాచార స్స నృశంసః ప్రకీర్తితః॥

నృశంసః కీర్తితో రాజ న్నానృశంస్య మతోఽన్యథా ।
ఇహాముత్రార్థ వైరాగ్యా ద్వేదాంత శ్రవణేన చ ॥

నిత్యా నిత్య విచారేణ మనో నిర్మలతామియాత్ ।
ఏవం మనోమలత్యాగా చ్ఛుద్ధో భవతి నాన్యథా ॥

మనశ్శుద్ధిమతః పుంసో బ్రహ్మాదీనాం చ య త్సుఖమ్ ।
తదనంత సుఖస్యాస్య తత్సుఖం గోష్పదాయతే ॥
తస్మాన్మనోమల త్యాగః సర్వతీర్థ ఫలప్రదః ॥

పుణ్యాపాపములను ఎరుగకుండుటయు, పాపకార్యములనే యెప్పుడును మనస్సున తలంచుచుండుటయు, పరులపై నిందలు పెట్టుటయు, అన్యులపై చాడీ చెప్పుటయు, పరులకు నిరంతరము అపకారముచేయ తలంచుటయు, కఠినమైన మనస్సు గలిగియుండుటయు, ఎల్లప్పుడును కఠినమైన మాటలు మాటలాడుటయు, ఈవిధములగు దురాచారములు గల మనుష్యుడును నృశంసుడని చెప్పబడును. ఓ దిలీపమహారాజా! పైన చెప్పబడిన నడవడిక లేవియు లేనివాడు అనృశంసుడనంబడును. మరియు ఈ లోకసంబధములైన విషయములందు ఆశలేకయుండుటచేతను, వేదాంతమును వినుటచేతను, ''ఇది నిత్యమైన పదార్థము'' అనగా ఎల్లప్పుడుండునది ''ఇది అనిత్యమైన పదార్థము'' అనగా ఎల్లప్పుడు నుండని వస్తువని విచారించి నిత్యానిత్యవస్తువును తెలిసికొనుట చేతను, మనస్సునందలి మాలిన్యము తొలగును. ఈ విధముగా తప్ప వేరు రీతిగా మనోమాలిన్యము నివృత్తికాదు. ఈ విధముగా మనస్సులోని మలినమును తొలగించుటవలన మనుష్యుడు పరిశుద్ధుడగును. మనశ్శుద్ధి గల మానవుడు బ్రహ్మాదులు పొందునట్టి సుఖమునకంటె అధిక సుఖమును పొందును. కాబట్టి బ్రహ్మాదులు పొందు సుఖము అటువంటి మానవునకు అల్పసుఖముగ తోచును. కావున మనస్సునందలి మాలిన్యమును నివర్తించు మానవుడు సమస్త తీర్థములలో స్నానముచేసిన ఫలమును పొందును.

## 14. తపస్సు

మనసో నిగ్రహేణైవ శరీరస్య తు మోక్షణాత్ ।
ఇంద్రియాణాం నిరోధేన నాకాదీనాం చ నిగ్రహాత్ ॥

ఆహారవర్జనా చ్చైవ యుక్తాహార నిషేవణాత్ ।
యుక్తస్వప్నావ బోధేన యత్తప స్తత్తపో విదుః ॥

ఏత త్తపః పరం తీర్థ మితి యత్తత్సమీరితమ్ ।
జ్ఞానమేవ పరం తీర్థం సకళం నిష్కళంతు వా ॥

హరిం హరం రవిం వ్యక్త మపివా చింతయే త్సుధీః ।
సాంగం సముద్రం సన్న్యాసం సఋషి చ్ఛంద దైవతమ్ ॥

జపేన్మంత్రం నరస్సోపి సర్వతీర్థ ఫలం లభేత్ ।
అవిచారిత రమ్యేషు స్త్రీదేహేష్వపి రాగిణామ్ ॥

మాయారమ్య తరా ప్రీతి ర్జాయతే హ్యవివేకినామ్ ।
ఇయం పశ్యతి మాం నారీ పరిరంభం చ వాంఛతి ।
ఇత్యేవం మన్యతే రాగీ నాంతర్వస్తు విచారవాణ ॥

పురుషోఽయ మియం స్త్రీతి పృథజ్ఞ్నాస్తి వివేకినామ్ ।
ఆత్మైవభాతి సర్వత్ర బాహ్యేంతః పరిపశ్యతామ్ ॥

మనస్సును పోయినమార్గమున విడువక దానిని తన వశము చేసికొనుట చేతను, దేహసుఖములను విడుచుట చేతను, ఇంద్రియములు అవి పోవుమార్గమున విడువక అడ్డగించి తన యిష్టప్రకారము త్రిప్పుటచేతను, స్వర్గము మొదలగువానిని అలక్ష్యముగా చూచుట చేతను, తగని ఆహారమును విడిచిపెట్టుటచేతను, తగిన ఆహారమును తినుటచేతను, మితముగా నిద్రపోవుటచేతను, మితముగ మేలుకొని యుండుటచేతను, అనుభవించు సుఖములన్నియు కలలవలె తలచి పైన చెప్పిన రీతిగా నడచుకొనుటకు తపస్సనిపేరు. ఇట్టి తపస్సే అన్నిటిలోపల మిగుల శ్రేష్ఠమైన తీర్థమని

చెప్పబడును. చదువుతో గూడుకొనినదైనను, విద్య లేనిదైనను, జ్ఞానమే సర్వ శ్రేష్ఠమైన తీర్థమని చెప్పబడును. బుద్ధిమంతుడైనవాడు విష్ణువును, శివుని, సూర్యుని యెరిగి పూజింపవలయును లేక మనస్సున ధ్యానింప వలయును. మరియు ఓ రాజా! అంగన్యాస కరన్యాసములతోను, ఆయా మంత్రములకు గల ముద్రలతోను, ఋషిచ్ఛందోదైవములతోడను మహామంత్రములను జపించిన మనుష్యునికి సమస్త తీర్థములలో స్నానము చేసిన ఫలము సిద్ధించును. ఇది గాక కాముకులయి అవివేకు లయినవారికి విచారించకుండుటచేత, అనగా నిత్యానిత్య వస్తువిచారము చేయకుండుటచేత మిగుల మనోహరముగా తోచునట్టి స్త్రీ దేహాదులయందు మాయచేత మిగులమనోజ్ఞమగు ప్రీతిపుట్టుచున్నది. అందువలన కాముకుడైనవాడు, ''ఈస్త్రీ నన్నుచూచుచున్నది. నన్నుఆలింగనము అనగా కౌగిలించుకొనుటకు మిగుల ఇష్టము గలిగియున్నది.'' అని యిట్లు తలచునేగాని లోపల వెలుగు చుండెడి పరమాత్మను విచారించడు. వివేకి యగువాడు అనగా జ్ఞానియైనవాడు ''వీడు పురుషుడు, ఇది స్త్రీ'' అనుభేదము లేక తనవలెనే లోపలను వెలుపలను పరమాత్మయే వెలుగుచున్నది అని తెలిసికొని యెల్లెడలను సమభావముతో చూచును. ఇదే తపస్సని చెప్పబడును.

## 15. ఆచార్యోపాసనము

జలతీర్థేన కిం తస్య కోటిసంఖ్యేన భూపతే ।
ఆచార్యోపాసనం తీర్థం పరం కైవల్య సాధనమ్ ॥

అధ్యాప్య వేదం వేదాన్య స్సషడంగ పదక్రమా౯।
ఆచార మాచారయతి సోఽయ మాచార్య ఉచ్యతే ॥

ఆచార్యాయ ప్రియం కుర్యా త్ప్రాణై రపి ధనై రపి।
అనుక్తసేవీ సతత మింగితజ్ఞో వసేత్సదా ॥

శౌచమాచార్య శుశ్రూషాం భక్త్యా యః కురుతే నరః ।
స గచ్ఛే ద్బ్రహ్మణో లోకం యాతో నావర్తతే పునః ॥

ఓ రాజా! జలతీర్థములు కోట్లకొలది సేవించినను అది గురువును సేవించుటతో సమానము కాదు. గురువును సేవించుట యను తీర్థము మిగుల శ్రేష్ఠతమమైనదియును మోక్షసాధనమైనది యునుంగా నున్నది. స్వశాఖావేదమును, అన్యశాఖావేదములను, శిక్ష,వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము అనెడి ఆరు అంగములతోడను, పదక్రమములతోడను చదివించి అందు చెప్పబడి యుండెడి ఆచారముల ప్రకారము నడచుకొనునట్లు చేయువాడు ఆచార్యుడు అనగా గురువు అనబడును. ఓ రాజా! ఆచార్యుని అనగా గురువుయొక్క యిష్టమును నెరవేర్చుటకు ప్రాణమునైనను, ధనమునైనను పోగొట్టుకొనవచ్చును, మరియు శిష్యుడగు వాడు గురువువలన నాకిది చేయుమని చెప్పబడకయే, ఆయనకు కావలసిన విషయములను తాను తెలిసికొని, ఆయన తోడువిడువక యుండి సమస్త విషయములందును గురువునకు పరిచర్య చేయవలయును. శుచియై భక్తితో గూడుకొని గురుశుశ్రూషచేయు మానవుడు బ్రహ్మలోకమును పొందును. అట్టివాడు మరల పుట్టడు.

## 16. శౌచము

శౌచం తు ద్వివిధం ప్రోక్తం బాహ్యమాభ్యంతరం శుభమ్ ।
మృజ్జలాభ్యాం బహిశ్శుద్ధి రాంతరం బ్రహ్మచింతనమ్ ॥
అనిష్కల్మష చిత్తస్య సర్వతీర్థేషు మజ్జనమ్ ।
నరస్యాంగారకస్యేవ సదా క్షీరాభిషేచనమ్ ॥

ఓ రాజా! శౌచము రెండువిధములు. శౌచమనగా శుద్ధి. ఇది వెలిశుద్ధి యనియు, లోశుద్ధియనియు రెండువిధములు, లోశుద్ధి మిగుల మేలు గలుగ జేయునది. మన్నుతో తోమి నీటితో కడుగుటవల్ల వెలిశుద్ధి యగును, బ్రహ్మవిచారము చేత లోశుద్ధియగును. కల్మషముగల మనస్సుతో గూడుకొన్నవానికి సమస్త తీర్థములయందు స్నానము చేయుట బొగ్గును తెల్లగా జేయుటకై నిరంతరము పాలతో కడిగినట్లువలె నిరర్థకమగును. అనగా కొంచెమైనను నుపయోగము లేదని భావము.

## 17. వైరాగ్యము

స్వదేహ సుత జాయాసు నిర్మమో నిరహంకృతిః।
అసక్తో విషయేష్వేవ యస్త్వేతేషు చ సర్వదా ॥

సూర్యాచంద్ర మసోరూప సాన్నిధ్యం దర్శితం భవేత్।
వైరాగ్యమేత ద్భూపాల! వ్యాహృతం తే మయోత్తమమ్ ॥

ఓ రాజా! తన దేహమందును, బిడ్డలయందును, భార్యయందును, మోహము లేనివాడు అనగా ఆశలేనివాడును, నేను అను గర్వములేనివాడు నిరంతరము తన శక్తికి మించిన పనులయందు ప్రవేశింపనివాడును నగు మనుష్యుడు సూర్యచంద్రాదులను నిజరూపమునందు నిరంతరమును తన సాన్నిధ్యమునందే చూచుచుండును. ఓ రాజా! ఇదియేవైరాగ్యము. ఈ శ్రేష్ఠమైన వైరాగ్యమును నీకు చెప్పితిని. దీనివల్ల వస్తువైరాగ్యము వైరాగ్యముగాదనియు, భావవైరాగ్యము వైరాగ్యమనియు తెలియందగినది.

## 18. విషయవిరక్తి

యోగే జ్ఞానే చ వైరాగ్యే సాంఖ్యే వేదాంత సమ్మతే।
దుర్వాసనా క్షయే వాపి సంగనాశోఽఘసంక్షయే ॥

సత్సంగతి ర్గతిర్ నృణాం నాన్యథా గతి రిష్యతే।
అత స్సంసారనాశాయ కుర్యా త్సత్సంగతిం సదా ॥

యమ నియమ ఆసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణా యోగము లనెడి యెనిమిది యోగములు సిద్ధించుటకును, జ్ఞానమునకును, అనగా ఇది నిత్యము, ఇది అనిత్యము అని తెలిసికొనెడి తెలివి కలుగుటకును, వైరాగ్యమునకును అనగా సకల విషయము లందును త్యాగ బుద్ధి గలిగి యుండుటకును, వేదాంత సమ్మతమైన సాంఖ్యమును అభ్యసించుటకును,

దుర్విషయములందు తగిలెడి బుద్ధిని నశింపచేయుటకును, దుష్టసహవాసమును విడుచునట్లు చేయుటకును, పాపమును నశింపచేయుటకును, ఎల్లప్పుడును సత్పురుషులతోడ సహవాసమే గతియగును ఇదితప్ప వేరుగతిలేదు. కాబట్టి సత్సాంగత్యము వలన విషయాదులందుగల ఆశ నశించు నని భావము. ఇదిగాక ఆదిశంకరులవారును జీవన్ముక్తికి గూడ కారణము సత్సాంగత్యమే అని చెప్పియున్నారు.

సత్సంగత్వే నిస్సంగత్వం నిస్సంగత్వే నిర్మోహత్వమ్ ।
నిర్మోహత్వే నిశ్చలతత్త్వం నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః ॥

సత్సహవాసమువలన దుస్సహవాసము విడుచును, దుస్సహవాసము విడుచుటచేత మోహము వదలును, అనగా ఆశ విడుచును. ఆశ విడుచుటచేత మనోనిశ్చలత గలుగును. మనోనిశ్చలత కుదురుటచేత జీవన్ముక్తి గలుగు నని శంకరులు చెప్పియున్నారు.

## 19. సమచిత్తత్వము

ఆచారా ల్లభ్యతే లక్ష్మీ రాచారో హంత్యలక్షణమ్ ।
ఆచారా ద్రూపతాం ప్రాహుర్ముక్తిమాచారవా౯ లభేత్ ॥

వృత్తమేవ సతాం రక్షే ద్వృత్తమేతి చ యాతి చ
అక్షీణో వృత్తతః క్షీణో వృత్తతస్తు హతో హతః ॥

ఆచారహీనం న పునంతి వేదా యద్యప్యధీతాః సహ షడ్భిరంగైః ।
ఛందాంస్యేనం మృత్యుకాలే త్యజంతి నీడా౯ శకుంతా ఇవ జాతపక్షాః ॥
తస్మా దాచారవా౯ లోకే సర్వతీర్థ మయో భవేత్ ॥

సురా భాండే యథా తోయం శ్వస్పృష్టంచ యథా పయః ।
ఊషరే చ యథా వారి వృత్తహీనే తథా శ్రుతమ్ ॥

సదాచారమువలన సంపద కలుగును. సదాచారము వలన అనిష్టములు నశించును. సదాచారమువలన మంచి రూపము గలుగును. సదాచారసంపన్నునికి

మోక్షము లభించును. యోగ్యులగువారు సదాచారమును కాపాడు కొనవలయును. సదాచారమును కాపాడుకొనని పురుషుడు నశించును. సదాచారము గల పురుషుడు ఎప్పుడును చెడడు. శిక్షా వ్యాకరణాదిషడంగములతో గూడ వేదములు చదువుకొన్నప్పటికిని ఆచారహీనుని ఆ వేదములు గూడ పరిశుద్ధుని చేయజాలవు. మరియు రెక్కలు వచ్చిన పక్షులు గూళ్ళను విడిచి పారిపోవునట్లు ఆ చదువుకొన్న వేదములుగూడ అంత్యకాలమున వానిని విడిచిపోవును. కావున సదాచార సంపన్నుడే లోకమునందు సర్వతీర్థస్వరూపుడు. సదాచారము లేనివానికి గల వేదార్థవిచార జ్ఞానము కల్లుకుండయం దుంచబడిన మంచినీళ్ళవలెను, కుక్కత్రాగిన పాలవలెను, చవిటినేలలోపడిన వర్షపునీళ్ళవలెను నిష్ప్రయోజనము. కాబట్టి సదాచారసంపన్నత సర్వతీర్థస్వరూపము కావున నిదియే సుతీర్థ మనబడును.

## 20. ఆత్మనిదర్శనము

అద్రోహేణైవ భూతానాం వర్తతే యో ద్విజో నృప ।
అతిథి స్సభవే ద్ధాతు శ్శివస్యచ హరే రపి ॥

మానసేష్వపి తీర్థేషు యో నరస్స్నాతి బాహ్యకే ।
జలే న హి భవే చ్ఛుద్ధో యథా మండూక కచ్ఛపౌ ॥

న శరీరమలత్యాగా న్నరో భవతి నిర్మలః ।
విషయేష్వపి సంసక్తిర్మనసో మలముచ్యతే ॥

విషయేషు విరాగస్య మనసో మలనాశనమ్ ।
చిదానంద్దార్ణవే స్నాతో రాగాది మలనాశనే ॥

సంప్రబోధజలే రాజ్ఞ కైవల్యమచిరాల్లభేత్ ।
ఏతత్తే కథితం రాజ్ఞ మానసం తీర్థ లక్షణమ్ ।
యస్య శ్రవణ మాత్రేణ జ్ఞానయజ్ఞ ఫలం లభేత్ ॥

ఓ రాజా! సకల జీవుల యందును ద్రోహచింత లేక సమభావముతో నడచుకొను బ్రహ్మనిష్ఠుడు బ్రహ్మ విష్ణు మహేశ్వరులకు అతిథి యగును. అనగా

అతిథివలెనే పూజింపదగిన వాడగును. పైన చెప్పబడిన మానసతీర్థములందు స్నానముచేసిన మానవుడు మహాపరిశుద్ధుడగును. మనశ్శుద్ధిలేక బాహ్య తీర్థములందు అనగా గంగాదితీర్థములయందు స్నానముచేయువాడు శరీరమలమును కడిగి వేయుటచేత ఎంతమాత్రము పరిశుద్ధుడు కానేరడు. నిరంతరము నీటియందే యుండెడు కప్ప తాబేలు మొదలగువాని వలెనే శుద్ధుడు గానేరడు. శబ్దాది విషయములగు ఇంద్రియాదివిషయములందు ఆశగలిగి యుండుట మనోమలము అని చెప్పబడును. ఆ శబ్దాదివిషయములందు ఆశలేక యుండుట మనశ్శుద్ధి యని చెప్పబడును. తెలివి యనెడి సముద్రమునందు స్నానము చేసిన మానవుడు కోరికలు మొదలగు ఆశలు నశించుటచేత జ్ఞాన జలమందు మునిగినవాడై శీఘ్రకాలములోనేకైవల్యమును పొందును. ఓ రాజా! మానసతీర్థలక్షణమును నీకు తెలిపితిని. ఈ మానసతీర్థములను విన్నమాత్రముననే జ్ఞానము కలుగును. యజ్ఞము చేసిన ఫలము లభించును అని వసిష్ఠుడు దిలీపమహారాజుతో చెప్పెను. ఇట్లు శ్రీపద్మపురాణమునందు మాఘమాహాత్మ్యమున మానసాది తీర్థప్రభావమును తెలుపు నట్టి యిరువది ఒకటవ అధ్యాయము ముగిసెను.

*****

# ధ్యానము

(అరవపాళెములో జరిగిన శ్రీసనాతన ధర్మపరిపాలన సమాజమున సంధ్యాకాలమున ధ్యానమును గురించి శ్రీ మలయాళస్వాములవారొసంగిన యుపన్యాసము యొక్క సారము ఈక్రింద ముద్రితము)

**ఈశ్వరో గురురాత్మేతి మూర్తిభేద విభాగినే ।**
**వ్యోమవద్వ్యాప్త దేహాయ దక్షిణామూర్తయే నమః॥**

పరిశుద్ధమైనజ్ఞానమును, కరుణయు, త్యాగమును మూర్తీభవించిన ప్రియసోదరీ సోదరులారా! ఇది ధ్యానకాలము. అదిగో ఒక ప్రకాశమైన లైటు వెలిగించుటకొఱకు గాస్లు (చిమ్ని) ఒక్కరు తుడుచుచున్నారు. ప్రతిరోజు

ఈ చిమ్ని తుడుచుటచే స్వచ్ఛమై దీపము ప్రకాశించుచుండును. ఈ చిమ్ని కొద్దిరోజులు తుడువక పోయినచో పొగచే ఆవరింపబడినదై, దీపము ఏలాగున కానిపింపదో, ఆలాగున మీ హృదయమును ప్రతిరోజు ధ్యానమను ఉపాయముచే శుద్ధపరచనిచో మీలో ప్రకాశించియుండు జ్ఞానము ఆవరణమై అజ్ఞానులగుదురు. కనుకనే మహర్షులు ఈ ధ్యానవిధిని ఏర్పరచిరి. ఇట్లు చేయనిచో తెలిసికొనందగిన దానిని తెలియనివారలై జీవితముయొక్క ముఖ్యఫల మనుభవింపకపోయెదరు. నారీమణులారా? మీ స్వగృహములలో గల చెంబు మొదలైన పాత్రములను ప్రతిదినము ప్రాతః కాలమున గడుగుచున్నారుగదా! అట్లుచేయనిచో, పాత్రములు చిలుము పట్టి యేలాగున చెడునో, అదేరీతిగా అంతఃకరణశుద్ధి చేయనిచో మూఢులై పోవుదురు గదా!

ఈ ధ్యానము ప్రాతఃసంధ్యాకాలములలో అభ్యసించి శీలించుట మరింత మంచిది. ఏలన?

1. అప్పుడు ప్రకృతి చాల శాంతమైయుండును. అంతేగాక దినము రాత్రితోను, రాత్రి పగలుతోను కలియుటచేత ఆత్మైక్యధ్యానము చేయువారికి చాల అనుకూలముగా నుండును.

2. అంతేగాక భగవంతుడు భక్తులయొక్క భావనారూపమై యుండును. అనేక మహాత్ములు, యోగులు, భక్తులు, సిద్ధులు, మహర్షులందరును ఈ కాలమున ధ్యానము చేయుచుందురు. కనుక అప్పుడు లోకములో గొప్పజ్ఞానము, కరుణ, శాంతము, భక్తి మొదలైన దైవభావములు గల్గుచుండును. మరియు సంధ్యాకాలము అనేకప్రాణికోట్లకు తమోరజోగుణములు తొలగినదై, సత్త్వగుణమై యుండును. సంధ్యాకాలమున అనేక పశుపక్ష్యాదులగు జంతువులే గాక మనుజులలో కూలిపని, ఉద్యోగము మొదలువృత్తిగాగల మనుజులును విద్యార్థులును, కర్మయోగములను మానియుందురు. వారి హృదయము సత్త్వగుణమునకు వచ్చుచుండును. కర్మము రజోగుణము, కరణములచే జేయంబడు కార్యమునకు కర్మమనిపేరు. వాక్, పాణి, పాద, పాయు, ఉపస్థలనెడు అయిదును కర్మేంద్రియములు. అస్తమయకాలమున పక్షులన్నియు వాటి

కర్మేంద్రియ వ్యాపారములను మాని, చిత్తమునేకాగ్రపరచి, గూండ్లలో ప్రశాంతముగాను, ప్రసన్నముగాను ఉండును. అదేప్రకారము గోవులు, గొఱ్ఱెలు మొదలైన జంతువులుగూడ కర్మేంద్రియముల నణచుకొని అతిసంతోషముగా అంతరంగమనస్సు గలిగియుండును. అవి యన్నియు ప్రశాంతసుఖము ననుభవించుచుండును. ఇక కొంతరాత్రియైన, అవి అన్నియు తమః స్వరూపమగు నిద్రలో ప్రవేశించును. ప్రథమ యామరాత్రిలోపల ధ్యానము చేయుట శ్రేష్ఠమని విధింపబడిన రహస్యమిదియే.

రాత్రి 9 గంటలలోపల ధ్యానముచేయు టుత్తమము, అదే ప్రకారము ప్రాతఃకాల మనగా ఉదయము 4 గంటలనుండి సూర్యోదయమైన తర్వాత 9 గంటలలోపల యోగాద్యనుష్ఠానము చేయుట మంచిది. బ్రహ్మముహూర్తము అని యీ సమయమునకు పేరు. అప్పుడు సుషుప్తి యను తమస్సు నుండి సత్త్వగుణములోనికి ప్రవేశించుకాలము. సూర్యుడుదయించి కొంతసేపు పోయిన పై చెప్పిన పశ్వాది జంతువులన్నియు కర్మేంద్రియకృత్యముల కుపక్రమించును. ప్రాతఃసంధ్యా కాలములలో ప్రకృతి యెంత ప్రశాంతమైన రమణీయతతో నాట్యము చేయుచుండునో చూడుడు. కవి పుంగవులందరును ప్రకృతిని వర్ణించెడు విషయమై బుద్ధిని ఈ కాలములో వినియోగపరచెదరు. మనుజులును సూర్యోదయమున స్నానసంధ్యాధ్యానపూజాది కృత్యముల నిర్వహించి ప్రశాంత ప్రశోభిత ఈశ్వరాయత్తచిత్తులై ఆనంధభరితులై, భోజనాదులు సలిపి వారివారి కార్యముల ననుసరించిన యుద్యోగములకు వెళ్ళి కర్మేంద్రియ కార్యములలో ప్రవేశించెదరు గదా?

3. మరియు గొప్పవారు ధ్యానించు నప్పుడు ఒక్కవిధమగు దైవమహిమ గల్గుచుండును. సామాన్యధ్యానకాలమున అందరును ఒకే స్థలంబున ధ్యానించుట మంచిది. విశేషధ్యానము ఏకాంతమున ఏకాకియై మాత్రమే చేయవలయును. విరక్తులైన కొందరు దైవభక్తిగలవారుగాని, తత్వబోధగలవారు గాని ధ్యానించెడు సమయమున సామాన్యజనులుగూడ అదే స్థలమున ధ్యానము చేయుట మంచిది ఎట్లన? కొన్ని యెండిన కట్టెలు మండుచున్నప్పుడు దానిలో కొన్ని పచ్చికట్టె

లుండినను కాలిపోవును గదా! లేక కొన్ని చిన్నచిన్న దీపపు వత్తులను ఒకేస్థలమున వెలిగించిన గొప్ప ప్రకాశముగా మారునట్లు సామాన్యజ్ఞానశక్తి గలవారు ఒకే స్థలమున ధ్యానము చేయునపుడు అట్టిస్థలము గొప్ప జ్ఞానమయముగ మారును. గొప్ప నిప్పుచుట్టును గూర్చుండువారికి ఆ గొప్పప్రకాశము అందరికి ఒకే విధముగా నుండునట్లు అచ్చోట నుండువారందరికిని గొప్ప ఆత్మలాభము గల్గును. లేక, ఒక రైలు ఇంజనుతో తగిలించియుండు భారముతో గూడిన అనేకములగుపెట్టెలను ఇంజను లాగుకొని పోవునట్లు, గొప్పబ్రహ్మనిష్ఠుని ధ్యానకాలమున వారి ధ్యానముతో మీ మనస్సును ఐక్యపరచిరేని, మీరును ఆ గొప్పదైవసుఖము ననుభవింపగలరు. మీ హృదయములో ప్రపంచవాసనలనెడు కర్మభారముండినను ఈ ధ్యానముచే తరింపవచ్చును. ఇంజన్ అనునది మహాబ్రహ్మనిష్ఠులును, పెట్టె లనునవి మీ అందరి హృదయములును, వానిలోగల భారమనునది ప్రపంచవాసన యనియు, గ్రహించదగినది. మరియు ధ్యానకాలమున మనస్సును విశాలముగాను, విశుద్ధముగాను చేయుడు. ఒక టాంకిలో నీరు నిండుగా నుండినను గొట్టము ఎంతటిదో, అంత నీరుగదా దాని ద్వారా వచ్చును. కొళాయి చిన్నదైనచో కొంచెము జలము మాత్రము వచ్చుచుండును. లేక ఒక్కనది నిండుగా జలముండినను మీరు తీసికొనిపోయిన పాత్రలయొక్క పరిమాణము ననుసరించి జలము తీసికొని రావచ్చును గదా! ఒక చెరువు నిండుగా జలము గలదని భావింపుడు. తూమును, కాలువయును ఎంత పెద్దవో అంత జలము తద్ద్వారా వచ్చునట్లు మీ హృదయ మెంత వికాసము, విశుద్ధి గలిగి యుండునో దాని ననుసరించి మీకు దైవశక్తి గూడ గలుగుచుండును. గంగాదిజలము మహత్తరముగా పొంగి ప్రవహించినను మీరు తీసికొనిపోయిన పాత్రయొక్క ముఖము మూసి జలములో ముంచిన దానిలో ఒక బొట్టైనను జలము ప్రవేశించనట్లు మీ హృదయద్వారమును ఇట్టి ధ్యానకాలములో ఇతరసంకల్పములచే మూసినచో ఈ ధ్యానము యొక్క సుఖ మిసుమంతయు ననుభవింపజాలరు. లేక ప్రచండభాస్కరుడు ప్రకాశించుచుండినను మీ గృహాంతరాళకవాటమును తెరవకపోయిన ప్రకాశము దానిలోపల ప్రవేశించని చందంబున ధ్యానకాలములో నిస్సంకల్పస్థితిని పొందనిచో జ్ఞానస్వరూపు డగు

ఈశ్వరుని అనగా ఆత్మసౌఖ్యము నొందజాలరని మీరు మరువక యుందురని తలంచెద. మరియు ప్రభాకరుడు ప్రపంచమంతయు ప్రకాశించుచుండినను స్వచ్ఛమైన జలమందు గాని, నిర్మలమైన దర్పణమునందు గాని మాత్రమే ప్రతిబింబించును గదా! ఆలాగున సర్వేశ్వరుండు సమస్త ప్రాణికోట్ల హృదయమందు సమముగా నుండినను, విషయవిరక్తుల చిత్తమునందు మాత్రమే గోచరించును. అదేరీతిగా సూర్యరశ్మి అంతట నుండినను సూర్యకాంతపు మణి మాత్రము కదా ప్రజ్వలించును! ఆలాగున చంద్రునియొక్క చంద్రికయు సర్వత్ర ప్రసరించియుండినను చంద్రకాంతమణి మాత్రమే అమృతమును స్రవించునుగదా! అదే రీతిగా ఈశ్వరుండు అందరిచేతస్సులో వ్యాపకమైయుండినను, సూర్యకాంతమణివలె శుద్ధమును, చంద్రకాంతమణివలె శాంతమును అగు హృదయములో మాత్రము ప్రకాశించును, దైవభక్తియును గలుగును.

4. మానసేంద్రియములను ఏకాగ్రమొనర్చుటకు ముందుగా దేహమును గూడ నిశ్చలముగాను, ఋజుత్వముతోను నిలుపుటమంచిది, ''సమం కాయశిరోగ్రీవం'' అని గీతావచనము. మరియు విజ్ఞానజ్యోతి యను జ్ఞానము ప్రకాశించుటకు విరక్తి లేక ధర్మానుష్ఠానచిత్తమను ప్రమిదయు, భక్తి లేక కరుణయను తైలమును అమర్చిన తరువాత సర్వేంద్రియైకాగ్రత అనగా నిశ్చలత అను వత్తియు, చక్కగ నుంచవలయును. అట్లైన మాత్రమే దివ్యజ్ఞానమగు ప్రకాశమును మీరు చూడగలుగుదురు. ఇదంతయు నుండినను, సర్వవిషయ ప్రశమిత ప్రశాంతబుద్ధి యను చిమ్నీ అనగా యోగ మనెడి గ్లాసు నుండవలయును. లేనిచో ఇంద్రియార్థవిషయ ప్రచండమారుతముచే విజ్ఞాన దీప మారిపోవును. కనుకనే దక్షిణామూర్తు లిట్లుపదేశించిరి.

**వైరాగ్య తైలసంపూర్ణే భక్తివర్తి సమన్వితే ।**
**ప్రబోధ పూర్ణపాత్రే తు జ్ఞప్తిదీపం విలోకయేత్ ॥**

దీని సారము పై నుదాహరించినదే.

5. ధ్యానమును గురించి ఉపనిషత్తులలో నిట్లు గానుపించు చున్నది.

ప్రణవో ధనుశ్శరో హ్యాత్మా బ్రహ్మ తల్లక్ష్యముచ్యతే।
అప్రమత్తేన వేద్ధవ్యం శరవ త్తన్మయో భవేత్ ॥

ఇచట ప్రణవము అనగా ఓంకారమును ధనుస్సుగాను, ఆత్మను అనగా మనస్సును శరముగాను, బ్రహ్మమును అనగా తన యొక్క ధ్యేయమూర్తిని లక్ష్యముగా నుంచుకొని ప్రమాదరహితుడనగా నిశ్చలమైన సాధకుడు ధ్యానము చేయునప్పుడు శరము లక్ష్యములో ప్రవేశించునట్లు తనయొక్క ధ్యేయవస్తువులో నైక్యము నొందును. అనగా స్వరూపము స్పష్టముగా గోచరించును. లేక ధ్యేయాకారవస్తువే ధ్యాతయై మారుచుండును. తుపాకిచే గురిపెట్టి కాల్చువాడు కొంచమైనను చలించినచో లక్ష్యము ఏలాగున భేద్యము గాదో, ఆలాగున ధ్యానకాలమున మానసేంద్రియములు కొంచమైనను చలించినచో, మీనిష్ఠ పూర్తిగా ఫలింపజాలదు. సూది రంధ్రములో నూలు ఎక్కించువారు ఏలాగున ఏకాగ్రముగా నుండవలయునో, లేనిచో బెజ్జములో నూలు ఎక్కదో, అదేవిధముగ సర్వేంద్రియములను ఏకాగ్రపరచిన మాత్రమే ధ్యానముచే గలిగెడు ఫలితము సిద్ధించును. మరియు మీరు వాక్కుతో ఏ స్వరూపంబును గురించి ఉచ్చరించెదరో, మనస్సులోను అట్టిభావన స్థిరముగా నుండవలయును. లేనిచో గుండులేని వట్టిమందుమాత్రము వేసి కాల్చిన ఫిరంగి శబ్దమువలె నగును. కావుననే ప్రస్తుత జనుల ఆత్మశక్తి తగ్గిపోయెనని వంరువకుడు. ఇదియే ''తజ్జపస్తదర్థభావనం'' అని పతంజలిమహర్షి యోగసూత్రమున లిఖించుటకు కారణము. మనోవాక్కాయములు మూడును ఏకరీతిగా నుండినమాత్రమే మీరు అనుకొన్నఫలము సిద్ధించును. దీపము వెలిగింపవలయు నని తలంచువారు దీపపు చిమ్నియు, దానిలో చమురును, చమురులో వత్తియు అమర్చిన మాత్రమే దీపము ప్రకాశించునుగదా! అప్పుడు చీకటిదొలగి వస్తువులు గోచరించును. ప్రమిద ఒక్కమూలలోను, వత్తి మరియొక్క ప్రదేశములోను, చమురు ఇంకొక స్థలములోను, పెట్టి వెలిగించిన దీపము వెలుగదుకదా! కనుకనే, కొందరికి చిత్తైకాగ్రత లేమి ధ్యానమందు ధ్యేయాకారము స్ఫురింపక పోవుచున్నది. అనగా, మనోవాక్కాయకర్మములు ఏకరీతిగా నుండవలెనని భావము. అట్లు లేకపోవుట మనస్సులయించి బ్రహ్మానందము గలుగకపోవుటకు హేతువని తెలియందగినది.

మరియు సూర్యకాంతఅద్దము మీలో కొందరు చూచియుందురు. ఆ దర్పణము సూర్యుని కభిముఖముగా చలింపక నిలిపినచో దాని ద్వారా అగ్ని ప్రజ్వలించి క్రిందిభాగములోగల వస్తువులను దహింపచేయురీతిగా మీమనోదర్పణమును పరమాత్మ ధ్యానాభిముఖముగా నిశ్చలముగా నిలిపితిరేని, జ్ఞానాగ్నిప్రజ్వలించి కర్మకట్టెలను భస్మము చేయుటయేగాక అజ్ఞానమను తమస్సును సమూలముగా నాశనమొనర్చును. ఆ దర్పణము కదలుచుండినను లేక మలినపడియుండినను భాస్కరకిరణము దానిద్వారా ప్రకాశింపదుగదా! ఇదే మహాత్ములయొక్కయు, సామాన్యజనులయొక్కయు అంతఃకరణవృత్తికి మార్పని మీరు గ్రహించవలయును. కనుకనే ''క్షీణదోషాః ప్రపశ్యంతి'' అని ఉపనిషత్తు లుద్ఘోషించు రహస్యము.

ధ్యానములు అనేక విధములు. అవి పరంపరాప్రకారము ననుసరించియు, పరిపక్వస్థితిని బట్టియు నుండును. ఇచ్చట నుండువారందరును వారివారి మతానుసారముగా ధ్యానము చేయవచ్చును. సర్వేశ్వరుడొక్కడే. మార్పులన్నియు భాషలను బట్టియుండును. జలమనియు, నీళ్లు అనియు, అతణ్ణి అనియు వాటర్ అనియు, పాని యనియు ఒక్కొక్కభాషలో నుచ్చరించినను ఉదక మొకటియేగదా? అట్లే మతమతాంతరములోగల నామములను మనము గ్రహించవలెను. ఇదే శ్రుతి ''ఏకం సత్ విప్రా బహుధా వదంతి'' అని చెప్పురహస్యము. కాబట్టి మీమీ మామూలు ప్రకారము సగుణధ్యానముగాని, నిర్గుణధ్యానముగాని లేక స్వరూపధ్యానముగాని చేయవచ్చును. ప్రత్యేకమూర్తిని ధ్యానించువారు రెండుపాదకమలములనుండి శిరస్సువరకును, స్పష్టముగా గోచరించువరకును, ఏకభావన చేయవలయును. లేక ముఖమండలమును, తరువాత వక్షఃస్థలమును, కటిప్రదేశమును, జానుస్థలమును, చరణసరోజము వరకు ఒక్కొక్క అంగము హృదయములో గోచరించువరకు ధ్యానించవలయును. ఆ మూర్తికి అనుగుణములగు రూపములును సాలంకృతములుగా భావనచేయవచ్చును. ఇదియే స్థూల సగుణ ధ్యానమగును. రెండవసగుణధ్యానము ఒకటి గలదు. అది సర్వేశ్వరుడు, సర్వచరాచరములలో వ్యాపించియుండువాడనియు, సత్యము, జ్ఞానము,

పూర్ణకరుణ, శాంతము మొదలగు గుణములుగలవాడని ధ్యానించుటయు, సగుణధ్యానమని చెప్పవచ్చును. గుణములతో గూడిన వాడగుటచేతనే సగుణుడని పేరు గలిగినది. ఇచ్చట పైజెప్పిన ద్వివిధగుణములను సగుణధ్యానమని చెప్పదురు. వీరి అభిప్రాయప్రకారము సత్త్వరజస్తమోగుణము లైన ప్రాకృతగుణములులేని కారణములచే సర్వేశ్వరునికి నిర్గుణుడని పేరేగాని పైనుదాహరించిన గుణములు గలవనియు, అవి అప్రాకృతములగుటచే నిర్గుణుడనియు చెప్పుదురు. మరికొందరు ప్రకాశస్వరూపుడై, కృపాసాగరుడై, వ్యాపకముగలవాడై యుండువాడే భగవంతుడని ధ్యానము చేయుదురు. నిర్గుణధ్యానములో స్వస్వరూపధ్యానమొకటి, అది తాను సత్త్వరజస్తమో గుణములు లేనివాడనియును, పంచకోశములకు సాక్షి యనియును, సాక్షి దేహత్రయమునకు విలక్షణుడనియు, ప్రపంచసంబంధములయిన ఏలాటిగుణములు లేనివాడనియు, నిత్య, శుద్ధ, స్వయంప్రకాశుడనియు ధ్యానించుటయే, ఈధ్యానముచేత జీవునియొక్క అవిద్యోపాధియు, ఈశ్వరునియొక్క మాయోపాధియు వేదాంత విచారణచేత తొలగించినపుడు అఖండబోధ గలుగును. దీనికే అజపమంత్రమనియు, సోఽహంభావన యనియు, శివోఽహం అనియు పేర్లు. ఇది మహానందమును కలుగజేయును.

ఇక యోగశాస్త్రము రీతిగా మూలాధారము నుండి సహస్రార పర్యంతముగల ఒక్కొక్కాధారచక్రముల ననుసరించిన అధిదేవతలను తత్తద్వర్ణబీజాక్షరములతో జపపూర్వకముగ అంతర్ దృష్టిలో ధ్యానించుటయు ఒక విధమగు ధ్యానమే యగును. పూర్వము చెప్పిన సగుణధ్యానము చేయునప్పుడు మనస్సు తదనుకూలజపమును చేయుటయు, అర్చించుటయు, ఆరాధించుట గూడ గలదు. ఆధ్యానము లన్నిటిలోను, మనోలయము గలుగువరకు తారకాదిమూలమంత్రములను జపింపవచ్చును. ప్రాణనిరోధముగూడచేయుట మంచిది. ఇంతవరకు చెప్పినదంతయు ఖండజ్ఞాన మనియు, అపరిపూర్ణస్థితి యనియు గ్రహించవలెను. పై జెప్పిన విషయము లేవియు పరమాత్మునికి లేనప్పటికిని, సాధకుల పరిపక్వస్థితికొఱకు చెప్పంబడినవి. ఇవి యన్నియు సాధనయే గాని సాధ్యస్థితిగాదు. అనగా అభ్యాసమేగాని, ఆరూఢావస్థగాదని

తెలియందగినది. అయినను సామాన్యమని తలంపరాదు. గొప్పమహిమ దీనిలో గలదు. సాధన సరిగా సాధింపని కారణముచే గదా! ప్రస్తుతజనులు శక్తివిహీనులైరి. ఋషులు సాధనయందు పటుత్వము గలవారగుటచే అధ్యాత్మవిద్యయందు పట్టభద్రులైరి.

ఫలస్య కారణం పుష్పం ఫలం పుష్ప వివర్జితమ్ ।
జ్ఞానస్య కారణం కర్మ జ్ఞానం కర్మ వివర్జితమ్ ॥

మనకు ఫలమే గావలసియుండినను ఫలమునకు పుష్పము ఆధారముగాను, పుష్పమునకు వృక్షము ఆధారముగాను ఏలాగున నుండునో, అదేరీతిగా జ్ఞానఫలమే కావలసియుండినను అనుష్ఠానమను వృక్షమునుండియే భక్తి, అనగా కరుణలేక, ప్రశాంతమను పుష్ప ముద్భవించును. దాని అంతరాళము నుండియే జ్ఞాన ఫలము గలుగు చుండును. అనుష్ఠానవృక్షము శమదమాదిపల్లవములు గల్గిసాధన చతుష్టయసంపత్తియనెడు పత్రములచేత నలరారుచుండును. కనుక వృక్షమును చక్కగా పోషించినచో పుష్పమును, పుష్పము నుండి ఫలమును గలిగి పండుబండి, స్వయముగా క్రిందికి రాలుచున్నట్లు మంచినిష్ఠగలవారికి నైష్ఠికసిద్ధి స్వయముగా గల్గును.

మిత్రులారా! ఈ అనుష్ఠానము జ్ఞానపరమై యుండవలయును. కర్మపరమై యుండరాదు. కర్మఠులకు భేద మనెడు దుఃఖసాగరము నుండి దరిజేరుటకు మార్గము లేదు. కర్మము భయంకరమేగాని, భయరహితమగు ఆనందము గలుగజేయజాల దని తలంచియే, శ్రీశంకర, శ్రీరామానుజ, శ్రీబుద్ధ, శ్రీయేసుక్రీస్తు, శ్రీమహమ్మదునబి, శ్రీకృష్ణచైతన్యాదులందరును కర్మకాండ ప్రవృత్తిని చాలమట్టుకు తొలగించిరి. కనుకనే, గీతయందు ''బహవో జ్ఞాన తపసా పూతా మద్భావమా గతాః'' అని, శ్రీకృష్ణభగవంతుడు గానముచేసెను. అనేకులు జ్ఞానమనెడు తపస్సుచేత పరిశుద్ధాత్ములై భగవద్భావమును బొందిరి. అయినను ఆత్మసోదరులారా! మీకు నీలిమందే కావలసినను నీలిచెట్టునుండిగదా! అది సిద్ధించును. అదేప్రకారము పంచదారయే ఆవశ్యకమైయుండినను చెరకునుండిగదా! అది లభించును. ఆలాగున

సాధనయందుండియే సాధ్యము గల్గుచున్నదని మీరు మరువకుడు, పైనుదాహరించిన చెరకుపాలు తీసిన తర్వాత పిప్పిని పారవేయునట్టును, నీలిమందును ఎత్తుకొన్న తర్వాత పిప్పిని త్యజించునట్లును అపరోక్షస్థితి గల్గు పర్యంతము సాధన యుండియే తీరవలయును. చెరకు సకాలమున రసము తియక పెంచినచో ముదిరిన తర్వాత కొంచెమైనను రసము లభింపక వట్టిబెండై పోవునట్లును, అదేరీతిగా సకాలమున నీలిచెట్టునుండి సారము గ్రహింపక చెటును పెంచిన కొంచమైనను నీలిమందు దొరుకక వట్టికట్టెలై పోవునట్లును, కేవలము కర్మఠులస్థితి దుఃఖమే యగును. కనుక మీరు కర్మఠులుగాక ఉండవలయును. అయినను జ్ఞానపరములగు కర్మలను త్యజింపరాదు. కర్మఠులకు కరుణచాల తక్కువయగును. భేదము వృద్ధియై యుండును గనుక ఆత్మశుద్ధియగు అంతరంగసాధన మనుష్ఠింపుడు.

ఇకమీద మనయొక్క చిత్తైకాగ్రత విషయమును గురించి విచారింపబూనెద. చిత్తైకాగ్రత లేనిచో, నిగూఢ రహస్యమేమియు మనకు గోచరింపదు. మీరేదైన ఒకపదార్థము తినునప్పుడు జిహ్వాయందు చిత్తైకాగ్రత గల్గిన మాత్రమే దానియొక్క రుచియు, వస్తువులయొక్క జ్ఞానమును గల్గును. అదేరీతిగా నేదైన యొకవాసన గనిపించిన వెంటనే అది యేవాసన యని తెలియుట ప్రయాసముగా నుండినను నాసికారంధ్రములో మనస్సును ఏకాగ్రపరచిన ఆ వాసన యెచ్చటనుండి వచ్చుచున్నదనియు, పలానివాసన యనియు తెలిసికొనవచ్చును గదా! అదేరీతిగా మనప్రక్కనుండి యేదో యొక చిన్నశబ్దము వచ్చుచున్న దని గ్రహింపుడు. అయినను ఆ శబ్దము వ్యక్తముగా గోచరించుటకు, మనస్సును ఆశబ్దము పైకి మరలించవలెను గదా! ఇదేరీతిగా అన్నివిషయములను గురించి, విచారించిన చిత్తైకాగ్రత అత్యవసర మని గోచరింపకమానదు. మీరు ఎవరితోనైన మాటలాడుచుండగా నితరశబ్దములు వినరావు. దేనిని గురించియైన దీర్ఘచింతనచింతన చేయుచుండినచో వాసనగ్రహించుటగాని, శబ్దము వినుటగాని దృష్టిలో నేదైన గోచరించుటగాని యుండదు. దీనివలన ఏమి గోచరించుచుండు ననగా ఏకాగ్రతచేత దృశ్యము మరుగై పోవుచున్న దనియు, వ్యక్తముగాని విషయము సువ్యక్తమగుచున్నదనియు తేలుచున్నది. మీరు కొన్నిశ్లోకములను గాని,

కీర్తనలనుగాని, కంఠపాఠముగా నేర్చుకొని యుందురు. అయినను వానిని పఠించునపుడు మనస్సు వేరే దేనిపై పోయినను మీరు ఆ శ్లోకకీర్తనలను చక్కగా గానము చేయజాలరు గదా! కనుకనే నిస్సంకల్పముగా నుండవలె నని చెప్పెడి రహస్యము. హృదయసరోవరమున సంకల్పములు అలలవంటివి. అలలు ఉండిన ఆజలములో రాత్రికాలమున చంద్ర ప్రతిబింబము కానుపింపదుగదా! ఆలాగున, నిస్సంకల్పస్థితి అందనివారికి హృదయస్థుడగు పరమాత్మదర్శనము లభింపదు. ఇంకొక రహస్యము చెప్పెద, మూర్తియు, పూజయును లేనినాడు దేవాలయము ఎట్లు వ్యర్థమో, ఆలాగున మీదేహ మను క్షేత్రములో భగవత్స్వరూపస్మరణ లేక ఆత్మ భావనయు, కరుణ యను జలాభిషేకమును, శాంతము, సత్యము, దయ, విరక్తి, తపస్సు అనెడు పుష్పములును, సర్వేశ్వరధ్యానానందము లేక, భక్తిలో మునిగిన అమృతమగు నైవేద్యమును లేనిచో మీజన్మము వ్యర్థమేగాక భూమికి భారమని గూడ మరువకుడు. ఈ ధ్యానమును చేయక పోవుటచేతనే జ్ఞానవిహీనులగుచున్నారు. పతివ్రతయైనస్త్రీ, భర్తకు భోజనము పెట్టక ముందుగా వండి తాను భుజించుట ఎంతపాతకమో, గురుశుశ్రూషా తత్పరుడైనవాడు భిక్షాన్నము తెచ్చిగాని, పచనముచేసి గాని, గురుస్వాములకు పెట్టుటకు ముందుగా తినువాడు ఎట్టి దుష్టగుణములు గలవాడో, దేవతార్చన చేయువాడు నైవేద్యము నొనగూర్చి స్వామికి ఆరాధన చేయుటకు ముందుగా ఆనైవేద్యమును భుజించువా డెంత పాపియో, ఆలాగున మీ ఆత్మారాధనము చేయుటకు ముందుగా అనగా ఈశ్వరధ్యాన మను పూజచేయుటకు ముందుగా నశ్వరమగు ఈశరీరమును పోషించువాడు గూడ పాపజన్మముగల వాడనియే తలంచవలెను.

దయయే స్వరూపముగాగల సోదరులారా! సోదరీమణులారా! మీరందరును ఒక్క వ్రతము నవలంబించిన మాత్రమే యీ దుఃఖ సాగమునుండి తరింపగలరు. ఆ వ్రత మేమన, మీయొక్క ఆత్మారాధనపరమగు దైవప్రార్థనలు జరుపక అన్నపానాదులు చేయరాదని వ్రతమును గట్టిగా పట్టుడు, ఈ వ్రతము ప్రారంభదశలో చాలప్రయాసముగా గానుపించును. ప్రకృతిచేతను,

ప్రాకృతజనుల చేతను కొద్దిరోజులవరకు బాధ గలుగవచ్చును. అయినను ఆహార మనివార్యకార్యమగుటచే ఈ సంయమవ్రతము అనుష్ఠించువారిని ప్రకృతియే తనయొక్క నిరంకుశశాసనమునుండి తొలగించును. సముద్రములో అలలు శాంతమైన తరువాత స్నానముచేయుటకు నిరీక్షించుచుండిన సమయము దొరకనట్లు ఈ సంసారసాగరములో నుండగా సమస్త కార్యములు ప్రశాంతమైన తరువాత మీకు బ్రహ్మనిష్ఠచేయుటకు ప్రసన్నమైన కాలమొక్కటి లభించు నని తలంచి మోసపోకుడు. మీరు జేయు ధ్యానము సాధ్యమైనంతవరకు ప్రతిదినము ఒకటే సమయమున ధ్యానించి శీలించవలెను. అట్లయిన ఆసమయము వచ్చినప్పుడు ఇంద్రియార్థములనుండి ఇంద్రియములు స్వయముగా ఆత్మాభిముఖమై తిరుగుచుండును. మీరు ప్రతిదినము ప్రాతఃకాలమున లఘు ఆహారమును గాని, మధ్యాహ్నమున భోజనమునుగాని, భుజించెడు ఏర్పాటు ఉండిన ఆ సమయము వచ్చినప్పుడు ఆకలి మిమ్ములను మేల్కొలుపును. అదేరీతిగా ప్రాతఃసంధ్యాకాలములలో బహిర్భూమికి వెళ్లెడు అలవాటుగలవానికి ఆకాలములో విసర్జనశుద్ధి యేలాగున శుద్ధముగా గలుగుచుండునో, ధ్యానముయొక్క రహస్యము ఇటు వంటిదే. లేక ఒకరాజు ప్రతిరోజును సాయంకాలమున విహారార్థము పోయెడి యేర్పాటుండినచో తనయొక్క సిబ్బంది లందరును ఆ సమయమున నిరీక్షించుకొని హాజరై యుందురుగదా! కాలము తప్పించి పోయెడు స్వభావముండిన సమయమునకు ఎవరును హాజరు కాని రీతిగా, మనయొక్క ఆత్మయను ప్రభువు ధ్యాన మనెడు విహారకాలము తప్పక యేర్పాటుచేసికొనినచో, ఇంద్రియము లనెడు భృత్యులందరును, అప్పుడు అప్రయత్నముగా వశవర్తులై యుందురు. కనుక మీరు ధ్యానము జరుపక భోజనము జేయరాదని ఒక్కవ్రతము నేర్పాటు చేసికొనవలెను.

6. ఇక మీరు గ్రహించవలసిన గొప్పవిషయము మరిమొకటి గలదు. దీనియందు జాగరూకత వహింపకపోయినచో జన్మముయొక్క సంపూర్ణక్లేశము తొలగదు. అదేమన? కొందరు ఈ లాగున చెప్పెదరు. మీలో కొన్ని తెగలవారు పాపులనియు, దైవకార్యముచేయుటకు యోగ్యతలేనివారనియు, నీచజన్మము గలవారనియు, పుణ్యకార్యము లన్నిటిలోను అనర్హులనియు ఏమేమో బలికెదరు.

ఈలాటి వచనములను చెప్పువారు మీకు విషముపోసెడువారలని మరువకుడు. మీరు పరిశుద్ధులనియు, మీయాత్మ దైవస్వరూపమనియు, మీరు కరుణాళువు లనియు, దేహేంద్రియ కరణముల కన్యులనియు, శుద్ధజ్ఞానమే స్వరూపముగా గల వారనియు, మీ యొక్క యోగ్యత ననుసరించిన సమస్త దైవప్రాప్తికార్యములు చేయుట కర్హతగలదనియు చెప్పువారే మీకు అమృతముపోసి రక్షించెడువారలు. మీరును మీయొక్క గుణకర్మములను చక్కబరచుటలో శ్రద్ధగలవారలై యుండినమాత్రముననే పైజెప్పినవచనము సార్థకమగును. అనాత్మ జడ ప్రకృతివాదులను మన వారు నాస్తికులనియు, వేదవిరుద్ధులనియు పేర్కొనియున్నారు. ఆత్మను గురించి బోధించువారు ఆస్తికులనియు, వేదానుకూలు రనియు మనయొక్క సచ్ఛాస్త్రసిద్ధాంతము. కావున సోదరులారా! మీరు నాస్తికులై పోవుటకు చూడకుడు. ఆస్తికులై వర్తించుటకు ప్రవర్తింపుడు జనులందరిచేతను శుద్ధకర్మ చేయించి పరిశుద్ధులుగా చేయుటకు ప్రయత్నింపుడు. సోదరులారా! సోదరీమణులారా! మీరు పరిశుద్ధ దైవస్వరూపులు, కరుణాళువులు, నిత్యముక్తులు, ప్రశాంత గుణముగల వారను భావనయే మీరు చేయవలయును. మనయొక్క మనస్సు ఊర్ధ్వాధముగా అతివేగముగ తిరుగునటువంటి యంత్రము. అనాత్మ భావనచేతను, కర్మల చింతనచేతను, ఆత్మగుణములనుచూడక కేవలము కల్పితకులగోత్రాదుల చూచుటచేతను ఈ మనస్సు మిమ్ములను అతల వితల పాతాళములకు గొనిపోయి పైశాచికముగ మార్చును. మీరు ఇంద్రియములకును దానికృత్యములకును సాక్షియై వెలిగెడు శుద్ధబోధస్వరూపులు అను ఆత్మ భావన మీమనస్సు నూర్ధ్వముగా గొనిపోయి సువర్లోక జనలోక తపోలోక సత్యలోకములకు అవతల కందజేసి, దైవసదృశులుగా చేయునని సత్యముగా నమ్ముడు.

ఇక చెప్పబోయెడు ధ్యానము పై చెప్పినవాటి యన్నిటిలోను ముఖ్యమైనది. దీనిని జూచినవారు మరల దుఃఖము నొందరు. ఇదిశివము, అద్వైతము, అమృతము, శాంతము, ఆనందము. దీనికి ముందుగా నుదాహరించిన మార్గములద్వారా యీస్థితిని పొందవలయును, సంస్కారాత్మ యైనచో నీజన్మములోనే పైనజెప్పిన అనుష్ఠానము లన్నియు

పనిలేదు. దానియొక్క నిర్ధారణము గురువుపై ఆధారపడి యున్నది . లేనిచో వేదాంత విచారణయు, శుద్ధబుద్ధియు, మహాపురుషుల సంసర్గము నుండిన వారివారి అవస్థను వారువారు గనుగొనవచ్చును. ఇది ప్రకృతిలేని స్థితియని మరువకుడు. పూజలన్నియు స్థూలదేహమునకు సంబంధించినవి. కీర్తన జపాదులు సూక్ష్మదేహము నంటియుండును. ధ్యానము బుద్ధికిని, కారణదేహమునకును సంబంధపడి వెల్గుచుండును. ఈ మూడు మెట్లును ప్రకృతితో గూడినవేగాని ప్రకృతిరహితములు గావు. యోగముగూడ ఇంతవరకు మాత్రమే రాగలుగును. అవతలస్థితియే మీరు పొందవలసిన పరమపదము అదే శివము, అదే మీ స్వరూపము. దీనిని మొదట ఓంకారధ్యానము చేసి శీలింపవచ్చును. క్రమముగా ఓంకారముయొక్క మూడు పాదములనెడు విశ్వ తైజస ప్రాజ్ఞులను, స్థూల సూక్ష్మకారణములను విడిచి, నాల్గవపాదమగు తురీయస్థితిని చేరవలెను. అచ్చట జీవేశ్వరుల ఉపాధిద్వయమును విచారించి విడిచిపెట్టి ఐక్యమును కనుగొనవలెను. అప్పుడు ఘటాకాశ, మేఘాకాశ ఉపాధిద్వయమును తొలగించిన, మహాకాశము మిగులునట్లు, మీరు నిత్యబోధ స్వయంప్రకాశస్వరూపులగుదురు. ఇచ్చట ధ్యాతయు, ధ్యేయమును ఏకము గావలసియుండును. అనగా ధ్యానముచేయువాడును, ధ్యానింపందగినదైవమును ఐక్యము గావలయును. అప్పుడు మీ ఆత్మచేతనే యివి అన్నియు ప్రకాశించుచున్న వనియు, మీరు నిత్యచైతన్య జ్ఞానస్వరూపులనియు స్వయముగా గోచరించును. ఈ అవస్థ జ్ఞప్తికి తగులుటయే తత్త్వమసి యను వేదాంతశ్రవణ మగును. ఇట్లు గలుగక విషయాసక్తులై కర్మదృష్టిచే బద్ధులైనవారు ఎన్నిజన్మములు శ్రవణము చేసినను, చిలుకపలుకులవలె నిసుమంతయు ప్రయోజన ముండదు. ఈ ధ్యానమును మూడుమార్గములుగా విభాగించవలయును. మొట్టమొదట సంయమమ్ములై దేహేంద్రియములను చక్కగా నిలిపి సుస్థిరులై చక్కగా కూర్చుండవలయును. తరువాత ఒకడు ఆత్మయొక్క లేక దైవముయొక్క మహిమను గురించియు, ధ్యానరీతిని గురించియు, ఫలమును గురించియు కొంతసేపు ఉద్బోధించవలయును. తరువాత పరంపరలో గల ఋషులను, అనగా ప్రవక్తలను గురించి ధ్యానించుట

ధర్మము. రెండవది దైవమును గురించిన ఉపనిషద్వాక్యములను లేక ఆత్మతో సంబంధించిన ఉపనిషత్ మహావాక్యములను గాని, శ్లోకములను గాని, పద్యములనుగాని, వాక్యములనుగాని పఠించుట యుపయోగకరము. వీటివల్ల మనస్సు బహిర్విషయములనుండి ఉపరతి నొందును. తరువాత అందరును కొంతసేపు తన్మయాకారులై యుండవలెను. అప్పుడు సత్స్వరూపము ఆత్మమాత్రమై శేషించియుండువిధి నొందవలయును. అప్పుడే సంకల్పములు నశించును. దృశ్యమైన ప్రపంచము ప్రశమనము నొందును. ప్రచండభాస్కరునిచే తమస్సు నశించునట్లు అజ్ఞానముగాని, కర్మముగాని, కర్మఫలముగాని కనుపడదు. హృదయగ్రంథులు అప్పుడు విచ్ఛిన్నములగును. సంశయములన్నియు నెచ్చటనో పారిపోవును, కర్మకట్టెలు సంపూర్ణముగ భస్మమగును. దృశ్యము జలములో పడవేసిన మంచుగడ్డ క్రమక్రమముగా లీనమై జలమయ మగునట్లు సంపూర్ణముగా దృక్కైన దైవముగా మారును.

ధ్యాతృ ధ్యానం పరిత్యజ్య క్రమాద్ధ్యేయైక గోచరమ్ ।
నివాత దీపవచ్చిత్తం సమాధి రభిధీయతే ॥

అనగా ధ్యానించువాడగు ధ్యాతయు, ధ్యానమనెడు వృత్తియు, విడిచి ధ్యేయాకారమగు ఆత్మయై, గాలిలేనిచోట నుండు దీపమువలె చలింపక స్వస్వరూపుడై నిలుచుటయే సమాధియనం బరగెడు నిర్వాణస్థితి యని మరువకుడు.

**ఓం శివోఽహం శివోఽహం శివోఽహమ్.**

ఇచ్చోట దాసోఽహం దాసోఽహం దాసోఽహం అని గూడ చింతించు వారుండినచో, అట్లుగూడ చేయవచ్చును. ఇదియు దృఢముగా రూఢిపడిన బంధవిముక్తి పరమగు ఆనందము గలుగును. సుగుణసంపత్తి లేనివాడై శివోఽహ మని ఉచ్చరించుటకన్న సుగుణాన్వితుడై, దాసోఽహమని యుచ్చరించుటయే పరమపావనము. వీడు క్రమముగా దైవత్వమును పొందును, సందియము లేదు.

**యదా సర్వే ప్రముచ్యంతే కామాయేఽస్య హృది శ్రితాః।**
**అథ మర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే ॥**



# శ్రీమద్భగవద్గీతాశయము

ఈశ్వరో గురురాత్మేతి మూర్తిభేద విభాగినే ।
వ్యోమవద్వ్యాప్తదేహాయ దక్షిణామూర్తయే నమః ॥

కృష్ణద్వైపాయనం వ్యాసం సర్వలోకహితే రతమ్ ।
వేదాబ్జ భాస్కరం వందే శమాదినిలయం మునిమ్ ॥

శ్రీమత్ భగవద్గీత ప్రస్థానత్రయమున నొకటి. ప్రస్థానత్రయమనగా దశోపనిషత్తులు, బ్రహ్మసూత్రము, శ్రీమద్భగద్గీతయనంబడును. ఈ మూడింటిని మతత్రయాచార్యులు ముగ్గురును ముఖ్యముగా బ్రహ్మవిషయమై అంగీకరించిరి.

1. ఉపనిషత్తులు వేదముల యంతమగుటచే వేదాంతమనియు, శ్రుతిశిరస్సనియు, వేదముల రహస్యమనియు, వేదసారమనియు, బ్రహ్మవిద్యయనియు, అధ్యాత్మజ్ఞానమనియు పెక్కువిధములుగా మహర్షులు స్తుతించిరి. వీనిలో ఈశావాస్యాది దశోపనిషత్తులు ముఖ్యములగుటచే, శ్రీజగద్గురుశంకర భగవత్పాదాచార్యులు వానికి వ్యాఖ్యనొనర్చిరి. వేదములోనుండి ఈ యుపనిషత్తులను వేరుపరచుటకు కారణము విచారించగా, వేదములను జదివి, వేదాంతసారమును గ్రహించుట అందరికి సులభసాధ్యముకాదని తలంచియో, లేక వేదాధ్యయనమునకు అర్హతలేనివారికికూడ ఈ పరమతత్త్వము తెలియవలెనని యుద్దేశించియో యుండవలయును. ఏలన, వేదములను స్వరయుక్తముగా అధ్యయనము చేయవలసియుండును. ఉపనిషత్తులన్నియు అట్లు చేయపనిలేదు. కొంత భాగము మాత్రము స్వరముతో పాఠముచేయవలసి యుండవచ్చును. లేక యిది పఠించురీతిని మంచివిద్వాంసులచే గ్రహించిన, అదేరీతిగా కొంచెము సంస్కృతము చదివినవారందరు పఠించవచ్చును. వీటిలో విశేషభాగము ఛందోబద్ధ శ్లోకరీతిగా నుండుటచే, సామాన్య జనులు పఠించి భక్తులు గావలెనని మహర్షుల మతమని గోచరించుచున్నది. విశాలహృదయమును,

విశుద్ధాంతఃకరణమును గలవారును, కరుణామూర్తులు నగు మహాత్ములు అట్లు గదా తలంచుదురు! కనుకనే గదా వారు పూజ్యులైరి. సర్వలోకవంద్యులును అగుటకు కారణమయినది. కావుననే ఋషులను దివ్యనామమును వినునప్పుడు సర్వజనులును తమయొక్క ప్రాణముల కన్ననెక్కువగ ప్రేమించుచున్నారు. సర్వజనుల యందు అట్టిప్రేమ ఆ ఋషిసత్తములకు లేనిచో, ఈ జనులు వారిని ఇంత ప్రేమించుటకు అవకాశముండదు. దృష్టాంతముగా మతాచార్యులు గొందరు ప్రత్యేకము లగు సంఘములను ప్రేమించుటచే గదా ఆయా సంఘములవారు మాత్రము వారిని గౌరవించుచున్నారు. ఇతరులు వారిని గొప్పపూజ్యులని తలంపరుగదా కనుకనే ''యద్భావం తద్భవతి'' అనియు ''యాదృశీ భావనా యత్ర సిద్ధిర్భవతి తాదృశీ'' అనియు చెప్పబడినది. మరియు సూర్య చంద్ర వాయువులు, సృష్టిమొదలైన వాటిని ప్రేమింపని మనుజులు లేరు. కారణమేమన అవి సమత్వబుద్ధితో సర్వమానవులకు ఒక విధముగానే అనుగ్రహము చేయుచున్నవి. ఇదేరీతిబుద్ధి మహర్షులకుండుటచే వారు జగద్వంద్యులైరి.

2. రెండవది బ్రహ్మసూత్రము. ఇది శ్రీబాదరాయణమహర్షి కృతము. వేదవేదాంతములలో గల అతిరహస్యములను సంగ్రహించి చిన్నచిన్న వచనములతోను, గొప్ప అర్థముతోను సులభగ్రాహ్యరీతిని రచించి వారు ప్రసిద్ధినొందిరి. ఈ దివ్యగ్రంథము నాల్గు అధ్యాయములతోను, అధ్యాయము ఒకటింటికి చతుష్పాదములు చేరి ఐదు నూర్ల ఏబదిఐదు సూత్రములతోను, నూటతొంబది అధికరణముల తోను అజ్ఞానతమస్సునకు సూర్యునివలె ప్రకాశించుచున్నది.

> **చత్వార స్తత్ర చాధ్యాయాః ప్రత్యేకం తే చతుష్పదాః ।**
> **సూత్రాణాం పంచపంచాశ దుత్తరం శతపంచకమ్ ॥**
> **వేదాంతస్థాధికరణం ద్వినవత్యుత్తరం శతమ్ ।**
> **ఏతచ్ఛా రీరకం శాస్త్రం కృష్ణద్వైపాయనో గురుః।**
> **పుత్రమధ్యాపయామాస శిష్యం చ శుకమాదరాత్ ॥**

దీని అర్థము పైనచెప్పినదే. ఇక సూత్రశబ్దమునకు అర్థమును చెప్పుచున్నారు,

**అల్పాక్షర మసందిగ్ధం సారవ ద్విశ్వతోముఖమ్ ।**
**అస్తోభ మనవద్యం చ సూత్రం సూత్రవిదో విదుః ॥**

స్వల్ప అక్షరములతోను, సంశయము లేకుండునట్లును, అతిసారముగాను, విశ్వవ్యాపకముగాను, పూర్వపక్షముకానిదిగాను, సర్వశాస్త్ర సమ్మతముగా నుండుదానిని సూత్రశబ్దార్థము నెరింగిన మహర్షులు సూత్రమని వచించిరి. ఈ బ్రహ్మసూత్రమును గురించి విచారించిన స్వరయుక్తములగు వేదములను, ఛందోబద్ధములగు నుపనిషత్తులను పఠించి అర్థమును గ్రహించు శక్తిలేనివారు గూడ వేదసారము నెరింగి, కృతార్థులు కావలయుననియే సూత్రరూపముగా చేయుటకు కారణమైనది, కనుకనే కదా శ్రీవేదవ్యాసులకు ''సర్వలోక హితే రతః'' అని పేరు వచ్చినది. మంచి రుచిగల కొన్ని గట్టివస్తువులు దంతములేనివారికి భుజించుట ప్రయాసమైనచో దయగలవారేలాగున, పొడిచేసి యిచ్చెదరో అదేరీతిగాను, చెరుకు నములుటకు పండ్లులేనివారికి ఏలాగున రసము తీసి యిచ్చెదరో ఆలాగుననను, సత్యవతీపుత్రుడగు ఆ కృష్ణద్వైపాయన మునివర్యుడు సామాన్యజనులుగూడ జదివి సారము గ్రహించేలాగున సర్వవేదవేదాంత పురాణేతిహాసములలో నిగూఢమైయుండు రహస్యమును సులభముగా అందరును గ్రహించేలాగున బ్రహ్మ సూత్రము ననుగ్రహించెను. బీజరూపములుగా నుండు ఈసూత్రములను దయాస్వరూపుడగు పరమశివుండు శ్రీ శంకరాచార్యరూపముగా లీలామానుష విగ్రహముగా అవతరించి భాష్యమను వృక్షముగా గావించి బ్రహ్మజ్ఞానామృతమగు ఫలమును భక్తుల కిచ్చిరి. ఇతర మతాచార్యులు వారివారి మతానుసారముగా అనేకభాష్యములును, వార్తికములును వ్రాసి తత్తన్మతానుసారులను కృతార్థులుగా జేసిరి.

3. ప్రస్తుతము ప్రస్తావనవిషయ మగు శ్రీమత్ భగవద్గీతను గురించి విచారింతము. ఇది శ్రీకృష్ణభగవానుడు అర్జునుని నిమిత్తకారణముగా జేసికొని యుపదేశించిన దివ్యగ్రంథము. ఇది కలియుగ వేద మనియే గొప్పవారి యభిప్రాయము. భారత రత్నహారమునకు ఇది నాయకమణియై యుండుటచే

భారతమునకు పంచమవేదమని పేరు వచ్చినది. ''వేదత్రయీ పరానంద తత్త్వార్థ జ్ఞానమంజసా'' అనియు ''సర్వోపనిషదో గావః'' అనియు స్తుతి చేయుటచే ఇది వేదవేదాంతసార మని ఆస్తికులందరును అంగీకరించియే తీరవలయును. మూడు వేదములయొక్క సారమనియు, తత్త్వములయొక్క అర్థమనియు, తత్త్వజ్ఞానమనియు స్తుతింపబడుచున్నది. మరియు ఉపనిషత్తులను గోవులుగా చేసికొని, అర్జునుని దూడగా గావించి భక్తులకొరకు శ్రీకృష్ణపరమాత్మ గీతామృతమును పితికి యిచ్చిరని స్తోత్రము చేయబడుచున్నది గదా. భగవద్గీత ఉపనిషత్ సారమని అంగీకరించియే తీరవలయును. కనుకనే దీనికి భగవద్గానమనియు, ఉపనిషత్ సారమనియు, బ్రహ్మవిద్య యనియు, యోగశాస్త్రమనియు, అంతేగాక శ్రీకృష్ణార్జున సంవాద మనియు అమోఘమగుపేరు కలిగెను వేదములసారము ఉపనిషత్తులనియు, ఉపనిషత్ సారము గీత యనియుచెప్పుటలో గీత యొక్కమహిమ యేమని చెప్పవలయును? మరియు, వేదములు గోవులనియు, ఉపనిషత్తులు క్షీరమనియు, ఆ క్షీరమును మథించిన కైవల్యనవనీతమే గీత యనియు మహాత్ములు స్తుతించిరి. లేక వేదము సముద్రమనియు, దానిలోగల ముఖ్యరత్న రాసులే ఉపనిషత్తులనియు, వాటిలో ముఖ్యముక్తిప్రద మగు రత్నములచే చేయంబడిన హారమే గీతయనియు, గ్రహించవలయును. కనుక నేకదా ప్రాణికోట్లకు ప్రాణమువలె గీతయందింత ప్రేమ గలుగుటకు అవకాశమైనది. దీనియొక్క మహిమ అమోఘమగుటచే సామాన్య మైన స్త్రీపురుషులే గాక అతీంద్రియ జ్ఞానముగల విశేషపురుషులగు యతీశ్వరులుగూడ దీనిని పారాయణము చేయుచున్నారు. ఈలాగున మరియే గ్రంథమును జనులు పారాయణముచేయుట విచారించినగానుపింపదు. మరియు దీనికి ఒక విశేషము గలదు. భారతదేశభాష లన్నిటిలోను ఈ భగవద్గీతకు ఎన్నియో భాష్యములు గలవు. ఇదియు గీతయొక్క ప్రత్యేకశక్తి యనియే తలంచవలయును. ఇంతేగాక ఖండఖండాంతరములలోను, ఈ గీత వ్యాపించి, వారివారి భాషలలోను, నక్షత్ర మండలమున చంద్రుని వలె ప్రకాశించుచున్నది. జర్మని, జపాన్, గ్రీక్, ఇటలీ,

అమెరికా మొదలైన ముఖ్యరాజ్యములలోగల ప్రముఖులు హిందువులవలెనే గీతాశాస్త్రమును ప్రమాణముగా అంగీకరించి పారాయణము చేయుచున్నారు. ఈగీత విదేశములలో ఇంత వ్యాపకమై కృష్ణసార రసామృతమును పానముచేసి జననమరణరహిత మగు అమృతత్వమును విదేశీయులు గూడ పొందుటకు కారణము శ్రీభగవాన్‌రామకృష్ణపరమహంస యను బ్రహ్మయు, తన్మానసపుత్రుడగు సనత్కుమారుడన జగద్విఖ్యాతిగాంచిన శ్రీవివేకానందస్వామి యనియు మనము ఎల్లప్పుడు స్మరింపవలయును. ఇట్లు విదేశీయులు భక్తి శ్రద్ధలతో పఠించుచుండగా పుణ్యభూమిలో జన్మించిన భారతీయులలో గొందరు ఈ దివ్యగ్రంథమును పఠింపరాదను మూఢవిశ్వాస మొకటి, సత్యస్వతంత్రమను ప్రచండభాస్కరుడు మధ్యాహ్నస్థాన మధిష్ఠించి ప్రకాశించియుండు ఈ కాలమునగూడ, మూల ముక్కలలో నీడచే ఆవరింపబడుచున్న దని వినుట ఎంతయో వింతగా నున్నది. సూర్యరశ్మి లేనిప్రదేశము విషవాయువుచే ఆవరింపబడి ఏ సస్యములను పెరుగనీయక నాశ మొనర్చుటయేగాక జనులనుగూడ రోగగ్రస్తులుగా జేసి పాడుచేయునట్లు గీతాభాస్కరుడు ఎవరి హృదయాంతరాళమున ప్రకాశించుటలేదో వారిజీవితము సార్థకము గాకపోవుటయే గాక నష్టము నొందును.

4. ఈ శ్రీకృష్ణగానమును భూలోకమున మొట్టమొదట వినినవాడు సంజయుడు. అనగా శ్రీకృష్ణభగవంతుడు కురుక్షేత్రమున ధర్మసమ్మూఢుడగు అర్జునుని కారణ భూతునిగా జేసికొని ఉపదేశించిన గీతాశాస్త్రమును శ్రీవ్యాసభగవంతుని కరుణవలన సంజయుండు వినశక్తిగల వాడాయెను. ఈ గాథ భారతమున భీష్మపర్వమునందు విశదముగా గనందగును. ధృతరాష్ట్ర మహారాజు యుద్ధవిషయమును తెలిసికొన కోరికగలవాడైనందున, సంజయుడు జరిగిన యావద్విషయములను ధృతరాష్ట్రమహారాజునకు చెప్పుచుండెను. ఇచ్చట విచారణీయ మేమన గీత అందరును చదువవచ్చునా? లేదా? ఆ గీతను ప్రప్రథమమున గ్రహించినవాడు సంజయుడు. ఆయన శూద్రుడని

ప్రసిద్ధముగదా! గీత భూలోకమునకు వచ్చినది సంజయ ముఖారవిందము నుండియే. శ్రవణముచేసిన వాడు ధృతరాష్ట్రమహారాజు , ఇతడు క్షత్రియుడు, మరియు ఈ మహత్తమైన గీతామృతోపదేశస్థలము రణరంగము. శ్రీకృష్ణపరమాత్మ గురుడు, శిష్యుడు అర్జునుడు. సమయమా ప్రసన్నమైనదికాదు. నిర్జనప్రదేశమును కాదు. ఇరుకక్షులును యుద్ధసన్నద్ధులై భేరీశంఖములను ఘోషింపజేయుచుండిరి. ఆహా! కడుంగడు భయంకరము! ప్రపంచమా, సకలము భయోద్భూతమేఘావరణముచే దిక్కులు తెలియుట లేదు. చిత్తము తుమ్మెదల రెక్కలవలె అతితీవ్రముగా చలించెడు ఇట్టి తరుణమా? బ్రహ్మజ్ఞానోపదేశమునకు తగినకాలము. కనుక వీటినిగురించియే మనము గ్రహించవలసిన విషయములన్నిటిలోను ముఖ్యమైనది కలదు. మహాత్ములగు ద్రోణాచార్యులును, భీష్మాచార్యులును, ధర్మమే మూర్తీభవించిన ధర్మరాజులును, భక్తోత్తముడగు భీముడును, ఇంకను పెక్కండ్రు మహనీయులుండగా రజోగుణాన్వితుడగు అర్జునుడా ఈ ఉపనిషత్ సారవేదాంతమును వినుటకు అర్హుడు? ఇదియు మనము విచారించవలసిన విషయములలో ప్రధానమైనదే.

1. శ్రీకృష్ణద్వైపాయనులు సంజయుని ద్వారా యీ గీతాశాస్త్రము లోకమున కుపదేశించుటకై తలంచిన దానికి కారణము చతుర్వర్ణస్థులును ఈ దివ్యగ్రంథమును పఠించి, ధన్యులు కావలయుననుటయే. వ్యాసులు దివ్యదృష్టిని ఒక మహర్షికిగాని, బ్రాహ్మణునకు గాని యిచ్చియుండిన, అట్టివారికి మాత్రమే యీ గీతాపఠనమునకు అధికారము గలదని కొందరు సయుక్తిగా ఇప్పుడు వాదించుటకు వెనుకతీయరని బాదరాయణులు ముందుగానే తెలిసికొనియుండిరి. మరియు పూర్వీకులు ఏర్పాటుచేయు నామము లన్నియు వారిగుణముల ననుసరించియే యుండెడివి. సంజయు డనగా సమ్యక్ + జయుడు సంజయుడు లెస్సగా ఇంద్రియములను జయించినవాడగుటచే సంజయుడని నామమేర్పడినది. ఇంద్రియనిగ్రహము లేనిచో రణరంగమున శ్రీకృష్ణపరమాత్మ ఉపదేశించిన విషయము గ్రహింపజాలడు. దీనిసార మేమన, ఈ గీతాశాస్త్రము నిజముగా గ్రహింపవలసియుండిన యింద్రియనిగ్రహము గలిగియుండవలయుననియు, ఇంద్రియనిగ్రహము

గలిగినవారెవ్వరైనను ఈ గ్రంథమున కర్హులనియు తెలియవచ్చుచున్నది. కనుకనే అ. 8. ''సర్వేంద్రియాణి సంయమ్య'' అ.2 ''వశే హి యస్యేంద్రియాణి'' మొదలుగాగల పెక్కు శ్లోకములు నుపయోగించుటకు కారణము, ధనుర్విద్యాపరునికి ఏకాగ్రత లేనిచో లక్ష్యమెట్లు భేదింపజాలడో, ఆలాగున ఏకాగ్రతాబుద్ధిలేనివారికి బ్రహ్మము వేద్యము కాదు. ఈ తత్త్వము నాధారము చేసికొని, అష్టాదశపురాణములును శ్రీ వ్యాసభగవానులు సూతమహర్షి చే నైమిశారణ్యమున వైశంపాయనాదిమహర్షులకు బోధింపించిరి. కనుకనే గదా ఏ పురాణములను జూచినను ''శ్రీసూతఉవాచ'' అని కానిపించుచున్నది. సూతమునీంద్రుడు శూద్రుడని అందరెరింగిన విషయమే. వ్యాసులవారికి శ్రీశుక, వైశంపాయన, యాజ్ఞవల్క్య, గౌతమాది మహామహులగు ఋషిరత్నము లెందరో శిష్యరత్నములై యుండిరి. ఇట్లుండగా శ్రీసూతమునీంద్రునిచే పురాణములు బోధింపించిన రహస్యము, పై చెప్పినరీతిగా నాల్గువర్ణములవారును ఈ గ్రంథముల చదువుటకు అధికారులు కావలయునను ఉద్దేశమే. లేనిచో మూలపురుషు డెవడో వానిని ఆధారముగా జేసికొని గ్రంథముయొక్క పఠనమునకై అధికారము చేసెదరు. వేయేల వేదవిభాగకర్తయు, బ్రహ్మసూత్ర నిర్మాతయు, గీతయొక్క ఋషియు శ్రీవ్యాసులే గదా. ఈ మునిసత్తముడు సత్యవతి యని ప్రఖ్యాతిగాంచిన కైవర్తకన్యయందుగదా అవతరించినది!

2. గీతాశాస్త్రమును ఏ విజనప్రదేశములోనో విరక్తుడగు బ్రహ్మనిష్ఠునకుపదేశింపక, యుద్ధమధ్యమున ఉపదేశించిన కార్యము యోచించిన మహాశ్చర్యము గలుగుచున్నది. ఇదిన్ని భవిష్యత్కాలము నుద్దేశించియే భగవాన్ శ్రీకృష్ణమూర్తి ఉపదేశించినది. యుద్ధము క్షత్రియునకు స్వధర్మము గనుక గీతాపఠనమునకు, స్వధర్మానుష్ఠానపరులందరును అర్హులే, అనగా వారివారి కుటుంబ కార్యములతో గూడి వర్తించెడువారు గీతాపారాయణము చేసికొని ముక్తినొంద వచ్చును. గీతాపారాయణము చేయువారికి ప్రత్యేక వ్రత

నియమాదులు అనావశ్యకము. స్వధర్మనిష్ఠమాత్ర ముండిన చాలును. ఇట్టి విశాలభావము గీతకు లేనిచో ఇంత ప్రామాణ్యమును, వ్యాపకత్వమును గలుగదు. అంతేగాక సత్యమను స్వతంత్ర ప్రభాకరుడు ప్రకాశించుచుండెడి ఈకాలమున, గీతను ముట్టుటకు అసహ్యపడుదురు గదా! ఇదియును గాక దయామయుడును, సత్యస్వరూపుడునగు సర్వేశ్వరుని దృష్టి విశాలమైయుండునేగాని, సంకుచితత్వమునకు లోనగునా? ఈ తత్త్వమును తెలిసికొనదగినంత బుద్ధి వైశాల్యమును, విశుద్ధతయును లేనివారు అనంతుడగు భగవానుని తమ శుష్కహృదయములోనికి సొంతుడుగా నొక్కి యెక్కించుటకు చూచుట భగవదపచారమే యగును. భగవంతునకు ఇది దూషణమగు నని మఱువకుడు. సూర్య, వాయ్వాది పంచభూతములు, ఒక సంఘము వారు మాత్రము తమకు చేరినవి యని చెప్పునప్పుడు ఎంత అవివేకమో ఇదిన్ని అట్లే యగును. ఈలాటి వాక్యములను, యథార్థ భగవద్భక్తులు చ్ఛరించుదురను నమ్మకము లేదు. లేక ఒక్క ప్రభుత్వము ప్రత్యేక మొక్క సంఘమునకు ఉపకారమును, తక్కిన వారికి అపకారముచేయుచుండిన, ఉపకారమును పొందెడువారు ప్రభుత్వమును స్తుతించినను తక్కినవారు దూషించుదురు గదా! న్యాయవర్తియైన ప్రభువు అయినచో ఈ నీచకార్యము చేయునా? ప్రజ లందరిని సమత్వముతో పరిపాలించువాడుగదా న్యాయమూర్తి యగును. ఇట్లు లేనిచో ఆ రాజు ఎంత పరిహాసపాత్రుడుగా నుండునో మీరే యోచింపుడు. అట్టి దోషదృష్టి సర్వేశ్వరునియం దారోపించుట ఎంత పాపకరము! యుద్ధారంభమున మనస్సు ఎంత చంచలముగా నుండునో మనమే యోచింపవచ్చును. అట్టి మనోభ్రమత నొందిన అర్జునుడు గీతోపదేశము నొందిన వెంటనే సర్వసంశయ నివృత్తిగలిగి స్వధర్మనిష్ఠలో సుస్థిరుడై నిలుచుకొని కర్మపరుడయ్యు, నైష్కర్మ్యసిద్ధియగు ముక్తి నొందెను. అర్జునునకు యుద్ధమున గలిగినంత మనశ్చాంచల్యమును, తీవ్రప్రవృత్తియు మీ కెవరికినియుండదుగదా, అట్టి కిరీటియే నిశ్చలసమాధి నొంది మోక్షమొందునప్పుడు, సామాన్య గృహకార్యముగాని, ఉద్యోగముగాని, వ్యాపారముగాని, వ్యవసాయముగాని, ఇతరములగు స్వధర్మకార్యము లేవేవి చేయుచున్నను గీతాపఠనముచే మనఃశాంతి గలిగి శాశ్వతమగు మోక్షము

ననుభవింపవచ్చునని గీతవలన గోచరించుచున్నది. ''యోగస్థః కురు కర్మాణి'' మరియు ''యోగః కర్మసు కౌశలం'' ఇత్యాదివచనములు పెక్కులు గలవు.

భీష్మద్రోణాది మహనీయులుండగా అర్జునున కుపదేశించుటకు పైన చెప్పినదే కారణము. పార్థుడు క్షత్రియుడును, గృహస్థుడును, సామాన్య సంసారియు గావున అట్టివానికి నుపదేశించుటచే సాధారణ గృహస్థులు గూడ గీతాపారాయణముచేసి జీవన్ముక్తిని పొందుటలో సంశయములేదని తెలిసికొనుటకొరకు శ్రీకృష్ణభగవానులు బహుయోచనాపూర్వకముగా నుపదేశించిరి. మరియు కలియుగమున ఏకాంతవాసము, బ్రహ్మచర్యము, తపస్సు, కఠినమైన వ్రతమును జనులు సలుపజాలరనియు, ఇట్టి అనుష్ఠానము గలవారికే గీత నుపదేశించిన, అప్పుడు జనులు గీతాపారాయణమునకు భయపడుదురనియు తలంచియుండవలెను. కాని అట్లు భయపడ నక్కరలేదు. ఇవి యన్నియు తలంచియే వాసుదేవుడు గీతోపదేశమున, ఈ రీతి అనుసరించిరి. మరియు బ్రాహ్మణులలో నెవరికైన బోధించియుండిరేని ఈ గ్రంథమున బ్రాహ్మణులకు తప్ప తక్కినవారికి అధికారము లేదనియు, సన్న్యాసులకు నుపదేశించిన యతులకు తప్ప తక్కినవారు అర్హులు గారనియు, తపస్వి యైనవానికి అనుగ్రహించి యుండిన తదితరులు ఉపయోగపరచరాదనియు వాదనకు ఆధార ముండెడిది. మధ్యస్థితిలోనుండు క్షత్రియున కుపదేశించిన అందరికి అధికారము గలదని తలంచియుండిరి. పూర్వము ధర్మసంస్థాపనమంతయు క్షత్రియకరస్థమై యుండెను. కాలాంతరముచే ధర్మచ్యుతి కలిగినందున, దేశమధోగతికి జారిపోయినది. గీతోపదేశోపాయ మెటువంటి దనగా, ఒక గొప్పవాడు విందు జరుపువేళలో చతుర్వర్ణస్థులను ఆహ్వానము చేసియుండెను. గౌరవకార్యము జరుగు తరుణమున నాల్గువర్ణస్థులలో గల నలుగురు గొప్పవారి మధ్యభాగమున ఒక పాత్రములో గౌరవ మర్యాదావస్తువుల నుంచినట్లున్నది. కనుక మిత్రులారా! విశాలమైన భగవంతుని దివ్యదృష్టి క్రిందుపరచి సంకుచితపరచచూడకుడు. ఇది భగవద్భక్తి గాజాలదు. విశాలబుద్ధియును గాదని మఱవకుడు. నేత్రము తెరచుకొని విశాలమగు భగవత్

సృష్టిని పంచభూతములను చూచి ఆనందింపుడు. ఇతరులను ఆనంద భరితులుగా జేయుడు. ''అహమాత్మాగుడాకేశ సర్వభూతాశయస్థితః........ ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున! తిష్ఠతి ... క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత-సమోఽహం సర్వభూతేషు'' ఇత్యాది భగవత్ వచనములను లోకమునంతను ప్రకటింపుడు.

ఇక స్త్రీలకు ఈ గీతయందు స్థలము గలదా? అని విచారింతము. గీతాశాస్త్రము విష్ణుమూర్తి, భూదేవికి (లక్ష్మీదేవికి) బోధించినట్లు గీతామాహాత్మ్యమునందు తెలియవచ్చుచున్నది. ఇది వరాహపురాణమున ప్రసిద్ధము. ఈ పురాణమునుండియే గీతామాహాత్మ్యము పారాయణమునకు వచ్చినది. ''ధరోవాచ'' అని ప్రారంభించుటకు కారణమదియే. జగజ్జననియగు పార్వతీదేవి శ్రీపరమశివుని సర్వజనులు తరించేలాగున ఒక గొప్పవిషయ మడుగగ, పరమశివుండు తారకమంత్ర ముపదేశించినట్లు శ్రీదేవి యీగీతను ఎవరికొర్కై శ్రీమన్నారాయణమూర్తినుండి గ్రహించినదో, దానిని వివరించెద. ఒక్క జాతిని గురించిగాని, ఆశ్రమమును గురించిగాని అడుగలేదు. జనసామాన్యమును గురించియే యడిగియున్నారు.

**భగవన్పరమేశాన! భక్తిరవ్యభిచారిణీ !**
**ప్రారబ్ధం భుజ్యమానస్య కథం భవతి హేప్రభో! ॥**

పరమేశ్వరుడును, ప్రాణికోట్లకు ప్రభువును నగు ఓ భగవంతుడా! ప్రారబ్ధకర్మము ననుభవించువారికి అచంచలమైన దైవ భక్తి యెట్లు గలుగును ? ఈ ప్రశ్నవలన ప్రారబ్ధకర్మము లేనివారెవ రుందురు? ఎవరును లేరనుట నిక్కము. కనుక ప్రారబ్ధముగల వారందరును గీతాశాస్త్రమును పఠించి ప్రారబ్ధకర్మయొక్క నివృత్తి రహస్యమును తెలిసికొని ధన్యులు కావచ్చును. భగవంతుడును ఈ ప్రశ్నమునకు సరియైన సమాధానమునే ఆనతిచ్చిరి గాని, ఏలాటి విపరీతభావముతోను బోధించలేదు.

**ప్రారబ్ధం భుజ్యమానోఽపి గీతాభ్యాసరతస్సదా ।**
**స ముక్తస్స సుఖీ లోకే కర్మణా నోపలిప్యతే ॥**

ప్రారబ్ధకర్మమును అనుభవించు చున్నవాడైనను ఎల్లప్పుడును భగవద్గీతలను పారాయణ చేయుటయందు ఆసక్తిగలవాడు లోకములో ముక్తుడగును. సుఖము గలవాడును అగును. వానికి కర్మములలో సంబంధము లేదు. ఇచ్చట ఒక శంక పొడమును, ద్వాపరాంతమున కురుక్షేత్రమునందు గదా కృష్ణభగవానులు గీత నుపదేశించినది. పురాతనమగు వరాహపురాణమున భూదేవికి కర్మరాహిత్యమునకు గీతాపారాయణమే ముఖ్యమని ఎట్లు బోధించిరి? దీనికి సమాధానము గీత 4వ అ. లో భగవానునిచే చెప్పబడెను. ఈ గీత అనాదియనియు, ఆదికాలమున సూర్యుని కుపదేశించి యుంటిననియు, సూర్యుడు మనువుకును, మనువు ఇక్ష్వాకురాజునకు బోధింపగా, క్రమముగా రాజఋషు లందరును గ్రహించి రనియు, అట్టి బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును నగు ఈ రహస్యవిద్య కాలక్రమమున నశించెననియు, అట్లు క్షయించిన ఆయోగవిద్యను, ఇప్పుడుపదేశించుచున్నాననియు, భగవద్వచనము గలదు. అ. 4. శ్లో. 1,2,3, 4 చూడం దగును. ఇక ఒక రహస్యము చెప్పెద, నాయనలారా! ''మాతృదేవో భవ'' అనిగదా వేదవచనము. అటువంటి దైవస్వరూపురాలగు తల్లిని గురించి యాస్త్రీజన్మము పాపభూయిష్ఠ మనియు, నీచజన్మమనియు పుణ్యకార్యముల కర్హత లేనిదనియు, బహిరంగముగ చెప్పుట ఎంత విచారశూన్యమగు వచన మని చెప్పవచ్చును? తనతల్లి పాపిని అయిన, తానెట్లు పుణ్యవంతుడగును? తల్లి పాపయోనిజాతయైన అట్టి దానినుండి జన్మమెత్తిన వారెట్లు పుణ్యాత్ములగుదురు? ఆహా! భయంకరవచనము! శ్రీరామరామ, రామరామా, వినుటకు సాధ్యముకాదు. ఇట్టి దుష్టకల్పిత కథలవలనగదా, పుత్రులకు మాతృభక్తి నశించిపోయినది; ఇట్టి క్రూరవచనములను నేను వినజాలను. ఇది ఎంతయో ఘోరకృత్యము. తల్లి దైవస్వరూపురాలనియు, పుణ్యమే మూర్తీభవించినదనియు, బోధించియుండిన పుత్రులకు, మాతృభక్తి యెంత వృద్ధియై యుండెడిది! స్త్రీలందరు తమ తమ బిడ్డలకు తల్లు లగుదురు గదా! అప్పుడు తన అమ్మను, పాపిని యని చెప్పినట్లు గదా, స్త్రీజన్మము పాపజన్మము అని చెప్పుట, ఓహో ఎంత తెలివిలేనితనము?

మనుజుల అజ్ఞానగాఢతమ మేమని చెప్పవచ్చును. తల్లిని దూషించు పాపికన్న వేరొండు పాపి గలడా? గీతాచార్యులగు కృష్ణభగవానులు, స్త్రీలకును శూద్రులకును, భగవద్గీత పఠింపతగదన్నట్లు 18 అధ్యాయములలోను గల ఏడునూర్ల శ్లోకములలో ఒక్క అక్షర మయినను ఎవ్వరైనను చూపగలరా? చూడుడు.

**మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః ।**
**స్త్రియో వైశ్యాస్తథా శూద్రాస్తేఽపి యాంతి పరాం గతిమ్ ॥**

హే పార్థ = ఓయి అర్జునా! యేఽపి = ఎవరు, పాపయోనయః = నికృష్టజన్మములు గలవారలు, స్యుః = అవుదురో, తేఽపి = వారు సహితము, స్త్రియః= స్త్రీలును, తథా= ఆలాగుననే, వైశ్యాః = వైశ్యులును, శూద్రాశ్చ = శూద్రులును, మాం = నన్ను, వ్యపాశ్రిత్య= ఆశ్రయించి, పరాం= ఉత్కృష్టమైన, గతిం = గతిని, యాంతి హి= ఈ లోకమునందే పొందుచున్నారు గదా! ఈ సందర్భమున సంకుచిత బుద్ధిగల వ్యాఖ్యాతలు, స్త్రీ శూద్ర వైశ్యాదులను పాపయోనులని వ్యాఖ్యానము చేసియున్నారు. ఇది మహాపాతకము. నీచయోను లనగా దీనత్వము గలిగి కుష్ఠమున్నగు మహావ్యాధులచే బాధపడువారని అర్థము. మరల జ్ఞానహీను లని యర్థము గూడ గలదు. అటువంటివారు గూడ, కరుణామూర్తియగు సర్వేశ్వరుని ధ్యానించి కృతార్థులు గావచ్చును. ఇట్లుండ స్త్రీలును, శూద్రులును, వైశ్యులును భగవద్గీతా పారాయణము చేసికొని ధన్యులు గావచ్చునని నొక్కి చెప్పవచ్చును.

**మహాపాపాది పాపాని గీతాధ్యానం కరోతి చేత్ ।**
**క్వచిత్ స్పర్శం న కుర్వంతి నళినీదళమంభసా ॥**

అని మాహాత్మ్యమున గలదు గదా! మరియు ఈ గీతాశాస్త్రము అందరికిని బోధింపవచ్చునా? లేదా? అనువిషయమై భగవద్వచనము ఉండునా? లేదా? యనియు విచారించుట కర్తవ్యము.

**య ఇదం పరమం గుహ్యం మద్భక్తే ష్వభిధాస్యతి ।**
**భక్తిం మయి పరాం కృత్వా మామే వైష్యత్యసంశయః ॥**

యః = ఎవ్వడు, పరమం= ఉత్కృష్టమైన, గుహ్యం= గోప్యమైన, ఇదం= ఈ గీతాశాస్త్రమును, మద్భక్తేషు= నాభక్తుల విషయమై, అభిధాస్యతి= చెప్పగలడో, సః =వాడు, అసంశయః= సంశయరహితుడై, మయి= నాయందు, పరాం= ఉత్కృష్టమైన, భక్తిం = భక్తిని, కృత్వా= చేసి, మామేవ = నన్నే, ఏష్యతి= పొందగలడు.

ఎవడు పరమోత్కృష్టమైన పరమరహస్యమైన ఈ గీతాశాస్త్రమును, నాభక్తుల కుపదేశము చేయుచున్నాడో వాడు నాపై పరమభక్తిని జేసినవాడై నాస్థానమైన మోక్షము చెందగలడు. ''భక్తేషు'' అని భగవంతు డుపదేశించుటచే భగవానునియందు భక్తిగలవారందరికి అని అర్థము.

**న చ తస్మా న్మనుష్యేషు కశ్చిన్మే ప్రియకృత్తమః ।**
**భవితా న చ మే తస్మా దన్యః ప్రియతరో భువి ॥**

తస్మాత్ = వానికంటె, మనుష్యేషు= మనుష్యులయందు, మే = నాకు, ప్రియకృత్తమః = మిక్కిలి ప్రియమును జేయువాడు, కశ్చిత్= ఒకడును, న = లేడు. తస్మాత్ = వానికంటె, అన్యః = ఇతరుడు, మే=నాకు, భువి= భూమి యందు, ప్రియతరః = ఎక్కువ ఇష్టుడుగా; న భవితా=కాగలవాడు కాడు.

అట్లుపదేశము చేయువానికంటె మనుష్యులలో నాకు పరమప్రియము చేయువాడు వేరొకడు లేడు. భవిష్యత్కాలమునను నాకు వానికంటె ప్రియుడు భూలోకమందు ఇప్పుడున్న వారిలో లేడు. ఇక గలుగబోడు. జనులారా! విన్నారా! ఈ భగవద్గీతను భక్తులకు నుపదేశించువానికన్న భగవంతునకు ప్రియమైనవాడు భూత భవిష్యత్ వర్తమాన కాలములలో మరియొకడు లేడని సాక్షాత్ భగవంతుడే బోధించియున్నాడు. ఈలాగున భగవంతుడే మేఘగర్జనమువలె బోధించియుండ జనులు తెలిసికొనక పోవుట వారి మూఢస్వభావమనియే గ్రహించవలెను.

**అపి చేదసి పాపేభ్య స్సర్వేభ్యః పాపకృత్తమః ।**
**సర్వం జ్ఞాన ప్లవేనైవ వృజినం సంతరిష్యసి ॥**

పాపాత్ములందరిలోను మహాపాపివైనను, పాపసాగరమంతయు ఈ గీతాపారాయణముచే కలిగిన జ్ఞానమనెడు తెప్పచే దాటగలుగుదువు.

**విద్యా వినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని ।**
**శుని చైవ శ్వపాకే చ పండితా స్సమదర్శిన: ॥**

జ్ఞానులు విద్యావినయములతో గూడిన బ్రాహ్మణునియందును, గోవునందును, ఏనుగునందును, శునకమందును, దానిని వండి భక్షించువాని యందును, సమానమైన బుద్ధిగలిగి వర్తింతురు,

**సమోஉహం సర్వభూతేషు న మే ద్వేష్యోஉస్తి నప్రియః ।**
**యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్ ॥**

నేను ఎల్లభూతములకును సముడను, నాకు నిష్టుడు గాని విరోధి గాని లేడు. అయినను భక్తిశ్రద్ధలతో ఎవరు నన్ను గొలుచుచున్నారో, అట్టివారు నాయందున్నవారు అగుదురు. వారియందు నేనున్ను ఉన్నవాడను.

**అపి చేత్సుదురాచారో భజతే మా మనన్యభాక్ ।**
**సాధు రేవ స మంతవ్య స్సమ్యగ్వ్యవసితో హి సః ॥**

మిగుల దురాచారముగలవాడైనను, అనన్యచింతతో నన్నే శరణు జెంది భక్తిచేసిన యెడల నట్టివాడు ఆత్మతత్త్వ మెరిగిన నాభక్తుడు గనుక వాడు పుణ్యాత్ముడనియే తలంచవలయునను, ఈ శ్లోకవుచే ఒక్కడు కడు క్రూరకృత్యములతో నుండినవాడైనను, భగవద్భక్తి పరాయణుడయ్యేనేని సర్వపాపములనుండి విముక్తుడై శుద్ధ జ్ఞానస్వరూపుడు గాగలడనియు, పాపకార్యములో ప్రవర్తించువాడైనను భగవద్గీత పారాయణము చేయవచ్చు ననియు గోచరించుచున్నది.

**క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి ।**
**కౌంతేయ! ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి ॥**

అట్టివాడు అతిత్వరలో ధర్మాత్ముడై నిత్యమైన పరమశాంతిని

జెందుచున్నాడు. ఓయర్జునా! అట్టి దురాచారము గలిగిన నా భక్తుడు అనగా నాయందు సమర్పింపబడిన యంతరాత్మగలవాడు దోషము చెందడని నీవు ప్రతిజ్ఞచేసి చాటుము.

ఒక రహస్యము గలదు. పాపజన్మముగల వారెవరెవరు గలరో వారు పాపనివారణానుష్ఠానము, శీలింపక పాపమునుండి ఎట్లు విముక్తులౌదురు? రోగికి కదా ఔషధమును, వైద్యుడును, వైద్యశాలలును ఏర్పడినవి. ఆలాగున అజ్ఞానవ్యాధిగలవారికి బోధగల గురువులు, భక్తిజ్ఞానవైరాగ్యాదులను బోధింపక వారెట్లు తరింపగలరు? దానికి అనుకూల మగు గ్రంథములు చదువక, ఎట్లు సత్యమును తెలిసికొనెదరు? ఇట్టి తత్త్వము తెలియకపోవుటచే గదా మన భారతదేశము క్షీణతచెందినది! ఒకప్పుడు ప్రపంచములోగల రాజ్యములన్నిటిలోను భారతదేశము శిరోరత్నమైయుండినది. అట్టి భరతఖండము ప్రస్తుతము ఇతరరాజ్యములతో పోల్చిచూచిన పాదరక్షయై పోవుటకు ఇదే కారణము. ఏలన కల్పిత గ్రంథములు నిండిపోయినందుచేతను, సత్యాసత్య విమర్శకులు మధ్యకాలమున తగ్గిపోవుటచేతను, రాజులకు విమర్శనాశక్తి లేకపోవుటచేతను గదా, భారతదేశీయులు విదేశీయులకు బానిసలై దుఃఖము నొందజొచ్చిరి! ఎంతో స్వల్పసంఖ్యాకు లగు గ్రీకులచేతను, మహమ్మదీయులచేతను, ఫ్రెంచివారిచేతను, ఇంగ్లీషువారిచేతను ఇంతగొప్ప రాష్ట్రము జయింపబడినది! కారణ మేమన, క్షత్రియులు మాత్రమే ఆయుధము పట్టవలెననియు, బ్రాహ్మణులు మాత్రమే విద్యాప్రచారము, తపస్సు మొదలైనవి చేయవలె ననియు, తక్కిన వైశ్య శూద్రులుస్త్రీ లందరు సేవకవృత్తితో కాలము గడపవలె ననియు గల ఘోరమగు పైశాచికాచారము గదా యింత దుఃస్థితికి దెచ్చినది! ఇప్పుడు చూడుడు, ఇంగ్లీషు విద్యయందందరికి, అధికార ముండుటచే, నియమ నిర్మాణాది సభలయందు, చతుర్వర్ణస్థులును సమానమేధా సంపత్తిగలిగి వర్తించుచున్నారు. ఇదేరీతిగా, పూర్వమునుండి శమదమాది గుణములు గలవారిని బ్రహ్మవిద్యయందును, బాహుబలము, మనోధైర్యము

గలవారిని సైన్యము నందును, ఏర్పాటు చేసియుండి తదితరులను కృషి వాణిజ్యాది కార్యములలో నియమించి యుండిన ఈ భారతదేశము బ్రహ్మప్రళయమువరకు పరుల పాలు గాకుండెడిది గదా! ఓహో! ఎంత దురదృష్టము? ఈ తత్త్వమును తెలిసికొనక హైందవులకు సంప్రదాయసిద్ధముగా సహోదరభావము లేదనియు, మైత్రి లేదనియు, శూరత్వము లేదనియు చెప్పుటచే ప్రయోజనమేమి? కనుక వివేకవంతు లందరును ఈ తత్త్వము తెలిసికొని, దేశోద్ధారణము కొరకు బూనుట చాలా లాభకరము. ఇప్పుడు కొంచెము వివేక జ్ఞానము గలవారు ఏదిక్కు తెలియక పూర్వము బ్రహ్మనిష్ఠులందరు బ్రాహ్మణు లనియు, కనుక బ్రాహ్మణులయందు తిరస్కార భావము గూడదనియు చెప్పునది ఒక పక్షమున సత్యమైనను, ప్రస్తుతము అనుభవము లేని కార్యము చర్చించి ప్రయోజనముండదు. రోగము వచ్చిన మార్గము తెలిసికొనక చాలా జాగరూకతతో మందుయిచ్చినను ప్రయోజనముండదు గదా! పిత్త వ్యాధి కలవారికి, వాతరోగమున కుపయోగపడు ఔషధసేవచే ఫలమేమి? కనుక మిత్రులారా! అందరమును వాస్తవస్థితిని తెలిసికొని స్వరాజ్యమునకును, స్వారాజ్యసిద్ధికొరకును ప్రయత్నించి ధన్యత్వము నొందుదము. స్వరాజ్యసిద్ధి ఒక్కదాని మాత్రముచే ధన్యుల మయ్యెదమని తలంపకుడు. స్వారాజ్యము నధిష్ఠింపని వారికి స్వరాజ్యము సిద్ధించినను అది ప్రాణము లేని శవము వంటిదే యగును. స్వరాజ్యమునకు తగినంత సాధనలేని వారు స్వారాజ్యమునకు అర్హులు గారు. దీనిలో అవిచారపూర్వక మగు వచనము లుండిన విచారపరులగు సత్పురుషులు మన్నింతురు గాక! మనుష్యుల ఆత్మోన్నతిని అడ్డుపరచెడి గ్రంథములన్నియు, విషయుక్తములగు బాంబుల వంటివని మఱవకుడు. ఇట్టి గ్రంథముల అభిప్రాయములచే గదా! ప్రజలు జీవచ్ఛవములైరి. వీటిలో బాహ్యార్థము మాత్రము గానిపించి, అంతరార్థమును విడువరాదనియు, కొందరు చెప్పునది సత్యమే, శ్రీమత్ భగవద్గీతలో అంతరార్థ మందుగాని, బాహ్యార్థమందుగాని, అట్టి విషప్రాయ మగు విష వచనము లుండినచో

నేను ఈ గ్రంథమును దూరముగా విసరి వేసి యేడుసార్లు జలమృత్తికలచే కరశుద్ధి చేసికొందును. అంతేగాక, అటువంటి గ్రంథములను పైశాచికకృత్యము లని గూడ నవ్ముదును. కావున దివ్యాత్మస్వరూపులారా! సోదరులారా! సోదరీజనులారా! ఈ లాటి దోషములేమియు ఈదివ్యగ్రంథమందు లేవు. స్వరాజ్య విషయమై లోకమాన్య తిలకుగారు, స్వరాజ్యము తనజన్మ హక్కని యుద్ఘోషించినట్లు స్వారాజ్యమును, దానికి సంబంధించిన సాధనలును, సాధనకు అనుకూలములగు శాస్త్రములును మనుష్యులందరి సొంతమని దృఢముగా నుద్ఘోషింపుడు. ఇట్టి దృఢమగు ప్రబోధము గలిగి వర్తింపుడు. అప్పుడే మీరు నిద్ర నుండి మేల్కొనిన వారగుదురు. ఇట్లు చెప్పినప్పటికిని ఒక్క రహస్యము గలదు. అదేమన ఏ ఏ పదవికి ఎవరెవరు అర్హులని శాస్త్రములలో నియమము గలదో, ఆవిషయమున మీరు జాగరూకులై వర్తింపనిచో మీ సంకల్పము సఫలమగుట దుస్తరము. ఇది ప్రకృతినియమము, అలంఘనీయమగు శాసనము. అట్టి సుగుణములతో గూడిన వారికి సమస్తసాధనలును, అనుకూలములైన శాస్త్రములును ఉపయోగపరుప వచ్చును. ఇట్టి సుగుణములు గలిగి వర్తించువారికి పాపము గలదని యెవరైనను చెప్పినచో ఆ పాపము సంకల్పపూర్వకముగా నాపై వేయుడు. నేను దానిని సుఖముగా వహించెద. సుగుణములు లేనివారి పాపములకు వారే పాత్రులుగాని, నేను పాత్రుడనుగాను. భగవద్భక్తులందరును సత్యార్థ విచక్షణ శీలురగు కోవిదులును పైగీతను గురించి వ్రాసిన వచనములను రక్షింతురు గాక!

లోకాస్సమస్తా స్సుఖినో భవంతు.

సర్వభూతేషు చాత్మానం సర్వభూతాని చాత్మని ।
సమం పశ్యన్నాత్మయాజీ స్వారాజ్య మధిగచ్ఛతి ॥



# శుద్ధజిజ్ఞాస

**సర్వతంత్ర స్వతంత్రాయ సదాత్మాఽద్వైతవేదినే।**
**శ్రీమతే శంకరార్యాయ వేదాంత గురవే నమః ॥**

శ్రీమలయాళస్వామివారు తిరుపతి సనకసనందతీర్థమున తపస్సు చేయు కాలములో, ఒక జిజ్ఞాసువు వచ్చి యిట్లు ప్రశ్నించిన దానికి సమాధాన మిట్లొసంగిరి:-

ప్రశ్న. అయ్యా! తామేల యీ నిర్జన ప్రదేశములో తపమొనర్చు చున్నారు? ఈశ్వర ప్రత్యక్షమునకా? లేక మోక్షము కొఱకా? లేక యితర కార్యముల నుద్దేశించియా?

ఈ ప్రశ్నలకు శ్రీస్వాములవారు సవినయముగాను, సగౌరవము గాను, సభక్తిగను ఇట్లు సమాధానము సెలవిచ్చిరి,

ఉ. మహాశయా! సావధానముగా వినుడు. (1) ఈశ్వర ప్రత్యక్షము నుద్దేశించి కాదు. ఏలన, ఈశ్వరుడు అనేకులకు ప్రత్యక్షుడయి యుపదేశించిన విషయములే శ్రీ భగవద్గీతాది మహాగ్రంథములు. వానిలో బోధించిన విషయములకన్న అధికమేదియు తెలియందగినది లేదు నాకును, దానికన్న ఎక్కువ ఈశ్వరుడు ప్రత్యక్షమయినను అనుగ్రహించు నూతన విషయముండదు. (2) మోక్షము ప్రాణికోట్లకు స్వతస్సిద్ధమై యున్నది. నేను బద్ధుడు గానందున ముక్తి అపేక్షణీయము కాదు. ఆత్మను బంధించుటకు, ఆత్మకన్న నితర మేదైన బలవత్తరముగా నుండవలయును. అట్టిది మరియొకటి యుండునని తలంచుట పిల్లవాడు రాత్రి దీపములో కనుపించు తన నీడనుజూచి దయ్యమని భ్రమించి ఏడ్చుచందమున భ్రాంతియే యగును. (3) ఇతర కార్యలాభ మేదైన నుద్దేశించుటయు నాకు లేదు. ఆత్మ సర్వదా లభ్యమై యుండుటచే, మరల లభించవలసిన దేదియు లేదు. ఆత్మోపలబ్ధికన్న నితరములగు బ్రహ్మాదిపదవు లన్నియు కాలాంతరమున నశించునవే. ఏది సుఖమని జనులు తలంతురో, అది నశించునప్పుడు దుఃఖము తప్పక కలుగును. అంతేగాక, సూర్యుడు

ప్రకాశమానమైయుండగా, దీపమునకై వెదకువా డెట్టి వెఱ్ఱివాడో అట్టివాడే ఆత్మలాభమునకన్న నీశ్వరలాభము కోరువాడు. కనుక తామడిగిన మూడు ప్రశ్నలు నా యుద్దేశము గాదు. నిజమైన ముముక్షువైన అతడు ఈశ్వర ప్రత్యక్షము కోరడు. ఆత్మసాక్షాత్కారమే కోరును.

నే నిప్పుడుండు ఈ సిత్థి నాయొక్క నైజగుణమే. ఇది గొప్ప తపస్సని గాని, తీవ్రవైరాగ్యమనిగాని, కఠినవ్రతమని గాని నాకు తోచుట లేదు. ఎట్లన విషయలంపటులకు సదా విషయబుద్ధియు, చోరులకు చోరత్వబుద్ధియు, ధనాసక్తులకు ధనసంపాదనబుద్ధియు నెట్లు స్వాభావికముగా గలిగియుండునో, ఆలాగున బ్రహ్మనిష్ఠులకు, ఏకాంతవాస తపశ్చర్యావిషయ విరక్త్యాదులు స్వభావముగానే యుండును. పేడపురుగు మలమును, భ్రమరము మధువును, బకము మలిన జలప్రదేశమును, హంసము తామరసరస్సును స్వభావముగా గ్రహించునట్లు, విరక్తులయొక్కయు, రక్తులయొక్కయు చిత్తభ్రమరము చరించు చుండును. పైనిచెప్పిన వానికన్నిటికిని జన్మాంతర సంస్కారమే కారణముగాని, వేఱు హేతువాద మేమియు లేదు.

**కర్మానురూపేణ గుణోద్గమో భవే ద్గుణానురూపేణ మనః ప్రవృత్తిః ।**
**మనోఽనుగైస్త్రైరుభయాత్మకేంద్రియై ర్నివర్త్యతే పుణ్యమపుణ్యమత్ర॥**

కర్మమునకు దగినట్లు గుణము కలుగును. గుణమునుబట్టి మనస్సు ప్రవర్తించును. మనస్సు ననుసరించి యింద్రియములు పుణ్యమునుగాని పాపమునుగాని యాచరించుచుండును అని శ్రీశంకర భగవత్పాదాచార్యు లానతిచ్చిరి.

**త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా ।**
**సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శృణు ॥**

**సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత! ।**
**శ్రద్ధామయోఽయం పురుషో యో యచ్ఛ్రద్ధ స్స ఏవ సః ॥**

ప్రతివానికి సాత్త్వికమని, రాజసమని, తామసమని శ్రద్ధ మూడువిధము

లగుచున్నది. అది పూర్వకర్మసంస్కారము వలన బుట్టునది. కనుక నా మూడు విధముల శ్రద్ధను చెప్పెదను వినుము. అర్జునా! అందఱికిని సత్త్వాదిగుణముల తారతమ్యమునుబట్టి శ్రద్ధ (స్వభావము) గలుగుచుండును. కావున ఒక్కొక్క పురుషుని స్వభావ గుణకర్మములబట్టి వారి వారిని కనుగొనవచ్చును అని శ్రీభగవద్గీత పదునేడవ అధ్యాయము. ఈ విషయమే యితర గ్రంథములలో గూడ గానుపించు చున్నది.

**సత్యం జ్ఞానం తపో మౌనం ధృతి ర్ధర్మ స్తితిక్షుతా ।**
**ఉత్సాహో నిశ్చలం ధైర్యం సాత్త్వికం గుణలక్షణమ్ ॥**

1. సత్యము, ఇది బహిరంతర భేదములచే ద్వివిధము. 2. జ్ఞానము, ఇదిన్ని ఆత్మజ్ఞానము, కార్యాకార్యవివేచన మని యిరుతెగలు. 3. తపస్సు, ఇది కృచ్ఛ్రచాంద్రాయణాది వ్రతములచేతను, ఆత్మనాత్మ విచారణ జ్ఞానము చేతను రెండువిధములు. 4. మౌనము ఇది సత్యమితభాషణ బ్రహ్మమననములచేతను, అవాఙ్మనసగోచర ఆత్మబోధముచేతను ద్వివిధములు. 5. ధృతి అనగా ధారణాశక్తి. ధర్మము వేదవిధి. 6. గురువాక్యానుసార ప్రవర్తన. 7. తితీక్ష, సహనము. 8. ఉత్సాహము సత్కార్మాదులలో అత్యంత ఆహ్లాదము. 9. నిశ్చలము అనగా వృత్తులచే చలింపకుండుట. 10. ధైర్యము అనగా ధీరత్వము. ఈ పది గుణములు సత్త్వగుణము గలవారికి స్వభావముగా గలిగియుండును. ఎట్లన, ఒక్కొక్క జాతివృక్షములు స్వభావముగా ఫల, పల్లవ, పుష్ప, లతాదులచేతను, కృష్ణశ్వేత పీతవర్ణాదులచేతను, కటు, ఆమ్ల, మధురాదిగుణములచేతను స్వయముగా గలుగుచుండునో, ఆలాగున వారివారి గుణకర్మములనుబట్టి వారివారి స్థితిని కనుగొనవచ్చును.

**గర్వం క్రోధ మహంకార స్సతీసంగః ప్రలాపనమ్ ।**
**అప్రియం దంభ మాత్సర్యం రాజసం గుణలక్షణమ్ ॥**

గర్వము, క్రోధము, అహంకారము, విషయలంపటత్వము, అధికప్రసంగము, అతృప్తి, దంభము, మాత్సర్యము ఈ యెనిమిదిగుణములు గలవారిని పై చెప్పినరీతిగా వృక్షస్వభావమును బట్టి కనుంగొన దగును. ఇది

రజోగుణ స్వభావము.

**అజ్ఞానం మోహనిద్రా చ చాపల్యం బుద్ధిహీనతా ।**
**పాపిష్ఠం పరపీడత్వం తామసం గుణలక్షణమ్ ॥**

అజ్ఞానము కార్యాకార్య విచేచనాహీనత్వముచేతను, ఆత్మానాత్మ బోధరాహిత్యముచేతను ద్వివిధము, 2. మోహము అనగా భ్రాంతి, 3. అతినిద్ర 4. చంచలస్వభావము, 5. బుద్ధిహీనత్వము, 6. పాపకార్యములో ప్రీతి, 7. పరప్రాణుల పీడించెడు స్వభావము. ఈ ఏడుగుణములును పైనుదాహరించిన వృక్షదృష్టాంతముచే తమోగుణము గలవారివని తెలియందగినది.

ఓ విశుద్ధాత్మా! కారణములేక కార్య మెప్పటికిని ఉండదు అను న్యాయము ననుసరించి నేనిచ్చో నివసించుదానికి నా ఆశయము తమతో విన్నవించెద. స్వర్గనరకవములు రెండును నాకు లేవు. దీనియందేలాటి సంశయమునకు అవకాశ ముండదు. ఏలన నరకమునకు తగినవాడైన నిప్పుడు గలిగియుండు పవిత్రత కవకాశముండదు. స్వర్గమనిన, నా యధీనము. ఏలన స్వర్గము విషయాసక్తులు కామ్యకర్మ ఫల మనుభవించుటకు ఏర్పడిన స్థలము. నేను కామ్యకర్మలను బుద్ధి పూర్వకముగా జన్మనా అనుష్ఠించినవాడనే గాను. మరియు స్వర్గము గూడ దృశ్యసుఖమేగాని, దృక్ అయిన ఆత్మసుఖము కాదు దృశ్యమంతయు భ్రమప్రాయమేగాని, వాస్తవముగా నుండదు. అంతేగాక యింద్రియసుఖములే గాని, యింద్రియాతీతజ్ఞానసుఖము కాదు. మరియు స్వర్గములో హెచ్చుతక్కువ సుఖములు గలవు. రాగద్వేషములుగూడ అచ్చట నుండును. పుణ్యక్షయమున అట్టి సుఖమునుండి జారిపడుట కలదు. దీనిని ముముక్షువులు కాకిమలమువలె హేయముగా తలంచెదరు. అమృతము భుజించువాడు అమేధ్యమును తినగోరనట్లు జ్ఞానామృత పానతృప్తాత్ముడు స్వర్గాదిభోగము లన్నియు తుచ్ఛముగా తలంచును. మఱియు స్వర్గలోకము ఇష్టముండిన పోవలసిన స్థలమేగాని నిర్బంధము లేదు నరకము అటువంటిదికాదు. ఇష్టములేనప్పటికిని బలాత్కారముగా పోవలసియుండును. ఏలన

దొంగపనిచేసినవానికి కారాగృహవాస మిష్టములేనప్పటికిని రాజభటుల నిర్బంధముచే వెళ్ళియే తీరవలయును. స్వర్గమటువంటిది కాదు. ఒక్కడు ఒకగొప్పపరీక్షయందు ఉత్తీర్ణుడైనను ఉద్యోగము చేయవలయునని నిర్బంధము లేదుగదా! స్వర్గమును అటువంటిదే.

ఇక మూడవకార్య మొకటి కలదు. దానియందు మాత్రమే భీతిగలుగు చున్నది. ఆ భయమునుండి తప్పించుటకు దయామయుడగు సర్వేశ్వరుని గురించి తప మొనరించు చున్నాను. అదేమన ఇంత వఱకు భగవత్ ప్రీతి కార్యములతో కాలము గడపినందున ఆ కరుణామూర్తి నాపై కరుణగలిగి జన్మరహిత మోక్షము నిచ్చునేమో అని మాత్రము గొప్ప భయము గలుగుచున్నది. అట్టిదానినుండి తప్పించి వెంటనే పునర్జన్మ మియ్యవలయుననియే ప్రార్థన. అట్టి వచ్చెడి జన్మములో నేను ధనవంతుడనై యుండవలయుననిగాని, పండితుడై జన్మించవలయుననిగాని, సుందర గాత్రాన్వితుడై యుండవవలయుననిగాని, బ్రాహ్మణకులములో జనన మొందవలయుననిగాని కోరను. మరల ప్రాపంచికభోగము ఏదిన్ని యిచ్చింపను. మాట్లాడుట, చూచుట, వినుట మొదలుగాగల యింద్రియములతో గూడిన జన్మ మేది వచ్చినను చాలును. ఆ జన్మములో సర్వేశ్వరుని ఒక్క నిమిషమైనను ఎడబాయక దర్శించుటకును, తైలధారవలె అవిచ్ఛిన్న భక్తిగలిగియుండుటకును, అనగా పరమాత్మజ్ఞానము ఆవరణము నొందక యుండుటకును, సర్వేశ్వరసన్నిధిలో చేరుటకు ఎవరెవరికి ప్రతి బంధము గలదో అట్టి ప్రతిబంధము సమూలముగ నివర్తింపజేయుటకును, జనుల అంతఃకరణములో అనాదిగా నిండియుండు అజ్ఞానము తొలగించుటలో ప్రయత్నించుటకును, జను లందరిలోను ఒకటే ఆత్మ గలదనియు, అజ్ఞానముచే నానాత్వమై కానుపించు భేదము పాపమనియు, దానినుండి విముక్తి నొందుటయే ముక్తి అనియు, ఈ అర్థమునే ఉపనిషత్ ప్రతిపాదితవేదాంతమనియు, ఆత్మప్రాప్తి అనియు, మోక్షమనియు, నిర్వాణ మనియు, జనులకు తెలుపుటకు యోగ్యమగు జన్మమునే నేను కోరుచున్నాను. ఈ జనులు పరమపావనులై యుండువఱకును,

సత్యమైన అర్థము అందఱికిని తెలియువఱకును, అందఱును సత్యజ్ఞానానంద నిత్యపుణ్యమూర్తులను బోధ గలుగువఱకును మరల మరల మానవకోటుల ఆత్మోద్ధార లోకోద్ధార ప్రవృత్తిలో ప్రవర్తించెడు జన్మమునే కోరికగా కలిగియుండువాడు వీడు. బాహ్యదృష్టికి కానుపించు భేదము లన్నియు గుణకర్మములచే కలిగినవేగాని యథార్థముగాదనియు, మనుష్యులకు ఏదైనను ఉచ్చనీచావస్థలుండిన, నుండుచుండిన, నుండబోవుచుండిన జన్మనా లేదనియు, గుణకర్మముల ననుసరించి మాత్రమే దానికి నునికిగలదనియు. అన్ని ప్రాణికోట్లును సుఖమునే కోరుచున్నారనియు, వాటి సుఖమార్గమునకు అడ్డుపోగూడదనియు, పోయినచో మహాపాతకమనియు బోధించెడి జన్మమే కావలయును. ఇదే నాయొక్క ఆశయము. ఇట్లే శ్రీప్రహ్లాద భక్తోత్తముడు కోరియున్నాడు.

> న త్వహం కామయే రాజ్యం న స్వర్గం నాపునర్భవమ్ ।
> కామయే దుఃఖతప్తానాం ప్రాణినా మార్తినాశనమ్ ॥

భగవంతుడా! నేను రాజ్యమునుగాని, రాజ్యసుఖమునుగాని కోరను. స్వర్గాదిసౌఖ్యమునుగాని ఇచ్ఛగింపను. తుట్టతుదకు పునర్జన్మరహితమగు మోక్షమునుగూడ ఆశింపను. మరల దేనిని గోరెదనో తెలిపెద. తాపత్రయదుఃఖములచే తపించెడు ప్రాణికోట్ల దుఃఖశమనమునకు మాత్రమే కోరికగలుగుచున్నది.

నిర్మలాత్మా! సాక్షాజ్జీవన్ముక్తి లభించుట అల్ప స్వల్పకార్యమని తలంపకుడు. అట్టి ఆత్మసాక్షాత్కారస్థితిని స్వల్పమని తలంచెడు వారు, ఆ బ్రహ్మ సాక్షాత్కారమహిమను ఎఱింగినవారుగారు. అట్టి పదవి అనేక జన్మములలో చేసిన తపఃఫలమనియు, బహుజన్మముల అనన్యభక్తితో దైవారాధనచే గలిగిన సాధనమనియు, అనవధికజన్మ సుకృత పుణ్యాపుంజమనియు, సద్గురు కారుణ్యామృత వీక్షణామృతవృష్టి యనియు తలంచువానికి మాత్రమే సిద్ధించును. ఇంత గౌరవబుద్ధి లేనివారు ఈ తత్త్వ మెఱుంగజాలరు. దీనిని సత్యముగా నమ్మువారు ధన్యాత్ములని తలంచుడు. ఆస్తికబుద్ధిని మానకుడు.

**యేన నారాధితో దేవో యస్య నో గుర్వనుగ్రహః ।**
**న వశ్యం హృదయం యస్య తస్య శాన్తిర్న సిద్ధ్యతి ॥**

ఎవండు అనన్యభక్తితో సర్వేశ్వరుని ఆరాధించలేదో, ఎవనికి మహాత్ముడగు గురుని కరుణ గలుగలేదో, యెవనికి మనస్సువశ్యము కాలేదో అట్టివారికి శాంతి గలుగదు.

మిత్రమా! అటువంటి మహత్ పదవియగు మోక్షము నొందినవాడైనను గురుదైవశాస్త్ర తిరస్కార ముండరాదు.

**న ప్రమాదోఽత్ర కర్తవ్యో విదుషా మోక్షమిచ్ఛతా ।**
**ప్రమాదే జృంభతే మాయా సూర్యాపాయే తమో యథా ॥**

మోక్షమును కోరువాడు సమాధినిష్ఠ విషయమై ప్రమాదమొందదగదు. సూర్యుడస్తమింప, చీకటి విజృంభించునట్లు ప్రమాదమునందు మాయ విజృంభించుచున్నది. ఇక నెంత వఱకు బ్రహ్మ నిష్ఠాభ్యాస తీవ్రవైరాగ్యములు ప్రమాదరహితముగ నుండవలసినవో దానిని వినుడు.

**విపరీతార్థ ధీర్యావన్న నిశ్శేషం నివర్తతే ।**
**స్వరూపస్ఫురణం యావన్న ప్రసిద్ధ్యత్యనర్గళమ్ ॥**
**తావత్సమాధిషట్కేన నయేత్కాలం నిరన్తరమ్ ॥**

ఎంతవఱకు ఆత్మస్వరూపముయొక్క విపరీతభావన నిశ్శేషముగ తొలంగదో, ఎంతవఱకు స్వరూపానుభవము నిరర్గళముగా సిద్ధింపదో, అంతవఱకు వారు సమాధులను అభ్యసించుచుండవలయును. అని సర్వవేదాన్త సంగ్రహము.

**సర్వస్తరతు దుర్గాణి సర్వో భద్రాణి పశ్యతు ।**
**సర్వః సద్బుద్ధి మాప్నోతు సర్వః సర్వత్ర నందతు ॥**



# సమత్వము

**సదాశివ సమారంభాం శంకరాచార్య మధ్యమామ్ ।**
**అస్మదాచార్యపర్యంతాం వందే గురు పరంపరామ్ ॥**

స్తుతినిందలలో సమత్వ మెట్లు సిద్ధింపగలదను విషయమై సంగ్రహముగా వ్రాయుట సముచితమే గాక అనేకులకు చాల ఉపయోగముగా నుండునని తలంచెద. ముఖ్యముగా ముముక్షువులకే గాక ముక్తులకుగూడ ఇది గొప్ప ఉపయోగకరము. అనేక భక్తులు అప్పుడప్పుడు దీనినిగురించి ప్రస్తావించుటగూడ కలదు. ఈద్వంద్వములలోనుండి ముక్తి నొందినివారు విముక్తులు కాజాలరు. అంతేగాక మనః ప్రశాంతి నొందరు. ద్వైతప్రపంచము మాయము గాదు. కరుణ గలుగదు. ఆనంద మనుభవింపను సమర్థులు గారు. కావున ఈ క్రింద వివరించు విషయములలో ఎవరెవరికి ఎద్దియెద్ది మనస్సున పట్టునో వారు దానిని ఆధారవంగు నావగా గైకొని ద్వంద్వప్రవాహ దుఃఖభవసాగరమును దాటి నిత్యసుఖమోక్షము నొందవచ్చును.

1. ఈ శరీరము వచ్చినది ప్రారబ్ధానుభవముకొఱకు గదా! అపుడు మాతృగర్భమున ప్రవేశించిన సమయమునుండి శరీరపతనము వఱకు వచ్చెడు సుఖదుఃఖాది ద్వంద్వము లన్నియు ప్రారబ్ధానుసారముగనే జరుగును. అది అనుభవించే తీరవలయును. తనయొక్క నీడను నిలబెట్టి పోవుటకు ఎవరికిని సాధ్యము కానట్లు కర్మముల విడిచి పెట్టుట సాధ్యము కాదు. ఈ సంకల్పము దృఢముగా గలవారిని దూషణభూషణాది ద్వంద్వములు బాధింపవు. అంతేగాక ప్రారబ్ధమనుభవించుటలో జ్ఞాని ఆనందభరితుడై యుండును. దానిని నివర్తించుటకు కొంచెమైనను ప్రయత్నింపడు. ఏలన ఈ ప్రారబ్ధక్షయముతో జీవన్ముక్తి కలుగును గదా యని కలిగెడు ఆనందోత్కర్షముచే ప్రశాంతచిత్తుడై వర్తించును. మరియు దేహేంద్రియాది సుఖదుఃఖములు అజ్ఞానదశయందే స్ఫురించును. రాత్రికాలమందు గదా దీప, నక్షత్ర, చంద్రాదులు ప్రకాశించును! అవి సూర్యోదయమైన వెంటనే అగపడనట్లు జ్ఞానభాస్కరోదయమున అవి

ఏమియు గోచరింపవు. కనుక ప్రారబ్ధముకొరకే శరీరము వచ్చినది. అది అనుభవించియే తీరవలయునని దృఢసంకల్పముండిన దేహ, ఇంద్రియ, మనస్సులు మొదలైన వానికి సంబంధించిన యిచ్ఛాద్వేష ద్వైత మేమియు ప్రకాశింపదు. మరియు ఒక చిన్నరహస్యముచే దూషణ భూషణముల నుంచి విముక్తి నొందవచ్చును. ఏలన ఈశ్వర సృష్టి యందు వ్యర్థమైన పదార్థమేమియు నుండదు. దూషించుటలోగూడ ఏదో ప్రయోజన ముండునని నిజమైన భక్తుడు తలంచును. ఏలన దైవసృష్టిలో వ్యర్థముండరాదు గదా!

2. ఇక చాలక్రింద మెట్టునుండి మనఃసమాధానము కలిగే లాగున చెప్పెద. ''పరిహాసం పాపనాశనం'' అని పెద్దలు చెప్పుదురు. అనగా ఎవరు ఎవరిని పరిహసించుదురో, వారి పాపము పరిహసించు వారు భాగించుకొను చున్నారు. కనుక పరిహసింపబడువాడు తన పాపములను వీరు భాగించు కొనుచున్నారని తలంచి సంతుష్టాంతఃకరణుడై యుండవచ్చును, ఎట్లన ఒకడు ఋణస్థుడై పరాధీనుడై బాధనొందునపుడు అతని మిత్రులందరు వారివారి శక్త్యనుసారముగా కలసి అప్పు తీర్చి పరబంధమునుండి విముక్తి చేయునట్లు పరిహసించువారు పరమ మిత్రులని తలంచవలెను. ఇది ఎంత అనుకూలకార్యమో అని విచారింపుడు. ఇక దీనిపైనుండు మార్గమును వినుడు.

3. వారివారి గుణముల ననుసరించియే జీవులు ప్రయత్నింతురు. ఈ రహస్యమును తెలిసికొనిన వాడే జ్ఞాని యనంబడును. ఈ విచారముచే మనస్సునకు నెమ్మది గలుగును. ప్రాణికోట్లు సంగ్రహముగా విభాగించిన, సత్త్వ, రజ, స్తమోగుణములతో గూడి యుండును. ఈ గుణత్రయములోను, మూడు గూఢ అంతర్భావములు గలవు. అవి ప్రస్తుత ప్రస్తావయోగ్య మని తలంపను. మూడుగుణములను ఇచ్చట గ్రహించినచాలును. పనసపండు మొదలగు ఫలములు మధురముగాను, చింతకాయ మున్నగు కొన్ని పులుపుగాను, ముష్టికాయ వంటివి కొన్ని చేదుగా నుండునుగదా! మధుర, ఆమ్ల, కట్వాది గుణములను చూచి ఆ వృక్షములను దూషించెడివాడు ఎట్లు వివేకవంతు డగును? ఈ గుణములు వాటియొక్క నైజములు. ఇది తెలిసికొనక వాటితో

పోట్లాడువాడు వివేకజ్ఞానవంతు డగునా? ఆలాగున ఒక్కొక్కరి వృత్తులు అనగా వారు చెప్పు మాటలు, తిను ఆహారము, చేయు పని చూచుకొని వారువారు ఆయాగుణములతో గూడి యున్నవారని తెలిసికొనిన విశ్రాంతి నొంద వచ్చును. ఇది నిండా లాభకరము గదా! లేక మామిడికాయలు లేతకాలమున చేదు వగరుగాను, మధ్యకాలమున పులుపుగాను పరిపక్వకాలమున తీపుగా నుండునట్లు ప్రాణికోట్లు ప్రథమమున, తమోగుణము నుండి రజోగుణములోనికిని, దానినుండి సత్త్వగుణములోనికిని క్రమముగా పరిణామ ము నొందుచుండును. కావున ఒక్కొక్కరి అవస్థ చూచి వారు పలానిగుణములో నున్నారని గ్రహించుకొనవలయును. ఆ వృత్తి ననుసరించి వారు ప్రవర్తించుచుందురు. ఈ విచారణమున గూడ శాంతి నొందవచ్చును. మరియు సత్కార్మ నిష్ఠులను నిందించుటవలన, నిందింపబడు వారి యిహపర భారములను తగ్గించు చున్నారు. పరమునకు భారమగు కర్మమును, ఇహములో బ్రహ్మనిష్ఠాదులకు జనబాహుళ్యముచే గలిగెడు బాధయును తగ్గిపోవును గదా! ఏలన నిందితవచనములను వినునపుడు సంపూర్ణ విశ్వాసభక్తియు, యథార్థతత్త్వమును తెలియనివారు, దగ్గరకు ఎక్కువ చేరరు గదా! ఇది సమాధినిష్ఠకు ఎంత లాభకరమో యోచింపుడు. శ్రేయః కాంక్షు లెవ్వరును సత్పురుషుల నిందించు పాపవచనముల వినుటకు శ్రద్ధ జూపకుడు. నిందించువానిని అనుకరింపకుడు. ఏల మీరును వ్యర్థముగా ఆపావన పురుష నిందలో చేరినవారై దురితము నొంద కోరుచున్నారు? భగవంతుడు నన్ను నిందించువారినైన క్షమింతునే గాని నా భక్తులను నిందించువారిని శిక్షింపక మాననని ప్రతిజ్ఞ చేసి యున్నాడు. మరియు

> **కర్తా కారయితాచైవ ప్రేరకశ్చానుమోదకః ।**
> **పుణ్యకార్యే పాపకార్యే చత్వారః ఫలభాగినః ॥**

చేయువానికిని, చేయించువానికిని, ప్రేరేపించువానికిని, అనుమోదించువానికిని, పుణ్యకార్యమైనను పాపకార్యమైనను సమానఫలమని శాస్త్రసిద్ధాంతము. దూషించువాడు ఒక్కరిని దూషించుట తనలోగల ఒక గొప్ప దోషమని నేటికి గాకున్న రేపటికైన తెలిసికొను అవస్థ వచ్చును. అప్పుడు

రాహువుచే విముక్తినొందిన చంద్రునివలె ప్రకాశించును.

4. ఈ నాల్గవ విషయములో ప్రశాంతముగా యోచించిన చాలమట్టుకు నిర్మలత్వము నొందవచ్చును. దూషించెడువారు లేనిచో చాలప్రమాదమునకు కారణముండును. తనయొక్క దోషము తనకు తెలియుట ప్రయాసము. మీ నేత్రములచే దృశ్యప్రపంచమంతయు చూచుచున్నారు. అన్ని రంగులును కనుగొనుచున్నారు. మీనేత్రము ఎరుపో, నలుపో, తెలుపో యని మీకు తెలియదుగదా! ఆలాగున సామాన్యజనులకు ఇతరుల దోషగుణములను విమర్శించెడు బుద్ధియే యుండునుగాని వారు తమయందు గల దోషమును చూడరు. వీరు పశుప్రాయులు. వీరిని మార్జాల పయఃపానరీతిలో గణించుదురు. అనగా పిల్లి దొంగవృత్తితో పాలుత్రాగునపుడు, నేత్రములు మూసికొనియే యుండును. పాపము దాని విచారమేమన కన్నులు మూయునపుడు చీకటి యగుటచే ఎవరును చూడరనియే తలంపు. అనగా అందరికిని చీకటిగానుండునని దాని భావము. అయ్యో! ఇది యెంత పొరబాటో యోచింపుడు. తనలోగల దోషమును గనుగొన ప్రయత్నింపక యితరుల దోషములను వివరింపబూనువాడు పర్వతోపరిభాగమునుండి జలము క్రిందికిపడునట్లు తన యున్నతస్థితినుండి పతితుడగుచున్నాడు. ఎవడు తనలోగల దోషమును పరిశీలించుటకై అంతర దృష్టిలో ప్రవేశించునో, అతడు ఏలాగున నది వేగముగా ప్రవహించి సముద్రములో నైక్యమొందునో, ఆలాగున ఆత్మయందు ఐక్యమొందుచున్నాడు. అనగా ఈశ్వరసన్నిధిని ప్రవేశించుచున్నాడు. ఆత్మను దర్శించుచున్నాడు. ఇది సత్యమని మరువకుడు.

**యథా సునిపుణ స్సమ్యక్ పరదోషేక్షణే రతః ।**
**తథా చే న్నిపుణస్స్వేషు కో న ముచ్యేత బంధనాత్ ? ॥**

ఏలాగున పరులదోషములను వెదకుటకు నేర్పు గలవాడై సదా ప్రయత్నించునో, అదేరీతిగా తనలోగల దోషములను పరిశీలించి నివృత్తి చేయుటకై యెవడు ప్రయత్నించునో, అటువంటివాడు బంధనమునుండి అతిశీఘ్రముగా విముక్తుడగును. మరియు ఒకడు దూషించునపుడు తనలోగల

దోషమును గనుగొని దానినుండి నివృత్తినొందుటకు అవకాశము దొరకినది గదా! వారు చెప్పక పోయిన మన ఆత్మోన్నతికి హానికరము గదా? కనుక మనలో గల తప్పిదమును తిలకించెడువారు మనకు గురువనియే తలంచవలయును. దోషము నుండి తొలగించువారుగదా గురువులు! ఒకవేళ వారు చెప్పెడి దోషము మనలో లేనిచో మన యదార్థస్థితిని వారికి తెలియలేదని నెమ్మదిగా నుండవచ్చును. ఒక భిక్షువు సంతృప్తిగా భుజించి ఏకాంతమున విశ్రమించుచుండగా, యథార్థము తెలియని కొందరు అయ్యో, ఈసాధువు ఆకలితో నున్నాడని చెప్పుకొనిన ఆ తృప్తాత్మ యేమి తలంచును? మన యొక్క స్థితిని వీరు తెలియక చెప్పుచున్నారనియు, వివేకము లేదనియు, తలంచి తూష్ణీంభావముతో నుండునుగదా! ఇదిన్ని మీకు మంచి యోచనయే.

5. ఈ ఐదవమార్గమునగూడ జితేంద్రియుడై విచారించెనేని నిశ్చలత్వమునకు ఏలాటి సంశయము లేదు. సుఖము, దుఃఖము, స్తుతి, నింద, మాన అవమానాదిద్వంద్వములలో సమభావన గల వాడే గదా జ్ఞాని యనంబడును, కనుక స్తుతినిందలలో సమత్వము గలుగు చున్నదా ? లేదా ? అని విచారణచే మనస్సును త్రిప్పుకొనవచ్చును. అట్లు నిందించువారు లేనిచో, మనకు సమత్వము గలిగినదా? లేదా? యని తెలియుటకు మార్గము లేదు గదా! కావున, తనలో గల దోషములను సవరణచేయ తలంచువారికి దూషణము భూషణమే యగును. పరీక్ష యొక్కటి లేనిచో పాఠములనుండి యెట్లు ఉత్తీర్ణుడగును? మిత్రులారా! మనల నందరును స్తోత్రముచేయు విషయములో చాలా అపాయమునకు అవకాశము కాగలదు. ఏలన, అజాగ్రత్తపడుటయే గాక, ప్రమాదమునకు మెండు మార్గముండును. నిందించునపుడు ఏ పని చేయునప్పుడును చాల జాగ్రత్తతో ప్రయత్నించును. ఇది గొప్ప అనుగ్రహము గదా!

6. ఈ క్రింద వివరించు సంగతులలో మనసును ప్రవేశపెట్టిన స్తుతి నిందలలో ఏకత్వమొందవచ్చును. అది యెట్లన ప్రపంచము ద్వైతముతో కూడినది గనుక దీనిని గురించి చింతింపం బనిలేదు. పగలు, రాత్రి, సూర్యుడు,

చంద్రుడు, పురుషుడు, స్త్రీ, వర్షము, ఎండ, మధురము, చేదు, సుగంధము, దుర్గంధము, తెలుపు నలుపు, అగ్ని, జలము, దేవతలు, అసురులు మొదలైనవి అన్నియు ఆకర్షణవికర్షణములవలె ఒక్కొక్క దానికి విరుద్ధధర్మములతో గూడియున్నవి. కనుక నిది ప్రకృతిధర్మము. వీటికి పరమైన పరమాత్మకు వీటితో సంబంధములేదు గదా! సూర్యుడు సమస్తమైన మంచిచెడు వస్తువులలో ప్రతిబింబించినను ఆ దోషములు సూర్యునియందెట్లుండవో ఆలాగున ఇవి యన్నియు, దేహ, ఇంద్రియ, మనస్సులు మొదలైనవాటి ధర్మములేగాని, వీటికి సాక్షియై ఆత్మయగు తన కంటదుగదా! అని చింతించిన యీద్వంద్వబాధనుండి తప్పించుకొన వచ్చును. ఇంకను దీర్ఘముగ విచారించిన దూషణము లేనివారు ఎవరున్నారు? ఎవరును లేరనుట. సాక్షాత్ పరమశివుని కొందరు మతభ్రాంతులైన వీరవైష్ణవులును, అదేరీతిగ శ్రీమన్నారాయణ మూర్తిని విభ్రమముగల కొందరు వీరశైవులును దూషించుచున్నారు. మతాచార్యులను చూచిన యిక చెప్పం బనిలేదు. ఎన్నియో యుద్ధములు, హత్యలు, కలహములు మతవిషయమై జరుగుచునే యున్నవి. కాపిలమతమును జైనులును, జైనమతమును బౌద్ధులును, బౌద్ధమతమును భాస్కరభట్టాచార్యులును, కర్మకాండ ప్రవర్తకు లగు భట్టమతస్థులను శ్రీశంకరులును, శాంకరమతమును శ్రీరామానుజులును, శ్రీరామానుజ విశిష్టాద్వైతమతమును వేదాంత దేశికులును, వీరందరిని మధ్వాచార్యులును, శ్రీమధ్వద్వైతము మొదలుగా గల అన్నిటిని దయానందుని ఆర్యమతమును, రాజారామ మోహనరాయ్ బ్రహ్మసమాజమును నిందించుచున్నవి. ఆలాగుననే క్రైస్తవ, మహమ్మదీయ, జోరాష్ట్ర మతములకు పరస్పరదూషణాదులు జరుగుచునే యున్నవి. పైచెప్పిన యన్నిటిలోను అవాంతర భేదము లెన్నియో గలవు గాని వారందరును సామాన్యపురుషులుగారు గదా! అపారదైవశక్తి గలవారే! వీరి అనుయాయులును అల్పస్వల్పులా? కారు. మహామేధాసంపత్తి గలవారలే. వారందరును నిజమార్గము తెలియనివారని అనవచ్చునా? కూడదు వారి మార్గానువర్తులు ఆత్మశాంతిని పొందక పోయినారా? లేదు. వారందరును ముక్తాత్ములే. ఇట్లుండగా నిచ్చట విచారింపతగినదేమన మనస్సే ప్రధానమనియు, ఈ మనస్సుయొక్క

ఉపశమనమే వాసిష్ఠము రీతిగా ముక్తి యనియు గ్రహించవలయును.

**మనఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయో : ।**
**చిత్తే చలతి సంసారో నిశ్చలే మోక్ష ఉచ్యతే ॥**

అని శ్రీవసిష్ఠభగవంతుని వచనము. పై చెప్పిన మతములన్నియు, దృశ్య దృష్టితోను, వ్యష్టిబుద్ధితోను చూచువారికి భిన్నముగా తోచినను, దృక్ దృష్టితోను సమష్టి బుద్ధితోను చూడ శక్తిగలవానికి ఏకమ్మై కనబడును. వృక్షముయొక్క మొదలు ఒకటిగా కనబడినను, శాఖోపశాఖలు అనేకములుగా కానుపించినను భిన్నముగానట్లు ఆత్మయందు ఏకత్వము గనుగొనవచ్చును. ఆలాగున, నదీనదములు, వేరువేరు పేర్లతోను, భిన్న భిన్న మార్గములతోను ప్రవహించినను ప్రాప్యస్థానమగు సముద్ర మొక్కటియై యుండునట్లు అందరియొక్క మనస్సు లయించిన తరువాత లేక మనసు నశించిన తరువాత లేక జీవేశ్వరుల ఉపాధి తొలగిన తరువాత ఐక్యమును గనుగొని ఆనందింప వచ్చును.

**యథా తోయ ప్రవాహోనాం సముద్రః పరమావధిః ।**
**తథైవ సర్వమార్గాణాం సాక్షాన్నిష్ఠా మహేశ్వరః ॥**

**ఆకాశాత్పతితం తోయం యథా గచ్ఛతి సాగరమ్ ।**
**సర్వదేవ నమస్కారః కేశవం ప్రతి గచ్ఛతి ॥**

దీనియొక్క విచారణచేత ప్రజ్ఞావంతులు సంతసించెద రని తలంచి ఈ ఆరవవిచారణ ముగించెద.

**సుహృన్మిత్రార్యుదాసీన మధ్యస్థ ద్వేష్య బన్ధుషు ।**
**సాధుష్వపి చ పాపేషు సమబుద్ధి ర్విశిష్యతే ॥**

సుహృత్తనగా ప్రత్యుపకారమును కోరక ఉపకారము చేయువాడు. మిత్రుడనగా స్నేహముగలవాడు. ప్రత్యుపకారమును కోరి ఉపకారము చేయువాడు. ఉదాసీనుడు ఎవ్వని పక్షము జేరనివాడు. మధ్యస్థుడనగా విరోధముగల యుభయులకు హితమును గోరువాడు. ద్వేష్యుడనగా తనకు

అనిష్టకార్యము చేయువాడు. బంధువు అనగా చుట్టము, సాధువు అనగా బ్రహ్మనిష్ఠుడు, పాపుడనగా నిషిద్ధకార్యములు చేయువాడు. సమబుద్ధి యనగా కర్తయెవ్వడు? కర్మమేది? అని విమర్శించి బుద్ధిని ప్రసరింపజేయనివాడు; ఇట్టిగుణముగలవాడు ద్వంద్వమైన స్తుతినిందాది ప్రపంచమునుండి విముక్తుడగు చున్నాడు. అనగా ఇవి అన్నియు వృత్తులే గాని నిత్యశుద్ధమైన ఆత్మయం దివి యుండవు. ఆత్మయందు రమించువాడు జ్ఞానియు, అనాత్మయందు రమించువాడు అజ్ఞాని యనియు గ్రహింపుడు అని భగవద్గీత ఆరవ అధ్యాయము.

''తత్ర కో మోహః కః శోక ఏకత్వ మనుపశ్యతః?'' అను ఈశావాస్యోపనిషత్తు రీతిగా ఒకటే ఆత్మ సర్వజీవరాసులలో నుండగా ఎవరిని ద్వేషించును, ఎవరిని ప్రేమించును? శోకమోహములకు అవకాశమెక్కడిది? ''ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః'' అంతటను ఒకటే బ్రహ్మమును లేక ఆత్మను లేక ఈశ్వరుని దర్శించుటయేగదా యోగదృష్టి. మరియు అద్దములో గనుపించు తనయొక్క ముఖము మంచిదిగా గాని చెడ్డదిగా గాని యుండిన హర్షశోకాదులు ఎట్లు పొందరో ఆలాగున అన్నిఆత్మలలో తనను, తనయందు అన్ని ఆత్మలను దర్శించునప్పుడు గదా ఏకాత్మదర్శనము సిద్ధించును. దూషణ భూషణములలో భిన్నత్వము స్ఫురించిన యింకను ఐక్యము గలుగలేదని తలంచి యేకత్వమునొందుటకు ప్రయత్నించవలెను. మరియు మీకు కరుణ గలిగిన లేక మీరు ప్రేమస్వరూపులైనచో ఒకరిపై ద్వేషము గలుగదు. ఎట్లన, ఒకనికి ఇద్దరు భార్యలుండిరని గ్రహింపుడు. వీరిలో ఒక్కరియందు అమితప్రీతి యుండిన ఆమె యెన్ని తప్పులు చేసినను వాని కది దోషముగా గనుపించదు. ప్రేమకు దూరము అయిన రెండవభార్య చేయునవి యన్నియు తప్పులుగానే గనుపించును గదా! లేక అతిప్రేమ భాజనమైన చిన్నబిడ్డ యెన్ని తప్పిదములు చేసినను కరుణగల తల్లికి అవియన్నియు ఆనందమయమై కనుపించును. అదేరీతిగా కొన్ని వనమూలికలను నమలిన తరువాత ఏ వస్తువు తినినను మధురముగానే యుండును. జ్వరాదిరోగముచే జిహ్వ అరుచినొందిన వారికి

రుచికరపదార్థములుగూడ చేదుగా గనుపించునుగదా! ఆలాగున జ్ఞాని అయినవారికంతయు ఆనందమయమై కనుపించును. అజ్ఞాని అయినవానికి మంచి గూడ చెరుపుగా గనబడును. ఇంతేగాక మన సోదరులలో ఒక్కడు చెడుకార్యములుచేసి దుర్దశను పొందునపుడు అయ్యో మనసోదరుడు చెడిపోవుచున్నాడని ఏలాగున జాలి గలుగునో, ఆలాగున మీరు కరుణామూర్తులైన నిందించు వారిని జూచి అయ్యో యితడు సాధుమూర్తులను దూషించి అధః పతితుడగుచున్నాడే అని దయగలిగి పరితాపపడుదురు. కాబట్టి అంతయు బ్రహ్మమైగానుపించుటకు ప్రయత్నించువారు ద్వంద్వాతీత నిర్వాణపదమునొంది నిత్యసుఖస్వరూపు లగుదురు. ఇక దీనికి సంబంధించిన శ్లోకములు ఈ క్రింద వివరించెద.

దహ్యమానా స్సుతీవ్రేణ నీచాః పరయశో ఽగ్నినా ।
అశక్తాస్తత్పదం గంతుం తతో నిందాం ప్రకుర్వతే ॥

నీచస్వభావముగలవారు ఇతరుల యశస్సను అగ్నికి గుఱియై ఓర్వజాలక మండిపడుచుందురు. ఏలన వారు అనుభవించు వైభవము మనకు దొరక లేదని తలంచి పెక్కువిధములుగా దూషించుచుందురు.

దుర్జన స్సుజనం ద్వేష్టి ధార్మికం చాప్యధార్మికః ।
రూపవంతమరూపో ఽపి దుర్బలో బలవత్తరమ్ ॥

అకర్మీ కర్మిణం ద్వేష్టి ధనవంతం చ నిర్ధనః ।
నిర్గుణో గుణవంతం చ తే తస్య కలిలక్షణమ్ ॥

దుర్జనుడు సజ్జనుని, అధర్మపరుడు ధార్మికుని, కురూపుడు రూపవంతుని, బలహీనుడు బలవంతుని, స్వభావముగ దూషించుచుందురు. ఇది కలిమహిమయే గాని వేరు గాదు. అదేవిధముగా దుష్కర్మము చేయువాడు సత్కర్మపరుని, దరిద్రుడు ధనవంతుని, గుణహీనుడు సుగుణసంపన్నుని నిందించుచుండును. ఇదే కలియొక్క లక్షణమని తెలియందగినది. అనగా కల్మషపురుషుల స్వభావమని గ్రహించవలయును.

**దాతను జూచి లోభి పరతత్త్వవిదుఁ గని మూర్ఖుడుఁ, శివ**
**ప్రీతుని జూచి నాస్తికుడుఁ, బేరువహించు పతివ్రతైన యా।**
**నాతిని జూచి జారిణియు, నక్క పులిం గని వాతవేసికొ**
**న్రీతిని నోర్వఁజాలడు మరేమి వచింపుదు పుత్రరత్నమా॥**

మరియు నింకను ముక్తాత్ముడు తనకు గలుగు స్తుతినిందాది ద్వంద్వములను ప్రారబ్ధమని తలంచి వాని నివృత్తికి ప్రయత్నింపడు. ప్రయత్నించినను నిలువదు. ఒకవేళ నిలుపజూచినను ఆగామియై పరిణమించి పునర్జన్మమునకు కారణమగు నని అతనికి బాగుగా తెలియును.

జ్ఞానోదయా త్పురారబ్ధం కర్మ జ్ఞానాన్న నశ్యతి।
అదత్వా స్వఫలం లక్ష్య ముద్దిశ్యోత్సృష్టబాణవత్॥
వ్యాఘ్రబుద్ధ్యా వినిర్ముక్తో బాణః పశ్చాత్తు గోమతౌ।
న తిష్ఠతి భినత్త్యేవ లక్ష్యం వేగేన నిర్భరమ్॥

జ్ఞానోదయమయిన తరువాత గూడ శరీర పతనపర్యంతము ప్రారబ్ధకర్మము నశింపదు. ఏలన లక్ష్యము నుద్దేశించి విడిచిన బాణము ఆగురిని తప్పక భేదించును గదా! ఒకడు రాత్రికాలము వేటాడుటకు జలాశయతీరమున నుండగా ఒక ఆవువచ్చి జలము త్రాగుచున్నది చూచి, పెద్దపులి యని తలంచి బాణమువిడిచిన తరువాత గోవు అని బుద్ధిగలిగి పశ్చాత్తాపపడినను ఆ బాణము నిలువక లక్ష్యమును భేదించునుగాదా! అదేరీతిగా అజ్ఞానదశయందు చేయంబడిన కర్మము ముక్తబాణము వంటిది. అది జ్ఞానోదయమైన తరువాత గూడ దేహవిముక్తి పర్యంతము ఆవరించును. సంచితము, ప్రారబ్ధము, ఆగామి అని కర్మ త్రివిధము. సంచితకర్మము పొదిలోనుండు అంబువంటి దనియు, ప్రారబ్ధము విడిచిపెట్టిన బాణమువంటి దనియు, ఆగామి అనుసంధానము చేసిన శరము వంటిదనియు గ్రహించవలయును. తూణీరమందుండు బాణములు కర్తృత్వము నశించిన ప్రయోజనపడవు. త్యక్తశరము లక్ష్యమును తప్పక భేదిస్తును. అనగా ప్రారబ్ధమును అనుభవించియే తీరవలె ననుట. ఆగామి అను సంధించిన బాణము. ఇష్టముండిన విడువవచ్చును, లేనిచో లక్ష్యము మార్చుకొనవచ్చును. కానిచో విరమింపవచ్చును.

ప్రారబ్ధం భోగతో నశ్యే త్తత్వజ్ఞానేన సంచితమ్ ।
ఆగామి ద్వివిధం ప్రోక్తం తద్ద్వేషి ప్రియవాదినో : ॥

ప్రారబ్ధము అనుభవించియే తీరవలెను. తత్త్వజ్ఞానాగ్ని యందు సంచితము భస్మమగును. ఆగామియగు పుణ్యాపాపకర్మములు వందించువారును, నిందించువారును భాగించుకొనెదరు. అనగా బ్రహ్మ నిష్ఠులయందు విశ్వాస భక్తిగలవారికి పుణ్యము, నిందించువారికి పాపము విభాగింపబడును. కనుకనే సత్పురుషులనెప్పటికిని నిందింపరాదని భావము. ''సాధుబాధా కులక్షయం'' అని శాస్త్రకర్తల మతము. ఇంక సంపూర్ణ విరక్తుని లక్షణము దెలిపెద.

అజిహ్వాష్షండకః పంగు రంధో బధిర ఏవ చ ।
ముగ్ధశ్చ ముచ్యతే భిక్షు ష్షడ్భిరేతైర్న సజ్జ తే ॥

అజిహ్వుడు అనగా జిహ్వ యుండియు లేనివాడు అనగా రుచి అరుచులచే చలింపనివాడు, మితభాషియని భావము. షండుడు పురుషత్వ ముండియు లేనివాడు అనగా ఎటువంటి దుర్విషయోద్వేగ బుద్ధిగల స్త్రీలతో కూడియుండియు వికారము నొందనివాడు. పంగువు అనగా కాలుండియు లేనివాడు, అనగా వ్యర్థముగా తిరుగక ఒకే స్థలములో నుండి బ్రహ్మనిష్ఠ చేయువాడు, అంధుడు నేత్రము లుండియు లేనివాడు, అనగా తనదృష్టిలో ద్వంద్వము స్ఫురింపక అన్నిటిలోను ఒకే బ్రహ్మమును లేక ఆత్మను లేక ఈశ్వరుని చూడ గలిగినవాడు. ఇదే దివ్యదృష్టి అనబడును. బధిరుడు చెవియుండియు చెవిటివాడు అనగా దూషణభూషణాదులచేతను శృంగారాది సంతోషవచనములచేతను దుఃఖకరమగు వాచకములచేత చలింపని వాడు. ముగ్ధుడు అనగా జడప్రాయుడు అనగా శరీరేంద్రియములు అన్నియు అచేతనము లనియు, వీటికి ఏలాటి వృత్తులు లేవనియు, ఆత్మ యొకటియే చేతన మనియు, ఆ స్వరూపమే తాననియు బోధగలవాడు. ఆహా! ఎంత మహత్పదవి చూడుడు. ఇట్టి అవస్థ మనకు గలిగినదా? లేదా అని విచారించుట గదా శ్రవణ మనన నిది ధ్యాసనములయొక్క ఫలితము! పైనిచెప్పిన ఆఱింద్రియములచేత సంబంధించని వాడు భిక్షుడనియు ముక్తుడనియు భావము. ఇంక స్థితప్రజ్ఞుని లక్షణము

శ్రీభగవద్గీత ద్వితీయ అధ్యాయమందును గుణత్రయాతీతుని లక్షణము చతుర్దశాధ్యాయమందును గనందగును. ఉపనిషత్తంతయు ఈ తత్త్వమునే బోధించుచున్నది. గ్రహించ దలచిన వారికింతయే చాలునని విరమించెద. నిప్పును వృద్ధిచేయుటకు ఇచ్ఛగలవారికి కొంచెము దొరకిన చాలును. అట్లు చేయనివారికి పదితట్టల నిప్పిచ్చినను అది బొగ్గైబూడిదై పోవును గదా! ముముక్షువులారా! లార్డు గౌరంగ్ అనగా శ్రీకృష్ణచైతన్యులు భక్తుల కుపదేశించిన రెండువచనములను ఇచట నుదాహరించెద. మోక్షద్వారమునకు రెండు తలుపులనియు ఆత్మస్తుతి, పరనిందలచే అది గట్టిగ మూయబడు ననియు, ఇవి మానుటయే ఆ ద్వారము తెరచు ఉపాయమనియు బోధించిరి.

ఇక ఒక రహస్య వచనము చెప్పెద. ఒక కర్షకుడు తన భూమిలో ఆవాలు చల్లుచుండెను. ఒక పాంథుడు అది ఏమని అడుగగ నూవులు అని చెప్పెను. ఏవి దానిలో ఫలించును. నూవులు ఫలించవు గదా! అంతేగాక ఆవాలు మొలకలెత్తు పర్యంతము కర్షకునిమాట నిలుచును. తరువాత ప్రకృతి వ్యక్తియగు శక్తిని అతడు నిలుపగలుగునా? ఆలాగున మీ హృదయము ఒక భూమివంటి దనియు, మీ సంకల్పములన్నియు దానిలో పెట్టు విత్తనముల వంటివనియు మఱువకుడు. ఆ ఫలితము మీరు తప్పక అనుభవించియే తీరవలెను. నడచునప్పుడు నీడను నిలిపి పోవలేనట్లు మీ సంకల్పమూలమును మీరు త్యజించి పోజాలరు. మనస్సును, వాక్కును, కాయమును ఏకము చేయుటయే గొప్ప తపస్సనియు, యోగ మనియు, వేదాంతవిచారణ యనియు మఱువకుడు. కనుకనే పెద్ద లిట్లనిరి.

మనస్యన్యత్ వచస్యన్యత్ కర్మణ్యన్యత్ దురాత్మనః ।<br>
మనస్యేకం వచస్యేకం కర్మణ్యేకం మహాత్మనః ॥

8. ఈ ఎనిమిదవ విచారణతో దీనిని ముగింతును. ఈ అవస్థలో ప్రవేశించినవారిని ద్వంద్వాదిశోక మోహములు పొందవు. ''బుద్బుదా ఇవ వారిణి'' సముద్రములో గలిగిన అలలు బుగ్గలు, జల బిందువులు మొదలైనవి సముద్రమున కన్యముకానట్లు ఈ దృశ్య దేహాది జగత్తంతము ఆత్మకు అన్యము

గాదు. ఈ అవస్థ నొందుటయే విదేహముక్తి యని గ్రహింపుడు. పుష్పఫల పల్లవశాఖోపశాఖాదులచే భిన్నమై కానుపించినను విచారించిన వృక్షము ఒకటై యుండునట్లు ఇదంతయు ఆత్మకు అన్యము కాదు.

దృశ్యం నాస్తీతి బోధేన మనసో దృశ్యమార్జనమ్ ।
సంపన్నం చేత్తదుత్పన్నం పరా నిర్వాణ నిర్వృతిరిః ॥

దృశ్యము లేదని బోధగలిగి మనసునుండి దృశ్యము గలదను వాసనను తుడిచివేసెనేని తర్వాత కలిగెడు అనంత అనందావస్థయే సర్వోత్కృష్ట నిర్వాణ మనియు, నిర్వృతి యగు ముక్తి యనియు శ్రీవసిష్ఠ భగవంతు డుపదేశించెను.

ఆత్మస్వరూపులగు మిత్రులారా! మీకు మనసు ప్రశాంతమై ప్రసన్నమై యుండవలెనని తలంచితిరేని ఒక చిన్న ఉపాయము చెప్పెద. కొంచెము బుద్ధికి స్వచ్ఛత గలవారికి దీనిని అభ్యసించు రోజుననే ఫలితము గానుపించును. అంత సూక్ష్మత లేనివారికి మూడు మాసముల లోపల తప్పక ఫలము గానుపించును. ఈ అభ్యాసము చెప్పునప్పుడు పెక్కండ్రకు హాస్యముగా గానుపించును. అయినను ఇది ముమ్మాటికి సత్యము. 1. మొట్టమొదట ఆహారనియమ మేర్పరచుకొనుట అనగా నియమిత సమయమున తప్ప ఇతర సమయమున ఏ వస్తువు తినకుండుట. కఠినమై వచ్చిన దాహము మాత్రము త్రాగ వచ్చును. ఆహారనియమము గలవారికి ఇంద్రియ సంయమము తప్పక సిద్ధించును. 2. ఆహారము భుజించునప్పుడు చాల సావధానముగాను, ప్రశాంతముగాను, ప్రసన్నబుద్ధితోను, నిశ్చల భావముతో భుజించి శీలించుట. దైవచింతన యుండిన మిగుల విశేషఫల మిచ్చును. ఈ ఆహారపదార్థము మీ శరీరములో ప్రవేశించి మిమ్ముల ఆనందమయులుగా చేయునటుల తలంపవలయును. ఆ ఆహారము చాల శుద్ధమనియు, మీకు నిర్విషయస్థితిని గలుగు జేయుచుండు ననియు, అది అమృతసమాన మనియు భావించుట. 3. మరల మీకు విశ్రాంతి దొరకునప్పుడు డంతయు ఏకాంతస్థలమున కూర్చుండి మీరు ఆనందస్వరూపు లనియు జ్ఞానస్వరూపు లనియు, అమృతస్వరూపు లనియు, మీకు అన్యముగా ఈ జగత్తు లేదనియు, దృఢమగునట్లు భావనచేయుటయే మీ ఆనందము

కలుగుటకు కారణము. ఉపనిషత్తులన్నియు దీనినే ప్రతిపాదించుచున్నవి.

బ్రహ్మార్పణం బ్రహ్మహవిర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్ ।
బ్రహ్మైవ తేన గన్తవ్యం బ్రహ్మకర్మ సమాధినా ॥

అర్పణం = అనగా హోమసాధనము, బ్రహ్మైవ = బ్రహ్మమే, హవిః = హవిస్సు, ( అన్నము, నెయ్యి మొదలైనవి) బ్రహ్మైవ = బ్రహ్మమే, బ్రహ్మాగ్నౌ= బ్రహ్మస్వరూపమైన అగ్నియందు, బ్రహ్మణా = యజ్ఞకర్తయైన బ్రహ్మముచే, హుతం = చేయంబడినహోమము, బ్రహ్మైవ = బ్రహ్మమే, బ్రహ్మకర్మసమాధినా= బ్రహ్మమైన (ఈయజ్ఞ) కర్మమునందు స్థిరమైన మనసుతో గూడిన, తేన = వానిచేత, గన్తవ్యం = పొంద బడునదియు, బ్రహ్మైవ = బ్రహ్మమే అని భగవద్గీత అధ్యాయము.4. శ్లో. 24. ఈశ్లోకము ఉపనిషత్ మంత్రములో గలదు. ఈమంత్రమును ధ్యానించి సన్న్యాసులును, బ్రహ్మనిష్ఠులును భోజనము చేయుదురు.

ఇది పైనుదాహరించిన అనుష్ఠానమునకు చేరినదని జ్ఞప్తిలో నుంచుడు. ఇక పరమరహస్య మొక్క దానిని తెలిపి యిది పూర్తి చేసెదను. అదేమన? ఏ వస్తువైనను వృద్ధినొందుటకు ద్వంద్వ ముండే తీరవలయును. ఎల్లప్పుడున్ను పగలుగా నుండిన ఒక్క ప్రాణి యైన జీవింపజాలదు. ఆలాగున రాత్రిగా నుండినను ఒక్క తృణముగూడ బ్రతుకదు. అదేరీతిగా ఎల్లప్పుడు వర్షాకాలమైన ఒక్క కసువుగూడ పుట్టదు. అట్లే యెల్లప్పుడు ఎండాకాలమైన ఒక్క జీవిగూడ జీవింపదు. ఇవి ద్వంద్వముగా నుండుట చేతనే ప్రపంచము వృద్ధినొందు చుండును. ఆలాగున స్తుతినిందలు మానావమానములు మొదలగు ద్వంద్వములుండిన మాత్రమే మనము వృద్ధినొందగలగుదుము. ఆలాగున నెల్లప్పుడుష్ణకాలమును, లేక యెల్లప్పుడును శీతకాలమును ఉండినను ఒక్క ప్రాణియైన బ్రతుకజాలదు గనుక ద్వంద్వత పరమోపకారము. ఇది దైవ ఆజ్ఞగా మున్నది. పూర్ణజ్ఞానము ఈ ద్వంద్వమున కావల గలదు. ఇది సత్యమని నమ్ముడు.



# వివాహసువిచారము

(శ్రీమలయాళస్వాములవారితో, గృహస్థభక్తు డొకడు వివాహకార్యమును గుఱించి, అడిగినప్పుడు వారికి స్వాములవారు బోధించిన సంగతులలో, ముఖ్యవిషయము ఈ క్రింద ముద్రితము.)

ఓ పరిశుద్ధాత్ములగు ప్రియమైన సోదరీ సోదరులారా! మనమందరమును తెలిసిగాని, తెలియకగాని, యిహపరసుఖమునే కోరుచున్నాము. అట్టి సుఖము ఏ మార్గమున బ్రవర్తించిన లభించునో అని విచారించుట కర్తవ్యము గదా? దానికి ధర్మమే ఆధారమని శ్రుతి చేతను, పెద్దల వాక్యముచేతను వినవచ్చు చున్నది. అట్టి పునీతమగు ధర్మమున నడుగుపెట్టుడు. ''యద్యదా చరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో జనః'' అను గీతాశాస్త్రము ననుసరించి శ్రేష్ఠులైనవారు అనగా, విద్యచేతగాని, ధనముచేతగాని గుణముచేతగాని, ప్రసిద్ధిగలవారు ఎవరు కలరో, వారి ఆచరణయే ఇతరులు ఆచరించుదురని భావము. ఇప్పుడు విస్తరించి చెప్పబూనక అది సంగ్రహముగా జెప్పెద. వివాహాది పుణ్యకార్యములలో నీక్రింద వివరించు ఐదు విషయములను గ్రహించి ఇట్టి పవిత్రాశయ ప్రకారమున వర్తించుట మనకు శ్రేయస్కరము.

(1) వివాహాది పుణ్యకార్యములలో అపరిష్కృతులై వివేకశూన్యులై యుండెడు కాలములో వర్తించి వచ్చెడి జీవహింసాది ఆహారములను బొత్తిగా మానుట.

(2) కల్యాణ మంగళకార్యములలో అనేక స్త్రీ పురుషులు చేరుచుందురు. అట్టి పుణ్యసమయమున స్త్రీలకు పాతివ్రత్యమహిమయు పురుషులకు బ్రహ్మచర్య, ఏకపత్నీవ్రత శ్రేష్ఠత్వము బోధించు కాలములో వ్యభిచార కృత్యమును దెలుపునదియు, పరమనీచులచే అంగీకరింపబడు నదియునగు వేశ్యాకుల నటననాట్యమును స్వప్నేపి స్మరింపకుండుట.

(3) మితిమీఱిన ఆభరణవస్త్రాదులలో మునిగి ఉన్మత్తులై పోవక సాధ్యమైనంతవఱకు తగ్గించుటకు చూచుట. కన్యాశుల్కముగాని వరశుల్కము

గాని తీసికొనుట చాల నీచకృత్యమని శాస్త్రము చెప్పుచున్నది. శాస్త్రములో నమ్మకము లేనివారు నాస్తికులుగారా! కన్యాశుల్కాది దారుణ రాక్షసకృత్యముచే, వివాహము జరుగక యెందరో మంచిజ్ఞానముగల సోదరీమణులు పరితాపము నొందుచున్నారు. మరికొందరు ఆత్మహత్యగూడ చేసికొనుచున్నారు. మరి కొందరు కులమునుండి పతితులగుచున్నారు. ఇట్టి మహాపాపము లన్నిటికిని కన్యాశుల్క వరశుల్కములే కారణములు. ఇవి శాస్త్రములో చాల నిందితములు.

(4) వ్యర్థమగు అల్పసుఖమునకు ఎక్కువ వ్యయముచేయు మేళ, తాళములు, పూలపందిరి మొదలైన డంబాచారములను మానుటయు, ఆలాగున ఎక్కువ వెలపట్టెడు భోజనపదార్థముల చేయక యుండుటయు మీకు మంగళకరము.

(5) కొందరు భూమికి భారముగా జన్మించిన వారలు పెండ్లి మొదలగు కార్యములు 5,6,7,9,11,15 రోజులు అధిక వైభవముగా అప్పుచేసి యైనను జరుపుదురు. అట్టి మూఢవిశ్వాసమును సంపూర్ణముగా మాని ఒక్కరోజుగాని, యెక్కువైనచో రెండురోజులలోగాని పూర్తిచేయుడు.

ఇక వివాహసౌఖ్యమును గోరుదంపతులు, ఈ క్రిందచెప్పబోవు విషయములలో ఇలలో జాగరూకులై వర్తించినచో ఇహపర సౌఖ్యములను నిశ్చయముగ పొందుదురు. అదేమన, శరీర చర్మపు ఎఱుపు వర్ణమును చూడగూడదు. శరీరము నల్లగనుండినను లోపలదెల్లగనుండిన జాలును. అనగా, దేహము ఎఱుపుగానుండినను లోపల నల్లనివర్ణమగు తమోగుణ ముండిన ఎంతసుందరులైనను దుఃఖమే గలుగును. అట్లుగాక, హృదయము ప్రశాంతమై తెలుపువర్ణమనెడు సత్త్వగుణము గలిగియుండిన సౌఖ్యము తప్పక సిద్ధించును. అదేరీతిగా, భయోత్పాతమగు ఆభరణములు నఖాగ్రమునుండి శిఖాగ్రము వరకు నుండినను అంతరాత్మకు ఉండవలసిన సత్య శాంత దయా భక్తి మొదలగు దివ్యాభరణములు లేనివారు ముల్లోకములలో దూషితులగుదురేగాని భూషితులు గాజాలరు. ''కిం భూషణా ద్భూషణమస్తి శీలం'' అని శ్రీజగద్గురు శంకరభగవత్పాదాచార్యులు మణిరత్నమాలయం దానతిచ్చిరి. పైనిచెప్పిన

ఐదువిషయములలో వ్యర్థమగు కర్చుచేయు ధనముచే ఒక్కరోజుగాని, రెండు రోజులుగాని, మూడు రోజులుగాని దారిద్ర్యవ్యాధిచే పరితపించెడు బీదసాధువులకు కడుపు నిండ అన్నము పెట్టుడు. ఇకను శక్తియుండిన మానసంరక్షణమునకైనను వస్త్రములేక క్లేశము నొందువారికి ఒక్కొక్క మోటువస్త్రమును ఇండు. ఉదారబుద్ధియుండిన ధర్మకార్యములు జరుగు స్థలములకు శక్త్యనుసారముగా కొంచెము కొంచెము ధనము పంపుడు. ఇట్లు జీవించు బుద్ధి భారతీయులకెప్పుడు గలుగునో అప్పుడు మాత్రమే వీరు దుఃఖబాధనుండి తొలగుదురు. పరబంధమునుండి విముక్తులగుదురు. ఇహపరసుఖమును పొందుటకు శక్తులగుదురు. ఇది సత్యము.

పాతివ్రత్య ఏకపత్నీవ్రతముల మహిమ ఇతర గ్రంథముల ద్వారా మీరు తెలిసికొనవచ్చును.

శ్రుతం సత్యం తపశ్శీలం విజ్ఞానం విత్త మున్నతిమ్ ।
ఇంధనీకురుతే మూఢః ప్రవిశ్య వనితానలమ్ ॥

వివేకశూన్యుడు వేదాంతశ్రవణము, సత్యము, తపస్సు, సుశీలము, విజ్ఞానము, విత్తము, గౌరవపదవి మొదలుగాగల పవిత్ర గుణము లన్నియును నిప్పుకట్టెలను ల్చివేయునట్లు వేశ్యాలయమను అగ్నిని ప్రాపించి బూడిదగా కాల్చివేయుచున్నాడు అనగా పైచెప్పిన సుగుణము లన్నియు, పరస్త్రీ ప్రవేశము గలవారికి నష్టమై యిహమునకును పరమునకును ఉపయోగకర మగు దేహ ధనములు నశించువారై, దుఃఖితు లగుదురు.

**ధర్మ్యం యశస్య మాయుష్యం లోకద్వయ రసాయనమ్ ।**
**అనుమోదామహే బ్రహ్మచర్య మేకాంత నిర్మలమ్ ॥**

అతిపావనమై ధర్మము లన్నిటిలోను ముఖ్యమైన బ్రహ్మచర్య మెట్టిదనగా, ధర్మఅర్థకామమోక్షము లనెడు చతుర్విధ పురుషార్థములకు కారణమైనదియు, అత్యంతమైన యశస్స్వరూపముగా గలదియు, పూర్ణాయుస్సు నిచ్చునదియు, ఇహపరలోకములకు దివ్యరసాయనము వంటిదియు బ్రహ్మచర్యమని మఱవకుడు. ఓహో! మనుష్యులు ఎంత

వివేకశూన్యులై పోయిరి. అప్పుచేసియైనను అభరణములు చేసికొని ద్రవ్యమును తీసికొని వివాహకార్యముచేయుటలో సంతోషము గలవారై యున్నారు. పాపము భవిష్యత్తున వీరి యొక్క జీవితయాత్ర సుఖముగా జరిగెడు విచారము కొంచమైన చేయుటలేదు. నగలకును, కట్నమునకును, అప్పుచేసిన ఋణమును తీర్చుకొనజాలక వడ్డీ పెరిగి పెరిగి యెందరో దుఃఖజీవు లగుచున్నారు. ఇది కొంచెమైనను యోచించుట లేదు. కేవలము మాయామోహములో మునుగుచున్నారు. ఇది పరమాశ్చర్యము. దీనివల్ల యెన్నియో కుటుంబములు దివాలై పోయినవి, విజ్ఞులు ఈ విషయములో లోకము నుద్ధరింపక పోయినచో లోకము చాలా దుఃఖసాగరములో మునిగిపోవును.



# విజ్ఞాపనము

ఓ అధ్యాత్మజ్ఞానాసక్తులగు ప్రియమైన సోదరీ సోదరులారా! కరుణానిధి యగు సర్వేశ్వరుని కారుణ్యామృతవృష్టిచే సమస్త జీవరాసుల పాపబుద్ధియను దోషాగ్ని శమించి నిర్మలహృదయులగుదురు గాక! ఈ ఆంధ్రదేశములో అనేక మాసపత్రికలు, పక్షపత్రికలు, వారపత్రికలు, దినపత్రికలు ప్రచారములో నుండినను, అధ్యాత్మవిషయము కొన్నిపత్రికలయందు అప్పుడప్పుడు ప్రకటింపబడు చుండినను ఇంకను చాలా కొరతగానున్నది . ఆ.కొరతను పూర్తిచేయుటకు జిజ్ఞాసులగు అంధ్రసోదరీ సోదరుల తోడ్పాటుతో ''యథార్థభారతి'' అను పేర నొక మాసపత్రిక నడుప తలచితిని. ఆంధ్రసోదరీ సోదరు లందరు రాజకీయ సాంఘికవిషయములలో నున్నతస్థానమును అలంకరించిన విషయము లోకవిదితము. పత్రికలలోను పూర్తిగ వీటినే ప్రతిపాదించుట కనబడుచున్నది. భౌతికజ్ఞానములో అద్వితీయపదవి నధిష్ఠించినవాడైనను, ఆత్మజ్ఞానామృతమును గ్రోలనిచో, అంత్యకాలముననైనను అతడు నిశ్చయముగా క్లేశమునకు లోపడక మానడు. ఈ ఆత్మజ్ఞానామృత మొకటి యుండుటచేతనే భారతీయులు ఇప్పుడును సజీవులుగా నున్నారు. లేనిచో నాగరిక ప్రపంచ ప్రవాహ వేగము చేతను, మతమతాంతర

ప్రకంపనతాడనముచేతను, నిశ్చయముగా అడుగంటినవారలే యగుదురు. ఈ సత్యము విశాలహృదయుల కందరికిని విదితమే. హైందవుడగువాడు భౌతికవిద్యలోను, ధనము లోను, అగ్రగణ్యుడైనను అధ్యాత్మ జ్ఞానరహితుడైనచో, పశుత్వమునకన్న అధికస్థితిని పొందడనియే ఋషులు తలంతురు. కారణమేమన, పూర్వీకులగు ఋషిశ్రేష్ఠుల పరంపరలో జన్మించియు, ఆ మునిపుంగవులు అనుభవించిన ప్రపంచాతీతజ్ఞానసుఖమును పొందక పోవుటయే పూర్వీకులు ప్రపంచము మరుమరీచికాసదృశ మని చక్కగ గ్రహించిరి. ఎండమావులలో జలము కలదని పరిభ్రమించి పరుగెత్తెడి పశువులు పిపాసాబాధితములై చచ్చునేగాని దాహనివృత్తి నొంది సుఖింపవుగదా! ఆలాగున శ్రేష్ఠమైన మానవజన్మమెత్తి భ్రమప్రాయమగు ప్రాపంచిక విషయములలో యావత్ కాలము గడపిన వాడు ఏగతి నొందగలడు? ఇట్లు చెప్పుటచే ప్రాపంచిక విద్యలను బొత్తిగ విడనాడు డని నా యుద్దేశము కాదు. ప్రపంచ సుఖమునకన్న ఆత్మ సుఖము మరియొకటి గలదని, మరువకుండిన చాలును. దానియందు మాత్రమే శోకశాంతి గలదు. ఇటువంటి అమృతమే మన ఋషీశ్వరులు చిరకాల ప్రయత్నముచే సంపాదించి మన కిచ్చిన అక్షయధనము.

ఈ విషయమై ప్రసిద్ధులగు కొందఱు పత్రికాధిపతులకు కొన్ని సంవత్సరముల క్రిందటనే తెలిపియుంటిని. వారు దానిని గురించి ప్రయత్నపూర్వకముగ పనిచేయకుండినందున చాలా చింతించు చుంటిని. ఆకొరత నివృత్తిచేయుటకు దైవకృపచే నిప్పుడు కాలమాసన్నమైనది. ఆంధ్రసోదరులును, సోదరీమణులును దీనియందు ఆసక్తి గలవార్లలై అభివృద్ధికి దెచ్చెదరని నమ్మెద. లోకములో జీవయాత్ర సుఖముగనెరపుటకు మతవిషయక జ్ఞానమంత యావశ్యకము గాదనియు, విషయసుఖ సాధనములగు కళలను మాత్రము అభివృద్ధినొందింపవలయుననియు కొందరు తలంచుచున్నారు. అట్టివారి విచారము యథార్థ మగునా? కాదా? అని వ్యక్తపడుటకై యీక్రింది విషయము తెలుపుచున్నాను. జగత్తునకును, దేవునకును, జీవునకును గల సంబంధములను, వీటియం దొండొంటి స్వరూపమును నిర్ణయించి జీవితపరమార్థమును, తత్సాధనములను నిర్ణయించునదే మతము. ఈ

విషయమును గురించిన జిజ్ఞాస మానవజన్మ మెత్తిన ప్రతిజీవునకు మనస్సునందు సహజముగా పొడముచునే యున్నది. మృగములు ఆకలి గొన్నప్పుడు ఆహారము భుజించుచు, దప్పిగొన్నప్పుడు నీరుద్రావుచు తృప్తి నొందగలవు గాని మనుజు డట్లు చేయజాలడు. నానావిధ జంతు సంఘాత సంకులమై, నానాతరులతాగుల్మశోభితమై, అగాధ విశాలసాగర పరివృతమై, అత్యున్నత పర్వతపంక్తి విరాజమాన మగు ఈ జగత్తు ఎట్లు ఉత్పత్తి అయినది? ఎప్పుడు? ఎవ్వడు దీనికర్త? దీని కడపటి పరిణామమేమి? మనుష్య జీవితమునకు ప్రయోజనమేమి? దానిని పొందుటకు సాధనము లెవ్వి? యని విచిత్రమును రమణీయము నగు ప్రాసాదమునుగాంచి, యాశ్చర్య నిమగ్నమానసుడగు పాంథునివలె మనుజుడు దానిని గురించి విచారింపక పోజాలడు, కాని, యిట గమనింపదగిన యంశమొక్కటి యున్నది. కొందరి యందు ఈ జగత్తును గురించిన జిజ్ఞాస తీవ్రరూపము దాల్పక సులభముగ లభించిన సమాధానములచే తృప్తినొంది శాంతిల్లుచున్నది. మరికొందరియందీ జిజ్ఞాస పొడచూపినను, వారు లౌకికవిషయవ్యావృత్త చిత్తులగుటచే ఫలవంతముగాక, నిరంతరాతృప్తి హేతుకమై యుండును. మరికొందరీ పై జెప్పిన సమస్యలకు స్థూలబుద్ధులగు ప్రాకృతులు పరంపరాగతముగా విశ్వసించు సిద్ధాంతములనే సమాధానములుగా జేకొని, తాత్కాలికముగ తృప్తి నొందుచున్నారు. జీవితము సుఖముగ జరిగిపోవునంతవరకు, విషయ సుఖైకతత్పరులై తల్లి యెంత పిలిచినను చెవిని బడవేసికొనక, క్రీడాసక్త చిత్తులగు పిల్లలవలె పరువిడుచుందురు గాని లౌకికభోగములు ముగియునప్పటికి, పారమార్థిక చింత పొడసూపక మానదు. పూర్వోక్తమగు స్వాభావిక జిజ్ఞాసను యథార్థజ్ఞానముచే తృప్తిపరచినచో లోక మెంతయో యానందదాయకమై యుండును. తనకును లోకమునకును, ఈశ్వరునకును ఎట్టి సంబంధము వాస్తవముగా గలదని మనుజుడు ఎంచునో, దానిని బట్టియే యాతని జీవితచర్యావిధానము మంచిగనో, చెడుగనో యుండును. గమ్యస్థాన మెద్ది యనియు, తత్ప్రాపక మార్గ మెద్ది యనియు నెరుంగక కనబడినదారులలో నెల్ల

పరిభ్రమించు తెరువరివలె మానుష పరమపురుషార్థమును గురించియు, తత్సాధనములను గురించియు, దృఢమగు జ్ఞానము లేని నరుడు తనజీవనయాత్రను సార్థకముగ నడుపజాలడు. జీవయాత్ర సులభముగను ప్రయోజనవంతముగను నెరపి జనన మరణ పరంపరారూప సంసారబంధము నుండి విముక్తి బడయుటకు మన ప్రాచీన మహర్షులుత్తమ మగు మార్గమును గనిపెట్టి దానిని గురించి జ్ఞానమును, శ్రుతిస్మృతుల రూపకముగా మనకు ప్రసాదించియున్నారు. పూర్వార్జితమై పరంపరాగతమగు నిట్టిమహాభాగ్య మగు విజ్ఞానమును మన మెంతవఱకు బొందజాలక యుందుమో అంతవఱకు మన మకృతకృత్యులమే యగుదుము. కావున మనము సాధ్యమయినంత సులభమైన రీతిని సంసారసాగరసంతరణమునకు సాధనశ్రేష్ఠములని యెన్నబడుచు వేదప్రతిపాదితము లగు నీతి భక్తిజ్ఞాన వైరాగ్యముల గూర్చి, తెలిసినంత లోకమునకు బోధించుట కర్తవ్యము. ప్రపంచమున అజ్ఞానముకంటె విపరీత జ్ఞానమే అత్యంతానర్థక హేతు వగుచున్నది. మనుష్యజాతిలో ఒండొంటికి నిదివరకు గలిగి, యిప్పుడు గలుగుచున్న మనస్తాపములకును, కలహములకును, పరస్పర హింసలకును, మతవిషయక విపరీతజ్ఞానమే కారణమని విచారశీలురగు సూక్ష్మబుద్ధులకు తోచక మానదు. అద్వితీయుడై, సర్వశక్తియుతుడై జ్ఞానానందమయుడగు, భగవంతునకు ఒక్కొక్క జాతివారు ఒకొక్క నామమును, రూపమును, కల్పించి అవియే యథార్థము లనియు నితరులు కల్పించినట్టివి అసత్యము లనియు నమ్మటే గదా! శైవులకును, వైష్ణవులకును, క్రైస్తవ మహమ్మదీయులకును. కల్గు స్నేహేతర భావములకు మూలకారణము. కావుననే జనులయందు వ్యాపించిన విపరీత జ్ఞానమును పరిహరించుటకును, సర్వమత సామరస్యమునకును, అందరును ప్రయత్నించుట మంగళకరము. మతము లన్నిటికిని పరమోద్దేశమందు ఐక్యమున్నది. సాధనవిషయములందు మాత్రము భేదము కొద్దిగ కనుపించినను, నిజముగ అనుష్ఠించిన, అందరును ఒకేస్థానమును జేరుదురు. మత మనగా దుఃఖనివృత్తియు, ఆనంద ప్రాప్తియు గదా. ఇంక, ఏతత్ప్రసంగము జాలించి యీపత్రిక విషయమున గొంత

విచారింతము. దీనికి 'యథార్థభారతి' యని పేరిడితిని. 'ఈ పేరేల పెట్టితిరి?' అని కొంద ఱడుగవచ్చును. కావున నా యభిప్రాయమును వివరించుచున్నాము.

'యథార్థభారతి' అను మాటకు సాధారణముగా, సత్యమైన సరస్వతి యని తాత్పర్యము జెప్పవచ్చును. కాని నాతలంపదికాదు. భారతి శబ్దమున వర్ణములలో నాద్యంతవులు, 'భాతి' యనియు నాదిమధ్యంబులు 'భార' యనియు, మధ్యాంతములు 'రతి' యనియు నగునుగదా! ఇందు 'భాతి' యనుటకు 'కాంతి' యనియు, 'భాతి' యనుటకు 'వెలుగుచుండు నిప్ప' నియు, 'రతి' యనుటకు, 'అనురాగ' మనియును, నర్థము జెప్పవచ్చును. యథార్థమనుటకు, సత్యమనియే యర్థము జేయవలయును ఆలాగైనచో, వరుసగా పై శబ్దములను, సత్యముతో కలిపినపుడు సత్యమైన కాంతియనియు, సత్యమై వెలుగుచుండు వహ్ని యనియు, సత్యమైన యనురాగమనియు జెప్పవచ్చును. ఏదిసత్యమైనదో యది పరమాత్ముడనియు, ఆ పరమాత్మ స్వరూపమే భాతియనియు లేక నిజమైన వెలుగు అనియుం జెప్పవచ్చును. రెండవది అసత్యమైన ప్రకృతిని దహింపచేసి, సత్యమైన పరమాత్మను వెలుగురూపమున గనబడజేయునది యని యర్థము. ఇందున ఇంధనప్రాయమైన మాయను దహింపచేయుట లేక పోగొట్టుటలో వహ్నిత్వమును, సత్యమైన తేజమును దెలుపుటచే మాయారహిత శుద్ధపరబ్రహ్మద్యోతకత్వమును నేర్పడుచున్నది. ఇంక రతి యన్ననో, పైని జెప్పిన రీతిగా తెలియదగిన పరమాత్మ వెలుంగుటకు సత్యమైన యనగా సుస్థిరమైన యనురాగము అనగా ప్రీతిగలిగి యుండుట లేక మనస్సును పరమాత్మయందు రమింపజేయుట అనగా లయింపజేయుటయని తాత్పర్యము. ఇట్లు వ్యాఖ్యానము జేసినచో, యథార్థభారతి అనగా సత్యమైన తేజస్స్వరూపమై యొప్పు పరమాత్మయందు మనస్సును లయింపజేయు నదియని యేర్పడుచున్నది. మూలప్రకృతి యైన యసత్యమును బోగొట్టి, స్థిరమై సత్యమైన తేజము అనగా పరమాత్మ యందు చిత్తమును నిలుపునట్లు చేయునది యని నిశ్చయింపబడినది. దీనివల్లనే, యధ్యాత్మతత్త్వప్రబోధకమైన

యీ పత్రికకు, 'యథార్థ భారతి' అను నామకరణము గావించితిని. ఈ నామము పాఠకులకు తృప్తికరముగా నుండునని తలంచుచున్నాను. దీని యభిధానమును గురించి యెంత యైనను వ్యాఖ్యనము జేయవచ్చును. కాని యది చదువరులకు విసుగు గలిగించు నట్లుండు నని విరమించితిని.

ఓమ్ తత్ సత్.

(శ్రీవ్యాసాశ్రమ మనెడి కాశీబుగ్గ తీర్థతీరస్థులైన శ్రీశ్రీశ్రీ మలయాళస్వాములవారు అక్షయనామ సంవత్సర భాద్రపద బహుళ 10లు శుక్రవారము పాలచ్చూరు గ్రామమున నూతనముగా నేర్పఱుప బడియుండు సనాతన ధర్మపరిపాలన సేవాసమాజమును గురించి యొసంగిన యుపన్యాసమున ప్రధానభాగము.)

ఓమ్ నమో బ్రహ్మాదిభ్యో బ్రహ్మవిద్యా సంప్రదాయ కర్తృభ్యో వంశ ఋషిభ్యో మహద్భ్యో నమో గురుభ్యః.

ఓ పరిశుద్ధ జ్ఞానమే స్వరూపముగాగల ప్రియమైన సోదరీ సోదరులారా! వందనములు. విశాలము విశుద్ధము నగు హృదయముగల మహాశయులారా! నమస్కారములు, శ్రీసనాతన ధర్మపరిపాలన సేవాసమాజముయొక్క జన్మతిథి శ్రీఅక్షయనామ సంవత్సర భాద్రపద పూర్ణిమ పుణ్యదినమున శ్రీవ్యాసాశ్రమమున నడుపబడి నేటికి పదిరోజులైనవి. పదియవ దినము జననాదిసూతకము లన్నియు నివృత్తియై మంగళకార్యములు మొదలైన యుత్సవాదులు జరిపెడి పుణ్యదినము. ఈ దివ్యసభలో మహానుభావులగు అనేక పుణ్యపురుషులును, చారిత్రశుద్ధియు, అపారకరుణయు, ఆత్మబోధము గల అనేక నారీమణులును సాన్నిధ్యమునొంది యున్నారు. ఇట్టి మహాత్ముల దర్శనమున కన్న పుణ్యము మరియొకటి యుండునా? ఈ ఆంధ్రదేశములో అనేక సభలుండినను, మహానుభావులై, బ్రహ్మనిష్ఠ లగు సాధువుల సమాజము దుర్లభము. ఈలాటి సాధుసంఘములు సమాజములు ఉత్తర హిందూస్థానములోను దక్షిణ, అరవ, కేరళకర్ణాటక దేశములలోను మెండుగా గలవు. కనుకనే ఆ ప్రదేశములు జ్ఞానాభివృద్ధియు, సాధుమఠములు,

అన్నసత్రములు, సంస్కృత పాఠశాలలు గలిగియున్నవి. ఈ విషయము మీ కందరికిని విదితము. భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంసావతార కల్పవృక్ష ఫలములచే దేశదేశములలో ఎన్నియో సేవాసంఘములు అభివృద్ధినొంది యున్నవి. దీనిని గురించి మీరును కని వినియు నుందురు. ఆంధ్రదేశము ఇంత విశాలమైనదియు, ధర్మగుణములతో గూడినదై దయార్ద్రహృదయులగు జనులచే నిండినదై యుండియు, లోకసేవాపర మగు సాధుసంఘమొకటి లేకపోవుట కొరతగదా! ఇట్లున్నందున తెలుగు దేశములో లోకసేవాసంఘము లేదని తలంపరాదు. దివ్యజ్ఞాన సంఘమువారును, ఇతర సమాజములును, బందరు, రాజమహేంద్రవరము, ఏలూరు మొదలగుకొన్ని స్థలములలో లోకోద్ధారము కొఱకు పనిచేయుచున్న విషయము వార్తాపత్రికల ద్వారా మనము వినుచున్నాము. కనుక మనమును శక్తివంచనలేక లోకసేవచేయుటయు, ఆత్మవిముక్తి నొందుటయు, బద్ధులైన జీవుల విముక్తికొఱకు మనసా కర్మణా వాచా ప్రవర్తించుటయు కర్తవ్యంబు. మహాత్ములందరు ఈశ్వరసేవ కన్న లోకసేవ మహత్తర మనివారి జీవితదశలో అనుష్ఠించి చూపియున్నారు. ఇప్పుడును చూపుచున్నారు. ఈ దివ్య సభయొక్క ముఖ్యవిషయములు మూడు.

1. (1) సత్యము నన్వేషించుట, అనగా సత్యస్వరూపుడగు సర్వేశ్వరుని లేక ఆత్మను వెదకుట,(2) సత్యమును బోధించుట. (3) సత్యము ననుష్ఠించుట.

2. (1) ధర్మమును వెదకుట, (2) ధర్మము ననుష్ఠించుట, (3) ధర్మమును బోధించుట.

3. (1) దుఃఖకారణమును కనుగొనుట, (2) దుఃఖమునుండి తరించుట, (3) దుఃఖతరణోపాయ మార్గములను బోధించుట.

ఈ ధర్మత్రయమే, మన సమాజముయొక్క ముఖ్యోద్దేశము. ఈ విషయమై, ఏ ఏ కార్యములు మన మనుష్ఠించ వలసినదో, అవి ధర్మకోవిదు లగు మీరందరు తీర్మానించుటకు కోరెద.



# శ్రీబుద్ధ పురాణము

బాల్యకాలమునందె భవమును నిరసించి
వ్యామోహతతి నెడ బాసె నెవడు
సంసార మది యెల్ల సారహీనం బని
సన్న్యాసధర్మంబు జరిపె నెవడు
భోగభాగ్యములు మిథ్యాగతంబు లటంచు
వేదాంతపథమున వెలసె నెవడు
భువి నాత్మవత్సర్వ భూతాని యనువాక్య-
సార్థకంబుగ జేయ జాలె నెవడు ॥

అట్టి ధర్మైకనిరతు డత్యమలగుణుడు
భూరిసుజ్ఞానమూర్తియౌ బుద్ధదేవు ।
పూతచరితంబు వినరండు పూజ్యులార!
సకల దుఃఖంబు లుడుగు నిస్సంశయముగ ॥

ఈ పావనగ్రంథము నేను కృష్ణామండల గుడివాడ తాలూకా లింగవర గ్రామమున నుండగా నందివాడ గ్రామవాస్తవ్యు లగు శ్రీయుత పూనూరు వెంకారెడ్డిగారిచే అత్యధిక భక్తి శ్రద్ధలచే సమర్పింపబడెను. ఈ పుణ్యగ్రంథము ఆంధ్రజను లందరికి తెలిసే లాగున యథార్థభారతిలో ప్రకటింపవలసినదని వారు తెలిపియుండిరి. గ్రంథము సకల మవలోకన మొనర్చిన తర్వాత ఆంధ్రసోదరీ సోదరులకు తెలుపదలచి యుంటిని. ఇప్పటికి ఈ పుస్తకము పూర్తిగ చూచితిని.

ఇది 1-2-127 పేజీలు గలిగిన పీఠికతోను, 1086 పుటలుగల శ్రీబుద్ధదేవుని జీవితచరిత్రతోను గూడిన గొప్పగ్రంథము. ప్రతి ఆంధ్రుడు చదువవలసిన పవిత్రగ్రంథము. దయామయుడగు బుద్ధదేవుని కొందరు ఇతర మతావేశము గలవారు నాస్తికుడనియు, పాషండుడనియు నిందించిన విషయము చాల పాపకర మని దీనిని చదివిన వారికందరికి గోచరింపక మానదు. శ్రీబుద్ధ భగవానులు ఉపనిషత్ ప్రతిపాదక వేదాంతతత్త్వమును అనుష్ఠాన రూపముగ

సాధనచేసి యితరులచే అనుష్ఠింపించి దుఃఖరహితమగు శాశ్వతనిర్వాణమును పొందింపగలిగిరి. బుద్ధ భగవానుని యథార్థాచరణమును చూచుటచే అనుష్ఠానరహితులై వాచావేదాంతమిథ్యాప్రసంగముచేయువారికి అసూయ జనించియుండునట్లు ఈగ్రంథముచే స్పష్టమగును. వాక్కుతో చెప్పి అనుష్ఠానము లేనివారుగదా నిజముగా విచారించిన పాషండు లనియు, నాస్తికు లనియు, మనము తెలిసికోవలసినది. సత్యము చెప్పువారిని అసత్యప్రవర్తకులు నాస్తికులని చెప్పుట ఒక వింతగాదు గదా! పౌరాణికులందరును శ్రీబుద్ధదేవుడు శ్రీమన్నారాయణ నవమావతార మని అంగీకరించియు, ఆయన మతము నాస్తిక మనియు, అంగీకార్యము కాదనియు, తెలుపుటలో ఆశ్చర్యము గలుగుచున్నది. ఈ గ్రంథమును అంగలూరు దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారు పాళీభాషనుండి తెనిగించిరి. అంతేగాక ఇది అనేక మహాశయుల ఆశయములను బహుగ్రంథ పరిశీలనముచే సంగ్రహించిన సారముగా నున్నది. సూక్ష్మతరము లగు జీవుల పరిణామము ననుసరించియే అవతారములు ఏర్పడినవి అనియు, కొందరు సూక్ష్మదృష్టిగలవారు చెప్పుచున్నారు. మొదటిది మత్స్యావతారము. ఈ అవస్థలో ఇంద్రియముల సంపూర్ణతలేని జీవితము. ఇది జలములో మాత్రమే సంచరింపగలుగును. రెండవది కూర్మావతారము. ఇది జలజంతువే అయినను జలస్థలములలో సంచరింపంగల శక్తి గలిగినది. దీనికి కరచరణాదీంద్రియములు మత్స్యమున కన్న వికాసమై యుండును. మూడవది వరాహావతారము. ఇది కూర్మమునకన్న గమనాగమనములకు ఎక్కువ శక్తి గలిగిన యింద్రియములతో గూడినది. నాల్గవది నృసింహావతారము. ఇది యర్ధము మృగత్వము, అర్ధభాగము మనుష్యత్వముతో గూడినది. అయిదవది వామనావతారము. ఇది మనుష్యజన్మముతో గూడినదైనను మరుగుజ్జు రూపముతో గూడిన వామనాకారమై యుండెను. ఈ అవతారమున బ్రహ్మచర్యము మాత్రము అనుష్ఠింపందగియుండెను. ఆరవది పరశురామావతారము. ఇది సంపూర్ణ రజోగుణముతో గూడినదై యుండెను. ఏడవ అవతారము శ్రీరామావతారము. ఇది గృహస్థ ధర్మమును చక్కగా బోధించునదిగాను. కొంతవఱకు సత్త్వగుణాన్వితమై యుండెను. అప్పటికి కరుణామృతవృష్టి కొరకు మేఘమువలె

నుండెను. ఎనిమిదవది శ్రీకృష్ణావతారము. ఇచ్చట కరుణామృతవృష్టి పూర్తిగా వర్షించెను. భేదము చాలవరకు అంతరించెను. భక్తియే ముక్తికి ముఖ్యసాధనమని తెల్లముగ తేటపడునట్లు అనుష్ఠించి చూపబడెను. నవమావతారము శ్రీబుద్ధావతారము. ఇది సంపూర్ణ కరుణావతారము. ''అహింసా పరమో ధర్మః'' అని బోధించిన పుణ్యావతారము. దీనియందు మాత్రమే సన్న్యాసము బోధింప బడెను. నిర్వాణమే దుఃఖరహితమార్గ మని తెలుపబడెను. ఇప్పటికి చిన్నజీవినుండి పూర్ణత్వమునొందెడు సన్న్యాసాశ్రమము పర్యంతము గల జన్మములను గురించి గలిగెడి మార్పులను తెలిసికొనవచ్చును. మనుష్యుడు పూర్ణత్వము నొందునప్పుడు సర్వజీవదయాపరుడై సంయమవ్రతానుష్ఠానపరుడై తనయాత్మ సాక్షాత్కారము పొందుటయే కేవలముక్తి యవస్థ యని మనము తెలిసికోవలసిన ముఖ్యవిషయమై యున్నది. పిన్నవయస్సుగల శ్రీదుగ్గిరాల బలరామకృష్ణయ్యగారు బాల్యావస్థలోనే యింత మహాగ్రంథము ఆంధ్రలోకమునకు రచించి ఆంధ్రుల ఆశీర్వాదములకు పాత్రుడయినందుకు ఎంతయు సంతసించుచున్నారము. దయామయుడగు సర్వేశ్వరుడును లోకోద్ధారకులగు మహర్షులును కరుణతో అనుగ్రహింతురు గాత!



# సంస్కృత విద్య

**మందస్మిత స్ఫురిత ముగ్ధముఖారవిందం**<br>
**కందర్పకోటి శతసుందర దివ్యమూర్తిమ్ ।**<br>
**ఆతామ్రకోమలజటా ఘటితేందు రేఖ**<br>
**మాలోక యే వటతటీనిలయం దయాళుమ్ ॥**

పరిశుద్ధమైన జ్ఞానమును, కరుణయు, శాంతియు, భక్తియు మూర్తీభవించిన ఓ ప్రియమైన సోదరీ సోదరులారా! ''విద్యావిహీనః పశుభి స్సమానః'' అని గదా పుణ్యభూమియగు భారత దేశమందు జన్మించిన ఋషిపుంగవుల దివ్యగానము! ఈ విద్యయను పదమునకు జ్ఞానవే

లక్ష్యార్థమైనను, వాచ్యార్థమునుగూడ గమనించవలసి యుండును. ఈ విషయమై బోధపడేలాగున క్రింద వ్రాయబడును. తత్త్వకోవిదులలో దయామయులైన వారందరును, మనము ఆర్యులమనియు, మన ముఖ్యభాష సంస్కృతమనియు తెలుపుచున్నారు. కావుననే భరతఖండములో ఎన్ని భాషలు గలవో వాటియన్నిటిలోను ఎక్కువ శబ్దములు ఇప్పటికి గూడ సంస్కృతమై యున్నవి. వేరు ఏ భాషలకును పరస్పరమింత ఐక్యము గానుపింపదు. భారతదేశ భాషలలో దేనియందైన స్వచ్ఛముగా మాటలాడినచో, సంస్కృత శబ్దములే ఎక్కువ గానుపించక మానవు. కావున ఇతర భాషలన్నియు దానినుండి గలిగియుండునని నిర్వివాదముగా అంగీకరించవలసి యుండును. పాశ్చాత్యభాషాప్రవీణులలో ముఖ్యుడగు మాక్సుముల్లర్ గూడ ప్రపంచములోగల భాషలన్నిటిలోను, ఆదిభాష సంస్కృతమని అంగీకరించి యున్నారు. ఈ విషయమై అనేక భాషలలో గల ధాత్వర్థములను నిరూపించియున్నారు. అది మన కిచ్చట ప్రతిపాదింప బనిలేదు. భరతఖండవాసుల సామాన్య వచనములుగూడ సంస్కృతమై యున్నవి. ముఖ్యవచనములు చూడుడు. అన్నం, వస్త్రం, జలం, దీపం, గృహం, దేహం, మార్గం, స్త్రీ, పురుషుడు, మృగం, పశువు, పక్షి, భూమి, అగ్ని, వాయువు, ఆకాశం, బాల్యం, యౌవనం, వార్ధక్యం, నేత్రం, పాదం, హస్తం, పుస్తకం, పుష్పం, ఆహారం, దేవాలయం, ఆశ్రమం మొదలుగాగల పదములన్నియు సంస్కృతము జదువని వారుగూడ సామాన్యముగా నుచ్చరించుచున్నారు గదా! దీనివల్ల సంస్కృతమే మనయొక్క మాతృభాషయైయుండవలెను. మరియు మతవిషయగ్రంథము లన్నియు సంస్కృతభాషలో నుండుటచేతను, ఇదే కారణమని యూహించవలసి యున్నది. భాష యెప్పుడు లోపించునో, అప్పుడు మతమును తప్పక కృశించును. మతముయొక్క కృశత్వముతో అధ్యాత్మ జ్ఞానశక్తియు క్షయము నొందును. జ్ఞానక్షయముతో మనుజులు ద్విపాద పశువులై చతుష్పాద పశువులవలె పరాధీనులై తీరుట నిక్కము. కావున స్వరాజ్యకాంక్షగలవారును, స్వారాజ్యముపై అభిలాషగలవారును, మాతృదేవతయగు సంస్కృత భాషను ఉద్ధరింపజూచిన మాత్రమే పైజెప్పిన యుభయలోకములను ఉద్ధరింపగలుగుదురు.

ఏ కారణముచే ఈ భాష సర్వజనులకు విరివిగా అభ్యాసమున లేకపోయినదో తెలియజాలము. హిందూరాజులచేతిలో రాజ్యముండునపుడు ఈ భాషకు ఎక్కువ ఔన్నత్యముండినది. ఐనను సర్వమానవులకు దానియందు అట్టికాలమున ప్రవేశముండెననుటకు సరియైన నిదర్శనమేదియు నిప్పుడు గానుపించుట లేదు. దీనికి కారణము బ్రాహ్మణుల నిరంకుశాధికార దారుణకృత్యమై యుండవలయునని కొందరును, బ్రాహ్మణేతరులు అప్పటికాలములో ఇప్పుడుండు సంస్కారావస్థ పొందక యుండవచ్చునని మరికొందరును చెప్పుచున్నారు. శాస్త్రములలో గుణకర్మముల ననుసరించియే జాతికి నిలకడగలదనియు లేకపోలేదు. మరికొన్ని శాస్త్రములను బట్టి మామూలు వర్ణముల ననుసరించియే జాతి గలదని గూడ వాదించువారు లేకపోలేదు. కాని, ప్రస్తుత సుకృత విశేషముచేత ఇప్పటిమేధాసంపత్తిగల వారందరును గుణకర్మముల ననుసరించియే జాతిగలదని చెప్పుటకై ప్రారంభించిరి. ఇది భారతభూమియొక్క మహాభాగ్యమనియే తలచవలెను.

సోదరులారా! ప్రకృతియొక్క పరమరహస్యము చెప్పెద- ఒక్కరి క్రింద ఇంకొక్కరుండవలెనని తలంపు గలవారు మరియొకరి క్రిందనుండే తీరవలయును. కనుకనే ''యద్భావం తద్భవతి, యా మతిస్సాగతి ర్భవేత్'' అని మహర్షులు వచించిన గూఢరహస్యము. బ్రాహ్మణేతరులు అచ్ఛేద్యమైన కపోలకల్పిత శ్లోకశృంఖలలచే బంధింపబడి యుండిరను విషయము నిర్వివాదాంశమే. అదియెవరో క్షుద్రహృదయులు చేసిన శ్లోకములకు దేవతలయొక్కయు, ఋషిపుంగవుల యొక్కయు పేర్లు పెట్టియుండవచ్చును. ఇట్టి క్లేశరూపము దాల్చియుండు ఘోర ఖడ్గములచే పూర్వరాజులు శూద్రాదులను బాధించి వధించు చుండిరి. ఇదియును సత్యమే. అశోకచక్రవర్తి ఒక్కరుమాత్రమే అట్టి దుష్టకృత్యములగు శ్లోకపంజరములనుండి బయటపడినవారు అయినను ఆ పావనహృదయుని కాలముతో గూడ ఆ స్వాతంత్రలక్ష్మియు అస్తమించెను. అయినను పోయినదానిని గురించి చింతించి, కాలము వ్యయపరచిన ప్రయోజన మిసుమంతయు నుండదు గదా! సత్యస్వరూపుడగు దైవము నిత్యుడై చూచుచున్నాడు. ఆ మహాత్ముని ఆశయమునకు మనుజులు అడ్డుబోవజాలరు.

ఇట్టి దయామయుడగు పరమపురుషుని యిష్టము ప్రాణికోట్ల అభివృద్ధియే యైనచో సత్యము నేటికిగాని, రేపటికిగాని ప్రకాశింపక పోదు. ప్రస్తుత ప్రభుత్వవిధాన మేరీతిగా నుండినను, జనులకు స్వాతంత్ర్యమను మహాపుణ్యా మొకటి హృదయరంజనముగా గానుపించుచున్నది. తక్కిన విషయము లెట్లుండినను ఉండును గాత! ఆ విషయ మిచ్చట ప్రస్తావింప బూనలేదు.

దైవకృపచేతను, పరమపావనులగు ఋషులకృపచేతను, సంస్కృతభాష అందరును అభ్యసించేలాగున స్థాపనము లెన్నియో యిప్పుడు గలవు. ఇంతవరకు బ్రాహ్మణేతరులలో కొందరు బ్రాహ్మణులు మాకు సంస్కృతవిద్య చెప్పలేదనియు, మా పురోగమనమునకు అట్టి భాష అత్యవసరమనియు చెప్పుచుండిరి. ఇప్పుడేల చదువ గూడదు? క్రియాశూన్యవచనములు ఫలములేని పుష్పములరీతిగా వ్యర్థముగదా! ఇప్పుడు బ్రాహ్మణులే' సోదరులారా! సోదరీమణులారా! రండు! సంస్కృతము చదువుకొండు!'. అని కరుణతో పిలుచున్నారే! ఇట్టి తరుణములో ఏల బ్రాహ్మణేతరులు సుషుప్తినుండి లేవకున్నారు. ఇది బ్రాహ్మణుల తప్పా! లేక బ్రాహ్మణేతరుల మాంద్యమా? యని విచారణ చేయుడు. అదేరీతిగా శ్రీవ్యాసభగవంతుని దివ్యనామధేయముతో స్థాపించిన శ్రీవ్యాసాశ్రమము మీ అందరిని పిలుచుచున్నది. ఇచ్చటసంస్కృత పాఠశాల యేర్పాటు చేయంబడి యున్నది అందరును చదువుకొన వచ్చును. ఇంతవరకు మిమ్ములను ''దూరముగా పొండు మీరు అనర్హు'' లని చెప్పులోకమున ఇప్పుడు ప్రేమతో ''రండు రండు మీరు అర్హుల''ను వాణి వీనుల విందుగా వినవచ్చుచున్నది. ఇట్టి పావనకాలమును వ్యర్థపరచకుడు. కాలచక్రము ఒక్కనిమిషమైనను నిలువక ప్రయాణము చేయుచున్నది ఇది యెవరిని లక్ష్యపెట్టునది కాదు. ఉదయము, వెంటనే మధ్యాహ్నము, మరల త్వరలోనే అస్తమయము. దినము, వారము, పక్షము, మాసము, ఋతువు, అయనము, సంవత్సరము దాటుకొనిపోవుచున్నవి. కాలము ఈలాగున పరుగెత్తుకొని పోవుచున్నది. శ్రీ వ్యాసాశ్రమములో ప్రస్తుతము సంస్కృతమును, దీనియందు బుద్ధిప్రవేశము కలిగిన తరువాత ఇంగ్లీషును, తదనంతరము హిందీభాషయును

నేర్పవలెనని విచారము గలదు. అన్నియు విద్యార్థుల ఆగమనము ననుసరించియు, దైవకృపనుబట్టియు జరుగవలసి యుండును. దీనిని గురించి వివరముగా గ్రహింప అభిలాషగలవారు మేనేజరుగారికి వ్రాసి తెలిసికొనవచ్చును. శ్రీవ్యాసాశ్రమము విద్యయను శబ్దముయొక్క యథార్థమును, అక్షరాభ్యాసమను వాక్యము యొక్క లక్ష్యార్థమును బోధించును. దేనియందు అవిద్య లేదో, అదే విద్యయనియు, ఏది క్షరముగాక సత్తు అయియుండునో దానియందు గల అభ్యాసమే అక్షరాభ్యాసమనియు సక్రమముగ బోధించును. విద్యార్థుల కుండవలసిన సత్యము, శాంతము, కరుణ, భక్తి, విరక్తి మొదలైన దైవికగుణములును, లోకసేవయు, గృహస్థాశ్రమమందుండ నిచ్ఛగలవారికి పవిత్రమైన గృహస్థ ధర్మములును బోధింపబడును.

ఇట్టి విద్యాభ్యాసమునకు శాస్త్రపరిచయము అనావశ్యకమని చెప్పువారు కొందరు లేకపోలేదు. అట్లు తలంపరాదు. ఏ సంఘము విద్యా విహీనమైయున్నదో అట్టివారు ధనముతోగూడ తప్పక హీనస్థితి నొందుదురు. ప్రస్తుతము ఏ దేశము విద్యచేత అభివృద్ధినొంది యున్నదో, వారు పూజ్యులై యున్నారు. విద్యలేని సంఘము పశువుల గుంపువలె విద్వాంసులచేత పాలింపబడుట ధ్రువము. ప్రస్తుతము ఏ సంఘమువారు విద్యావిహీనులై యున్నారో, వారు పరుల కధీనులై పడియుండు సంగతి కనులార చూచుచున్నాము గదా! మనకు నీలిమందే కావలసియుండినను నీలిచెట్టు లేనిచో అది లభింపదు గదా! అదేరీతిగా పంచదారయే అనుభవయోగ్యమైనను చెరకు నుండి గదా అది లభించును! అట్లే దేహముయొక్క సౌష్ఠవము లేనిచో దేహియొక్క పూర్ణత్వము దెలియజాలము గదా!

అదేరీతిగా విచారశీలురకు ప్రాకృతవిద్య అలవడిన అప్రాకృతమైన బ్రహ్మవిద్యను త్వరలో అభివృద్ధి చేసికొనవచ్చును. మండుచుండు అగ్నికి వాయు వెంత సహాయమో, అట్లే అధ్యాత్మజ్ఞానాగ్నికిని విద్యావిచారము తోడ్పడును. మరియు అనేక సిద్ధపురుషుల యొక్కయు, మహర్షులయొక్కయు యోగీశ్వరులయొక్కయు, ఆశయము సంస్కృత విద్యయందు ఉండుటచే అట్టి

అమూల్యధనమును అనుభవించుటకు సంస్కృతవిద్య యుండే తీరవలయును.

ఈ విషయమై శ్రీకృష్ణపరమాత్మ ఉత్తరగీతయందు నుడివిన మహావాక్యములను గమనింపుడు--

**నావార్థీ హి భవేత్తావత్ యావత్పారం న గచ్ఛతి ।**
**ఉత్తీర్ణే తు సరిత్పారే నావయా కిం ప్రయోజనమ్ ? ॥**

ఎంతవరకు నదీతీరమును జేరడో, అంతవరకు నదిని దాటుటకై యోడ యుండవలసినది గదా! ఏరు దాటినమీద ఆ నావవలన ప్రయోజనమేమి? ప్రయోజనము లేకపోయినను దానివల్ల దాటిన వాడగుటచేత కృతజ్ఞతయు, అనేకులకు దాటుటకు ఇంకను హేతువగుట చేత దాని సంరక్షణయు కర్తవ్యము గదా!

**గ్రంథ మభ్యస్య మేధావీ జ్ఞానవిజ్ఞానతత్పరః ।**
**పలాలమివ ధాన్యార్థీ త్యజేద్గ్రంథ మశేషతః ॥**

బుద్ధివంతుడైనవాడు వేదాంతాదిశాస్త్రంబుల నభ్యసించి గురుముఖంబుగ విశేషజ్ఞానానుభవంబు నొందినమీద, ధాన్యమును గ్రహించి కర్షకుడు గడ్డిని వదలునట్లు సకలశాస్త్రంబులను వదలవలయును.

**ఉల్కాహస్తో యథా కశ్చిద్ద్రవ్యమాలోక్య తాం త్యజేత్ ।**
**జ్ఞానేన జ్ఞేయ మాలోక్య జ్ఞానం పశ్చాత్పరిత్యజేత్ ॥**

కొరవికట్టె చేతగలవాడు చీకటిలోనుండిన ద్రవ్యమును గనుంగొనిన పిదప నెటుల దానిని వదలునో, ఆవిధంబున జ్ఞానసాధనముచే జ్ఞేయమైన బ్రహ్మ సాక్షాత్కారము గల్గిన పిదప ఆ సాధనమైన శాస్త్రమును వదలవచ్చును. ఇచ్చో శాస్త్రముగూడ వాసనాత్రయములో చేరినదని కొందరు చెప్పుదురు. అది తర్కవ్యాకరణాదిషట్ శాస్త్రములే గాని బ్రహ్మవిద్యయగు వేదాంతశాస్త్రము గాదు. ఏలన వేదాంతశాస్త్రము నిర్వాసనస్థితిని బోధించున దగుటచేత పై జెప్పిన శాస్త్రవాసనలతో జేరినది గాదు. ఐనను ముముక్షువులు ఒక్కరహస్యమును మనసులోనుంచి శాస్త్రము చదువవలెను. లేనిచో శ్రమయే

మిగులును. ఆవిషయమై శ్రీకృష్ణదేవుడే సెలవిచ్చి యున్నారు.

**అదీత్య చతురో వేదాన్ ధర్మశాస్త్రాణ్యనేకశః ।**
**బ్రహ్మతత్త్వం న జానాతి దర్వీ పాకరసం యథా ॥**

నాల్గువేదముల జదివినను సమస్త ధర్మశాస్త్రములను చూచినను, బ్రహ్మతత్త్వమును ప్రార్థించి తెలిసికొనక పోయినచో అనేక పక్వాన్నాదులలో తిరిగెడు గరిటె, వాని రుచులు ఎట్లు తెలిసికొనచాలదో, అట్లు వీడును ఆ గరిటెకు సమానమే.

**యథా ఖరశ్చందనభారవాహీ భారస్య వేత్తా న తు చన్దనస్య ।**
**తథైవ శాస్త్రాణి బహూన్యధీత్య సారం న జానన్ ఖరవద్వహేత్సః ॥**

మంచిచందనము, అత్తరు, కుంకుమ, కస్తూరి, గోరోజనాది సుగంధద్రవ్యములను మోయు గార్దభంబు దాని పరిమళ మెరుంగనటుల సకల వేదశాస్త్రములు చదివియును, తత్సారాంశమగు పరమవస్తువు నెరుంగక పోయినయెడల వాడును గార్దభమువంటి వాడేయగును.

ఇక ఒక విషయము విద్యార్థులు జ్ఞప్తిలోనుంచి వర్తింపవలసిన దత్యవసరము. అదేమన మీలో కొందరు సంస్కృతము గ్రహించదగిన మేధాసంపత్తి లేదని తలంచవచ్చును. అట్టి తలంపు పనిలేదు. శ్రద్ధయుండిన ఏ విద్యయైనను, సులభముగా లభించును. కమ్మరపనివారు గాని, బంగారుపనివారు గాని బొగ్గులో కొంచెము నిప్పు వేసి ఊదగా ఊదగా ఆ బొగ్గంతయు నిప్పుగా మారునట్లు సాధనచేయగ చేయగ మేధాశక్తి వికసించును.

**ఆస్థాసాస్థే యది స్యాతాం మేధయా కిం ప్రయోజనమ్ ?**
**తే ఉభే యది న స్యాతాం మేధయా కిం ప్రయోజనమ్ ?**

మంచి ఆసక్తి స్థిరముగా గలవానికి మేధాశక్తి లేనప్పటికిని గొప్పశక్తి కలుగును. గొప్ప మేధాశక్తి యుండియు దృఢమైన శ్రద్ధ లేనిచో నేలాటి యుపయోగ ముండదు. ఈవిషయమై శ్రీకృష్ణపరమాత్మ గీతయందు బోధించినది చూడుడు-

శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పర స్సంయ తేంద్రియః ।
జ్ఞానం లబ్ధ్వా పరాం శాన్తి మచిరేణాధిగచ్ఛతి ॥

శ్రద్ధయు, జ్ఞానాపేక్షయు, ఇంద్రియ నిగ్రహము గల పురుషుడు జ్ఞానమును త్వరలో బొందునుఅట్లు జ్ఞానమును బొంది యతి శీఘ్రములో నుత్కృష్టమైన చిత్తోపరతిని బొందును.

యోగీశ్వరుడగు శ్రీభర్తృహరి విద్యావిషయమై నుడివినది గమనింపుడు:-

విద్యా నామ నరస్య రూప మధికం ప్రచ్ఛన్నగుప్తం ధనం
విద్యా భోగకరీ యశఃసుఖకరీ విద్యా గురూణాం గురుః ।
విద్యా బంధుజనో విదేశగమనే విద్యా పరా దేవతా
విద్యా రాజసు పూజ్యతే న హి ధనం విద్యావిహీనః పశుః॥

మానవున కన్నిరూపములకంటె విద్య అతిమనోహరమగు సౌందర్యము. అది దొంగలచే నపహరింపబడని ధనము, విద్య అన్ని భోగములను ఇచ్చునది. యశస్సుఖముల నొసంగునది. విద్య గురువులకు గురువు. విదేశగమనమందు విద్య బంధువువలె సహాయము చేయుచున్నది. విద్య అన్ని దేవతలకంటె గొప్ప దేవత. విద్య రాజులచేత పూజింపబడునది, ఈ ధనము ధనముకాదు, విద్యా ధనమే ధనము, విద్య లేనివాడు పశువుతో సమానుడు.

శునఃపుచ్ఛ మివ వ్యర్థం జీవితం విద్యయా వినా ।
న గుహ్యగోపనే శక్తం న చ దంశ నివారణే ॥

విద్యలేని మానవజన్మము కుక్కతోకవలె వ్యర్థము. అనగా కుక్కతోక దానియొక్క మర్మస్థానమును కప్పుటకును, దేహమును బాధించెడు ఈగలను తోలుటకును ఉపయోగపడదు. ఇతర జంతువుల తోకలు ఈగలు తొలగించుటకును, గోప్యస్థలమును కప్పుటకును ఉపయోగపడును. కనుక విద్యలేనివాడు కేవలము, భారమే గాని యుపయోగపడడు.

రూపయౌవన సంపన్నాః విశాలకులసంభవాః ।
విద్యాహీనా న శోభంతే నిర్గంధా ఇవ కింశుకాః ॥

రూపము, యౌవనము, ధనముతోగూడి చక్కనివాడైనను, మంచి కులములో పుట్టినను, విద్యలేనిచో వాని జీవితము నిరుపయోగము. ఎట్లన మంచివర్ణముతోను, వికాసముతోను గూడిన బాడిశపుష్పమువలె స్పర్శయోగ్యము గాకయుండును. ఇచ్చట నాల్గవపాదమున ''హంసమధ్యే బకో యథా'' అని పాఠము గూడ గలదు. అనగా హంసల గుంపులో కొంగ యెట్లు ప్రకాశింపదో, ఆలాగున విద్యావిహీనుడు సర్వైశ్వర్యము లుండినను జనమధ్యములో శోభింపడు. మరియు విద్యలేనివానిని అజాగళస్తనముగా వర్ణించియున్నారు. మేక కంఠములో కొన్నిటికి స్తనము లుండును. అయితే అది కేవలము పరిహాస పాత్రమే గాని అందు పాలుండనట్లు విద్యలేనివాని జన్మము గూడ అటువంటిదే యగును. కనుక ప్రయత్నపడి విద్య నభ్యసింపుడు. ఇక చెప్పవలసినది బ్రహ్మచర్య విషయము. వీర్యము లేనివాడు నిర్వీర్యుడని మరల చెప్పవలెనా? ఇది లోపించిన ఆయిల్ అనగా తైలము నశించిన యంత్రమువలె జీవితయాత్రలో శరీరయంత్రము గూలునని సర్వదా జ్ఞప్తిలో నుంచి వర్తించుడు.

**ఆయు స్తేజో బలం వీర్యం ప్రజ్ఞా శ్రీశ్చ మహద్యశః ।**
**పుణ్యంచ మత్ప్రియత్వంచ లభ్యతే బ్రహ్మచర్యయా ॥**

బ్రహ్మచర్యము చేత దీర్ఘాయుస్సును, బలమును, శౌర్యమును, అమానుషప్రజ్ఞయు, సత్కీర్తియు, మంచియశస్సును, దైవప్రీతియును జనులకు లభించు నని మనుస్మృతి.

**న తప స్తప ఇత్యాహు ర్బ్రహ్మచర్యం తపోత్తమమ్ ।**
**ఊర్ధ్వరేతా భవేద్యస్తు స దేవో నతు మానుషః ॥**

మహర్షులు కేవలమైన తపస్సును తపస్సని తలంచరు. బ్రహ్మచర్యమే ఉత్తమోత్తమమైన తపస్సని తలంతురు. ఊర్ధ్వరేతస్సు గలవాడు అనగా వీర్యనష్టము లేనివాడు మానవుడు గాడు. దేవుడే యగును. అనగా బ్రహ్మచర్యముచే దేవత్వము సిద్ధించునని భావము.

**వేధా ద్వేధా భ్రమం చక్రే కాంతాసు కనకేషు చ ।**
**తాసు తేష్వప్యనాసక్త స్సాక్షాద్భర్గో నరాకృతిః ॥**

బ్రహ్మదేవుడు రెండు విధములగు భ్రమలచేత జీవులను సంసార చక్రమునందు అమర్చియున్నాడు. అదేమన? కాంతయు, కనకము ఈ భ్రమనుండి విముక్తి బొందినవాడు సంసారచక్రభ్రమణము నుండి మోక్షము నొందినవాడే. ఇంతేగాక అతడు సాక్షాత్ ఈశ్వరాకారముతో గూడిన నరుడని గ్రహింపుడు. అనగా దేవమానవుడే. ఇక ఈశ్లోకము నుదాహరించి వ్యాసము ముగించెద.

**మాతేవ రక్షతి పితేవ హితే నియుంక్తే**
**కాన్తేవ చాభిరమయత్యపనీయ ఖేదమ్ ।**
**కీర్తిం చ దిక్షు వితనోతి తనోతి లక్ష్మీం**
**కిం కిం న సాధయతి కల్పలతేవ విద్యా ॥**

విద్య బిడ్డలను తల్లివలె రక్షించును. తండ్రివలె ధర్మమునుపదేశించును. భార్యవలె ఆపత్కాలమున శ్రమను శమింపచేయును. దశదిక్కులలో కీర్తిని గలుగచేయును. ఐశ్వర్యము సమకూర్చును. వెయ్యేల? కల్పవృక్షమువలె సమస్తమగు కోరికలను ఇచ్చునది విద్య యొక్కటి తప్ప మరియేమియును లేదు. కనుకనే విద్యావంతుడే బలవంతుడని మహాపురుషులు చెప్పెడు రహస్యము. ప్రస్తుతము ఉన్నతాధికారపదవులన్నిటిని విద్యావంతులు గదా అలంకరించు చున్నారు! మరల విద్య యెటువంటి దనగా--

**న చోరహార్యం న నృపేణ దండ్యం న బంధుభాజ్యం నకరోతి భారమ్ ।**
**వ్యయే కృతే వర్ధత ఏవ నిత్యం విద్యాధనం సర్వధనప్రదానమ్ ॥**

ఈ విద్యాధనము చోరులచే అపహరించబడునది గాదు. మరియు రాజులకు పన్ను కట్టవలసిన ధనము గాదు. బంధువులకు భాగించి యివ్వవలసి యుండదు. మరల మోయుటకు భారము లేనిది. ఇంకను ఎటువంటి దనగా, ఏ ధనమైనను వ్యయము చేయగా తగ్గిపోవును. ఇది అటువంటిది గాదు. వ్యయము చేయగ చేయగ వృద్ధియగు చుండును. అంతేగాక విద్యాధనము సమస్తధనములను విశేషముగా దానముచేయునదిగా యున్నది, ''సర్వధన ప్రదానం'' అని చెప్పుటచే, ప్రపంచధనమును, యశస్సును, కీర్తిని, ఆరోగ్యభాగ్యమును, వైరాగ్యధనమును, యోగధనమును, జ్ఞానధనమును ఏల అన్ని సౌఖ్యములను

విద్య యిచ్చును. కావున విద్యను అవశ్యముగా సర్వజనులు అభ్యసించి దానిలో చెప్పేలాగున నడచుకొని ఇహసుఖమును, పరసుఖమును, పరాత్పరసుఖమును అనుభవింతురుగాక!

ఇప్పుడు కొందరు ఈ విద్యచదివి యేమి ప్రయోజన మనియు ఇదిచదువుకొన్నవారు, అందరును జ్ఞానులై యున్నారా? అనియు ''పరమునకు దీనివల్ల ఏమి యుపయోగ'' మనియు పలుకుదురు. అది సరియైన విచారము గాదు. దేన్నినైన సాధించి విడిచి పెట్టువాడే యోగ్యుడగును. అట్లు చేయక చెప్పువాడు ''నిర్ధనబ్రహ్మచారీ'', ''వృద్ధానారీ పతివ్రతా'' వంటి అర్థము లేని వ్యర్థ ప్రలాపమేగాని సారము లేదు. పై జెప్పిన దానికి అర్థమేమన? విద్యమాత్రము చదివి అనుష్ఠానము లేనిచో ప్రయోజనము లేదని భావమేగాని విద్య అవసరము లేదను భావముగాదు. విద్య లేనివాడు కండ్లు లేనివాడే. కనుక నే బ్రహ్మచారులకు యజ్ఞోపవీతకర్మమునకు ఉపనయన మని పేరు వచ్చినది. ఉపశబ్దమునకు సమీపమనియు నయనమునకు నేత్ర మనియు అర్థము. అనగా దైవమును కనుగొనుటకు సమీపమైన నేత్రమని యర్థము. మరియు భౌతికజ్ఞానమున కే మాంసచక్షుస్సనియు, అభౌతికజ్ఞానమునకు విద్యానేత్ర మనియు అర్థము. ఈ అవస్థలో ద్విజత్వము గల్గును. ద్విజత్వమనగా రెండవ జన్మమని భావము. విద్యలేని జన్మ సామాన్యమనియు, విద్యాభ్యాసము గలది దైవత్వమునకు తగిన జన్మమనియు భావము.



## శ్రీసనాతన ధర్మపరిపాలన సేవాసమాజ

# తృతీయ వార్షికోత్సవము

ఓమ్ నమో బ్రహ్మాదిభ్యో బ్రహ్మవిద్యా సంప్రదాయ
కర్తృభ్యో। వంశఋషిభ్యో మహాద్భ్యో నమో గురుభ్యః ॥

ఓ పరిశుద్ధమైన జ్ఞానమును, కరుణయు, శాంతియు, మూర్తీభవించిన ప్రియమగు సోదరీ సోదరులారా! శాంతాత్ములారా! త్యాగమూర్తులారా!

దయామయుండగు సర్వేశ్వరుని కృపచేతను, కరుణాళువు లగు మహర్షుల కరుణచేతను, లోకములో ప్రేమయు, శాంతియు, భక్తియు, జ్ఞానము గలుగజేయుట కొరకై పంపబడిన దైవాత్ములారా! మన అందరి జన్మము చాల సుకృతమైన దని తలంచవలయును. లేనిచో పుణ్యప్రదేశమగు ఈ కృష్ణాతీరమునందు పుణ్యకార్యనిర్వహణ కొరకై సమావేశము లభించదుగదా! కావున మన మందమును ధన్యాత్ములము. సంశయము లేదు.

ఇప్పుడు మనము సమావేశమైనది శ్రీసనాతన ధర్మసమాజము యొక్క తృతీయ వార్షికోత్సవము. మొదటిది చిత్తూరుజిల్లా, శ్రీకాళహస్తికి చెందిన పాలచ్చూరు గ్రామములోను, రెండవది నెల్లూరు జిల్లా అరవపాళెములోను దైవకృపచేతను, మహర్షుల కరుణచేతను, విజయప్రదముగా జరిగినది. మూడవదైన ఈ పుణ్యసభకు పునీతమైన ఈ ప్రదేశములో పుణ్యాత్ములగు ఈ పామర్రునివాసులు పుణ్యపురుషులను ఈ ప్రదేశమునకు రప్పించి, ఆదరింపగలిగినందుకు ఎంతో సంతోషము హృదయాంతరాళములో గలుగుచున్నది. ప్రప్రథమమున ఈ కానుపించెడు మహాసభను ఉగ్గుమూడి సుబ్బారెడ్డిగారు ప్రారంభించిరి. అట్టి తరుణమున ఇదియొక సభయను నుద్దేశముతో ప్రారంభించినది గాదు. శ్రీవ్యాసాశ్రమ భక్తులు నానా ప్రదేశములలో నుండు వారందరిని ఒకేచోటున చేర్చుకొని దర్శించుటకును, శ్రీవ్యాసాశ్రమ సోదరీ సోదరులు పరస్పరము అన్ని దైవకార్యములలోను ఐక్యము గలుగజేసికొనుటకును, మాత్రమే ఉద్దేశ ముండెను. ప్రథమసమావేశములో జరుగుచుండు ప్రార్థన, భజన, కీర్తన, పారాయణ, హరికథ, ఆత్మబోధపరములగు నుపన్యాసములు చూచిన వారందరును దైవపరవశులై యుండుట గాంచి అరవపాళెం, పాటిమిట్టనివాసులగు వెంకటసుబ్బారెడ్డిగారును, వాసుదేవారెడ్డిగారును, ఒక సంవత్సరము ఇట్టి మహాకార్యము జరుప దలంచిరి. పైజెప్పిన గ్రామస్థులేగాక పరిసర ప్రదేశజనులుగూడ తోడ్పడి అతివైభవముతో సభ జరిపి ధన్యులైరి. దిగంత విశ్రాంతకీర్తని బడసిరి. మహాత్ముల కృపకు పాత్రులైరి. దీనిని గురించిన విషయములు వార్తాపత్రికల ద్వారా మీరు విని యుందురు.

ఇట్టి సాధుసజ్జనుల సభలు హిందూస్థానములోను, తమిళనాడులోను, మహారాష్ట్రదేశములోను ఎక్కువ జరుగుచుండును. ఆంధ్రదేశములోను అచ్చటచ్చట దైవికసంబంధ సభలు జరుగకపోలేదు. ఇప్పుడు ఈ రాష్ట్రములోను జనులకు ఇట్టి విషయములో ఆసక్తి యెక్కువ కలుగుట మనకు భవిష్యత్ మంగళ సూచనయై యున్నది. మరియు సర్వజనులును సోదరభావముతో సమావేశమై దైవకార్యముల గురించి పరస్పరము చర్చించుట మహదానందముగదా! ఇక సభను గురించి వర్ణనచేసి కాలము గడుపక కర్తవ్య విషయము లోనికి ప్రవేశింతుము.

ఈ సమాజము యొక్క ముఖ్యోద్దేశము, సభామండప ద్వారములో వ్రాసియుంచబడిన బోర్డులో గానుపించు విషయమే. అదేమన ఇతరుల ఆత్మోన్నతికి అడ్డుపోకుండుటయు, సాధ్యమైన సహాయము చేయుటయు, తన ఆత్మోన్నతికి అడ్డుగలిగిన తొలగించుటయే శ్రీసనాతనధర్మసమాజము యొక్క యుద్దేశమై యున్నది. మరల విశ్వప్రేమను వృద్ధిచేసి ప్రేమసాగరములో మనుజులేగాక అన్ని ప్రాణికోట్లతో సహా పావన జీవితము గడుపుటయే యగును. దీనికి స్థూలప్రతిబంధమును మాత్రము తొలగించిన చాలదు. సూక్ష్మ ( అనగా మానసిక) ప్రతి బంధములనుగూడ తొలగించవలెను. దీనికి స్వరాజ్యవాదులు ఏలాగున ప్రయత్నము చేయుచున్నారో, ఆలాగున స్వారాజ్యవాదులుగూడ కొందరుండవలయును. ఇవి రెండును మనకు దేహదేహులవంటివి యని మీరు మరువకూడదు. అయినను ఈ సమావేశము ముఖ్యముగా స్వారాజ్యము అనగా ఆత్మరాజ్యప్రాప్తికొరకు ఎక్కువ ప్రయత్నించును. స్వరాజ్యము పొందినను స్వారాజ్యము నొందకపోయినచో మనయొక్క జీవితము వట్టి ప్రాణము లేని శవము వంటిదే యగును. ఇచ్చో ఒక రహస్యము గలదు. ప్రాణము మాత్రముండియు, కరచరణ కర్ణనేత్రాది ఇంద్రియములు లేనిచో గొప్పలాభము బడయజాలము గదా? కావున స్వరాజ్యమును మనకు నుండవలసినదే. ఆత్మరాజ్యము అనగా ఆత్మలాభము గలుగనివారు లోకలాభమును సంపాదింపజాలరనియే మన పూర్వీకులగు మహర్షుల మతము. కావుననే శ్రీగోపాలకృష్ణుడు గీతయందు ఉపదేశ ప్రారంభమగు ద్వితీయాధ్యాయమున

ఆత్మ ప్రాప్తిపరమగు సాంఖ్యయోగమును విషాదగ్రస్తుడైన అర్జునస్వామికి బోధించుట జరిగెను. ఈ యోగమునందు పాండవునికి ఆత్మయొక్క నిత్యత్వమును, అమృతత్వమును, విజ్ఞానత్వమును, ఆనందతత్త్వమును లభించినందుచే కర్మయోగమున కర్హుడని తలంచి శ్రీకృష్ణభగవానులు తృతీయాధ్యాయమున కర్మయోగము నుపదేశించెను. ''యోగః కర్మసుకౌశలం'' అని భగవానుండు గానము చేయుటకు కారణమిదియే. ఇట్టి వేదాంతముయొక్క పరమరహస్యమైన శ్రీగీతాశాస్త్రము చక్కగా మానవులందరును జదివి సారము గ్రహింపకపోవుటకు గారణము సాధువులును, సత్పురుషులును, సాధుసంఘములును, కావలసినంతగా లేకపోవుటయే. జనుల ఆత్మోన్నతి యింత హీనస్థితికి వచ్చుటకు కారణమిదియే. పడగనెత్తి బుసగొట్టుచుండు త్రాచుపామును పట్టుకొనుటకు ఎంత విశ్వాసముగలవారు బోధించినను సామాన్యముగా అందరు పట్టజాలరుగదా! బోధకుని యందు భక్తి విశ్వాసము గలవారు కొందరు ప్రాణముపైగల ఆశను విడిచిపెట్టి పట్టుకొనవచ్చును. గరుడమంత్రము తెలిసియుండువారు అట్టి భయంకరమైన కాలకూట విషమును గ్రక్కుచుండు ఆ సర్పమును అవలీలగా పూలమాలవలె ఎత్తుకొని ఆడింతురు గదా! అదేరీతిగా స్వరాజ్యములో నిర్భయముగా ప్రయత్నించుటకు గూడ స్వారాజ్యలాభము గలిగి యుండవలెను. ఈ తత్త్వసారమే గీతయొక్క సారమని తేటతెల్లముగ మనకు శ్రీకృష్ణపరమాత్ముడు బోధించెను. గతసంవత్సరం అరవపాళెం సభలో ఏర్పాటుచేసిన కార్యములు రెండు. పూర్వీకసాంప్రదాయముగా బ్రహ్మచర్య వ్రతముతో ఆశ్రమములు ఏర్పాటుచేసికొని ముఖ్యముగా సంస్కృతవిద్యయు, దానితోపాటు లోకవ్యవహారము కొరకు మాత్రము ఆంగ్లేయభాషయు బోధించుటయు, విరక్తులై లోకసేవాభిలాషగల స్త్రీలుగాని, పురుషులుగాని, యుండిన వారిలో భోజనవసతులు లేని వారికి తగిన యేర్పాటు చేసికొని, బ్రహ్మవిద్య నభ్యసింపజేయుటలో ప్రయత్నించుటయు అని, కార్యద్వయము ప్రస్తావింపబడెను. ఇవి రెండును శ్రీవ్యాసాశ్రమముపై విశ్వాసముతో, సత్ కర్మయొక్క రహస్యము తెలిసిన భక్తులు కొంతవరకు నిర్వహించియున్నారు.

సోదరులారా! సోదరీజనులారా! మనకు ప్రస్తుతము గుడిగోపురాదులు అంత అత్యవసరమైనవి కావు. విరక్తులైన నారీనరులను సంరక్షించి ఈ దేశములో నుండువారిని మరియొక్క ప్రదేశమునకు జీవనోపాయము లేనందుచేత పోవనీయక నిలబెట్టుటయు, ఇతరదేశములలో నుండు విరక్తులై లోకసేవా తత్పరులైన వారిని రప్పించి జనులందరికి ఆత్మబోధ గలుగజేయుటలో ప్రయత్నించుటయే కార్యమై యుండవలెను. బ్రహ్మనిష్ఠులకును, బ్రహ్మచారులకును, తగినంత అనుకూలత లేకపోవుటచే మనదేశములో గల పుణ్యపురుషులు ఇతర ప్రాంతములగు శ్రీకాశి, హరి ద్వారము, హృషీకేశము, కాశ్మీరము మొదలైనస్థలములలో తలదాచుకొని ముక్తులగుచున్నారు. అచ్చటిభాష తెలియకయు, ఆహారము శరీరమునకు పట్టకయు, చలిబాధచేతను ఈ దేశీయులు ఎందరో బాధపడుచున్నారు. మన ప్రాంతము ఇంత అదృష్టహీనమా? పై చెప్పిన దానికి దృష్టాంతముగా మన దేశీయులగు నివృత్తిమార్గమందున్న వారు పై దేశములలో ఎందరో యున్నారు. ఆ దేశీయులు ఈ దేశములో చాలా అరుదుగా గానుపించుచున్నారు. కారణ మేమన? ఆ దేశస్థులు వివేకజ్ఞానము గలవారగుటచే దేవుడు ఇచ్చిన ధనమును గుడులు గోపురముల కెక్కువగా వ్యయము చేయక సాధుసజ్జనులకును, బ్రహ్మచారులకును వినియోగపరచి ధన్యులగుచున్నారు. ఇతరులను ధన్యులుగా నొనరించుచున్నారు. వారికి సాధువులన్న ఎక్కువ ప్రీతి. దక్షిణదేశములో గుడిగోపురములకు చేసెడు కర్చు అపారము అయినను దేవాలయములచే మనుష్యులు పొందవలసిన విద్యయును, జ్ఞానమును చాల లోపించుచున్నవి. సాధారణముగా ఒక దేవాలయములో జరుగు ఖర్చులలో కొంతవరకు బ్రహ్మనిష్ఠులకును, బ్రహ్మచారులకును ఉపయోగపరచిన, యెంతో లోకమునకు మేలు గలుగును. ఇట్లు చెప్పుటచే దేవాలయము బొత్తిగ అక్కరలేదని తలంపరాదు. దాని యొక్క యుపయోగమిట్టిదని తెలిసికొని వర్తించవలయునని భావము. పూర్వీక ఉద్దేశ మిట్టిదైనను కాలాంతరముచే అట్టి భావము సంపూర్ణముగా అంతర్ధానమైన దనియే చెప్పవచ్చును.

ఒక్క బ్రహ్మనిష్ఠుడు భవసాగరము నుండి యుత్తీర్ణుడైనచో మనకు ఈలాటి దేవాలయములు వేలకొలది కట్టించుటకు శక్తి మంతుడగును. కనుక

ప్రియమైన సజ్జనులారా! బ్రహ్మచారిణులను, బ్రహ్మ నిష్ఠులను, ఆదరించుటలో కాలము వ్యయపరచుడు. ఇచ్చో నుండు వారలలో ఈలాగున తలంచువారు గూడ నుండవచ్చును. సోమరులై తిరిగి గృహస్థులను బాధించి జీవించెడి సాధువులు గుంపులు గుంపులుగా నున్నారు. ఇట్టి తిండిపోతులను పోషించుటయా? మన ధర్మమని తలంచువారు గూడ నుందురు. వీరిచే లోకమునకు ఏమి ప్రయోజనమని కొంద రడుగుదురు. ఇదియును కొంతవరకు సత్యమే. అయినను అందరు అట్లే యున్నారని తలంచుట చాల పొరబాటు. అట్టి త్రిమ్మరులను పోషించవలెనని ఎవ్వరును చెప్పరు. కనుకనే విరక్తులై, బ్రహ్మనిష్ఠాపరులై, లోక సేవాతత్పరులైన వారిని అని విశేషణములతో ముందుగా సంబోధించిన తాత్పర్యము. సాధువైన ఒక భగవాన్ రామకృష్ణ పరమహంస పుణ్యజీవితముచే ఎన్ని కోట్ల జనులు ఇహ పరదు:ఖసాగరమును దాటిరి. సన్న్యాసియైన ఒక శ్రీ వివేకానందగురునిచే ఎందరో శోకసాగరము తరించిరి. ఆలాగున ఒక జగద్గురు శ్రీశంకర భగవత్పాదులచేతను, ఒక్క శ్రీరామానుజాచార్యులచేతను, ఒక్క శ్రీమధ్వాచార్యులచేతను, ఒక్క శ్రీకృష్ణచైతన్యులచేతను, ఒక్క శ్రీరాజారాం మోహనరాయివారి చేతను, ఒక్క శ్రీదయానంద సరస్వతీస్వామిచేతను, ఒక్క శ్రీబుద్ధదేవునిచేతను, ఒక్క శ్రీఏసుక్రీస్తు దేవునిచేతను, ఒక్క శ్రీమహమ్మదునిబిచేతను లోకము తరించెనో లేదో యోచింపుడు. వీరందరును సాధుమూర్తులు గారా? సన్న్యాసులు గారా? కావున మహర్షుల వంశములో పుట్టిన సోదరీ సోదరులారా! పై చెప్పిన వారి దివ్యజీవితములను స్మరించి 'ఉత్తిష్ఠత' లెండు, 'జాగృత' మేల్కొనుడు. 'ప్రాప్య వరాన్ నిబోధత' ప్రకృతికి పరమైన ఆత్మస్థితి పొందిన వారిని విధివత్ ప్రాపించి జన్మముయొక్క ఆవశ్యకతను త్వరలో తెలిసికొండు! ఏలన కాలచక్రము త్రిమూర్తులనుగూడ అలక్ష్యము చేసి ఒక్క నిమిషమైనను నిలువక తనయొక్క ప్రయాణమును సాగనిచ్చుచున్నది. దైవాత్మస్వరూపులారా! కరుణాళువులారా! ఉదయమైనవెంటనే మధ్యాహ్నము వచ్చుచున్నది. తరువాతవెంటనే అస్తమయమును పొందుచున్నది. మరల రాత్రియు, పిమ్మట దివసము, వారము, పక్షము, మాసము, అయనము, సంవత్సరము అదిగో అతివేగముగా దాటుచున్నవి. ఇట్టి

తరుణములో ఊరకుండుట పాడియగునా? కావున జాగ్రత్తనొంది ఆత్మావలోకనము చేయుటలో ప్రయత్నింపుడు! శోకసాగరమును దాటి నిత్యసుఖము నొందుడు! అమృతమై, శివమైన పదవి నధిష్ఠించి సుఖింపుడు! మనదేశీయులగు బ్రహ్మనిష్ఠులు ఉత్తరదేశములోనికి వెళ్లుటచే ఈ ప్రాంతములో సత్య ధర్మములను బోధించెడువారు లేకపోవుటచే జనుల జీవితము రాగద్వేషాదిదారుణరోగములచే దుర్భర మగుచున్నది. ఇట్టి ఘోరతమస్థితినుండి జనుల నుద్ధరించుటకు బ్రహ్మవేత్తల సహాయము తప్ప మరిదేనిచేతను సాధ్యము గాదు. అట్టి ఆత్మనిష్ఠాపరులై లోకరక్షాతత్పరులగు బ్రహ్మనిష్ఠులను ఇచ్చట నిలబెట్టుటకు తగిన ఆశ్రమములును, అనుకూలస్థితికి తగిన ఆహారమును ఉండవలయును. ఈలాటి పరమపవిత్రమార్గము ఈదేశములో అరుదగుటచే భక్తులు దీనియొక్క తత్త్వము దెలియకయున్నారు. ఈ కొరతను తీర్చుటకు మనదేశములో ధార్మికులు లేకపోలేదు. రాజులును కొరతలేకయున్నారు. అయితే వారికి ప్రబోధముగలుగ చేయతగిన వ్యక్తులు తక్కువగా నున్నారు. అట్టి దివ్యమూర్తులను ఇక నూతనవ్యవసాయమువలెపెట్టి పెంచవలసియుండును. ఈ కల్పవృక్షము యొక్క ఫలము గల్గువరకు మన ప్రయత్నముండినచాలును. మరల మన దేశములో నుండు ధనికులును, ఆస్తికులును ఈ కార్యము సులభముగ నిర్వహింపగలుగుదురు.



# పూర్ణ సుఖం

నిర్మలాత్మ స్వరూపులారా! ప్రపంచములోగల సకల ప్రాణి కోట్లును ఏదో ఒక విధముగ సుఖమునే కోరుచుండును. అది తెలిసి కాని, తెలియకనే గాని పరివర్తనము ఒకటి జరుగుచున్న సంగతి విచారించిన అందరికిని గోచరించును. ఏదైన నొకస్మృతి అనగా విచారము గలుగుచుండిన దానికి హేతువు ఏదైన ఒకటి యుండే తీరవలయును. కారణము లేక కార్యముండదు గదా! మరియు ఒక్క ప్రాణియైనను దు:ఖమును కోరుట లేదు. సుఖమునే

కోరుచుండును. దీనివల్ల సమస్తప్రాణికోట్లును ఆనందస్వరూపులని తేలుచున్నది. అట్టి పూర్ణసుఖము దేనివల్ల సిద్ధించునో అట్టిమార్గము వెదకుట అందరి కర్తవ్యముగదా! సూక్ష్మ ప్రాణియైన చీమయు, దోమయు, వాటికన్న ఎక్కువస్థితిని పొందియుండు క్రిమికీటాదులు గూడ సౌఖ్యమునే గోరుచుండును. ఇకను పైపై జన్మముగల పక్షి వర్గములును సుఖమునే కోరుచుండును. మృగవర్గములను పరిశీలించినను అజవు, గజవు, అశ్వవు, గోవు మొదలైన యున్నత జంతువులును సర్వదా ఆనందానుభవమునే ఆశించియుండును గాని దు:ఖమును కోరుట లేదని పరిశోధకులందరికిని గోచరింపక మానదు. శైశవావస్థలో నుండు శిశువును ఆనందానుభవమునే అభిలషించుచుండును. కౌమారావస్థను అధిష్ఠించిన కుమారుడును ఆనందమునే ఇచ్ఛించుచుండును. తర్వాత యౌవనావస్థను అధిరోహించిన వారుకూడ చేయు కార్యము లన్నియు ఎల్లప్పుడును సుఖముగా నుండవలయు ననియే కదా! ఇంతవరకు సూక్ష్మ క్రిమినుండి పరిణామము మారి పూర్ణమైన మనుష్యావస్థలో చేరువరకు చేయు సమస్త కార్యములును సౌఖ్యము నుద్దేశించి గదా ఆచరించుచుండును! అయినను ఎవరైనను దృశ్యానుభవముచే పూర్ణసుఖమును అనుభవించుట లేదని మనకు కనబడుచున్నది.

ఇంతవరకు పండితుడును, పామరుడును, భూపాలుడును, గోపాలుడును, బ్రాహ్మణుడును, బ్రాహ్మణేతరుడును, స్త్రీయును, పురుషుడును ఈ సుఖము సుఖము అను మార్గమునుబట్టి వచ్చి గృహస్థసౌఖ్యమే మానవుల జన్మముయొక్క పూర్తి యని తలంచి దానికి కావలసిన సమస్త ఉపకరణములును న్యాయముతోగాని, అన్యాయముతోగాని సంపాదించి అనుభవించినను చాలకనే పోవుచున్నదని కనుగొనెడి కాల మొకటి సుకృత విశేషమువల్ల గోచరించును. అప్పుడు సమిధలచేతను, హవిస్సుచేతను హోమగుండాగ్ని అంతకంతకు వృద్ధి యగునేగాని, శమింప దను తత్త్వము జ్ఞప్తిలో స్ఫురించును. అదే రీతిగా ప్రాపంచికవిషయభోగములచేత విషయాగ్ని అంతకంతకు వృద్ధియగు నని తలంచి కట్టెలు వేయనిచో నిప్పు స్వయముగా చల్లారునట్లు నిర్విషయస్థితి పొందెడు విరక్తిమార్గముచే తప్ప దు:ఖాగ్ని శమింప దను జ్ఞానము కలుగును. అప్పుడు

దృశ్య సంబంధమైన వస్తువులను సంపాదించుటచే దు:ఖశమనము కలుగ దను బోధము గలిగి దృశ్యత్యాగము చేతనే నిత్యానందము కలుగుచున్నదని స్పష్టమైన బోధ గలుగును. అప్పుడు అతని జీవితదశ అంతయు నూతన పరివర్తనముతో కూడినదై ప్రవృత్తి అంతయు పూర్వవృత్తి కన్న భిన్నమై మారుచుండును. అప్పుడు ఇంతవరకు తలంచినట్లు కాదని జీవితదశాతత్త్వము కనుగొనును. అప్పటికి ఇంతవరకు అనుభవించిన సౌఖ్యము లన్నియు అజ్ఞానవముచే సుఖవని తలంచినదేగాని, నిశ్చయముగా దు:ఖమని హృదయాంతరాళవములో ప్రకాశించునప్పుడు నివృత్తిమార్గము మరియొకటి యుండుననియు, దానికి మార్గము ఇది కాదనియు, ఇంతవరకు సౌఖ్యము దృశ్యములో గలదని తలంచినది వట్టి భ్రమ యనియు, సౌఖ్యముయొక్క నిలయము దృక్కు అనగా ఆత్మబోధ అనియు, బుద్ధి వికసించినప్పుడు కొంచెము కొంచెముగా గోచరించునుగదా! అప్పుడు హృదయాంతరాళము నుండి, పర్వత బిలద్వారమునుండి చిన్న జలధార ప్రవహించునట్లు ఒక్కసమయమున దు:ఖవారియు, మరి ఒకప్పుడు ఆనందబాష్పమును, ఇంకొకప్పుడు భక్తిరసామృతమును, వేరొకప్పుడు ప్రశాంత ప్రశోభిత ప్రేమయును గలుగుచుండును. అప్పుడు దైవమా! నీవు తప్ప వేరుగతి లేదను తలంపు కలిగి ఒక్కొక్కప్పుడు ఏడుపుగూడ కలుగును. మరి ఒకప్పుడు మూర్ఛితుడై పడిపోవచ్చును. ఇంకొకప్పుడు నిద్రాహారములు లేక నిశ్చేష్టుడై కొలదికాలము కూర్చుండుట కూడా గలదు.

ఆ అవస్థలో ఈకానుపించెడు జగత్తంతయు నశ్వరమనియు, దైవమొకటియే సత్యమనియు, గోచరించుటచే ఇంతవరకు సాగిన ప్రవృత్తి అంతయు వ్యర్థము గదా యని తీవ్రమైన విచారము గలగును. ఇది శుభేచ్ఛ అను వేదాంతమార్గములో సప్త భూమికలందు మొదటి భూమిక యగును. ఇచ్చటనుండియే మనుష్య జన్మము యొక్క యథార్థానుభవము ఆవిర్భవించును. అప్పుడు వానప్రస్థాశ్రమమును, దానికి తగిన శమదమాదిగుణములును, ఇంద్రియనిగ్రహమును, తపస్సును, మనుజుల జన్మహక్కు అని బుద్ధికి గోచరించును. సోదరీ సోదరులారా! ఈ అవస్థ స్త్రీ పురుషులందరికిని

సమానముగానే యుండును. అప్పుడు ''త్యాగేనైకే అమృతత్వమానశు:'' అని శ్రుతిసారము గోచరించును. ''నాన్య: పంథా విద్యతేఽయనాయ'' అనగా త్యాగముచేతనే అమృతత్వము గలుగునుగాని భోగముచేత గాదని పై శ్రుత్యర్థము. ఈ మార్గము తప్ప వేఱు దైవమార్గము లేదని గోచరించును. ఇచ్చో చదివినవారును, చదువనివారును, బ్రాహ్మణులును, బ్రాహ్మణేతరులును, స్త్రీలును, పురుషులును ఎవరైనను శమదమాదిగుణములు గలవారైనచో శాశ్వతానందమోక్షమును పొందవచ్చును తత్త్వము స్పష్టముగ గోచరించును. అప్పుడు పూర్ణసుఖమగు మోక్షమునకు త్యాగము కలుగుటయే హేతువని గోచరించుటచే అమితానందము కలుగును.

అట్టి స్థితిలో అంతకంతకు ఉపరతిస్థితి నొందుటకు ప్రయత్నము తీవ్రముగా జరుగుచుండును. ఇట్టి ప్రయత్నము అంతకంతకు అధికరించుచు రాగా రాగా శుక్ల పక్షచంద్రునివలె ఆత్మసౌఖ్యమును అధికరించును. తర్వాత వానప్రస్థాశ్రమమున నుండినను, బంధచ్ఛేదము నిశ్శేషముగా గాజాలదని తలంపు గలుగునప్పుడు తురీయాశ్రమము ఒక్కటి యుండుననియు, దాని నందకపోయిన ప్రకృతియొక్క వికృతి యగు చక్రభ్రమణమునుండి నిలుకడ గలుగదనియు బోధము గలుగును. ఇచ్చట తురీయాశ్రమ మనగా కేవల దేహమునకు సంబంధించిన సన్న్యాసమని భ్రమనొందకూడదు. ఆత్మసన్న్యాసము యొక్క గురుతుమాత్రమే బాహ్యసన్న్యాస మను తలంపు మరువకూడదు. ఈ తత్త్వములో అజాగ్రత్త నొందిన పూర్వముకన్న మరింత బంధనములోపడి పోవునని మరువకూడదు. పై చెప్పిన అవస్థగలిగి రాగా రాగా సంస్కార మధికరించుటచే పౌర్ణమి చంద్రునివలె ఆత్మయు పూర్ణత్వము నొందును. అట్టి తరుణమున ఇంతవరకు దృశ్యములో గల విద్యయు, ఉద్యోగము, ధనము, అధికారము మనకు సుఖములు గలుగజేయజాలవను తత్త్వము గోచరించుటచే దృశ్యబుద్ధిని సంపూర్ణముగా మాని సదా దృక్కులో రమించెడు లేక విహరించెడు అవస్థ గలుగుచుండును. సంపూర్ణముగా దృశ్యము యొక్క భావము హృదయాకాశమునుండి తొలగునప్పుడు గ్రహణ విమోచనకాలములో రాహువుచే

విడువబడిన చంద్రునివలె ఆ మహనీయుడు ప్రకాశించును. లేక ''స్వయం ప్రకాశతే హ్యాత్మా మేఘాపాయేం ఽంశుమానివ'' అని శ్రీ జగద్గురు శంకర భగవత్పాదాచార్యులు ఆనతిచ్చినట్లు మేఘము వదలి పోయిన సూర్యునివలె ప్రకాశించునని భావము. అపుడు తా నమృతుడనియు, శుద్ధుడనియు, శాశ్వతుడనియు, ఆనందుడనియు, అచలుడనియు, పరిపూర్ణుడనియు, దైవమై వెలుగువాడనియు గోచరించును.

మిత్రులారా! పరిపూర్ణ ఆత్మస్వరూపులారా! మీరు పూర్ణసుఖ స్వరూపులగుటచేత గదా దు:ఖమును ప్రేమింపకుండుటకు కారణము. మీ పూర్ణసుఖమునకు సదృశమైన సుఖము ముల్లోకములలో లేకపోవుటచేతగదా లోకములోగల సర్వోన్నతపదవి యగు ఉద్యోగముచేతగాని, సార్వభౌమత్వముచేతగాని, స్వర్గలోకసుఖముచేతగాని, ఆఖరున బ్రహ్మాదుల స్థానముచేతగాని తృప్తి పొంద కుండుటకు కారణము. ప్రేమస్వరూపులారా! ఎచ్చటనుండి ప్రారంభము గలుగుచుండునో, అచ్చటనే దానియొక్క పర్యవసాన మని తత్త్వవేత్తలు చెప్పుచున్నారు. దృష్టాంతముగా భూమినుండి దీర్ఘముగా ఒక్క రేఖను దీసికొనిపోయిన ఎచ్చట ఆదియో, అచ్చటనే అంత్యముగా పర్యవసానించును. అదే రీతిగా మీకు ఏ హృదయాంతరాళమునుండి దు:ఖనిరసన బుద్ధియు, ఆనందప్రాప్తీచ్ఛయు గలుగుచుండునో, అచ్చటనే అది అంత్యమగును. మరల దేహములోనికిని, లోకములోనికిని సుఖముకొరకు వ్యాపించుని వృత్తిగలవారలై ప్రపంచములో గల సమస్త సుఖము లనుభవించినను తృప్తినొందక పుణ్యకర్మానుష్ఠానము చేతగాని, యజ్ఞాదిక్రతువులచేతగాని స్వర్గసుఖములను గూడ అనుభవించి అచ్చట నుండియో, మరల భూలోకమునకు వచ్చియో, బ్రహ్మలోకప్రాప్తికి తగినంత ధ్యానోపాయయోగాదులచేత అట్టి బ్రహ్మాది లోకములను పొందియు పూర్ణసౌఖ్యము అనుభవింపక మరల మీరు ప్రారంభించిన హృదయాంతరాళములోనికి వచ్చి చేరుటకై ప్రయత్నము సలిపెడి కాలమొకటి వచ్చును. అప్పుడు మీరు మీ యథార్థ ఆత్మను అనగా, దైవమును కనుగొనెదరు. అప్పుడు ''ధన్యో ఽహం ధన్యో ఽహ'' మని ధన్యనాదము వినవచ్చును. అప్పుడు

జన్మముయొక్క పరివర్తనము పూర్తి అయిన పరమలక్ష్యమును పొందుదురు.

కావున సోదరీసోదరులారా! దృశ్యత్యాగమే దృక్ ప్రాప్తికి కారణమని జ్ఞప్తిలో నుంచుదురు గాక! ఇట్టి గమ్యస్థానమునకు నాలుగుదిక్కులలో నాలుగు గోపురద్వారములు గలవు. నిర్మలబుద్ధితో నిష్కపట ప్రయత్నముతో దీనియందు దేనిలో ప్రవేశించినను ముఖ్యస్థానములో జేరి విశ్రమించవచ్చును. ఈ ద్వారములలో ఒక్కటి భక్తియోగమనియు, వేరొకటి కర్మయోగమనియు, మరొకటి ధ్యానయోగ మనియు, ఇంకొకటి జ్ఞానయోగ మనియు గ్రహించవలయును. వీటిలో ఏదైన ఒకటి సిద్ధించిన తక్కిన మూడును వశవర్తులై స్వయముగా సిద్ధించును. కనుకనే మహాపురుషులలో పై జెప్పిన గుణము ఒక్కటి ముఖ్యముగా నుండిన ఇతరములు మూడును గౌణములై అవశ్యముగా గానుపించుటకు కారణము. వీటిగమ్యస్థానమైన మహా అమృతసాగరములోనికే వేరువేరు మతములైన నదీ ప్రవాహములు ప్రవహించుచున్నవని మరువకూడదు. ఇట్టి అవస్థ గోచరించిన మాత్రమే అభేద దృష్టి కలుగును. అప్పుడు నిశ్శేషశోక శాంతియు, ఆనందప్రాప్తియు, ముక్తియు లభించును. ఎచట విరక్తియు, భక్తియు, శాంతియు, కరుణయు కలిగి యుండునో అచ్చటికి ముక్తియును స్వయముగా వెదకికొని వచ్చిచేరును. ఇది ధ్రువము. పై జెప్పిన నాలుగు అంగములు మోక్షమనెడు సౌధమునకు చతుఃస్థంభములనియు, ముక్తి యనెడు కామధేనువుకు చతుష్పాదము లనియు, మీరు మరువకూడదు. ఎచట సత్యము, ఎచ్చట ధర్మము ఉండునో అచ్చట దైవమును, ఎచ్చట అసత్యము, ఎచ్చట అధర్మము గలుగుచుండునో అచ్చట దయ్యమున్ను తాండవమాడుచున్నవని మీరు మరువక వర్తించెదరు గాక!

ఆనందాత్ములారా! ఇక ఒక చిన్న విషయమును జెప్పి ఈ వ్యాసమును పూర్తిచేయుచున్నాను. అది యేమన! స్థూల దేహములో విషదోషము గలవారెవరైనను అనగా స్త్రీలుగాని, పురుషులుగాని, పండితులుగాని, పామరులుగాని, బ్రాహ్మణులుగాని, బ్రాహ్మణేతరులుగాని, సన్న్యాసులుగాని, సంసారులుగాని, అవశ్యము బాధనొందుదురో, అదేరీతిగా మీహృదయములో

నెంతవరకు విషయదోషము ఉండునో అంతవరకు మీరెవ్వరైనను, దుఃఖమును తప్పించు కొనజాలరు. కావున నిర్విషయస్థితి నొంది సుఖింపుడు. విషయ జ్వాలలో దగులుకొని మలమల మాడుచుండు ప్రాణికోట్లను నిర్విషయా నందామృతబోధన వృష్టిచే చల్లపరచి పరమాత్మానందామృతముపానము చేయించి తృప్తులుగా చేయుటలో ప్రయత్నింపుడు. తాను తరించుటయు, ఇతరులను తరింపజేయుటలో ప్రయత్నించుటయే శ్రీవ్యాసాశ్రమ దివ్యసందేశమని మీరు మరువకుందురుగాక!

ఇప్పుడు మనము వ్యష్టిగతమైన మతమునుగాని, సంఘమునుగాని, కులమునుగాని కొంతదూరమునకు నెట్టివేసి సమష్టిగతమగు నిష్ఠలోనికి ప్రవేశింపవలయును. వ్యష్టిగతమైన యే మతములో నుండినను ఒక్క నదియంత వైశాల్యమే మనకు సిద్ధించును. నదులన్నియు సముద్రములో లయమొందునుగాని సముద్రము ఒక్క నదిలో లీనము గాజాలదు. కావున మనము ఖండత్వము నుండి అఖండములోనికి దూరవలయును. ఖండప్రాప్తి సుఖము సామాన్య రాజుయొక్క అధికారముతో కూడియే యుండును. అతనికి మరియొక రాజు శత్రువుగా నుండును. ప్రపంచవంతటికి ఏకచ్ఛత్రాధిపతియగు సార్వభౌమత్వములో మాత్రమే నిశ్శేషశత్రురాహిత్యము గల్గియుండును. కావున అట్టి స్థితిలో మీరు నిలకడగల్గి యుండవలసియుండిన భక్తియోగమునకును, కర్మయోగమునకును, అష్టాంగయోగమునకును, జ్ఞానయోగమునకును ప్రేమతో స్వాగతమివ్వవలయును. అలాగున అన్నిమతములకును స్వాగతపత్రము నిండు ప్రేమతో ముందుగా పంపవలయును. ఇంతవరకు జరిగిన మతముల కన్నిటికిని భక్తితో నమస్కారము సమర్పించి జరుగుచున్న మతములకు స్తోత్రము సలిపి, యికపై రాబోవు మతములకు ఇప్పుడే స్వాగత శుభలేఖను అచ్చొత్తించవలెను. అయితే క్షీరనీరన్యాయము ననుసరించి హంసపక్షివలె సర్వమతములలోగల సారమును మాత్రము గ్రహించిన చాలును. కులకర్మలను చూడక గుణకర్మలను చూచిన మాత్రమే యిచ్చట మీకు మార్గము లభించును.



# *సంయమ వ్రతము

యస్త్వవిజ్ఞానవాన్ భవత్యమనస్కః సదాఽశుచిః ।
న స తత్పదమాప్నోతి సంసారం చాధిగచ్ఛతి ॥

యస్తు విజ్ఞానవాన్ భవతి సమనస్కః సదా శుచిః ।
స తు తత్పదమాప్నోతి యస్మాద్భూయో న జాయతే ॥

1. సంయమవ్రతము - ఇదే బ్రహ్మనిష్ఠుల వ్రతములు అన్నిటిలోను ముఖ్యమైనది.

2. మాట్లాడవలసిన అత్యవసరము వచ్చిన పదివాక్కులచే చెప్పవలసిన అర్థము ఒక్క వచనములో నిమిడించి చెప్పేలాగున అభ్యసించుట, అదియును అభ్యాసులు తమ శరీరము ఎంత పొడుగుండునో దానికన్న దూరమున శబ్దము వినపడ కూడదని భయముతో ఉచ్చరించి శీలించవలెను.

3. ఉదయము ఒక్కజామును, సాయంత్రము ఒక్కజామును, కనీసము స్వరూపానుసంధానమగు నిష్ఠలో నుండవలెను. తక్కిన సమయములో బ్రహ్మవిచారపరమగు అనుష్ఠానములో కాలము గడిపి అతిస్వల్పకాలము మాత్రమే భోజనాది కార్యములకు వినియోగపరచవలయును. భోజనము మొదలైనది ఔషధము సేవించు రీతిగా వాడవలయును.

4. దూషణ భూషణాది ద్వంద్వములకు అందని పదవి నొందుటయే మనయొక్క స్థితి యని మరువకూడదు.

5. బ్రహ్మసాక్షాత్కార అపరోక్షజ్ఞానము గలుగువరకు రేయి, పగలు, శుచి, అశుచి, శుద్ధాశుద్ధస్థలాదులను పరిగణింపక సమయము వచ్చినప్పుడంతయు సమాధినిష్ఠను అభ్యసించుచుండవలెను.

6. ఒక్కనిమిషము వ్యర్థమైపోవునప్పుడు ఎంతో కష్టపడి సంపాదించిన

---

* శ్రీమలయాళస్వాములవారితో ముముక్షువైన వారొక్కరు పద్ధతిని అడుగగా వారికి ఉపదేశించిన ధర్మోపదేశములు.

అమూల్యధనము చేతినుండి జారిపోయిన ప్రాపంచిక మనుష్యుడు ఎట్లు భయపడునో కనీసమంతయైనను భీతి గల్గియుండవలయును.

7. ఇహపరములకు సాధనమైన బ్రహ్మచర్య వ్రతమందు సర్వదా జాగరూకతను వహించవలెను. దీనియందు అజాగ్రతగలవాని జీవితము తైలము నశించిన దీపము ఆరునట్లు అస్తమించును.

8. మూడు నిమిషములలో భ్రమచే దుఃఖమును సుఖమని తలంచి విషయమునకు లోబడినచో మూడుజన్మములలో గల సుకృత విశేషయశస్సును నశింపజేసినవారగుదురు. అనగా జన్మాంతర సుఖముచే గదా ఇప్పుడు ఇట్టి ఉన్నతపదవి లభించినది. ఈ పరిశుద్ధత యుండిన గదా భవిష్యత్ మంగళము లభించును.

9. కల్పితములైన కులగోత్రాది దృశ్యములలో మనస్సు ప్రవేశింపకుండ అతిజాగ్రత్తతో చూచుచు సర్వత్ర అకల్పితమైన దృక్కులో అనగా ఆత్మలో లేక దైవములో విహరించెడు శక్తి ప్రయత్నపూర్వకముగా సంపాదించవలయును.

10. దృశ్యమును దేహములోను, దేహమును ఇంద్రియములోను, ఇంద్రియములను మనస్సులోను, మనస్సును బుద్ధిలోను, బుద్ధిని అవ్యక్తములోను, అవ్యక్తమును మహత్తత్త్వములోను, మహత్తత్త్వమును ఆత్మలోను, ఆత్మను పరమాత్మలోను ఐక్యపరచి శీలించెడు అభ్యాసము సర్వదా చేయుచుండవలెను. ఇది అనులోమప్రకారము. ఇక ప్రతిలోమప్రకారము మరియొకటి గలదు. అది పరమాత్మను ఆత్మలోను, ఆత్మను మహత్తత్త్వములోను, మహత్తత్త్వమును అవ్యక్తములోను, అవ్యక్తమును బుద్ధిలోను, బుద్ధిని మనస్సులోను, మనస్సును ఇంద్రియములోను, ఇంద్రియమును దేహములోను, దేహమును దృశ్యములోను ఐక్యపరచి శీలింపవచ్చును. మహత్తత్త్వమనియు, అవ్యక్తమనియు పర్యాయ నామములుగా వాడుదురు. మొదటిది యోగమార్గము, లేక అనన్యమైన భక్తియోగమని గ్రహించవలెను. రెండవది జ్ఞానమార్గము. యోగమార్గమునకన్న ఇది చాలప్రయాసకరమైనది. సాధారణమైన వారికి ముందుచెప్పబడిన యోగమార్గమే అనుష్ఠించుటకు సులభమైనది. అయితే దీనియందు సదా త్రిపుటిరాహిత్య ముండదు. జ్ఞానమార్గము త్రిపుటిరహితమార్గము. ❋❋❋

# విశ్వప్రేమ

(శ్రీ మలయాళస్వాములవారు నవరాత్రికాలములో ఏలూరు భగవత్ప్రార్థన సమాజమువారు జరిపెడు వార్షికోత్సవకాలములో ఆసమాజము వారికి వ్రాసిన లేఖలోగల సారాంశము ఈ క్రింద ముద్రితము.)

ఓ పరిశుద్ధమైన జ్ఞానమును, కరుణయు, త్యాగమును, మూర్తీభవించిన ప్రియసోదరీ సోదరులారా! కరుణానిధి యగు సర్వేశ్వరుని కారుణ్యామృత వృష్టిచే సమస్త జీవరాసులు దోషబుద్ధియను శోకాగ్ని శమించి దైవజ్ఞానపరమగు నిర్వాణమును పొందుదురు గాక!

నిర్మలాత్ములారా! ప్రేమస్వరూపులారా! దైవకరుణ గలవారి ధనము, దేహము సార్థకవిషయములో వినియోగపడును. అనగా ధనమేదయిన నుండిన భగవత్ప్రీతికార్యములోను, భగవద్భక్తుల కైంకర్యములోను, పవిత్రమగు లోకసేవలోను వినియోగపడును. శరీరబలము భగవత్కార్యములోను, ప్రాణిసంరక్షణలోను, బ్రహ్మనిష్ఠలోను వినియోగపడి ధన్యత నొందును. మనస్సు సర్వదా మానవనాథుడగు సర్వేశ్వరుని మననమునందును, మానవుల హితము కొరకు పుణ్యకార్యము చేయుటలోను, భవబంధనాశనకరమగు కార్యములు విచారణ చేయునదియై సాఫల్యము నొందును. దైవానుగ్రములేని వారి ధనము డాంబికకార్యములోను, అభిమానము పేరును సంపాదించుటలోను, దుష్కార్యములో ప్రవర్తించుటచేతను, క్షయమునొంది నిరర్థకత నొందును. దేహబలము విషయాదులలో ప్రవర్తించినదై కృశించి విలయమునొందును. మనస్సో మానధనాది కార్యములలో ప్రవేశించి నిరుపయోగస్థితి నొందును.

కావున అనుగ్రహపుత్రులారా! ఈ మూడువిషయముల నుండి తప్పించుకొని దైవకృపకు పాత్రులై శాశ్వతపదవియగు మోక్షపదనివొంది సుఖింపుడు. ఎచట భక్తియు, విరక్తియు, శాంతియు, కరుణయు గలిగియుండునో అచ్చటకి అయిదవదయిన ముక్తియు స్వయముగా వచ్చి చేరును. బీదజనుల

సమారాధన యని వినుట మఱింత సంతోషము. మీరు చేయుకార్యములన్నియు భగవత్స్వరూపులగు మానవులకందరకేగాక ఇతర ప్రాణికోట్లలో సహా వ్యాపించినదయి యుండవలయును. అప్పుడే మీరు యథార్థమయిన దైవకరుణను పొందగలుగుదురు. మీ గ్రామ సమీపమున ప్రవహించు కృష్ణా, గోదావరీ నదులను చూచుట లేదా? పరమభాగవతోత్తముడగు బ్రాహ్మణునికిని, అధికపాతకియని తలంచెడు పంచమునకును, ఉత్కృష్టమయిన గోవుకును, నికృష్టమని తలంచెడి కుక్కకును ఒకేప్రకారము అవి దాహశాంతి కలుగచేయలేదా? అట్టిపుణ్యనదులకు గల పూజ్యత బావినీటికి గలుగునా? కారణము వాటి యొక్క విశాలత్వము, కూపముయొక్క సంకుచితత్వమని మరువకయుందురేని మీరు ధన్యులగుదురు. దృష్టిని విశాలపరచి చూచిన పృథివియు, వృష్టియు, సూర్యుడు, వాయువు, అకాశ మనెడి పంచభూతములయొక్క సమత్వమును జూడందగును గదా!

శ్రీకృష్ణభగవంతులు --

గీత పంచమాధ్యాయములో బోధించిన "విద్యావినయసంపన్నే" అను శ్లోకమునం సర్వదా గానము చేయుడు. శ్రీభాగవతములోగల "నితాంతాపారభూతదయయును" అను పద్యమును సర్వదా వినుచున్నాము గదా! ప్రేమయొక్క పరిణామము ననుసరించి మనుష్యుని గతి ఊర్ధ్వముగా నుండును. ఆఖరున విశ్వప్రేమయై మనస్సు మారునప్పుడు ప్రతిబంధరహిత ప్రబోధజ్ఞానము కలుగును. ఇట్టి జ్ఞానమునకు అఖండజ్ఞాన మని పేరు. తక్కినవి ఖండప్రేమలో చేరినవి. వీరు అనంతుడయిన ఈ సర్వేశ్వరుని సొంతుడుగా చేయజూచుట చీమపుట్టలో నేనుగను నొక్కి యెక్కింపచూచెడి ప్రయత్నమువంటిది యగును. ప్రేమలో మృగప్రేమ యనియు, మనుష్యప్రేమ యనియు, దేవప్రేమ యనియు, దైవప్రేమ యనియు అంతరములు గలవు. దైవప్రేమ కలుగునప్పుడు దైవత్వము లెస్సగా గోచరించును. అంతవరకు శాస్త్రములను పఠించుటచే గల్గు జ్ఞానము శ్రీ కాశీపట్టణమును చూడక వారణాశి ఛాయాపటమును చూచిన వారి జ్ఞానమెంతయో అంతయే. తన కులమునకు, తన మతమునకు మాత్రము

ప్రయోజనపడిన హృదయము మృగీయమే యగును. తన దేశములో గల సర్వమానవులకు నుపయోగపడెడు కార్యములో ప్రవేశించిన హృదయము మానుషీక మని చెప్పబడును. ప్రపంచములోగల మానవుల కందరికిని ఉపకారప్రదమయిన హృదయము దేవప్రేమ యని తెలియందగును. భూలోకమంతట నుండు మానవులకే గాక సమస్త ప్రాణికోట్లకు సహా ఆనందము కలుగచేసెడి ప్రేమయే విశ్వప్రేమ యని తెలియందగినది. ఇదే దైవప్రేమ యగును. ఈ హృదయములో శుద్ధజలమున సూర్యబింబము కానుపించునట్లు విశ్వేశ్వరుని సంపూర్ణముగా నెరుంగదగును దైవస్వరూపులగు సోదరీజనులారా! దైవసంభూతులగు సోదరోత్తములారా! మీరు అట్టి ప్రేమ సంపాదింపుడు, అప్పుడు మీరు ఆ పూర్ణశోకసాగరము యొక్క గట్టెక్కినవారలై పూర్ణత్వము నొందగలుగుదురు.

అయం బంధురయం నేతి గణనా లఘుచేతసామ్ ।
ఉదారచరితానాం తు వసుధైవ కుటుంబకమ్ ॥

ఓం పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్ పూర్ణముదచ్యతే ।
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే ॥

ఓం శాంతిః శాంతిః శాంతిః.

ఇట్లు తమ చరాచర సుఖాభిలాషి
మలయాళస్వామి

ఓమ్ లోకా స్సమస్తాస్సుఖినో భవంతు.



# శ్రీబుద్ధజయంతి

నమో తస్స భగవతో అర్హతో సమ్మాసంబుద్దస్స
సబ్బపాపస్స అకరణం కుశలస్స ఉపసంబదా ।
సచ్చిత్తపరియోతపనం ఏతం బుద్ధానుశాసనమ్ ॥

యస్త్యక్త్వా క్షితిపాలతాం ప్రియ వధూం భోగాంశ్చ చిత్రానపి
శీతోష్ణాది విసహ్యా దుర్ఘటవనే సంతాపహేతుం నృణామ్ ।
పౌనర్జన్మరహస్య మీక్ష్య పరమం ధర్మం తథాఽస్థాపయత్
తం వందే నవమావతార మధునా బుద్ధం సుబద్ధాంజలిః ॥

(ఇది ప్రమోదూతనామ సంవత్సరవైశాఖపూర్ణిమ దినమున శ్రీవ్యాసాశ్రములో జరుపడిన శ్రీ బుద్ధజయంతీ కాలములో బోధింపబడిన శ్రీబుద్ధ చరిత్రములో గల ఉపదేశసంగ్రహము.)

భరతఖండములో అవతరించిన అవతారపురుషులలో శ్రీబుద్ధదేవుడు అగ్రస్థాన మలంకరించిన మహాపురుషుడు. శ్రీమన్నారాయణమూర్తియొక్క అవతారములలో ఈ బుద్ధావతారము నవమావతారమని శాస్త్రప్రసిద్ధము. ఇది నిర్వాణమును బోధించిన సన్న్యాసాశ్రమావలంబకమై యుండెను. జీవన్ముక్తికి దగిన సత్యము, శాంతము, దయ, భక్తి, విరక్తి, ధర్మముయొక్క సమ్యక్ జ్ఞానము మొదలుగాగల దైవగుణము లన్నియు గలిగి మూర్తీభవించినదే యీ దివ్యవిగ్రహము.

జనులను గాఢముగా బంధించుచుండిన అతిదారుణమగు కపోలకల్పితశాస్త్రశృంఖలలను, స్వబోధైకఖడ్గముచే ఛేదించి ఆత్మవిముక్తి గలుగజేసిన మహాత్ముడు శ్రీబుద్ధదేవుడు. అట్లుండియు భరతదేశములో పుట్టిన యీ మహాత్ముని దివ్యచరిత్రము, భారతీయులందరు చక్కగా తెలిసికొనకపోవుట భారతీయుల దురదృష్టమనియే తలంచవలయును. వర్షము లేకపోయిన దేశమేలాగున క్షామబాధితమై యుండునో, ఆలాగున శ్రీబుద్ధదేవుని కరుణామృతవృష్టి ఎవరి హృదయ క్షేత్రములో కురియలేదో, అట్టివారి హృదయము తాపత్రయాగ్ని శమించి దివ్యబోధామృతమును పొంది సుఖింపజాలదు.

కావున సోదరీసోదరులారా! శ్రీబుద్ధదేవుని దివ్యబోధామృతమును పానము చేసి జననమరణములనుండి విముక్తులై నిత్యశుద్ధస్వయంప్రకాశ జ్ఞానులగుదురు గాక!

## రాగద్వేషముల ప్రభావము

1. రాగము- వర్షజలము శుద్ధమైనదిగా నుండినను మాలిన్యముచే కల్మషమగునట్లు, ఆత్మపరిశుద్ధమైనను, విషయాదిరాగములచే మలినత్వము నొందును. లేక విషమంటినవానికి స్వబోధము క్రమక్రమముగా తప్పిపోయి మృత్యువు వాతపడునట్లు కామవిషయము స్మరించినవానికి స్వబోధము విలయమై విషయములో గూలిపోయి నశించును.

2. ద్వేషము- గ్రహావిష్టునియొక్క స్వరూపజ్ఞానము ఆవరణమై గ్రహస్వభావముతో నాట్యము చేయునట్లు ద్వేషావిష్టుని నిజబోధము అచ్ఛాదితమై దయ్యపు స్వభావముతో వర్తించును.

3. కామము- గ్రుడ్డివానికి కండ్లు తెలియనట్లు కామపీడితునకు లోకము కనబడదు. కామము జ్ఞానదృష్టికి అంధత్వము నాపాదించును. కామాతురుని, ఋతుకాలమున ఆడకుక్కను వెంబడించు కామపరవశమైన మగకుక్కవలె కవులు వర్ణించియున్నారు.

4. క్రోధము- ఈనిన పెద్దపులి యెల్లప్పుడు రొప్పుచు కంటికి గనబడిన సర్వజంతువులపై ఎగిరిపడునట్లు, క్రోధముగల మానవుడు హృదయములో అశాంతి మిక్కిలి ప్రబలి అందరికి ద్రోహము చేయుచుండును.

5. లోభము - పిశాచము తనకు లభించిన నిధిని తానునుభవింపకయు, ఇతరుల కివ్వకయు, సదా ఆ నిక్షేపమును గనిపెట్టి యుండునట్లు లోభియైన మానవుండు దైవము తనకిచ్చిన ధనమును తాననుభవించకయు, పుణ్యకర్మలుచేసి సద్గతి పొందకయు, ఊరక దానిని కనిపెట్టుకొనియుండి వృథాకాలము గడుపుచుండును. పిశాచివలె దుఃఖరోదనము చేయుచుండును.

6. మోహము - దిగ్భ్రమనొందిన వానికి ఉత్తరము దక్షిణముగాను, తూర్పు పడమరగాను, గానుపించునట్లు మోహములో పడిన వానికి ధర్మాధర్మములు తెలియవు.

7.మదము- మత్తువస్తువులచే నిజబోధమునుండి జారి త్రోవదప్పి నడచువట్లు మదముగలవాడు ధర్మనిష్ఠనుండి దూరుడగును.

8. మాత్సర్యము- మాత్సర్యబుద్ధిగల మనుజుడు ఒకయూరి కుక్క యితర గ్రామములనుండి వచ్చిన కుక్కను మంచిదో, చెడ్డదో అని తెలిసికొనజాలక అరచి కరచునట్లు ఎవరిని జూచినను, యోగ్యతాయోగ్యతలు చూడక, కుయుక్తి కుతర్కవాదములకొరకు కాలుద్రవ్వుచుండును. ఇతనికి ఆత్మప్రసన్నతయు, సౌఖ్యమును గలుగదు.

9. ఈర్ష్య- నిప్పులో పడిపోయిన వానిశరీరము ఏలాగున తపించుచుండునో, ఆలాగున ఈర్ష్యగల మానవుండును ప్రతీకారము చేయుటకు హృదయమున తపన మొందుచుండును.

10. అసూయ- తేలుగుట్టినవాడు ఎంత బాధపడునో, ఆలాగున ఆసూయగల మానవుడు, ఇతరుల సౌఖ్యమును జూచి ఓర్వజాలక హృద యములో తపించుచుండును. అసూయను తేలుగా పెద్దలు వచింతురు.

11. దంభము- దంభముగల మర్త్యుడు కంపెనీ ఆటలో రాజువేషము ధరించిన బీదమానవునివలె తినుటకు లేక కడుపుకాలుచుండినను, వ్యర్థముగా లోకులు మెచ్చుకొనుటకొరకు నటనము చేయుచుండును. ఇతనికి కొంచమైన ఆత్మవిశ్రాంతి గలుగదు.

12. గర్వము - పిచ్చిపట్టిన కుక్క కనపడిన జంతువు లన్నిటిని కరచునట్లు గర్వపూరితుడైన మర్త్యుడు పుణ్యాపుణ్యముల నెరుంగకయే జనులపై విరోధము గల్పించుకొనును.

13. దర్పము - మదమెక్కిన ఏనుగు దిక్కు తెలియక అనేక వస్తువులపై

బడి ధ్వంస మొనర్చునట్లు దర్పము గలిగిన మానవుడు న్యాయాన్యాయములు చూడక యితరులను, ఇతరవస్తువు లన్నిటిని నాశమొనర్చు చుండును.

14. ఆశ- వీధిశునకమును ఎంత తరిమినను, రాళ్లతో రువ్వినను, గౌరవము తెలియక మరల వచ్చునట్లు దురాశగల మానవునికి గౌరవాగౌరవములు ఎంత చెప్పినను గోచరము గావు. వాడు ఎంగిలి విస్తళ్లపై తిరిగెడు కుక్కవలె పరుల వస్తువులపై ఆశపడి తిరుగుచుండును.

15. విషయేచ్ఛ- రోగియైనవానికి శీఘ్రముగా ఏకార్యమైనను చేయుటకు సాధ్యము గానట్లు, విషయేచ్ఛగల మనస్సుగలవాడు బ్రహ్మనిష్ఠలో త్వరితగమనము జెందజాలడు. దేహమునకు రోగ మెటువంటిదో, ఆత్మకును విషయేచ్ఛ అటువంటిది.

16. అహంకారము- మబ్బుచే సూర్యుడు మరుగుపడునట్లు అహంకారముచే ఆత్మ(దైవత్వము) లేక సోహంభావము మరుగుపడిపోవును. శరీరములో దారుణమైన వ్యాధిగలవారు, భూపాలురుగాని, గోపాలురుగాని, పండితులుగాని, పామరులుగాని, స్త్రీలుగాని, పురుషులుగాని, బ్రాహ్మణులుగాని, బ్రాహ్మణేతరులుగాని, అయినను ఏలాగున నిరంతరము శ్రమపడుచుందురో, ఆలాగున పైన జెప్పిన దుర్గుణములు గల వారెవరైనను, సదా దేహవేదనయు, మనోవేదనయు పొందుచుందురు. దయ, శాంతము, నిరపేక్ష, సమత్వము, జ్ఞానముగలవారెవరైనను, శరత్కాల పూర్ణచంద్రునివలె ప్రసన్నతయు, ప్రశాంతియును, పూర్ణసౌఖ్యమును పొందుదురు.

ఇవి పదునారును మనుష్యునికిగల దోషములు. ఇవి దేహమనస్సులకు సంబంధించినవి.

17. భ్రమ- నూలు తెల్లగానుండినదైనను, రక్త, నీలవర్ణములతో కలిసిన, ఏలాగున నైజమగు తెలుపు తెలియక, యెరుపు నలుపులై మారునో, ఆలాగున ఆత్మ నిత్యశుద్ధస్వయంప్రకాశజ్ఞానస్వరూపమైనను, దృశ్యముతో కలియుటచే తత్స్వరూపము గోచరింపక దృశ్యరూపముగా మారిపోవును.

18. ప్రమాదము- నదిలో పడవపై తీవ్రవేగముగా వెళ్లునప్పుడు నదీతీరమునకు సంబంధించినది పరుగెత్తునట్లును, తాను స్థిరముగా నున్నట్లును ఏలాగున గోచరించునో, ఆలాగున ఆత్మ నిత్యశుద్ధ స్వయంప్రకాశ అచంచల విజ్ఞానబోధైకవస్తువై యుండినను, ప్రమాదముచే అనిత్య, అశుద్ధ, అప్రకాశ, చంచల, అజ్ఞాన స్వరూపముగా గోచరించును. ఇది తానుండు పడవపై దృష్టి యుంచకపోవుటచే గలుగుచుండును. ఆలాగున స్వస్వరూపములో మనస్సుంచక దేహేంద్రియాది వస్తువులలో మనస్సుంచుటచే ఇట్టి ప్రమాదజ్ఞానము గల్గును. ధ్యానయోగముచేతను నిదిధ్యాసనపర మగు జ్ఞానయోగము చేతను అభ్యసించువారికిపై జెప్పిన ప్రమాదదోషములు దొలగి అప్రమాదకరమగు సాక్షాత్ ఆత్మైకబోధ మనెడు దైవ జ్ఞానము గల్గును. ఇవి రెండును ఆత్మలోగల దోషనివారణ పరమైన విషయములు.

## రాగద్వేషముల వృత్తులు

1. రాగము, 2. ద్వేషము, 3. కామము, 4. క్రోధము, 5. లోభము, 6. మోహము, 7. మదము, 8. మాత్సర్యము, 9. ఈర్ష్య, 10. అసూయ, 11. దంభము, 12. దర్పము, 13. అహంకారము, 14. ఆశ, 15. విషయేచ్ఛ, 16. దురహంకారము అని పదునారు విధములు- వీటియొక్క భేదములు క్రింద చెప్పబడుచున్నవి.

1. రాగము - స్త్రీ విషయమై వచ్చెడి చిత్తవృత్తికి రాగమనియును,

2. ద్వేషము - ఒక డపకృతి యొనర్చిన యపకృతికి ప్రతిక్రియ సేయవలయు నని తోచెడి చిత్తవృత్తికి ద్వేషమనియును,

3. కామము - గృహారామక్షేత్ర ధనధాన్యాదులను సంపాదింపవలయుననెడి చిత్తవృత్తికి కామమనియును,

4. క్రోధము - తాను సంపాదించినట్టి పదార్థముల కెవడు విఘ్నము సేయునట్టివానియందుద్రేకము గలిగెడి చిత్తవృత్తికి క్రోధమనియును,

5. లోభము - ఆర్జించిన పదార్థములను సెలవు సేయకూడ దనియెడి చిత్తవృత్తికి లోభ మనియును,

6. మోహము - ఐశ్వర్యమదముచేత కృతాకృతముల నెరుంగలేని చిత్తవృత్తికి మోహ మనియును,

7. మదము - సకలసంపదలు గలిగిన నేను ఏమి చేసినను చెల్లునని తోచెడి చిత్తవృత్తికి మద మనియును,

8. మాత్సర్యము - ఒకడు తనకంటె నధికుడై యుండెనేని వాని యుత్కర్షమును సహింపనోపని చిత్తవృత్తికి మాత్సర్యమనియును,

9. ఈర్ష్య- దుఃఖము పరునికి రాక తనకు రావచ్చునా? యనెడి చిత్త వృత్తికి ఈర్ష్య యనియును,

10. అసూయ - మనవలెనే పరులు సుఖముగ నుండవచ్చునా యని తోచెడి చిత్తవృత్తికి అసూయ యనియును,

11. దంభము - తానొనర్చిన ధర్మము నలుగు రెరింగి మెచ్చవలయునను చిత్తవృత్తికి దంభమనియును,

12. దర్పము - తాను దొడ్డవాడనియు, నితరు లెవరును తనకు సరికారనియును తోచెడి చిత్తవృత్తికి దర్పమనియును,

13. అహంకారము - ఓరీ! నిన్ను శిక్షించెడివాడనని యెరుంగవా? నేను పట్టినకార్యమును విడుచునట్టివాడను గానని పరులను బెదరించెడు చిత్తవృత్తికి అహంకార మనియును పేళ్లు.

14. ఆశ - ఇతరుల వస్తువులు, సౌఖ్యములు తాను ప్రయత్నముచేయకనే తనకు గలుగవలయుననెడి బుద్ధి ఆశ యనంబడును. అది యెంత దొరికినను తృప్తిజెందని వృత్తికి దురాశ యని పేరు.

15. విషయేచ్ఛ - ఇది యింద్రియాది విషయసౌఖ్యముల అనుభవించ వలయునని మరల మరల గల్గుచుండు వృత్తికి పేరు. అది ధర్మమునకు విరుద్ధమై

పాపభూయిష్ఠమగు స్త్రీ విషయాదులలో ప్రవేశించునప్పుడు దుర్విషయ మనంబడును. ఇది పురుషులకు చెప్పే లాగున స్త్రీలకు గూడ గల్గును.

**16.** దురహంకారము- తనయొక్క కులమును, స్థానమును, అధికారమును గురించి అభిమానము గల్గుట దురహంకారమనంబడును. దేహసౌందర్యమునుగాని, బ్రహ్మచర్య, సన్న్యాస, ఆశ్రమముల గురించిగాని కలిగెడు అభిమానము సామాన్యాహంకారమనంబడును. తనయొక్క విద్యను గురించిగాని, శిల్పాదినైపుణ్యమును గురించిగాని, ప్రతిభావిశేషమును గురించిగాని, యోగ, ధ్యాన, తపో, వైరాగ్యాదుల గురించిగాని గల్గునదిగూడ ఒక్కవిధమగు అహంకార మనబడును. పైజెప్పిన మూడువిధములగు అభిమానములు లేనివియై నిత్యశుద్ధస్వయంప్రకాశబోధైక జ్ఞానామృత శివమయమ్మై యుండు ఆత్మయే తన స్వరూప మని కలిగెడు అభిమానము దైవాభిమానమనంబడును. ఈ అభిమానమే సత్యమైనది. ఇట్టి అభిమానము గలవారు ధన్యాత్ములు. ఇది ఒక్కటి తప్ప తక్కిన 16 విధములగు వృత్తులున్ను ఆత్మకు బాధకరములు.

**17.** భక్తి - గురువునందును, దైవమందును, వేదాంతశాస్త్రమందును గల యెడతెగని అనన్యమైన అపారప్రేమ భక్తి యనంబడును. ఇది నిర్మలోదకము వంటిది. సర్వవిధములగు మాలిన్యములు పోయి శుద్ధజలములో కడుగునప్పుడు పరిశుద్ధత గల్గునట్లు పై జెప్పిన మాలిన్యదోషము లన్నియు, ఈ భక్తి యనెడు జలముచేత కడిగి శుద్ధపరచవలసి యుండును. అంతేగాక, సారవంతమగు భూమిలో యవాది ఓధులగు శుద్ధబీజముల పెట్టినను వర్షము లేనిచో ఏలాగున ఫలవంతములు గావో, ఆలాగున మనుష్యునియొక్క సాధనలన్నిటికిని, భక్తి అనవరతముగా నుండవలయును. అది ఒక్కటియే అన్నిదోషములను రహితమొనర్చి యీ ఆత్మను నిర్మలాత్మగా నొనగూర్చునది. భక్తి లేని సాధనలు నిష్ఫలములు.

**18.** శ్రద్ధ - గూరూపదిష్టనిష్ఠలోను, సత్యధర్మాది అనుష్ఠానములలోను, యోగధ్యానాదులలోను, దృఢమైన విశ్వాసము శ్రద్ధయనంబడును. ఇది లేనిచో,

పాకక్రియకు సమస్తపదార్థములుండినను శ్రద్ధతో వండకపోయిన అవి యేలాగున ఉపయోగపడవో ఆలాగున దైవికానుష్ఠానములన్నిటికిని శ్రద్ధ ముఖ్యమైనది. ఇట్టి శ్రద్ధగలవానికి తాననుకొన్న కార్యములన్నియు సిద్ధించును. దైవముగూడ వానికి తోడ్పడును. శ్రద్ధలేని అనుష్ఠానములు నిరుపయోగములు.



# మౌనము

దీనియందుగల తారతమ్యములు - ఇది 1. వాఙ్మౌనము, 2. అక్షమౌనము, 3. కాష్ఠమౌనము ఇత్యాది భేదములచే బహువిధములుగా బరగుచుండును. నివృత్తిమార్గము నందుండువారే గాక ప్రవృత్తిమార్గములో నుండువారు గూడ దినమున కొక ఘంటసమయ మైనను ఏకాంత స్థలములో నుండి దీనిని అనుష్ఠించుట శ్రేయస్కరము. వారమున కొక్కరోజు సాధారణముగా శీలించుట మంచిది. అయినను దీనియందు గల సారము నరయకపోయిన పవిత్రజీవితములో గల అమూల్యవిలువగల సమయమును పోగొట్టిన పాపమునకుగూడ పాత్రులగుదురను తత్త్వమును మరువకూడదు. మౌనశబ్దముయొక్క అర్థము విచారించిన మనన మనియే గోచరించును. ఈ మననము గలవాడే ముని యని గోచరించుచున్నది. దీనిని ఇంత ప్రశస్తముగా శాస్త్రములలో వర్ణించుటకును, మహర్షులు గౌరవించుటకును గొప్ప కారణ మెద్దియైన నుండే తీరవలయును. దీనిపై విచారణ సలిపిన తనలోగల నిగూఢమై యుండు దైవత్వమును, సూక్ష్మ రహస్యమును, కనుగొనుటయే యని తేలుచున్నది. ఇంద్రియనిగ్రహముచే సామాన్యజనులకు గూడ వ్యక్తముగాని విషయము సువ్యక్త మగుచుండును. నిదర్శనము చూడుడు. మీరు ఏదైన నొక శబ్దమును అప్రత్యక్షముగా చిన్నగా వినుచుండినచో ఆ శబ్దము మొదట వ్యక్తముగా గోచరము గాజాలదు. సూక్ష్మమైన అట్టిశబ్దముపై కర్ణేంద్రియద్వారమున మనస్సును ఏకాగ్రపరచిన అట్టి సూక్ష్మ శబ్దము మీకు స్పష్టముగా గోచరించును. రెండవదియగు స్పర్శేంద్రియమును శోధించెదము. మీ శరీరము వెనుక భాగమున ఏదైన తగిలిన

లేక క్రిములు సంచరించు చుండిన ప్రథమమున లెస్సగ తెలియదు. అయినను స్పర్శేంద్రియమగు త్వగింద్రియముపై మనస్సును ఏకాగ్రపరచినచో మనుష్యుల హస్తమో, లేక కర్రలో, లేక యేదైనపురుగులో యని మీరు తెలిసికొనగలుగుదురు. మూడవదైన రూపేంద్రియమును పరిశీలింతము. దూరమునుండి ఒకమనుజుడు వచ్చుచుండిన వెంటనే పలానివాడని గోచరము గాదు. నేత్రేంద్రియముపై మనస్సును ఏకాగ్రము చేసినచో వచ్చుచుండువారి వస్త్రధారణ, నడక మున్నగునవి కనుగొని పలానివారని తెలిసికొనవచ్చును గదా! నాల్గవదైన రసనేంద్రియమును చూచెదము. ఏదైన తొందర పనియుండి త్వరలో భుజించునప్పుడు పదార్థముల రుచి తెలియక పోవుటయే గాక పలాని వస్తువని గూడ జ్ఞప్తికి రాదు. జిహ్వేంద్రియముపై చిత్తము నేకాగ్రము చేసిన పదార్థజ్ఞానమును, రుచియును మనకు గోచరించును. ఐదవదైన గంధజ్ఞానమును గురించి ఆలోచింతము. ఏదైన ఒక వాసన గలుగుచుండిన మొదట ఇది పలానివాసనయని తెలిసికొనుట ప్రయాసము. అట్లుండినను ఘ్రాణేంద్రియమున మనస్సంయమము చేసినచో ఇట్టి వాసనయనియు, పలానిస్థలమునుండి వచ్చుచున్నదనియు మనము గ్రహించుకొనవచ్చును గదా! ఈ పంచజ్ఞానేంద్రియములకు అధీనములై వాక్, పాణి, పాద, పాయు, ఉపస్థలనెడి కర్మేంద్రియ పంచక ముండును. పై చెప్పిన జ్ఞానేంద్రియ సంయమముచే కర్మేంద్రియ నియమనము స్వయముగానే సిద్ధించును. ఇట్టి నియమమునకే దమ మని పేరు.

వీటికన్న సూక్ష్మమై యుండునది అంతరింద్రియము. అంతరింద్రియ మనగా లోపలనుండు ఇంద్రియమని అర్థము. ఇవియు పంచభూతములయొక్క సూక్ష్మాంశములు మనో, బుద్ధి, చిత్త, అహంకారము లనబడును. ఈ నాలుగింటికి అంతఃకరణమే స్థానము. సంశయించుటచేత మనస్సనియు, నిశ్చయించుట చేత బుద్ధియనియు, చింతించుటచేత చిత్తమనియు, అహంకరించుటచేత అహంకారమనియు చెప్పుదురు.

మనస్సు వాయుతత్త్వమగుటచేత గాలివలె చలించుటకు కారణమగుచున్నది. బుద్ధి అగ్ని అంశమగుటచే నిశ్చయించు గుణము గలిగియున్నది.

అనగా చీకటిలో దీప మేలాగున వస్తువును ప్రకాశింపచేసి సంశయరహితముగా చేయుచున్నదో ఆలాగున బుద్ధి నిశ్చయించును. చిత్తము జలాంశము. జలమునకు మందగమన మేలాగున నుండునో చిత్తముగూడ అదేరీతిగా నిదానముగా చింతనచేయుచుండును. ప్రాణికోట్ల వృత్తులన్నియు దీనియందుండును. వృత్తిరహితస్థితి గలుగువరకు ఇది నిశ్చింతగా నుండజాలదు. ఏలాగున వర్షజలముచే కొట్టుకొనిపోయెడు మృత్తికమొదలైన అణువులన్నియు నీటిలో నిలచిపోవునో అదేరీతిగా చిత్తములోనే సమస్తవృత్తులు నిలుచును. బురదనీటిలో సూర్య ప్రతిబింబము కనబడునట్లు ఈ చిత్తము నిర్మలమగువరకు ఆత్మానుభవము గాజాలదు. అహంకారము పృథివియంశము. రాళ్ళుమొదలైనవి కఠినముగా నుండును. అహంకారమునకు కాఠిన్యస్వభావము గలుగుటకు కారణ మిదియే.

ఈ అంతరింద్రియ విషయమై మరియొక ప్రశ్నగలదు. వాయు, అగ్ని, జల, భూముల యొక్కొక్క అంశములే మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారమని యిప్పుడు తెలిసికొన్నాము. పంచభూతములలో చేరిన ఆకాశముయొక్క సూక్ష్మాంశము ఏలానిదని చెప్పబడలేదు. ఆకాశాంశముగూడ ఉండే తీరవలయును. దీనిని జ్ఞాత యని కొందరు చెప్పుదురు. ఈ కారణముచే అచలమతస్థులలో కొందరు జ్ఞాత యెరుకయనియు, అది జడమనియు, యెరుకను విడువవలయుననియు చెప్పుదురు. ఇది సరిగాదు. జ్ఞాత యనగా జ్ఞానమును తెలిసి కొనువాడు. జ్ఞానలక్షణము జడమునకుండదు. అది చైతన్య స్వస్వరూపమగు ఆత్మకే యుండవలయును. జ్ఞాత ప్రత్యగాత్మకు సంబంధించినవాడు కనుక ఆకాశాంశము అంతఃకరణమని గ్రహించవలయును. ఏలాగున వాయువు, అగ్ని, జలము, పృథ్విగాగల వస్తువులన్నిటికిని ఆకాశము ఆధారమై యుండునో, ఆలాగున అంతరింద్రియ చతుష్టయమునకు అంతఃకరణము ఆధారమై యుండును. ఈ అంతరింద్రియ నియమనమును ''శమ'' మని చెప్పుదురు. అంతరింద్రియము వశపడినచో పైన చెప్పిన జ్ఞానేంద్రియ కర్మేంద్రియము లన్నియు వశపడును.

అయినను నిర్విషయస్థితి గలుగువరకు ఈ అంతరింద్రియము ప్రశాంత

నొంది వశపడనేరదు. ఇది శుద్ధపడువరకు జీవుడు అంతరాత్మను గనుగొన జాలడు. అంతవరకు ఆత్మలో జరుగుచుండు మనోబుద్ధి, చిత్తాహంకారముల యొక్క గమనాగమన చలనశక్తియు దెలియ [illegible] మలిన జలాంతర్గత మత్స్యకచ్ఛప కర్కటాది జంతువుల సంచా [illegible] చరింపజాలదు గదా! ఆకాశాంశవము జ్ఞాతకు బాహ్యాభ్యంతరజ్ఞానము తెలిసికొనుటకు ఒక కారణమగుచున్నది. మౌనముచే అంతఃకరణశుద్ధియు, ఆత్మనియమనశక్తియు గలుగును.

ఇక మౌనమును గురించి విచారింతము. మాట్లాడకుండుట మాత్రము వాఙ్మౌన మనంబడును. కరచరణాది నేత్రేంద్రియములతో సంజ్ఞ చూపక యేకాగ్రనిష్ఠలో నుండుట అక్షమౌన మనంబడును. మనస్సులో దైవచింతన లేక ఆత్మానుస్వరూప సంధానమగు నిష్ఠ తప్ప వేరు ఏలాటి చింతయు లేని స్థితి కాష్ఠమౌన మనంబరగును. ఇవి ఒక్కొక్కటి సహస్రాంశాధిక ఫలము గలవి. అనగా వాఙ్మౌనమునకంటె అక్షమౌనమునకు వెయ్యిరెట్లధిక ఫలము. దీనికన్న కాష్ఠమౌనము సహస్రాంశాధిక ఫలమునిచ్చును. కాష్ఠ యనగా నిష్ఠాపర్యవసానమని గ్రహించవలయును. మౌనవ్రతము అనుష్ఠించువారు తమ మనస్సులో గలిగెడు మార్పును కనుగొన ప్రయత్నించవలయును. ఈ మౌనవ్రతముచే సహనశక్తి ముఖ్యముగా గలుగును, సహనబలము గలవాడే బలవంతుడు కాని దేహబలము గలవాడు బలవంతుడు గాజాలడు. ఏలన, గొప్ప యంత్రములయొక్క అధికభారము గల చక్రములను అతి వేగముగా సూక్ష్మమైన ఆవిరి (స్టీము), లేక పవర్ త్రిప్పివేయుచుండు సంగతి మనము చూచుచున్నాము. కావున ఏజ్ఞానశక్తి గలుగని కారణముచే అజ్ఞానములగు ఇంద్రియములు వశపడకపోవుచున్నవి. ఈ శక్తిగలుగనిచో శతవర్షావధి జీవించి అస్థి చర్మపంజరమువంటి వృద్ధుడైనను ఇంద్రియనిగ్రహము కలుగజాలదు. విజ్ఞానశక్తి గలిగినవాడైనచో నవయౌవన కోమలశరీరము గలవాడైనను ప్రతిష్ఠింపబడిన విగ్రహమువలె జితేంద్రియుడై యుండును.

మౌనములో గల తారతమ్యములు 1. బ్రహ్మానుభవము గలిగి వాక్కుతో చెప్పుటకుగాని, మనస్సుతో అట్టిది యిట్టిది యని యూహించుటకుగాని శక్తిలేదని తలంచి నిశ్చేష్టుడై యుండుటయే నిజమైన మౌనమనంబడును. లేక అఖండభక్తిలో మునిగినవాడై, పులకాంకితగాత్రుడై, ఆనందబాష్పవారాశిలో నోలలాడు చుండువాడై, నిశ్చేష్టుడై యుండుటయు మౌన మనంబడును. దీనికి బ్రహ్మమౌనమని పేరు. లేక దైవమౌనమని గూడ తలంతురు.

2. ధ్యానమునందు నిరోధస్థితినొంది బ్రహ్మజ్ఞానామృతపానము చేయుయుండు చిత్తము ఎంత ప్రయాసపడినను బహిర్ముఖము గాక యుండుట శ్రేష్ఠతమమైన మౌన మనంబడును. లేక నిర్వికల్పసమాధినుండి ఉత్థానదశకు బహుప్రయాస ప్రయత్నముచేత వచ్చు నవస్థగూడ మౌన మనంబడును. దీనికి సిద్ధమౌనమని గూడ పేరు గలదు.

3. మాట్లాడుచేత లోకవ్యవహారము అధికరించి బ్రహ్మనిష్ఠ కుదరక కాలము వ్యర్థమగుచున్నదని భయము గలిగి అట్టి నిష్ఠను సాధించవలయునని తీవ్రమైన మనోవేదన గలుగుచుండి మౌనము శీలించుట తప్ప వేరు మార్గము లేదని తలంచి ఒక్కొక్క సమయములో ఏడ్పుగూడ గలుగుచుండి మౌనవ్రతము అనుష్ఠించుటయు ఉత్కృష్టతరమౌన మనంబడును. దీనికి యోగమౌనమని పేరు గలదు.

4. బ్రహ్మనిష్ఠులై యుండియు ఎక్కువ జనులతో మాట్లాడవలసి వచ్చినందుచేత, విశ్రాంతిలేక పోవుటచేతను, ఏదైన దైవవిషయము వ్రాయుటకు సమయము దొరకకపోవుటచేతను ఒక్కరోజు విశ్రాంతి తీసికొని పై కార్యములను నెరవేర్చవలయునని తలంపు గలిగిన మౌనము జ్ఞానమౌన మనంబడును. ఇదియు శ్రేష్ఠమైనది.

5. లోకములో ఏదైన గొప్పకార్యము నిర్వహింప తలంచి యుండి ఆ దినమంతయు దైవధ్యానములో నుండవలెనని గలిగిన వ్రతముగూడ మంచి మౌనమే. ఇది మనుష్యమౌన మనంబడును.

6. ప్రపంచములో గొప్ప దుఃఖకరములైన కృత్యములు జరిగి పశ్చాత్తాపముతో దైవప్రార్థన చేయుటకొరకు ఉపవాసమును ఏర్పరచియుండు మౌనము నియమమౌన మనంబడును. ఇదియు పవిత్రమైవది.

7. మాట్లాడుటవలన ఇంటిలోగల పనులు నిలిపి కొంచము సమయమైనను నిశ్చలముగానుండి ధ్యానము చేయ సమయము దొరక దని తలంచి స్వల్పాహార మవలంబించియుండు మౌనమునకు అభ్యాసమౌనమని పేరు. ఇది కూడ పావనమైనది.

8. ఏదైన కార్యము సాధించవలసియుండిన అది సాధించువరకు మౌనముగా నుండవలయునని తలంచి అనుష్ఠించెడు మౌనము కార్యమౌనమనంబడును. దీనికి సామాన్యమౌనమని పేరు గూడ గలదు.

9. మాట్లాడుటచే కోపతాపములు వృద్ధియగుచుండు నని తలంచి యట్టి దోషములను హరింపచేయవలయునను మంచి తలంపుతో చేయు మౌనమునకు హఠమౌనమని పేరు. ఇదియు నిర్మలమైనదే.

10. కొందరు మౌనముగా నున్నారుగదా యని తలంచి మౌనముచే గలుగు ప్రయోజన మేమియో తెలిసికొనుటకు ప్రయత్నించెడు మౌనమునకు పరీక్షామౌనమని పేరు. ఇది గొప్పఫలము గలుగ చేయనేరదు.

11. ఏలాటి సత్యాన్వేషణము చేయక మామూలు ఆహారమును భుజించియుండు మౌనమునకు మౌఢ్యమౌవమని పేరు.

12. పనులు చేయుటకు వల్లపడక సోమరియై మౌనముగా నుండిన గొప్పవాడని జనులు తలంచెదరని తలంపు గలిగి చేయు మౌనము జడమౌన మనంబడును.

13. ఇంటిలోగాని యితరస్థలములోగాని చెడుకార్యము చేసి కలహము పెట్టుకొని భోజనము చేయక మౌనముగా నుండు మౌనమునకు మౌర్ఖ్యమౌనమని పేరు. మౌఢ్యజడమౌర్ఖ్య మౌనములు తమోగుణములను వృద్ధిచేసి బద్ధుడుగా చేయును. తక్కిన మౌనములలో ఒక్కొక్కటి యెక్కువ యున్నతోన్నతము

లైనవి. ఇవి క్రమముగా తమోగుణ రజోగుణములను హరింపజేయునవియై సత్త్వగుణము నభివృద్ధిచేసి శుద్ధసత్త్వగుణము గలుగజేసి, ఆత్మయొక్క సమస్త బంధనములను నశింపజేయునవియై నిదానముగా దైవత్వము గలుగజేయును. ఈ దశవిధ మౌనములను అభ్యసించువారు ఉపవాసవ్రతముతో మౌనవ్రతము శీలించుట మంచిది. అట్లు చేయుట ప్రయాసమై నిష్ఠకు భంగము గలిగనేని ఫల, మూల, క్షీర, పానకాది స్వల్పాహారములను భుజించవచ్చును. ద్రవ పదార్థములు లఘ్వాహారముగా స్వీకరించుటయే శ్రేష్ఠము. ఈ మౌనము వారము, పక్షము, మాసమునకు ఒక్కరోజుగా ఉండునది. ఎక్కువ రోజులు శీలించువారు ఐనచో యుక్తాహారులై యుండవలయును. లేనిచో నిర్విఘ్నముగా మౌనవ్రతమును నిర్వహింప శక్తి చాలదు. అట్టిది కాలసమయము ననుసరించి వారివారి బుద్ధితోనే యేర్పాటు చేసికొనవలయును.

14. మనోవాక్కాయ కర్మలను స్వాధీనము చేసికొని సత్యము గాను శాంతముగాను, భూతహితముగాను, మితముగాను, కరుణాన్వితముగాను, ఆత్మభావముతోను మాట్లాడువాడు సదా మహామౌనియని గ్రహించవలయును. ఇట్టివారినే వేదములును, మహర్షులును మునిశ్రేష్ఠుడని తలంతురు. ఇది సత్యము.

**మౌనాన్న మునిర్భవతి నారణ్య వసనాన్మునిః ।**
**సల్లక్షణం తు యో వేత్తా స మునిశ్రేష్ఠ ఉచ్యతే ॥**

మాటలాడకుండుటచే మాత్రము వాడు మౌని గాజాలడు. అరణ్యనుందును, కొండగుహయందుండుట మాత్రముచేతను ముని గానేరడు. మరి సత్తామాత్రమగు, బ్రహ్మము నెరింగినవాడు మాట్లాడుచుండినను లేక యే ఆశ్రమములోగాని, యే కులములోగాని యుండినవాడైనను అతడు మహామౌని యని మహాత్ములు తలంతురు.

**ఏక మేవాద్వితీయం యద్గురోర్వాక్యేన నిశ్చితమ్ ।**
**ఏతదేకాంత మిత్యుక్తం న మఠో న వనాంతరమ్ ॥**

ఏక మేవాద్వితీయ మగు పరబ్రహ్మమును గురోరనుగ్రహముచేతను,

తన స్వబోధముచేతను తెలిసికొనుట ఏది కలదో అదియే యేకాంత మనంబడును. ఈ రహస్యము తెలియక సంసారము విడిచి అరణ్యమందుండుట, నదితీరమున నివసించుట, మఠముకట్టి దాని యందుండుట మొదలగునవి ఏకాంతము గాజాలదు. ఏకాంత మనగా మనస్సు ఇతర సంకల్పములు లేక ఏకమగు బ్రహ్మమునందు స్థిరముగా నిలుచుటయే. ఇట్లుండువాడు అనేక జనస్తోమ మందుండినను ఏకాంతమందుండువాడు. ఏకాంతమగు అరణ్యమందుండినను హృదయమున నితర సంకల్పము లుండినచో వాడనేక జనుల నడుమనుండువాడు అని మైత్రేయ్యుపనిషత్.

**మీనః స్నానపరః ఫణీ పవనభుఙ్మే మేషోఽస్తి పర్ణాశనః**
**నీరాశీ ఖలు చాతకః ప్రతిదినం శైలే బిలే మూషికః ।**
**భస్మోద్ధూళిత విగ్రహస్తు శునకో ధ్యానాధిరూఢో బకః**
**ఏతేషాం ఫలమస్తి కిం న హి న హి జ్ఞానం పరం కారణమ్ ॥**

అంతరనుష్ఠానము లేనిచో బాహ్యానుష్ఠాన మాత్రము చేత ఏలాటి ప్రయోజనము లేదని యీ శ్లోకము చెప్పుచున్నది. గంగాదితీర్థములలో మత్స్యకచ్ఛపాదులు సదా నివసించుచుండును. మంచి నాగసర్పము వాయుభక్షణము గలిగియుండును. మేకలు ఆకులనే తినుచుండును. చాతకపక్షికి జలమే ఆహారము. ఎలుకలు కొండగుహలలో నివసించియుండును. శునకము దిగంబరియై బూడిదలో పడియుండి బూడిదచేత సర్వాంగలిప్తమై యుండును. కొంగ మౌనముతో ధ్యానా ధిష్ఠానముతో నుండును. వీటియన్నిటికిని ఏలాటి విశేషఫలమును కానుపించుట లేదు. కావున బాహ్యాడంబరములో భ్రమనొందక పై జెప్పిన వాటియొక్క గుణములతో గూడియుండినను అంతరంగనిష్ఠ సంపూర్ణముగా గలిగియుండవలయును. ఎట్లుండినను జ్ఞానమొకటి మాత్రముచేతనే ప్రయోజనము గలుగును గాని మరి దేనిచేతను జీవుడు తరింపజాలడు.

ఇక వాఙ్మౌనము విషయమై శ్రీకృష్ణభగవంతుడు ఉపదేశించి యుండినది చూడుడు.

అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్ ।
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే ॥

ఇతర ప్రాణుల మనస్సును నొప్పింపనిదియు, సత్యమైనదియు, ప్రీతియు విశ్వాసములను వృద్ధిచేయునదియు, వేదచోదితమై నదియు నగు పవిత్రమైన వాక్కేది గలదో అదియే మౌనమనియు, వాగ్రూపమైన తపస్సనియు గ్రహించవలయును. శ్రీ సీతారామాంజనేయ సంవాదములో మౌనమును గురించి చెప్పినదానిని జూడుడు.

పలుకుల కందక భావమునంటక భాసిలు బ్రహ్మము దానగుచుం
బలుమరు బల్కగ పల్కినచో నవి పల్కితినంచు దలంపక యే
తలపులు లేక నిరంతర సౌఖ్యసుధారస మానుచు నుండుట ని
ర్మలమగు మౌనము మారుతనందన! మానక దీవి భజింపదగున్.

ఓ వాయుపుత్రా ! అవాఙ్మనసగోచరమైన బ్రహ్మమే స్వస్వరూప భూతమైనదని నిశ్చయించి, యెప్పటికైనను ఏ మాటలనైనను మాటలాడక యోగి సదా యాత్మానుభవనిష్ఠుడై యుండును. ఒకవేళ మాటలాడినను 'నేను మాటలాడితిని' అని తలంపడు. ఇంత యేల? అతనికి సంకల్పములే యుండవు. ఇట్టి స్థితిగలిగి సర్వకాలముల యందును స్వస్వరూపానందాను భవమును జెందుచుండుటయే మౌనమను యోగాంగము. దీనిని సర్వకాలములయందు నాశ్రయింపవలయును.

ధీరులచేత నేదేశ మాచార్యోప
　　దేశంబుచే నర్థి దెలియబడియె
బరమపవిత్రమై భాసిల్లు నేదేశ
　　మే దేశ మన్నింటి కెక్కుడయ్యె
నే దేశమురుమానసేంద్రియ ప్రాణాది
　　సంచారశూన్యమై సమతనొప్పు
నే దేశమున సాధ్వసేచ్ఛామదక్రోధ
　　దుఃఖ గంధలవంబు దోపకుండు

**గరము నిరుపద్రవంబు నిష్కంటకంబు**
**నిరతిశయమును నిత్యంబు నిర్మలంబు**
**దివ్యమానంద మగుచు నే దేశమలరు**
**నదియె యేకాంతదేశమౌ నాంజనేయ!**

ఓ యాంజనేయా! విద్వాంసు లగువారు (లేక బ్రహ్మ జ్ఞానార్థులగు బుద్ధిమంతులు) సద్గురువు నాశ్రయించి మిగుల శ్రద్ధతో నే దేశమును (బ్రహ్మమును) దెలిసికొందురో, ఏది పవిత్రములగు పదార్థములకంటె పవిత్రమైయున్నదో, దేనికంటె నధికమగునది మరియొక్కటి లేదో, దేనియందు మనస్సు నింద్రియములు మొదలగునవి సంచరించవో, దేనినాశ్రయించిన భయము, కామక్రోధాదులు, దుఃఖము అను విక్షోభకారణము లించుకయైనను గానరావో, ఏది మిగుల పరిశుద్ధమై, యానందరూపమై, లోకోత్తరమై, శాశ్వతమై, సర్వాధికమై యుండునో, దేనినాశ్రయించిన నే విధములగు బాధలును గలుగవో, చిత్తాదిచాంచల్యము కలుగదో, అట్టి బ్రహ్మమే (లేక బ్రహ్మాత్మైక్యసమాధియే) యేకాంత దేశ మనబడును. ఇదియే దేశమను యోగాంగము.

ఇక మనస్సును వశము చేసికొనుటకు మౌనమే ముఖ్యసాధనమని చెప్పబడుచున్నది.

**కపిరపి చ కాపిశాయన మదమత్తో వృశ్చికేన సందష్టః ।**
**అపి చ పిశాచగ్రస్తః కిం బ్రూమ స్తస్య వైచిత్ర్యమ్ ॥**

మనస్సుయొక్క చంచలత్వమును గురించి చెప్పబడుచున్నది. అది కోతివంటిది. కోతి యేలాగున స్వాభావికమగ అతిచపలమో, అట్టిదే మనస్సు. అట్టి కోతి కల్లుగూడ త్రాగెను. ఇంతే గాక దానినొక పిశాచముగూడ పట్టెను. ఇదియునుగాక తేలుగూడ కుట్టెను. అంతేగాక పిచ్చిగూడ పట్టెను. అప్పుడు ఆ కోతియొక్క చపలత్వము ఎంత విచిత్రముగా నుండునో, అట్టి వైచిత్ర్యముతో గూడినది మనస్సు. అనగా మనస్సు గాలివలె చలనమైనది, అది మోహమనెడి మద్యపానము గూడ చేసెను. దానిని మాయ యనెడు దయ్యము సోకెను.

ఇతరుల సుగుణము ఓర్వని అసూయ యను తేలుగూడ కుట్టెను. అహంభావ మనెడి పిచ్చియును గలిగెను. ఇట్టి కోతిని యిరుకైన కదలుటకు మెదలుటకు సందులేని బోనులోపెట్టి మైకము మందిచ్చిన ఏలాగున నిశ్చలముగా నుండునో, ఆలాగున చపల కోపాదిగుణములు గల మనస్సును మౌనమనెడు పంజరములోనుంచి దైవజ్ఞానమను ధ్యానములో నుంచిన మాత్రమే నిశ్చలత్వము గలుగును. అన్నిటికిని నిండు భగవద్భక్తి ముఖ్యమైనది. అది ఒక్కటియే చైతన్యవస్తువు. తక్కిన వన్నియు జడములు. ఇది గలవారికంతయు స్వయముగానే చేకూరును.

**వివేకం పరమాశ్రిత్య బుద్ధ్యా సత్త్వ మపేక్ష్య చ ।**
**ఇంద్రియారీ నలం భిత్వా తీర్ణో భవ భవార్ణవాత్ ॥**

కావున సర్వోత్కృష్టమైన వివేకము నాశ్రయించి బుద్ధితో సత్త్వగుణమును అవలంబించి యింద్రియాది వృత్తులగు శత్రువులను జయించి జననమరణ భవసాగరమునుండి ఉత్తీర్ణులై సుఖముగా నుండుడు.

ఇక జ్ఞానవాసిష్ఠములో శ్రీవసిష్ఠుడు మౌన భేదములను గురించి చెప్పినది చూడుడు. దీనియందు వాఙ్మౌనము, అక్షమౌనము, కాష్ఠమౌనము, సుషుప్తిమౌనము అని చతుర్విధములుగా బోధింపబడెను. వానిలో మొదటివి మూడును శ్లాఘ్యములు కావని తెలిపి నాల్గవదగు సుషుప్తిమౌనమును సర్వోత్కృష్టముగా అంగీకరించెను. అయితే ముందు చెప్పబడిన మూడు మౌనములును నాల్గవపదవిని పొందుటకు సహాయభూతము లగుచున్నవి. ఇది మనము గ్రహించవలసిన ముఖ్యభాగము. మరల గీతలో శ్రీకృష్ణభగవానులు బోధించినట్లు సాంఖ్యులును, యోగులును, ఒకే పదవినే పొందుచున్నట్లు దీనియందుగూడ సాంఖ్యులకును, యోగులకును, మోక్షపదవి ఒకటి యని తెలుపబడెను.

**యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే ।**
**ఏకం సాంఖ్యం చ యోగం చ యః పశ్యతి స పశ్యతి ॥**

వసిష్ఠ ఉవాచ --

ద్వివిధః ప్రోచ్యతే రామ ముని ర్మునివరై రిహ ।
ఏకః కాష్ఠ తపస్వీ స్యా జ్జీవన్ముక్త స్తథేతరః ॥

రామచంద్రా! మునులు రెండువిధముల నందురు. అందొక్కడు కాష్ఠతపస్వియు, ఇంకొకడు జీవన్ముక్తుండు నగును.

## కాష్ఠమౌని లక్షణము

అభావితాయాం శుష్కాయాం క్రియాయాం బద్ధనిశ్చయః ।
హఠా జ్జితేంద్రియగ్రామో మునిః స్యాత్కాష్ఠతాపసః ॥

బ్రహ్మ భావనారహితమైనది కాననే నీరసమగు ప్రాణాయామాది క్రియయం దాసక్తుండై హఠయోగముచేత నింద్రియముల నిరోధించువాడు కాష్ఠమౌని యని చెప్పబడును.

యథా భూతమిదం బుద్ధ్వా భావితాత్మాత్మని స్థితః ।
లోకోహమోఽపి తృప్తోంతర్య స్స ముక్తో మునిః స్మృతః ॥

ఎవ్వ డీజగము సర్వంబును బ్రహ్మ మే యని తెలిసికొని బ్రహ్మము నేనేనని నిశ్చయము గలవాడై యాత్మస్వరూపమునే యనుసంధానము చేయుచు వ్యవహారమాత్రముచే సర్వజనసాధారణుండైనను లోపల బ్రహ్మానందముచే తృప్తినొంది యుండునో ఆ మునీంద్రుడు జీవన్ముక్తుండని చెప్పంబడును.

ఏతయోర్యోఽభవద్భావశ్శాంతయో ర్మునినాథయోః ।
చిత్త నిశ్చయరూపాత్మా మౌన శబ్దేన కథ్యతే ॥

నిర్వికారచిత్తులగు నీ యిర్వురయొక్క యేకనిష్ఠత్వరూపమగు భావము మౌనశబ్దముచే చెప్పబడుచున్నది.

## వాఙ్మౌనాక్ష మౌనకాష్ఠ మౌనంబుల లక్షణము

వాఙ్మౌనం వచసాం రోధో బలాదింద్రియ నిగ్రహః ।
అక్షమౌనం పరిత్యాగ శ్చేష్టానాం కాష్ఠసంజ్ఞకమ్ ॥

**ప్రస్ఫుర చ్చిత్తకలన మేతన్మౌన త్రయంస్థితమ్ ।**
**ఏతేషాం హఠమౌనానాం విషయః కాష్ఠతాపసః ॥**

సషుప్తమౌనమును నిరూపించుటకై మొదట నితర మౌనముల జెప్పుచున్నాడు. వాక్కుల నిరోధము వాఙ్మౌనమగును. హఠయోగంబున జక్షురాజేంద్రియములు నిరోధించుట అక్ష మౌనమగును. శరీరము, తదవయవములు వీనిచేష్టల విడచుట కాష్ఠమౌన మగును. ఈ మూడును చిత్తవాసనలతో గూడినవి. కావున వీనికి కాష్ఠతాపసుండే ఆశ్రయభూతుండగును.

## సుషుప్త మౌనలక్షణము

**అవిభాగ మనాయాసం యదనాద్యంత మాస్థితమ్ ।**
**ధ్యాయతోఽధ్యాయతశ్చైవ సౌషుప్తం మౌనముచ్యతే ॥**

అంతర్ముఖుడైనను, బహిర్ముఖుడైనను, మునియొక్క జాగ్రదాది విభాగంబు లేనిదియు, కర్మేంద్రియనిరోధక్లేశము లేనిదియు, ఉపక్రమోప సంహారంబులు లేనిదియు నగు, నే బ్రహ్మనిష్ఠ గలదో అదియే సుషుప్తమౌనమని చెప్పబడుచున్నది.

**యథాభూత మిదం బుద్ధ్వా జగన్నానాత్వ విభ్రమమ్ ।**
**యథాస్థిత మసందేహం సౌషుప్తం మౌనముచ్యతే ॥**

నానావిధంబుగ పరిభ్రమించుచున్న యీ జగము బ్రహ్మమునం దధ్యస్తము గావున బ్రహ్మరూపముగా నిశ్చయించి నిర్వికల్పంబుగ బ్రహ్మభావంబున నుండుట యేది కలదో అదియే సుషుప్త మౌనమని చెప్పబడుచున్నది.

**అనేక సంవిద్రూపాత్మ శివమేవేదమాతతమ్ ।**
**ఇత్యాస్థిత మనంతం యత్సౌషుప్తం మౌనముచ్యతే ॥**

ఈ జగము అనేకసంవిద్రూపంబు లగు నాత్మస్వభావంబులు గలదియు, వ్యాప్తంబునగు బ్రహ్మంబే యని నిరవధికమగు బ్రహ్మనిష్ఠత్వమేది

గలదో అదియే సుషుప్తమౌనమని చెప్పబడుచున్నది.

**సుషుప్తమౌనం యోగీశైర్ద్వివిధైః ప్రాప్యతే ఖలు ।**
**సాంఖ్యయోగిన ఏకే స్యు రపరే యోగయోగినః ॥**

సాంఖ్యులు, యోగులు నీ యిర్వురచే సుషుప్తమౌనము పొందబడుచున్నది.

**సమ్యగ్జ్ఞానావబోధేన సుసిద్ధైక సమాధయః ।**
**సంఖ్యయైవాఽవబుద్ధ్యేయుస్తే స్మృతాః సాంఖ్యయోగినః ॥**

తత్త్వాజ్ఞానోదయముచే సిద్ధమగు సమాధినిష్ఠగల యోగులు సంఖ్య (జ్ఞానము) చేతనే సిద్ధిని పొందిరి. కావున వారు సాంఖ్యులని చెప్పబడుచున్నారు.

## యోగిలక్షణము

**ప్రాణాద్యనిలసంశాంతౌ యుక్త్యా యే పదమాగతాః ।**
**అనామయ మనాద్యంతం తే స్మృతా యోగయోగినః ॥**

అష్టాంగ యోగముచేత ప్రాణాదివాయువులు శాంతింపగా నాద్యంతరహితంబగు బ్రహ్మమును పొందినవారలు యోగులని చెప్పబడు చున్నారు.

**ఉపాదేయం తు సర్వేషాం శాంతం పదమకృత్రిమమ్ ।**
**యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం పరం యోగైస్తదేవ హి ॥**

శాంతము, అకృతిమంబునగు పదమే అందరకు నుపాదేయమగును. అట్లు గావున సాంఖ్యులచేత నే స్థానము పొందబడునో యోగులచేతను నదియే పొందబడుచున్నది అని శ్రీజ్ఞానవాసిష్ఠ నిర్వాణ ప్రకరణము.

**ఏకాక్షరం పరం బ్రహ్మ ప్రాణాయామః పరం తపః ।**
**సావిత్ర్యాస్తు పరం నాస్తి మౌనాత్సత్యం విశిష్యతే ॥**

ఏకాక్షరమైన ఓంకారమే పరబ్రహ్మస్వరూపము. ప్రాణాయామము

నకు సమానమైన తపస్సు లేదు. ఓంకార సహిత గాయత్రికి సదృశమైన మంత్రము లేదు. మౌనమునకన్న సత్యము చెప్పుట మేలు అని మనుస్మృతి.



## వర్ణస్థితి

మానవులలో ముఖ్యముగా నాల్గు తరగతులవారున్నారు. ఈ గుణములబట్టియే చాతుర్వర్ణ్య మేర్పడినది. అది వారి వారి స్వభావగుణములను బట్టి కనుగొనవచ్చును. 1. ఒక్కడు తనకు దైవప్రాప్తి లభించుటలో అనగా సత్య, ధర్మ, తపస్సులు, యోగజ్ఞానములు సిద్ధించుటకు మానావమానములను గాని, శీతోష్ణాది సుఖదుఃఖములనుగాని సహించుటయు, ధననష్టముగాని శరీరాదిసౌఖ్యములనుగాని లక్ష్యపెట్టకయు, పైన చెప్పిన కార్యములను నిర్వహించెడు పట్టుదల గలిగి వర్తించునప్పుడు అతడు బ్రాహ్మణవృత్తి గలవాడగుచున్నాడు. 2. శౌర్యపరాక్రమాదిగుణములు గలిగి యశస్సు కీర్తులు గలుగు విషయమై ధనమునుగాని, దేహేంద్రియాది సౌఖ్యములనుగాని, నిద్రాహారాది దేహసుఖములనుగాని, కడకు ప్రాణమునుగాని తృణీకరించి పై నుదాహరించిన యశశ్శౌర్యాది కీర్తులను సంపాదించెడు బుద్ధిగలవాడు క్షత్రియు డనంబడును. వీనికి ప్రాణమునకన్న యశస్సు గొప్పది యను తలంపు గలిగి యుండును. 3. ధనలాభములోను, కొంతవరకు శరీరసౌఖ్యములోను మాత్రము అభిలాష గలిగి సత్య శౌర్యాదియశస్సులనుగూడ పాటింపక కొంత దైవభక్తియు, ఫలాపేక్షతో గూడిన దానశీలమును గలిగియుండెడు గుణము గలవాడు వైశ్యజీవితములోనికి ప్రవేశించినవాడగును. 4. నిద్రాహారాది దేహసౌఖ్యములే పరమపురుషార్థమను బుద్ధి గలిగి కొంత ధనాభిలాషయు గలిగి సత్యమునుగాని, జ్ఞానమునుగాని, యశస్సునుగాని, ధనమునుగాని ముఖ్యమని తలపంక పై నుదాహరించిన కార్యములలో మాత్రము కాలము గడుపువాడు శూద్రజన్మము గలవాడగును. ఈ గుణములనుబట్టి ఒక్కొక్కరిని కనుగొనవచ్చును.

మరియు ఈ నాల్గింటిలో మరల మూడేసి మార్పులు గలవు. మొదటిది సత్త్వగుణాధిక్యమును, రెండవది రజోగుణాధిక్యమును, మూడవది మూడు గుణముల మిశ్రత్వమును, నాల్గవది తమోగుణమును గలిగి యుండును. అనగా సత్త్వగుణములో సత్త్వగుణము, సత్త్వగుణములో రజోగుణము, సత్త్వగుణములో తమోగుణము ఈ లాగున తక్కిన రెండు గుణములలోనుగూడ గలదని గ్రహించవలయును. వీరిలో క్రిందతరగతి జన్మము గలవారికి నిష్కామకర్మయోగమును, రెండవ వారికి భక్తియోగమును, మూడవ వారికి యోగాభ్యాసపరమగు ధ్యానయోగమును, నాల్గవవారికి ధ్యానయోగపరమగు జ్ఞానయోగమును తరణోపాయములు, అయితే దీనియందు కొన్ని రహస్యములు గలవు. మొదటివారికి అనగా క్రింది తరగతివారికి సకామ కర్మయోగముండును. రెండవవారికి కొంత నిష్కామ కర్మయోగమును, సకామ భక్తియును గలిగియుండును. మూడవ వారికి నిష్కామకర్మయోగమును, కొంతవరకు నిష్కామ భక్తియోగమును, సకామయోగ ప్రాప్తిచ్ఛయు గలిగియుండును. నాల్గవారికి నిష్కామకర్మయోగమును, నిష్కామదైవభక్తియు, నిష్కామయోగధ్యానమును, సకామ జ్ఞానయోగమును గలిగి యుండును.

వీరందరికన్న విలక్షణు డొక్కడుండును, వీడు విశుద్ధసత్త్వగుణము గలవాడు. అనగా గుణత్రయాతీతుడు, జీవన్ముక్తుడు, తురీయుడుగాను, తుర్యాతీతుడుగాను ఉండవచ్చును. వీనికి నిష్కామకర్మయోగము, నిష్కామదైవభక్తి, నిష్కామయోగధ్యానము, నిష్కామదైవజ్ఞానము గలిగి యుండును. వీడు మహాత్ముడు, పరిపూర్ణుడు. పుష్పము నుండి స్వయముగా సుగంధము వెడలునట్లును, సూర్యుని నుండి స్వయముగా ప్రకాశము గలుగునట్లును, చంద్రుని నుండి నైజముగ చల్లదనము గలుగునట్లును, సర్వకాలసర్వావస్థలలోను, వీని శరీరరోమకూపములనుండి సహా భక్తియును, జ్ఞానమును, వైరాగ్యమును, కరుణయును సర్వతో ముఖముగా ప్రకాశించుచుండును. ఇట్టివారు స్త్రీలలోను, పురుషులలోను గూడ ఉండ వచ్చును. ఇదే సత్యమైన వర్ణాశ్రమధర్మము యొక్క రహస్యము. ఏ కాలముననైన వర్ణ విభాగమేర్పడియుండినచో అది దీనిపై ఆధారపడియే యుండును. కావున

ఒక్కొక్కరున్ను తనయొక్క అంతరాత్మలో స్వయముగా పరిశోధన సలిపి జన్మకారణమును గనుగొని తరించేలాగున చూడవలయును. కావుననే కొన్ని శాస్త్రములలో బ్రాహ్మణుడై పుట్టిన మాత్రమే మోక్షము గలుగునని చెప్పెడు రహస్యమై యున్నది. ఇది దేహముతో సంబంధించియుండునని తలంచుట పొరపాటు. ఆత్మతో సంబంధించినదని తలంచువారు ధన్యాత్ములగుదురు. అట్టి బ్రహ్మత్వస్థితి గల్గుటకు ఒక జాతిగాని, ఆశ్రమముగాని, స్త్రీ పురుషాది భేదములుగాని అవసరము లేదు. జన్మాంతరసంస్కారమును, సర్వేశ్వరకృపయును దీనికి కారణములు. అయితే ఇది జ్ఞానపరమై ఆత్మతో సంబంధించిన దని గ్రహించవలెనే గాని, దేహముతో సంబంధించిన కర్మపరమైనదని తలంపరాదు.

ఇట్టి బ్రహ్మీభూతస్థితి గలుగుటకు అవిద్యాతనుసంబంధ గుణములు నశించి విద్యాతనువు గలుగవలసియుండును. ఇది గలుగునప్పుడు సర్వేంద్రియముల ద్వారా విజ్ఞానబోధైకరసామృతము పర్వతబిలములనుండి పరిశుద్ధమైన గంగ పొంగి ప్రవహించునట్లు ప్రవహించుచుండును. ఇదే దానికి గురుతు. దీనియొక్క సారమేమన? దేహేంద్రియాది సౌఖ్యములే గొప్పదిగా తలంచువాడు శూద్ర గుణముగలవాడు. ధనమే గొప్పదని తలంచువాడు వైశ్యగుణము గలవాడు. యశస్సే గొప్పదని తలంచువాడు క్షత్రియగుణము గలవాడు. దైవజ్ఞానమే గొప్పదని తలంచువాడు బ్రాహ్మణగుణము గలవాడు. భోగమే గొప్పదను తలంపు స్త్రీగుణమై యుండును. యోగమే గొప్పదను తలంపు పురుషగుణమై యుండును. క్షత్రియగుణము గలుగునప్పటినుండియే శుభేచ్ఛయు, బ్రహ్మజిజ్ఞాసయు, ముముక్షుత్వమున్ను, నివృత్తిమార్గబుద్ధియు గొప్పదను తలంపు గల్గును. అప్పటినుండి ఆత్మ వికాసమునకు వచ్చుచుండును. అదే దానికి గురుతు.



1931 లో రాజమహేంద్రవరములో జరిగిన

# శ్రీసనాతన ధర్మ సేవాసమాజ

ఐదవ వార్షికోత్సవమునందు శ్రీ మలయాళస్వాములవా రొసంగిన

# ఉపన్యాసము

ఓం నమో బ్రహ్మాదిభ్యో బ్రహ్మవిద్యా సంప్రదాయ కర్తృభ్యో
వంశఋషిభ్యో మహద్భ్యో నమో గురుభ్యః ॥
సాంబ శంభో మహాదేవ కృపాసాగర శంకర ।
మచ్చిత్త భ్రమరో నిత్యం తవాస్తు పదపంకజే ॥

ఓ పరిశుద్ధమైన జ్ఞానమును, కరుణము, విరక్తియు, సద్భక్తియు గలిగిన ప్రియసోదరీమణులారా! సోదరోత్తములారా! శాంతాత్మలారా! కరుణాళువులారా! దయామయుండగు సర్వేశ్వరుని కృపచేతను, కరుణాళువులగు పరమమహర్షుల కరుణచేతను లోకములో ప్రేమయు, శాంతియు, సద్భక్తియు, విజ్ఞానబుద్ధియు గలుగుటకొరకై మనమందరమును సర్వేశ్వరుని, పరమమహర్షులను ఒక్క నిమిషము నిర్మలహృదయముతో ధ్యానించెదము. దైవామృతమును లోకములో బోధించి జనులనందరిని అమృతులుగా చేయుటకు సర్వేశ్వరునిచే పంపబడిన దైవాత్మస్వరూపులారా! పరమపావనులగు మహర్షుల వంశములో బుట్టిన పుత్రికలారా! పుత్రులారా! మన అందరి జీవితము చాల పవిత్రమైనదనియే తలంచవలయును. లేనిచో పరమ పుణ్యప్రదేశమగు ఈగౌతమీతీరమున మనమందరము వేదాంత దివ్యరసాయనము పానముచేయుటకై యిచ్చట సమావేశము గలిగియుండ జాలము. కావున మనమందరమును ధన్యాత్ములము. సంశయము లేదు. కావున మన అందరి జన్మనిర్మలత్వమును గురించియు, మనలను గన్న తల్లిదండ్రుల నిర్మలత్వమును గురించియు, పరమపావనులగు మహర్షుల పుణ్యజీవితమును గురించియు, అపారకరుణాసముద్రుడగు సర్వేశ్వరుండు

మనకు గలుగచేసిన నిర్మలకాలవమును గురించియు, మరియొక్కసారి మనమందరమును పరమపావనమై, వేదములకు మూలమై, త్రిమూర్త్యాత్మకమై, సర్వచరాచరప్రాణికోట్ల అంతరంగమందు వెలుగుచుండు పరబ్రహ్మమును తెలిపెడు ఓంకారమును ఆత్మలో ధ్యానించి, నిత్యశుద్ధ, మంగళస్వరూపులై యుండుదుము గాక! ఋషిసంతానములారా! ఇచ్చట మనము శ్రీసనాతన ధర్మపరిపాలన సమాజముయొక్క ఐదవ వార్షికోత్సవము జరుపుటకై చేరియున్నాము. ప్రప్రథమమున చిత్తూరు జిల్లా పాలచ్చూరు గ్రామములో ఇది ప్రారంభింపబడెను. తద్గ్రామస్థులు నిండు భక్తిశ్రద్ధలతో సభ జరిపి ఆహూతులను భక్తి శ్రద్ధలతో ఆదరించి సంతుష్టిపరచి అనేక మహాత్ముల ఆశీర్వచనములకు పాత్రులైరి. ద్వితీయ వార్షికోత్సవము నెల్లూరుజిల్లా అరవపాళెము గ్రామములో జరిపి తద్గ్రామనివాసులు జనులను బహుభక్తితో సత్కరించి దివ్యయశస్సును బడసిరి.

తృతీయ వార్షికోత్సవము కృష్ణాజిల్లా పామర్రు గ్రామస్థులు నిర్వహించి అనేక పుణ్యపురుషులను వివిధోపచారములచే పూజించి యిహపర సౌఖ్యమునకు కావలసిన పుణ్యమును ఆర్జించి ధన్యత గాంచిరి. చతుర్థ వార్షికోత్సవము నెల్లూరుజిల్లా పెద్దగూడూరులో తద్దేశవాసులు నిండు ప్రేమతోను, భక్తితోను, శ్రద్ధతోను జరిపించి పుణ్యాత్ములై అచంచలమగు యశస్సును సంపాదించిరి. మొట్టమొదట ఈసభను ఉగ్గుమూడి సుబ్బారెడ్డిగారు ప్రారంభించిరి. ఇప్పుడు కానుపించు ఈ మహాసభ ఒక్కసభగా నుండవలయు నని ప్రథమమున తలంచినది కాదు. నానా ప్రదేశములలో నుండు శ్రీవ్యాసాశ్రమ భక్తులను ఒకే స్థలమున చేర్చుకొనుటకును, ఒక్కొక్కరికి పరస్పరమైత్రి గలుగచేసికొనుటకును మాత్రమే ఉద్దేశ ముండెను. ప్రథమ సమావేశములో జరుగుచుండు ప్రార్థన, భజన, కీర్తన, పారాయణాదులను, సుషుప్తిలో నుండు ఆత్మలకు ప్రబోధము గలుగజేసెడు వేదాంతపరమగు దైవోపన్యాసములను చూచిన వారందరును దైవపరవశులైయుండుట గాంచి అరవపాళెము పాటిమిట్ట నివాసులగు వెంకటసుబ్బారెడ్డిగారును, వాసుదేవరెడ్డిగారును ఒక్కసంవత్సరము అట్టి మహాకార్యము జరుపతలంచి వారి గ్రామమునకు ఆహ్వానించిరి. అచ్చట నుండి

పామర్రువారును, గూడూరువారును ఒక్కొక్క సంవత్సరము మహాసభను నిండు భక్తిశ్రద్ధలతో ఆరాధించిరి. ప్రప్రథమమున ఈ సభ జరుగుచుండగా దివంగతులును, మన ఆత్మసోదరియు, ఈ స్థలమునకు పవిత్రత గలుగచేసి మన అందరిని యీ ప్రదేశమునకు ఆకర్షించదగిన మహిమగలిగిన శ్రీమతి చల్లమ్మగారును, ఈ శ్రీకామమ్మగారును సభకు వచ్చియుండిరి. ఆ తరుణముననే మరు సంవత్సరమున ఈ ప్రదేశములో నీ దివ్యసభ జరుపతలంచి ఆహ్వానించిరి. పై జెప్పిన వెంకటసుబ్బారెడ్డి, వాసుదేవరెడ్డిగారును అదే సమయమున అహ్వానముచేసి యుండిరి. అప్పుడు ఎన్నికలలో వారికే అవకాశము లభించినది. అప్పటినుండి అహోరాత్రములు శ్రీమతి సోదరి కామమ్మగారును వారికి సంబంధించిన వారును గురువాక్యమును నిర్వహింపకపోయితిమి గదా యని చింతిల్లుచుండిరి. సుక్షేత్రములో పడిన బీజము వ్యర్థమైపోవనట్లు వారి హృదయాంతరాళములో నుండిన సంకల్పబీజము ప్రతిదినము పెరిగి యిప్పుడు బ్రహ్మవేత్తలగు మహాత్ములనెడి ఫలములతోను, పరమభక్తులను పుష్పములతోను, శమదమాది గుణములతో గూడిన శాంతాత్ములను పల్లవములతోను, కరుణాత్ములను కాయలతోను, మహాబ్రహ్మనిష్ఠులను శాఖలతోను అలరారునట్లు దైవకృపచే గలిగినది. ఇట్టి సాధుసజ్జనుల సభలు ఎక్కువగా హిందూస్థానములోను, తమిళనాడు, కర్ణాటక, మహారాష్ట్రాది దేశములలోను జరుగుచుండును. ఆంధ్రదేశములోను అచ్చటచ్చట జరుగకపోలేదు. వర్తమానకాలములో ఆంధ్రదేశ సోదరీ సోదరుల హృదయాంతరాళములో దివ్యతేజోమయశక్తి విజృంభితమగుచుండు విషయము లోకమంతట విదితము. దేశీయనాయకులును, తదనుయాయులును నిర్వహించిన మహాకార్యము దీనికి తార్కాణము. ఇది సూర్యోదయమునకు ముందుగా అరుణోదయమువంటిది యగును. వీరి అజ్ఞానాంధకారము నశించినది. ఇక వీరు తమస్సులో తనుకలాడజాలరు. దివ్యప్రకాశములో సంచరింప గలుగుదురు. ఇక యెక్కువ కాలము సభను గురించి వర్ణనచేసి కాలమును వ్యర్థపరచక కర్తవ్య విషయము లోనికి చిన్నగ ప్రవేశింతము.

ఈ సమాజముయొక్క ముఖ్యోద్దేశము సభామండప ద్వారములో వ్రాసియుంచబడిన బోర్డులో కానుపించు విషయమే. అదేమన ఇతరుల ఆత్మోన్నతికి అడ్డుపోవకయు, సాధ్యమైన సహాయము చేయుటయు, తన ఆత్మోన్నతికి అడ్డుగలిగిన తొలగించుటయును శ్రీసనాతన ధర్మసమాజము యొక్క ముఖ్యోద్దేశమై యున్నది. మరల విశ్వప్రేమను వృద్ధిచేసి ప్రేమామృతములో మనుజులకేగాక ఇతర ప్రాణికోట్లకు సహా బ్రతుకుటకు అవకాశము గలుగ జేసికొనుటయే యగును. దీనికి స్థూలప్రతిబంధమును మాత్రము తొలగించిన చాలదు. సూక్ష్మముగా నుండు మానసిక ప్రతిబంధములను గూడ గట్టిగ తొలగించవలసి యుండును. ఇట్టి విషయములో స్వరాజ్యవాదు లేలాగున ప్రాణమును గూడ త్యజింప సన్నద్ధులై యున్నారో, ఆలాగున స్వారాజ్యమును అనగా ఆత్మరాజ్యమును పొందుటలో ఆసక్తిగలవారు కొందరుండవలయును. ఈ ఉభయలోకములును మనకు దేహదేహులవంటివి అని మీరందరును మరువకయుందురు గాక ! అయితే యీ సమాజము ముఖ్యముగా స్వారాజ్యము, ఆత్మరాజ్యము లేక బంధవిముక్తి పరమగు నిత్యసౌఖ్య ప్రాప్తికొరకు ఎక్కువ ప్రయత్నించును. ఈ ఉద్యమము నుద్దేశించి ఇది స్థాపించబడినది. ఒకవేళ స్వరాజ్యము పొందినను స్వారాజ్యము పొందకపోయిన మన జీవితము జీవచ్ఛవమువంటిదే యగును. దీని యందు సందేహము లేదు. ప్రాచీన కాలములో నుండి భారతీయులకు గలిగియుండు ప్రాముఖ్యము ఈ యొక్క అంశమును బట్టి మాత్రమే కల్గినదని చరిత్ర పరిశీలన కారులందరును ఎరిగియుండునదే గాక విదేశీయులు గూడ ఈ దివ్యాత్మభావము నుద్దేశించిమాత్రమే వర్తమాన యుగములో గూడ భారతీయులను ప్రేమించు చున్నారు. ఇచ్చో ఒక్క రహస్యము గలదు. ప్రాణముమాత్రముండియు, శారీరేంద్రియములకు సౌష్ఠవము లేనిచో గొప్పలాభము బడయజాలము. దేహేంద్రియములు పుష్టిగానుండినను, దివ్యమగు ప్రాణశక్తి ప్రకాశింపకుండినచో జడశవమునకు ఎక్కువ గొప్పతనము ఏమియు లేదని గూడ మనము జ్ఞప్తిలోనుంచవలెను. మరియు ఆత్మలాభము గలుగనివారు లోకలాభమును సంపాదింపజాలరనియే మన పూర్వీకులగు మహర్షులు మనకు తెలిపియున్నారు.

మిత్రులారా! ప్రేమామృతులారా! చిత్రమునకు భిత్తి (గోడ) యెట్లవసరమో, ఆలాగున మతమునకు దేశమును ఉండే తీరవలయును. దేశమునకు దౌర్భాగ్యము గలిగినచో భిత్తి చెడిన చిత్రమువలె మతమునకు కీడు వాటిల్లుట నిక్కము. ఈ రహస్యము పుణ్యభూమియగు భారతభూమిలో పుట్టిన సర్వప్రాణికోట్ల హృదయాంతరాళములో జాగ్రత్స్వప్న సుషుప్తులలో గూడ నిలుపక జపించు చుండు మహాగాయత్రీ మంత్రమగు హంస మంత్రమువలె మరువక యుండతగిన దివ్యోపదేశమై యున్నది. అయినను దేశమునకు గలిగిన దురవస్థకు మూలకారణము పరిశీలింపక ప్రయత్నించినచో అది రోగకారణము నెరుంగక చేసెడు చికిత్స వంటిదే యగును. దీనియొక్క మూలతత్త్వమును గమనించి అగాధములో దిగి విచారించిన సర్వజనులకు గుణ కర్మముల ననుసరించి సర్వ విషయములలో స్వాతంత్ర్యము లేకపోవుటయే యని గాఢ చింతనగల వారందరికిని తెలియక పోజాలదు. దైవకృపచేత ఇప్పుడు గల మహాపురుషుల అందరి హృదయములలోను ఇట్టి విషయమున నిజతత్త్వము ఉదయించుట తమసావృత ఆకాశ మండలములో సూర్యోదయము వంటిది యగును. ఇది భవిష్యత్ మంగళసూచనము. ఉద్యమమునకు సంబంధించినది కానందుచేత ఒక ప్రక్క త్రోసివేసి కర్తవ్యకార్యము లోనికి మెల్లమెల్లగా ప్రవేశించెదము. ఇది సంఘసంస్కరణము, మతసంస్కరణము, దేశసంస్కరణము కానందుచేతను, కేవలము సర్వజనుల ఆత్మసంస్కరణమై యుండుటచే అట్టి విషయములోనికి దిగెదము.

ఇది అత్మోపలబ్ధి లేక ఆత్మలాభము, లేక ఆత్మయొక్క నిత్య, శుద్ధ, విముక్త, అవస్థను తెలిసికొనుటయే యగును, ఇది తెలియక పోయినచో మానవుడు అనుభవింపదగిన యింద్రియాతీత నిత్యసౌఖ్యమును ఎవరును పొందజాలరు. ఇంద్రియసౌఖ్యములు మాత్రము అనుభవించుట పశువుల ధర్మమేగాని పాశవిముక్తినొంద తలంచిన మానవుని ధర్మమేమాత్రమును గాజాలదు. అంతేగాక అట్టి మానవుండు స్వరాజ్యములో గాని, స్వారాజ్యములోగాని నిర్భయముగా ప్రయత్నించుటకును శక్తి గలిగి యుండజాలడు. కావుననే శ్రీకృష్ణభగవానులు భగవద్గీతయందు ఉపదేశ

ప్రారంభమైన ద్వితాయాధ్యాయమున ఆత్మ ప్రాప్తిపరమగు సాంఖ్యయోగమును ధర్మ సందిగ్ధభ్రమలో మునిగి దిక్కు తెలియని అర్జునునికి బోధించుటకు కారణమైనది. ఈ యోగమందు అర్జునునికి ఆత్మయొక్క నిత్యత్వమును, అమృతత్వమును, శాశ్వతత్వమును, అవధ్యత్వమును, ఆనందమును లభించినందుచే పిమ్మట స్వరాజ్యము సంపాదించుటకు శక్తిగలవాడయ్యెను.

కునుకనే ''యోగః కర్మసు కౌశలం'' అని శ్రీభగవానులేగానము చేసిరి. కర్మములు చేసి కర్మము చేయనివాడై యుండెడు పదవి యేది గలదో అట్టి కుశలత్వమే యోగ మనంబడును. లోకమంతటు చూచిన కర్మము చేయువారనేకు లని చెప్పువారును, ఏ కర్మము చేయనివారని పలుకువారు మరికొందరును కనబడుచున్నారే కాని కర్మలచేసి కర్మ చేయుట లేదని చెప్పువాడు మాత్రము కనబడుట అరుదుగా నున్నది. ఇట్టి వాడుండవలెననియే శ్రీగీత మన కుపదేశించుచున్నది. కర్మ చేయుచున్నామనియు, ఏకర్మము చేయుటలేదనియు చెప్పువారుభయులును భవప్రవాదములనెడు ప్రవాహములచే కొట్టుకొనిపోయెడువారే యగుదురు. మూడవవాడొక్కడు మాత్రమే విజ్ఞానబోధ మనెడు ఓడలో ఎక్కి యీ మహావేగముతో గూడిన ప్రవాహమును సుఖముగా దాటి నిత్యశాంతి అను మహర్షులు చెప్పెడు దరిని చేరి సుఖింపగలుగును. గీతయొక్క పరమ రహస్యమంతయు ఈ రెండు వచనములలోనే గూఢమైయున్నది. ఇట్టి కర్మయోగముయొక్కయు, జ్ఞానయోగముయొక్కయు పరమ రహస్యమగు గీతాశాస్త్రమును చక్కగా మానవులందరును చదివి విచారము చేయకపోవుటయే మహర్షుల పాదధూళి చేత పునీతమైన ఈ భారతదేశము అగాధదుఃఖములో దిగిపోవుటకు కారణము. సాధువులును, సత్పురుషులును, సాధుసంఘములును కావలసినంత లేక పోవునటచే జనుల ఆత్మోన్నతియింత హీనస్థితికి వచ్చినది. పడగనెత్తి బుసకొట్టుచు విషముగ్రక్కుచుండు త్రాచుపామును పట్టుకొనుమని యెంత విశ్వాసముగలవారు బోధించినను సామాన్యజనులు పట్టజాలరుగదా! బోధకుని యందు భక్తివిశ్వాసము గల కొందరు ప్రాణముపైగల ఆశను విడిచిపెట్టి

పట్టుకొనవచ్చును. గరుడమంత్రమును తెలిసియుండువాడు అట్టి భయంకరమైన కాలకూట విషమును గ్రక్కుచుండు అ సర్పమును అవలీలగా పుష్పమాలికవలె ఎత్తుకొని ఆడించును గదా!

ఈతత్త్వమే వేదాంతశాస్త్రము బోధించెడు పరమరహస్యమైయున్నది. లేక అతివేగముగా ప్రవహించెడు నదిని దాటుటకు ఈత తెలియని వానికి నెంత ప్రయాసయో, ఈత తెలిసిన వానికి ఎంత సులభసాధ్యమో, ఆలాగుననే సంకల్ప సంకులమైన ఈ ద్వంద్వ ప్రవాహమును ఆత్మవేత్త ఒక్కడు మాత్రము దాటునేగాని తక్కిన వారికి తరముగాదు. దుఃఖమయమగు సంసారసాగరమును తరింపజేసెడు ఈ జ్ఞానమనెడు ఓడయే తారకమై ప్రకాశించుచున్నది. అదే రీతిగా స్వరాజ్యములో స్వశక్తిని వినియోగించి సాధించుటకు గూడ స్వారాజ్యసిద్ధి పొందియుండవలయును. ఇదే గీతాశాస్త్రము మనకు బోధించు ప్రాణమంత్రము.

క్రొత్తగా ఈ సభలో నిర్ధారణచేయలసిన విషయము లేలియలేవు అరవపాళెము సభలో ఆమోదింపబడిన రెండు విషయములలో చేయవలసిన పనులు ఇకను చాల గలవు. అనేక విషయములను నిర్ధారణ చేసి అమోదించినను అనుష్ఠానమునకు తీసికొని రానిచో ఇసుమంతయు ప్రయోజనము లేదు. అనేకములగు మొక్కలను పెట్టి పోషింపకపోవుటకన్న ఒక్క మొక్కను పెట్టి పెంచిన చాలును. దేశోద్ధారణమునకు బూనుటకు ముందుగా ఆత్మోద్ధారణ అవసరమని మునుందు ప్రతిపాదించిన విషయముచేత మీరిప్పుడు ఎరింగియున్నారు. అట్లు గానిచో అంధుడు మరియొక అంధునికి మార్గదర్శకుడుగా ఉండుటకు బూనినట్లే యుండును. కావున మనము వ్రాసిన గ్రంథములుగాని, వ్యాసములుగాని, పత్రికలుగాని, ఉపన్యాసములుగాని అనుష్ఠానము లేనిచో నీటిపై వ్రాసిన అక్షరములవలె నుండును. హృదయాంతరాళములో నిండు విశ్వాసముతో, సత్యధర్మనిష్ఠలతో గూడిన అనుష్ఠానము శిలారేఖవలె శాశ్వతముగా నుండును. అధ్యాత్మలోకమును ఉన్నతస్థితికి తీసికొని రావలసియుండిన బ్రహ్మనిష్ఠులకును, బ్రహ్మచారులకును,

బ్రహ్మచారిణులకును పూర్వీక ఋషిసంప్రదాయమును ననుసరించిన ఆశ్రయముండే తీరవలయును. విరక్తులై బ్రహ్మనిష్ఠ చేయువారిలో కొందరికి జీవనోపాయము జరిగెడు మార్గము లేకపోవుటచేతను, మరికొందరికి జీవనోపాయముండియు తగిన ఆశ్రయము దొరకకపోవుటచేతను ఉన్నతస్థితికి రాజాలకయున్నారు. బ్రహ్మచారులకు, బ్రహ్మచారిణులకు అధ్యాత్మవిషయము నిస్సంశయముగా తెలిసికొనుటకు సంస్కృత విద్యయు, ఖండాంతరములతో సమన్వయపరచుకొనుటకు ఆంగ్లేయ విద్యయు అత్యావసరము. ఇదియు ప్రాణాయామ ప్రణవాది మంత్రజప బ్రహ్మచర్యవ్రతముతో, దగిన ఆహారముతో గూడియుండిన మాత్రమే వృద్ధికి రాగల్గుదురు. పై జెప్పినవారందరికిని తగిన యేర్పాటు ఉండిన మాత్రమే ఈ కార్యము సాధ్యపడునేగాని గత్యంతరము లేదు. లోకోద్ధారణ బుద్ధిపై లక్ష్యముంచి అత్మోద్ధారణ నిష్ఠలో నిరంతరము కాలము గడిపి కరుణాన్వితుడై, శాంతియుక్తుడై, విరక్తుడైన ఒక బ్రహ్మనిష్ఠునికి, ఒక చిన్న ఆశ్రమము నేర్పరచి అన్నాదులచేత సంరక్షించిన వేలకొలది శివాలయములను, విష్ణ్వాలయములను ప్రతిష్ఠించి త్రికాలఅభిషేక పూజార్చన, దీప ధూప నైవేద్యాదులచే పూజించుటకన్న కోటిరెట్లు ఫలము గలదు. ఇది ముమ్మారు నమ్మవలయును. ఈ తత్త్వము ఉత్తరభూమిలో సంచరించు వారందరికిని గోచరించును. కనుకనే ఉత్తరభూమి పుణ్యభూమి యగుటకు కారణమైనది.

**స్నాతం తేన సమస్తతీర్థ నిచయే దత్తం మహీమండలం**
**విప్రేభ్యః పితృదేవతా స్సురగణా స్సర్వేపి సంతర్పితాః ।**
**జప్తా మంత్ర సహస్రకోటి రమునా తప్తం చ తీవ్రం తపో**
**యస్య బ్రహ్మ విచారణే క్షణమపి ప్రాప్నోతి స్థైర్యం మనః ॥**

ప్రపంచములో గల సమస్త తీర్థములలో సంకల్పదాన పూర్వకముగా స్నానము చేసిన ఫల మేదిగలదో, చక్రవర్తియైనవాడు పుణ్యకాలములో కాశ్యాదిక్షేత్రములలో వేద వేదాంతపారంగతులగు బ్రాహ్మణులకు భూమండలమంతయు దానమిచ్చిన ఫలమేది గలదో, విప్రులను పితృదేవతలను

సంతృప్తిపరచిన ఫలమేది గలదో, బ్రహ్మ విష్ణు మహేశ్వరాది సమస్త దేవతలను సంతృప్తిగా ప్రతిష్ఠించి పూజించిన ఫల మేదిగలదో, గాయత్ర్యాది మహామంత్రముల నన్నిటిని వెయ్యికోట్లసార్లు జపించిన ఫలమేదిగలదో, కృచ్ఛ్రచాంద్రాయణాదితీవ్రతపస్సుచే గలిగెడు ఫల మేది గలదో అవన్నియు ఒక్క క్షణకాలము వృత్తిరహితమై బ్రహ్మాకారవృత్తితో నుండెడు ఫలమునకు సరిపోజాలవు. ఇట్లు చెప్పుటచే దైవారాధన స్థలము అక్కరలేదని భావించుకొనరాదు. కాని దానియొక్క ప్రయోజనముపై లక్ష్యముంచిన సామాన్యజనులకు పరోక్షజ్ఞానమును, దైవభక్తియు, సత్యధర్మములయొక్క ఫలమును కొంతవరకు లభించవచ్చును. అయినను డబ్బంతయు దేవాలయనిర్మాణములో ఖర్చు పెట్టక విద్యార్థులయొక్కయు, విరక్తులయొక్కయు, బ్రహ్మనిష్ఠుల యొక్కయు, ధర్మప్రచారకుల యొక్కయు ఉపయోగార్థముగా వినియోగపరచవలెను. పూర్వీకుల ఆశయమంతయు దీనిపై ఆధారపడియున్నది. అంతేగాని బ్రహ్మాండముగా దేవాలయములను కట్టి వేశ్యాస్త్రీల నాట్యనటనాదులను ఏర్పరచెడు స్థలము దైవస్థలము గాదు. దయ్యపు స్థలమే యగును.

విషయవిరక్తులైనవారికి బ్రహ్మసాక్షాత్కారము కొరకు శ్రవణ మనననిదిధ్యాసనములకును, ధారణధ్యాన సమాధులు అభ్యసించుటకును ఏకాంతప్రదేశమున, ఆశ్రమములు మన కత్యవసరములు. ఉత్తరదేశములో చిన్నచిన్న దేవాలయములు భగవత్ప్రార్థన విషయమై యేర్పాటుచేసి యుండినను అట్టి దేవాలయములు బ్రహ్మచారులకును, బ్రహ్మనిష్ఠులకును, ధర్మప్రచారకులకును ఎంతో ఉపయోగపడుచున్నవి. బ్రహ్మాండముగా నిర్మించియుండు దక్షిణదేశ దేవాలయములచే ఇట్టి పవిత్రభావము జనుల కుపయోగపడుట అరుదు. మనప్రాంతములో విరక్తులై బ్రహ్మనిష్ఠచేయువారికి దగిన అనుకూలత లేకపోవుటచే పుణ్యపురుష లందరును ఉత్తరదేశమునకు వెళ్లుచున్నారు. ఇది హృషీకేశము, హరిద్వారము, శ్రీకాశి మొదలైన స్థలములు చూచినవారికి గోచరింపక మానదు. పుణ్యపురుషులందరు ఈలాగున

వెళ్ళిపోవుటచే దేశముయొక్క పవిత్రతకును, అభివృద్ధికిని, జ్ఞానమునకును హాని గలుగుచున్నది. అట్టివారిని ఇచ్చటనే నిలబెట్టుటకును, హృషీకేశ కాశ్యాది దేశములనుండి కావలసియుండిన మహాపురుషులను రప్పించి యిచ్చట నిలబెట్టుటకును ఆశ్రమము తప్ప మరి యే యుపాయమును లేదు. ఈ తత్త్వము విశాల హృదయులకును, విశుద్ధాంతఃకరణులకును గోచరించును. పుణ్యపురుషు లందరును వెళ్ళిపోవుటచే పాపము వృద్ధియై, పాపాత్ములెక్కువై లోక అప్రతిష్ఠకు గూడ కారణమై యిహలోకసుఖమైనను జనులు సుఖముగా అనుభవింపజాలక పోవుదురు.

అయినను దైవకృపచేత ఇప్పుడిప్పుడు అచ్చటచ్చట చిన్న చిన్న ఆశ్రమములు ఏర్పడి పూర్వీకఋషి సంప్రదాయముల ననుసరించిన సంస్కృతవిద్యాభ్యాసము, అహింస, శాంతము, కరుణ, తపస్సు ఇత్యాది దైవగుణములు వృద్ధి యగుచుండుట శుభసూచకమై యున్నది. హృషీకేశము, కాశి మొదలైన దివ్యస్థలములలో దక్షిణదేశీయులు బ్రహ్మనిష్ఠ లెందరో గలరు. అట్టి మహాపురుషులకు ఇచ్చట తగిన వసతి లేకపోవుటగదా వారు వెళ్ళిపోవుటకు కారణము! మరియు మంచి ఆశ్రమము లేర్పాటుచేసికొని బ్రహ్మవిద్యా ప్రబోధము చేయు పద్ధతి యీ ప్రాంతములో సమీపకాలమున విరివిగా అలవాటులో లేనందుచేత నూతన ప్రవర్తకులకు బహువిధములగు ప్రతిబంధములును, నిందలును గలుగుచుండును. అయితే దానికై వచ్చినవారు అట్టి దానిని చేసితీరుదురు. చీకటి సందులో గదా దీపముపెట్టవలయును! ఆరోగ్యశాఖవారు మురికిప్రదేమును గదా శుభ్రపరచెదరు! కావున దైవాదేశనియుక్త మహాపురుషులు పాపులను, దీనులను ఉద్ధరించుటలో జీవితమును వినియోగపరచెదరు. రోగులుండే స్థలములో వైద్యులుండవలెననిగదా శ్రీ యేసుక్రీస్తుదేవుడు ఉపదేశించుచున్నాడు. దీనికి జనుల హృదయములో వైశాల్యము విశుద్ధతయు లేక పోవుట కారణమేగాని మరి యేమియుగాదు. ఓర్పుతో ఇట్టి దైవభావమును జనులకు బోధించి దీనియొక్క పరమతత్త్వమును గోచరింపచేసిన మరల వారే యీ మహాకార్యము నిర్వహింపగల్గుదురు.

ఇది సామాన్యజనుల పొరబాటుచే గల్గినది గాదు. సాధువులలో గల కళంక మనియే నమ్ముచున్నాను. ఎయతి ననుసరించిన నియమనిష్ఠయు, నిర్మలవర్తనమును, నిరంతర బ్రహ్మచింతనయు, సత్యధర్మ నిష్ఠయు, పరోపకార బుద్ధియు, కరుణయు, విరక్తియు, ఇంద్రియనిగ్రహమును సాధువులలో కొరవడి యింద్రియాదిసౌఖ్యములలో భోగలాలసులై, కరుణకు దూరులై సత్యప్రకాశములేని మరుగులో పడిపోవుటచే గలిగిన కళంకమేగాని మరియేమియు కాదు. ఇట్టి కళంకముండుటచే విద్యావైశాల్యమును, వివేకబుద్ధియు, విజ్ఞానాసక్తియు గల గృహస్థులు సాధుమార్గములో ప్రవేశించుటకు అసహ్యపడుటయేగాక బ్రహ్మవిద్యయందును, బ్రహ్మనిష్ఠులయందును లాఘవబుద్ధి గలిగియున్నారు. దీనివల్లవారు తరింపకపోవుటయే గాక తరణాభిలాషగలవారికి సహాయముగూడ చేయకయున్నారు. ఇట్టి పాతకబుద్ధిని తొలగించుటకు నివృత్తిమార్గస్థులలో నుండు నారీమణులును, నరోత్తములును వారి జీవిత మంతయు బ్రహ్మనిష్ఠ చేయుటలో ఫలాపేక్షను కోరక వినియోగపరచిన మాత్రమే వసంతకాలము వచ్చినప్పుడు వనము శోభాయమానమై ప్రకాశించునట్లు జనుల హృదయము శాంతి సత్య కరుణాది ఫల పల్లవములచే రమ్యమై ప్రకాశించుచుండును. నిజమైన ఋషి వంశములోను, మహాపురుషుల సంఘములోను పుట్టిన వారైనచో చేయవలసిన కర్తవ్యమిదియని మరువకయుందురు గాక!

ఉత్తరదేశీయులు చాల పుణ్యస్వభావము గలవారగుటచే సర్వేశ్వరుడు ఇచ్చిన ధనమును గుడిగోపురాదులకు ఎక్కువ వ్యయము చేయక బ్రహ్మనిష్ఠులకును, బ్రహ్మచారులకును ఉపయోగపరచి ధన్యులగుచున్నారు. ఇతరులను ధన్యులను గావించుచున్నారు. కావున ఆత్మస్వరూపులారా! బ్రహ్మనిష్ఠులను, బ్రహ్మచారులను ఆదరించుటలో జీవితము వినియోగపరచుడు. ఇచ్చోనుండు వారిలో ఈ లాగున తలంచువారుగూడ నుండవచ్చును. సోమరులై తిరిగి గృహస్థులను బాధించి జీవించెడు సాధువులు గుంపులు గుంపులుగా నున్నారు. ఇట్టి తిండిపోతులను పోషించుటయా

మనధర్మమని తలంచువారు గూడ నుందురు. వీరిచే లోకమునకు నేమి ప్రయోజన మని కొందరడుగుదురు. వీరికి సహాయము జేయుట ఆత్మద్రోహమనియు, దైవద్రోహమనియు తలంచువారు గూడ లేకపోలేదు. ఇదియు కొంతవరకు సత్యమే యైనను అందరును అట్లున్నారని తలంచుట చాలా పొరబాటే గాక పాతకము గూడ నగును. అట్టి త్రిమ్మరులను పోషించవలె నని యెవ్వరును చెప్పరు. కనుకనే విరక్తులై బ్రహ్మనిష్ఠాపరులై లోకసేవాతత్పరులైన వారని విశేషణముతో ముందుగా సంబోంధించిన తాత్పర్యము. సాధువైన యొక భగవాన్ రామకృష్ణపరమహంస పుణ్యజీవితముచే ఎన్నికోట్ల జనులు పుణ్యాత్ములై ఇహపరదుఃఖ సాగరమును దాటిరి! సన్న్యాసియైన యొక్క శ్రీవివేకానందగురునిచే ఎందరో శాకసాగరము దాటి ధన్యాత్ములైరి. ఆలాగున ఒక జగద్గురు శ్రీశంకరభగవత్పాదులచేతను, ఒక శ్రీరామానుజాచార్య స్వాములచేతను, ఒక శ్రీమధ్వాచార్యస్వాములచేతను, ఒక్క శ్రీకృష్ణచైతన్యస్వాముల చేతను, ఒక్క శ్రీరాజారాంమోహనరాయ్ చేతను, ఒక్క శ్రీదయానంద సరస్వతీస్వాములచేతను, ఒక్క బుద్ధదేవుని చేతను, ఒక్క యేసుక్రీస్తుచేతను, ఒక్క శ్రీమహమ్మదునబివారిచేతను, ఒక్క శ్రీగురునానక్‌చేతను ఏవిధముగా లోకము తరించబడెనో యోచింపుడు. వీరందరును సాధుమూర్తులు గారా? సన్న్యాసులు గారా?

కావున మహర్షులవంశములో బుట్టిన సోదరీ సోదరులారా? పై జెప్పినవారి దివ్యజీవితములను స్మరించి ఉత్తిష్ఠత లెండు! జాగృత, సుషుప్తినుండి మేల్కొనుడు! ప్రాప్యవరాన్ నిబోధత! ప్రకృతికి పరమైన పరమాత్మస్థితిని బొందినవారిని విధిప్రకారమున ప్రాపించి జన్మముయొక్క ఆవశ్యకతను త్వరలో తెలిసికొనుడు. ఏలన కాలచక్రము త్రిమూర్తులను గూడ అలక్ష్యముచేసి ఒక్క నిమిషమైనను నిలువక తనయొక్క ప్రయాణమును సాగనిచ్చుచున్నది. దైవాత్మస్వరూపులారా! కరుణాళువులారా! ఋషుల సంతానములారా! ఉదయమైన వెంటనే మధ్యాహ్నము వచ్చుచున్నది. తర్వాత వెంటనే అస్తమయమును బొందుచున్నది. మరల రాత్రియు పిమ్మట దివసము,

వారము, పక్షము, మాసము, ఋతువు, ఆయనము, సంవత్సరము అదిగో అతివేగముగా దాటిపోవుచున్నవి. ఇట్టి తరుణములో ఊరకుండుట పాడియగునా? కావున మాయా మోహసుషుప్తినుండి జాగ్రతనొంది ఆత్మావలోకనమును చేయుటలో ఉన్ముఖులై ధైర్యసాహసములతో నిలుచుకొనుడు.

భయపడకుడు, భయమే మాయ. అది అజ్ఞానజనితము. మీరు జ్ఞానమూర్తులు, మాయను మటుమాయనుగా చేయుటయే మీపని యని కృతసంకల్పులై లెండు శోకసాగరమును దాటి నిత్యసుఖమును బొందుడు. అమృతమై శివమైన పదవి నధిష్ఠించి సుఖింపుడు. ఇట్టి అమృతకలశము మీ అందరి హృదయములో ప్రతిష్ఠితమై యున్నది. మనుష్యమాత్రు లందరికిని అట్టి సుఖ మనుభవించుటలో మార్గము తెరచిపెట్టుడు. అప్పుడే మీ యొక్క ప్రతిబంధపు కోటధ్వంసమై మార్గము తెరవబడును. శ్రీబాలగంగాధరతిలకుగారు స్వరాజ్యము తన జన్మ హక్కని ఉద్ఘోషించునట్లు, స్వారాజ్యము మనుష్యులందరి జన్మహక్కని సూర్యుడు ప్రకాశించుచుండు నప్పుడు రాజ వీథిలో ఏనుగుపై భేరీ మ్రోగించి ఉచ్చస్వరముతో ఉద్ఘోషించి చెప్పుడు. అంతేగాక, అట్టిస్థితి పొందుటకు అభిలాషగలవారికి సాధ్యమైన సహాయముగూడ చేయుడు. అప్పుడే సర్వేశ్వరుండు మీపై కరుణగలవాడగును. ఈశ్వరుడిచ్చిన ధనమును, తనువును, మనమును నిశ్శేషముగ ఈశ్వరార్పిత విషయమై వినియోగపరచువాడే పరమభక్తుడును, పరమజ్ఞానియును అగును. నిష్కామ కర్మయోగముచే కాయేంద్రియముల శుద్ధియు, దివ్యనామ కీర్తన భజన పారాయణాదులచే వాక్శుద్ధియు, స్మరణ, ధారణ, ధ్యాన, సమాధులచే మనశ్శుద్ధియు గలగవలసి యుండును. అప్పుడు మాత్రమే నిరావరణ మేఘముగల ఆకాశమండలములో సూర్యుడు ప్రకాశించునట్లు మీ హృదయాకాశములో జ్ఞానభాస్కరుడు ఉదయించును. పైజెప్పిన వానిలో ఒక్కొక్కటి మాత్రము చేయువానికి ఒక్కొక్కటి మాత్రమే శుద్ధపడును. మూడును చేయువారికి త్రికరణశుద్ధి గలిగి గుణత్రయాతీత ప్రబోధజ్ఞానము గల్గును. ఇవి మూడును చేసికొని మూడింటికి విలక్షణుడై యేమియును

చేయనివాడని జ్ఞానము గలుగునప్పుడు మీరు ధన్యాత్ములగుదురు. సంసార మహాభ్రమణ చక్రము నుండి విముక్తి నొందుదురు. సర్వపాపములును అప్పుడు ఛేదింపబడును. కర్మకట్టె లన్నియు దహించిపోవును. అద్వయమై శివమై అమృతమై అఖండమై జ్ఞానమై మీరు మిగిలి యుందురు.



# ఆత్మయజ్ఞము

నైమిశారణ్యములో శ్రీశౌనకాదిమహర్షులు జనులకు ఆత్మతత్త్వమును బోధించు ఉద్దేశముతో ఏర్పరచిన నిమిత్తమాత్ర మగు యజ్ఞ మెటువంటిదో, అట్టి పవిత్రభావముతో మన మందరమును శ్రీగౌతమమహర్షి పాదధూళిచే పునీతమగు ప్రదేశమున నిప్పుడు చేరియున్నాము. యజ్ఞము ద్వాదశసంవత్సరములు మాత్రము చేయవలయునని లేదు. శక్తికొలది సంవత్సరములుగాని, నెలలుగాని, వారములుగాని చేయవచ్చును. ఒక్కరోజు చేయు శక్తిగలవారైనను అదియు యజ్ఞమే యగును. మనము అగ్నిహోత్రములతో గొప్ప యజ్ఞము చేయకపోయినను ఆత్మయజ్ఞమునే ముఖ్యముగా నిర్వహించు చున్నాము. ఇది యజ్ఞము లన్నిటిలోను ముఖ్యమైన దని శ్రీకృష్ణభగవానులే గీతయందు ఉపదేశించి యున్నారు. కావుననే ''యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి'' యజ్ఞము లన్నిటిలోను ఆత్మధ్యానపరమగు జపయజ్ఞము సర్వోత్కృష్టమని భగవంతుడే తెలిపి యున్నాడు. ఇది కర్మకలాపముతోను, జాత్యాది భేదముతోను సంబంధము లేకనే వారివారి హృదయములో చేయందగిన మహాయజ్ఞమై యున్నది. బాహ్యయజ్ఞములు నిష్కామ బుద్ధితోను, ఈశ్వరార్పిత భావముతోను చేసిరేని క్రమముగా, అంతఃకరణశుద్ధిగలిగి సోపానమార్గముగా క్రమముక్తి గలుగుననియే శాస్త్రము విధించుచున్నది. ఆత్మ యజ్ఞపరమగు శ్రీకృష్ణభగవానులు ఉపదేశించిన జపయజ్ఞము బాహ్యకర్మానుష్ఠానములతో సంబంధింపక సులభముగా సాక్షాన్ముక్తిని గలుగచేయునదిగా నున్నది. ఈ విషయమై ధర్మశాస్త్ర

మూలసూత్రమును రచించిన మనుమహర్షి ఉపదేశించినది గూడ మనము గ్రహించతగినది.

**విధియజ్ఞా జ్జపయజ్ఞో విశిష్టో దశభిర్గుణైః ।**
**ఉపాంశుః స్యాచ్ఛతగుణః సాహస్రో మానసః స్మృతః ॥**

విధిప్రకారముచేయు అశ్వమేధాది సమస్తయజ్ఞములకన్న ఆత్మయజ్ఞపరమగు ఓంకార వ్యాహృత్యాదుల జపము పదింతలు మేలు. ఆ జపమే ప్రక్కననుండువారు వినకుండ జపించుట నూఱింతలు హెచ్చు ఫలమును గలుగచేయును. ముందు చెప్పినది వాచక మనియు, ఇది ఉపాంశువనియు గ్రహించవలయును. అది మానసికమైనచో వెయ్యింతలు హెచ్చుఫలము నిచ్చును. (మానసిక మనగా నాలుకయు, పెదవియు, దంతములును నించుకంతయు గదలకుండ జపించుట.)

**యే పాకయజ్ఞా శ్చత్వారో విధియజ్ఞ సమన్వితాః ।**
**సర్వే తే జపయజ్ఞస్య కలాం నార్హంతి షోడశీమ్ ॥**

పాకయజ్ఞములైన అగ్నిష్టోమాదులాదిగా గల నిత్యనైమిత్తిక యజ్ఞములును, అశ్వమేధాదిమహాయజ్ఞములును, ఇతరములగు విధియజ్ఞములును, ఈ ఆత్మయజ్ఞపరమగు జపయజ్ఞ మనంబడు ప్రణవోపాసన యజ్ఞముయొక్క పదునాఱవభాగములో ఒక్క భాగమునకు సరిపోజాలవు.

**జప్యేనైవ తు సంసిధ్యేద్బ్రాహ్మణో నాత్ర సంశయః ।**
**కుర్యా దన్యన్నవా కుర్యాన్మైత్రో బ్రాహ్మణ ఉచ్యతే ॥**

బ్రహ్మనిష్ఠుడు జపముచేతనే నిస్సంశయముగా మోక్షసిద్ధిని బొందును. తక్కిన యాగాది వైదికకార్యములను జేసినను జేయనీ, చేయక వదలినను వదలనీ, బ్రాహ్మణుడు సర్వప్రాణిమైత్రుడు. యాగాదులందు ప్రాణిహింస చేయక తప్పదు కాన కొన్ని జంతువులకు విరోధి కావలసి వచ్చును. కనుక జపకర్మచే నెవ్వరికిని విరోధికాక సర్వప్రాణులకు మిత్రుడయియే యుండును.

**క్షరంతి సర్వా వైదిక్యో జుహోతి యజతి క్రియాః ।**
**అక్షరం త్వక్షరం జ్ఞేయం బ్రహ్మ చైవ ప్రజాపతిః ॥**

వేదవిహితములైన హోమయాగరూపములగు క్రియలన్నియు నశించుచున్నవి. ఓ మను నక్షరము బ్రహ్మప్రాప్తి హేతుభూతమగుట వలన నశింపదు, ఏలయన, ప్రజల కధిపతియు నీబ్రహ్మమే. కాన నా బ్రహ్మస్వరూపమే యీ యోంకారము. బ్రహ్మస్వరూపముగను, బ్రహ్మ ప్రతిపాదకముగను నుండుటచేత నోంకారమే బ్రహ్మము. రెండు తెరగులను బ్రహ్మత్వముచేతను, బ్రహ్మత్వ ప్రతిపాదకత్వముచేతను నోంకారమును జపించుట మోక్షప్రదము అని భావము. ఇక ఆధ్యాత్మజ్ఞాన విషయమైన యజ్ఞములను శ్రీకృష్ణపరమాత్ముండు గీత చతుర్థాధ్యాయమున వివరించినదిగూడ మనము గ్రహించ తగినది. ఇది గ్రహించిన ఆత్మయజ్ఞాధికారము సర్వజనులకు కలదనియు, వారివారి శక్తి ననుసరించి చేసిన చాలుననియు మనము గ్రహింపవచ్చును. గీత అ.4శ్లో. 25 ఇచ్చట నుండి ఆరు శ్లోకములు యజ్ఞవిషయమును గురించి వివరింపబడుచున్నవి.

**దైవమేవాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే ।**
**బ్రహ్మాగ్నావపరే యజ్ఞం యజ్ఞేనైవోపజుహ్వతి ॥**

అర్జునా! బ్రహ్మానుభవరూప జ్ఞానయజ్ఞము తక్కిన యజ్ఞము లన్నిటికన్న శ్రేష్ఠమైనది సుమా! ఎట్లనిన, కర్మయోగ నిష్ఠులైన కొందరు ఇంద్రసూర్య వరుణాది దేవతల నుద్దేశించి బ్రహ్మభావన బుద్ధిలేకుండ చేయబడు యజ్ఞములను చేయుదురు. ఇక కొందరు యోగనిష్ఠులు ''నేతి నేతి'' ఇది కాదు, ఇది కాదు, అని తక్కిన పదార్థము లేవియు నిదికాదని నిషేధరూపమున దెలియజేయబడు సర్వవ్యాపకమైన వస్తువే బ్రహ్మశబ్దముచే చెప్పబడుచున్నది. అట్టి బ్రహ్మ యనునగ్నియందు బుద్ధ్యాద్యుపాధిసంయుక్తుడై జీవుడని యధ్యాసము చేయబడుచుండు నాత్మ యను నాహుతిని, ఆత్మచేతనే చేయుచున్నారు. అవిద్య యను నుపాధితో గూడిన యాత్మనిరుపాధికమగు పరబ్రహ్మానుసంధానముచేయుట యను హోమమును బ్రహ్మాత్మైకత్వ

భావనానిష్ఠులగు సన్న్యాసులు చేయుదురు. వీరును మహాయజ్ఞము చేయువారలే. వీరు కేవలము జ్ఞానయజ్ఞము చేయు ఆత్మజ్ఞానులగుదురు. కనుకనే వీరిని ప్రథమముగా చెప్పుటయయినది.

శ్రోత్రాదీనీంద్రియాణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి ।
శబ్దాదీన్ విషయానన్యే ఇంద్రియాగ్నిషు జుహ్వతి ॥

మరి కొందరు శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణములనెడు హవిస్సును, నియమించుట యను నగ్నియందు హోమము చేయుదురు. మరి కొందరు ఇంద్రియములనెడు నగ్నియందు శబ్దస్పర్శ రూపరసగంధములనెడు విషయ రూపమగు హవిస్సును హోమము చేయుదురు.

ఇది యోగాభ్యాసియొక్క సంయమననిష్ఠను తెలుపుచున్నది. జ్ఞానమునకు సమీపముగా నుండునది యోగము. కనుకనే యిది రెండవమెట్టుగా చెప్పబడినది. బాహ్యకర్మము అంతరంగ రహస్యము తెలిసికొనుటకే యేర్పడినది. ఇచ్చట ఇంద్రియములను ఇంద్రియార్థములను జ్ఞానాగ్నియందు హోమము చేయవలె నని చెప్పబడెను. నవద్వారములకు సంబంధించిన వాటియొక్క విషయములను హోమించవలయునను నుద్దేశ్యవే యువాదినవధాన్యములును, అశ్వత్థాది నవవిధసమిధలును హోమము చేయుటలోని రహస్యము. స్పర్శేంద్రియము సర్వత్ర వ్యాపించినదగుటచే అది ఘృతమువంటిది. దీనితో సహా దశేంద్రియములను గ్రహించవలయును. సర్వేంద్రియములను ఇంద్రియవిషయములను నిరంతరము ఆత్మజ్ఞానాగ్ని యందు హోమము చేయువాడు అమృతమును అనుభవించును. దీనియందొక పరమరహస్యము గలదు. నవధాన్యములు హోమాగ్ని లో పడినవి మాత్రమే దహించును. అవి మరల అంకురింపవు. బయటపడినచో మొలకెత్తును. దీనివల్ల ధ్యానములో ఆత్మాగ్నియందు లయముబొందిన వృత్తిగల వారికి మరల సంకల్పముండదు. వృత్తులు నశించియుండును. ధ్యానము చేయువారైనను వృత్తులు నశింపనిచో ఇంకను వారిధ్యానము ఆత్మాగ్నిలో ఐక్యము పొందలేదని గ్రహించవలయును. ఇదే హోమమునకు నవధాన్యములు ఏర్పరచిన రహస్యము.

అట్లుగానిచో, ఎన్నియో ధాన్యములు, అనేకవిధసమిధలు నుండుగా ఈ నవవిధములను మాత్రము ఏల యేర్పాటు చేయవలయును?

**సర్వాణీంద్రియకర్మాణి ప్రాణకర్మాణి చాపరే ।**
**ఆత్మసంయమయోగాగ్నౌ జుహ్వతి జ్ఞాన దీపితే ॥**

మరికొందరు జ్ఞానేంద్రియ, కర్మేంద్రియ, అంతఃకరణేంద్రియ వ్యాపారములను ప్రాణాది దశవాయువులను కర్మలనెడు కట్టెలను జ్ఞానాగ్నియందు ప్రజ్వలింప చేసినవారలై ఆత్మవిషయక సమాధియను నగ్నియందు హోమము చేయుదురు. వీరు ప్రాణాయామపరులై యింద్రినిగ్రహ ప్రయత్నము గలవారలై యున్నవారగుటచే ముందు చెప్పబడిన యోగులకన్న ఒకమెట్టు క్రిందభాగమున నుండేవారు. వీరు ధారణాశీలురు. ముందు చెప్పబడినవారు ధ్యాననిష్ఠులు, దానికి పై చెప్పిన వారు సమాధి లభించినవారలు.

**ద్రవ్యయజ్ఞా స్తపోయజ్ఞా యోగయజ్ఞా స్తథాఽపరే ।**
**స్వాధ్యాయజ్ఞానయజ్ఞాశ్చ యతయస్సంశితవ్రతాః ॥**

కొందరు దైవికమగు కార్యములకును, బ్రహ్మనిష్ఠులకును శక్తికొలది ధనము సహాయము చేయువారును, మరికొందరు కృచ్ఛ్రచాంద్రాయణాది తపస్సే యజ్ఞముగా గలవారును, మరికొందరు ప్రాణాయామధ్యానధారణాది యోగనిష్ఠలే యజ్ఞముగా గలవారును, మరికొందరు అధ్యయనము ఉపనిషత్పారాయణము ప్రణవాది మంత్రములను యజ్ఞముగా తలంచి చేయువారును, మరికొందరు సర్వేంద్రియ నియమమే యజ్ఞమని తలంచి అనుష్ఠించువారును, మరికొందరు తనయొక్క వ్రతమును సుతీక్ష్ణముగా అనుష్ఠించుటయే యజ్ఞముగా తలంచువారును గలరు. వీరును యజ్ఞము చేయువారలే.

**అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేఽపానం తథాఽపరే ।**
**ప్రాణాపానగతీ రుద్ధ్వా ప్రాణాయామ పరాయణాః ॥**

మరి కొందరు అపానవాయువునందు ప్రాణవాయువును లయపరచుట యజ్ఞముగా తలంచువారును, కొందరు ప్రాంవాయువు నందు అపానవాయువును

ఐక్యముచేటయే యజ్ఞమని తలంచువారును, మరికొందరు పూరక, రేచక, కుంభకములు మూడును చేయుటయే యజ్ఞమని తలంచువారును గలదు. వీరును ప్రాణాయామపరులైన యజ్ఞము చేయువారలే.

**అపరే నియతాహారాః ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి ।**
**సర్వేఽప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షపిత కల్మషాః ॥**

మరికొందరు నియమితాహారమును నియమితకాలములో నియమము ప్రకారము భుజించుటయే యజ్ఞముగా గలవారును, అనగా వివిధపదార్థములను వివిధసమయములలో తినక నియమిత కాలములో నియమితాహారమును నియమము ననుసరించి తినుటగూడ గొప్ప యజ్ఞమగును. దీనివల్ల ఇంద్రియవిగ్రహమును, వ్యర్థులగు జనులతో సంసర్గరాహిత్యమును కల్గును. వ్యర్థమైన ఖర్చును చేష్టయు నశించి పోవును. ఒక్కొక్కపదార్థమునకును ఒకొక్కగుణము గలదు. దాని ననుసరించి మానసేంద్రియములు ప్రయత్నించుచుండును. మితాహారి కానివాడు మనస్సును వశపరచుటకు ప్రయాసపడును. కావున అనేక రకములగు వస్తువులను భుజింపక యెంత కెంతకు తగ్గింప సాధ్యపడునో, అంతకంతకు మనస్సు వశపడునదేదాక ధ్యాన ధారణాది కార్యములన్నియు ఏకధారగా నడచుచుండును. లేనిచో వివిధగుణములుగల గుఱ్ఱములను రథమునకు కట్టిన యేలాగునానేకరీతిగా నడువకపోవుటచే సారథికిని, రథికునకును, రథమునకును అపాయము గలుగునో, ఆలాగున బుద్ధికిని, ఆత్మకును, దేహమునకును కీడు వాటిల్లును. ఇట్టి మితాహారము గలవారు ప్రాణాపానములను ఐక్యపరచి, కేవలకుంభకమగు యోగమును చేయుటయే యజ్ఞముగా తలంతురు. ఈ పై జెప్పబడిన పండ్రెండుగురును ఆత్మయజ్ఞము చేయువారలు. ఈలాగున యజ్ఞము చేయువారు సమస్త పాపకర్మలను నశింపచేసిన వారలై కృతకృత్యు లగుదురు.

**యజ్ఞ శిష్టామృతభుజో యాన్తి బ్రహ్మ సనాతనమ్ ।**
**నాయం లోకోఽస్త్యయజ్ఞస్య కుతోఽన్యః కురుసత్తమ ॥**

ముందు చెప్పబడిన యజ్ఞములను ఆచరించి తర్వాత శాస్త్రమునందు

విధింపబడిన ప్రకారము యజ్ఞ శేషాన్న మను నమృతము ననుభవించువారు చిత్త శుద్ధిని, పిమ్మట జ్ఞానముద్వారా నిత్యమగు బ్రహ్మత్వమును బొందుదురు. పై జెప్పిన యజ్ఞములలో ఒక్క దానినైన చేయనివాని కీ లోకసుఖములే సంభవింపవు. అట్టి స్థితిలో విశేష సాధనసాధ్యములగు నుత్తమలోక సుఖములెట్లు గలుగును? కాబట్టి పై జెప్పిన వాటిలో ఒక్క అనుష్ఠానమైన చేయనివాడు సద్గతిని బొందజాలడు.

దీనివల్ల ప్రతిమానవుడును తనశక్తికి తగిన దైవికానుష్ఠానములలో ఏదైన ఒక్క దానిని ఆచరించిన తర్వాత భోజనము చేయవలయుననియు, అట్లు చేసినచో ఆ భుజించెడు అన్నము అమృతసమానముగా ఆత్మపావనత్వ మొనర్చుననియు గ్రహించవలయును. కనుకనే సర్వమతములలోను మానవులకు ప్రాత: సంధ్యానుష్ఠాన మేర్పడినది. దైవాశయమును లోకములో బోధించిన మహాపురుషుల శాసనము నుల్లంఘించి వర్తించుట పశుత్వమేగాని, మానవత్వము గాజాలదు. ఏలన పశువులకు నియమము లేదుగదా ! మరియు పై జెప్పిన అనుష్ఠానములో ఒక్కటైన చేయనివానికి ఇహలోకసుఖమే లేదని భగవంతుడు ఉపదేశించుట బహుకరుణతోను మనశ్రేయస్సు నుద్దేశించియును చేయబడినది. ఇచ్చటనే సుఖము లేనిచో పరములో ఎచ్చట గలుగును ? అనగ నియమనిష్ఠలు లేనివానికి ఇహమందును, పరమందును సౌఖ్యము గలుగదు.

**ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణో ముఖే ।**
**కర్మజాన్ విద్ధి తాన్ సర్వా నేవం జ్ఞాత్వా విమోక్ష్యసే॥**

పై జెప్పిన విధమున పలువిధములైన యజ్ఞములు వేదములవల్ల విధింపంబడియున్నవి. అనగా పై జెప్పిన వన్నియు ఒక్కొక్క విధములగు యజ్ఞము లనిభావము. వానిలో నెవరికి ఏదేది ఆత్మశుద్ధి కనుకూలపడునో దానిని అనుష్ఠింపవచ్చును. అవన్నియు ఆత్మ నిష్ఠల అంతఃకరణశుద్ధికొరకు ఏర్పడిన కర్మలని యెరుంగుము. అంతే గాని అది వ్యర్థమైనది కాదు. ఈ ప్రకారముగా మంచి బుద్ధితో తెలిసికొని అనుష్ఠించుచుందువేని సంసారబంధము నుండి నీకు విముక్తి గలుగును. లేనిచో బంధనివృత్తి గాజాలదు.

శ్రేయాన్ ద్రవ్య మయాద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరన్తప ।
సర్వం కర్మాఖిలం పార్థ ! జ్ఞానే పరిసమాప్యతే ॥

ఓ అర్జునా ! ద్రవ్యసాధన సాధ్యమైన యజ్ఞముకంటె జ్ఞానస్వరూపమైన యజ్ఞము మిక్కిలి శ్రేష్ఠమైనది. ఇది భక్తులపై కరుణ కలిగి భగవంతుడు ఉపదేశించిన వచనము. పుణ్యకార్యములు చేయుటకు ధనము లేదని తలంచి పరితపించు భక్తు లనేకులు గలరు. వారి ఆత్మశాంతికొరకు ఇది ఉపదేశించడమైనది. ద్రవ్య వ్యయముచేయు యజ్ఞాది కర్మానుష్ఠానములన్నిటి కన్న భగవద్భక్తి పరమైన జ్ఞాన నిష్ఠ శ్రేష్ఠమైనది. ఏలన? అది క్రమముక్తిని గలుగచేయునదే గాని యీ జ్ఞానమువలె సాక్షాన్ముక్తిని గలుగచేయజాలదు. కనుక బ్రహ్మనిష్ఠులకు అట్టి కర్మసాధనలు అక్కర లేదు. తక్కిన కర్మలన్నియు జ్ఞాననిష్ఠతో అనుష్ఠించిన జ్ఞానమును గలుగచేయును. జ్ఞానమే పరమసాధనము, అది సముద్రము వంటిది. తక్కినవన్నియు నదులవంటివి. కావున అంతఃకరణశుద్ధి గలుగువరకు అనుష్ఠానము లవశ్యముగానుండవలె నని భగవంతుడు ఉపదేశించుచున్నాడు.

పరమమహర్షుల సంతానములారా! ఎచ్చట చూచినను ఏ పత్రికలోను, సాధువులయొక్క దూషణయే కానుపించు చున్నది. ఇందుకు సంపూర్ణముగా గృహస్థులపై దోషము నారోపింపక సాధువులగు కొందరి శిరముపై ఈ కళంకపంకము భారమై యుండే విషయము గూడ నిజము. దీనికి గృహస్థులు చెప్పువచన మేమన సాధువులకు సరియైన అనుష్ఠాననిష్ఠ లేదనియు, ఏలాటి లోకోపకారకార్యము చేయుట లేదనియే చెప్పుదురు. అయితే వారు చెప్పు మాటలలో కొన్ని విషయములు మనము గ్రహించవలసి యుండును. మానవుండు ఇహమునకును, పరమునకును సంబంధపడియుండువాడు. కేవలము ఇహమునకు మాత్రము సంబంధపడి వర్తించెడు జన్మము మృగీయ మగును. ఏలన మృగములకు దేహవ్యతిరిక్త దేహియగు ఆత్మ ఒకటి గలదనియు, దానిని పొందవలయు ననియు, ఈ దేహేంద్రియప్రపంచము మిథ్యయనియు, దైవ మొక్కటియే సత్యమనియు తెలియదు. మనుష్యజన్మము అటువంటిది కాదు. వారికి దేహియే అనగా ఆత్మయే ముఖ్యప్రాప్యలక్ష్యమై యుండును.

ఇంద్రియసౌఖ్యము లన్నియు మృగజన్మములతో పూర్తియై పోవుచున్నవి. మనుష్యజన్మము కేవలము ఈశ్వరసౌఖ్యమును పొందుటకై యేర్పడినది. అట్లు గానిచో ఇంద్రియనిగ్రహ నియమమును శాస్త్రము విధించి యుండజాలదు. కావున దేహముతో నెంతవరకు మనకు సంబంధము గలదో అట్టి సంబంధము గూడ లోకముతోను గలిగియుండవలెను. అనగా తనయొక్క దేహసౌఖ్యములు ఎంతవరకు నిర్వహించుచుండునో అంతవరకు ప్రపంచములోగల ప్రాణికోట్ల సౌఖ్యమును గురించి ప్రయత్నించుటయు, మహాపురుషుల ధర్మమై యున్నది. ఇహమునకు దేహమును, పరమునకు దేహియు, అనగ ఆత్మయు మనము భాగించుకొనవలయునను. తన ఆత్మయొుక్క విముక్తికొరకును, ప్రయత్నించునట్లు పరుల దుఃఖవిమోచనముకొరకును, ఆత్మయొక్క విముక్తికొరకును మహాపురుషులందరు ప్రయత్నించియుండిరి. మనము అట్టివారి పాదరజోలేశముచే పునీతులు గావలసియుండిన వారిమార్గమును అవలంబించుట ధర్మమై యున్నది. లోకోద్ధారకులగు మహా పురుషుల జీవితచరిత్రము మనము సద్బుద్ధితో పరిశీలించిన యీ తత్త్వమును గనిపెట్టగలము. అవతారపురుషులగు శ్రీరామకృష్ణాది దివ్యపురుషులు లోకములో గల జనుల దు:ఖనివృత్తి కొరకే ప్రయత్నించలేదా?

వారు ఆత్మతత్త్వమే ముఖ్యముగా తెలుపుటకొరకై వచ్చినవారైనను బాహ్యసౌఖ్యమునకు కావలసిన సహాయము జనులకు చేసియే యున్నారు. ఆలాగున శ్రీయేసుక్రీస్తు, శ్రీమహమ్మదునిబి, శ్రీబుద్ధదేవుడు మొదలైన దివ్యపురుషులందరును ఇహపరక్యాములలో రెండిటిలోను మనుష్యుల సంరక్షణ విషయమై జీవితమంతము వినియోగపరచినట్లు చరిత్రపరిశీలకులకు కనుపింపకమానదు. ఆలాగుననే శ్రీశంకర, శ్రీరామానుజ, శ్రీమధ్వ, శ్రీకృష్ణచైతన్య, శ్రీగురునానక్, శ్రీదయానందసరస్వతీస్వామి, శ్రీరాజారాంమోహనరాయ్, శ్రీరామకృష్ణ పరమహంస, శ్రీవివేకానందస్వాములు మొదలైన వారందరును ఉభయలోక శుద్ధికొరకు ప్రయత్నించినవారలే. అట్టి మహనీయుల మహాశయమగు వేదాంతమే మనకుండవలసినది గాని, సంకుచిత హృదయశుష్కమానసుల వైరాగ్యరహిత

మగు, కరుణాశూన్యమగు వేదాంతము మనము స్వప్నేపి స్మరింపతగినది కాదు. అయితే ఆత్మయొక్క శాంతిగలుగువరకును, బంధనము లన్నివిధ్వంసములగు వరకును, దృశ్యము దైవమయమై కనపడువరకును, ఎవరును లోకకార్యములలో ప్రవేశింపక ఆత్మనిష్ఠలో నిరంతరము కాలము గడపిన మాత్రమే భరింప శక్తి గలిగియుందురు.

శ్రీమన్నారాయణమూర్తి యొక్క నవమావతారమని పేర్కొన బడిన శ్రీబుద్ధభగవానులు జన్మమాదిగా దైవచింతనలో మునిగిన హృదయము గలవారై యీ జనుల దుఃఖశమనము ఎట్లు గల్గునో అని అట్టి విచారముతోగూడి మరల ఆరుసంవత్సరములు బుద్ధత్వము పొందువరకు బుద్ధగయాది ప్రాంతములలో ఏకాంత ప్రదేశములలోను, కొండగుహలలోను, నిర్జనవనకుంజములలోను, నిర్వికల్పసమాధి సాధించినట్లు చరిత్రముద్వారా కనుగొనుచున్నాము. ఆలాగున శ్రీయేసుక్రీస్తు పండ్రెండు వయస్సునుండి 29 వయస్సువరకు అనగ 17సంవత్సరములు నిర్వికల్పసమాధి సాధించి యున్నట్లు చరిత్రము సాక్షిని చెప్పుచున్నది. ఆలాగున శ్రీమహమ్మదునిబి హైరా అను కొండగుహలో పదిహేనుసంవత్సరములు రేయింబవలును దైవవిచారములో మునిగి యీశ్వరాజ్ఞను బడసిన తర్వాత ప్రపంచమునకు వచ్చిరి. నర్మదాతీరమున శ్రీగోవింద భగవత్పాదుల దివ్యపాదసన్నిధిలో ఆరుసంవత్సరములు ఈశ్వరావతార మెత్తిన శ్రీశంకరులును తపస్సు చేసినట్లు చరిత్ర మనకు చెప్పుచున్నది. శ్రీరామానుజాచార్య స్వాములును, శ్రీమధ్వాచార్య స్వాములును ఈలాగుననే దైవమయములో మునిగి దైవత్వమునొందిన తర్వాత ప్రపంచమునకు వచ్చిరి. భగవాన్ శ్రీరామకృష్ణపరమహంసలును గంగాతీరమున కాశీఘట్టములో 20 సంవత్సరములు అనవరతము జగజ్జనని యగు దివ్యమాత భవ్యపాదకముల ద్వంద్వములో అర్పితచిత్తముగలవారై యుండిరి. శ్రీవివేకానందస్వాములును హిమాలయప్రాంతమున ఆరుసంవత్సరములు అగాధనిర్వికల్పసమాధినిష్ఠలో మునిగి యుండిరి. శ్రీరామతీర్థులు, శ్రీకృష్ణచైతన్యులు, శ్రీగురునానక్ మొదలగువారందరును అట్టి దైవముతో ఐక్యమొందిన తర్వాత మాత్రమే లోకమును పావనము నొనర్చుటకు ప్రయత్నించి

రని మనము జ్ఞప్తిలోనుంచి వర్తించవలయును. సత్తుతో ఎప్పుడు మనకు ఐక్యము గల్గునో, అనగా దివ్యాత్మస్వరూపమై, యెప్పుడు మనస్సు నిలుచునో, అప్పుడు మాత్రమే విద్యుచ్ఛక్తితంతి ఐక్యపరచిన దీపమువలె లేక యంత్రమువలె మనకు వెలుగు గల్గును.

అప్పుడు దైవకార్యములో పనిచేయ శక్తిగలుగను. అప్పుడు మిమ్మలను బంధించునది ఒకటి గలదను భావము మీకుండదు. అప్పుడు బయట రండి, అంతవరకు రాపనిలేదు. పవిత్రసంకల్పముండిన చాలును. అది మరియొక్క హృదయము నాశ్రయించి తప్పక పనిచేయును. అట్టి సంకల్పసిద్ధి కలుగువరకు సాధకుడు ఏ కార్యమును చేయుటకు శక్తి గలవాడు కాడు. అంతవరకు శోకము నీడవలె వెంబడించును. దీనివల్ల మీరు ఏదైనా ఒక్కసిద్ధిని సంపాదించి లోకసేవ చేయవలయునని తలంచరాదు. తనవలెనే సర్వప్రాణులను చూచుటయే వేదాంతములో ప్రతిపాదించిన జ్ఞానదృష్టి, మీ సుఖమువలె, సర్వప్రాణి కోట్లును సుఖముగా నుండవలెనని తలంచిన చాలును. వర్తమాన యుగమున మహాత్ములలో అగ్రపదవి నలంకరించియుండు శ్రీమహాత్మగాంధీగారి జీవితము జనుల యిహపరబంధ విముక్తికొరకై ప్రయత్నించుట లేదా ! ఇదే కారణగురువులై లోకోద్ధారక మహాపురుషుల సంఘమునుండి భూలోకమునకు వచ్చిన మహాత్ముల చిహ్నమై యుండును. తన యొక్క బంధవిముక్తిని మాత్ర ముద్దేశించి చేయువారుగాడ ముక్తులే, మహాత్ములే. అయితే తన కడుపుమాత్రము చూచి తక్కిన యేప్రాణులకుగాని, స్వంతజనములకుగాని, కొంచమైనను ఉపకారము చేయనివారి స్థితికన్న హెచ్చు వారి కేమియు లేదు. కావున ఋషిపుత్రికలారా! పుత్రులారా ! మహాపురుషుల ఆదేశమునకు మాత్రము హృదయమున చోటివ్వవలెను. ఒక్కవేళ అట్టి మహావిషయము ఈజన్మములో మీరు చేయకపోయినను లేక మహాపదవిని మీరు పొందకపోయినను అది సుక్షేత్రములో పెట్టిన బీజమువలె నశించిపోవక యింకొకప్పుడైన ఫలమును తప్పక యిచ్చును. అంతేగాని క్షుద్రహృదయులై, శుష్కహృదయులై సంకుచిత భావముగలవారి ఆశయమును, మనస్సులో రానివ్వకూడదు. అనంతశక్తియు, అఖండానంద స్వరూపముగల యేయొక్క

దైవశక్తిగలదో అదే మీ ఆత్మయై వెలుగుచున్నది. అట్టి ఉన్నత భావములోనికి మనస్సును తీసికొని పోవలయును.

అయితే దీపమే వెలుగవలసి యున్నప్పటికిని ప్రమిద, తైలము, వత్తి, గాలిలేని ప్రదేశము ఉండే తీరవలెను. పై జెప్పిన నాల్గింటిలో దేనికైన లోపము గలిగిన దీపము ఆరిపోవునుగదా! వైరాగ్యబోధ ఉపరతి కరుణాదులు ప్రతి బ్రహ్మనిష్ఠునకు నుండే తీరవలయును. తైలము, ప్రమిద, వత్తి మొదలైనవాటిని అమర్చి దీపము వెల్గించు వారు స్త్రీలుగాని, పురుషులుగాని, సన్న్యాసులుగాని, సంసారులు గాని, బ్రాహ్మణులుగాని, బ్రాహ్మణేతరులుగాని, మరి యెవరైనను, దీపము వెలుగుచుండును. పై జెప్పిన తైలాదులలో లోపము గల్గినపై జెప్పిన వారెవరికైనను దీపము వెలుగజాలదని మీరు సదా జ్ఞప్తిలో నుంచవలయును. అఖండ బ్రహ్మాకార బోధమందు నిలకడగల్గిన మాత్రమే మండుచుండు గొప్ప నిప్పులో దూది లేక, యెండిన తృణము కాలి భస్మమై పోవునట్లు దృశ్యవృత్తులన్నియు విలయము నొందగల్గును. అట్టి అఖండానంద బ్రహ్మాకారవృత్తిలో ఒక్కవేళ నిలువ శక్తిలేక పోయినను అట్టి భావనయైన చేయుటగాని, లేక వాక్కుతోనైన ఉచ్చరించుటగాని, చేసినను జన్మాంతరములలోనైన అట్టి మహత్పదవి గలుగునని శ్రీవ్యాసభగవానులు మానసికస్నానమందు ఉపదేశించియున్నారు.

> బ్రహ్మైవాహం న సంసారీ ముక్తోఽహ మితి భావయేత్ ।
> అశక్తశ్చే ద్భావయితుం వాక్య మేతత్సదాఽభ్యసేత్ ॥
> వాక్యాభ్యసనమాత్రేణ బ్రహ్మీభూతో భవేన్నరః ।
> సదేహశ్చ పరం బ్రహ్మపదం యాతి న సంశయః ॥

దీని అర్థము పై నుదాహరించినదే. శ్రీకృష్ణభగవానులుగూడ అంత్యకాలమున దేహి యే భావముతో దేహమును విడుచునో, ఆ భావమును తప్పక పొందుచుండునని అష్టమాధ్యాయములో ఆనతిచ్చియున్నారు.

> యం యం వాపి స్మరన్ భావం త్యజత్యంతే కళేబరమ్ ।
> తం తమేవైతి కౌంతేయ! సదా తద్భావభావితః ॥

ఈ గీత యొక్క దివ్యోపదేశమును పై జెప్పిన ఆత్మభావన చేయవలయుననియే.

**అథవా యోగినా మేవ కులే భవతి ధీమతామ్ ।**

ఒకవేళ అట్టి బ్రహ్మాకారచింతన చేయువాడు ఈ జన్మములో పూర్ణస్థితి పొందకపోయెనేని, యిది సాధించుటకు ఏ కులములో ఏ దేశములో ఏ కుటుంబములో పుట్టిన బ్రహ్మసాక్షాత్కారస్థితి నిర్విఘ్నముగా చెందగలుగునో, అట్టి యోగులవంశము లోగాని, ధీమంతుల కుటుంబములో గాని జన్మమెత్తును.

**ప్రాప్య పుణ్యకృతాం లోకా నుషిత్వా శాశ్వతీస్సమాః ।**
**శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే ॥**

నిష్ఠలో పదచ్యుతి గలుగక పూర్ణప్రజ్ఞా పూర్తిగలుగుటకు ముందుగా దేహావసానము గలిగిన బ్రహ్మనిష్ఠుని గురించి ముందు చెప్పబడినది. ఇప్పుడు చెప్పు ఈ శ్లోకము కారణాంతరము చేత బ్రహ్మనిష్ఠలోనుండి పదచ్యుతి ఒక్కవేళ గల్గినను విరోధము లేదనియు, అట్టివాడు గూడ మహాపుణ్యాత్ములగు పురుషుల సత్యాది లోకములోగాని, బ్రహ్మాదిదేవతల లోకములోగాని బహుకాలముండి మహాశుచి, ఆచారము నిర్మల నిష్ఠగల వారియొక్కయు, శ్రీమంతుల యొక్కయు కులములో పుట్టి బాల్యకాలమునుండి బ్రహ్మనిష్ఠను సాధించి ముక్తుడగునని తెల్పుచున్నది. ఇట్టి మహావిషయము సాక్షాద్భగవంతుడే ఉపదేశించి యుండగా మరల యేల సంశయము నొందెదరు?

**పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః ।**

ఒక్కవేళ అటువంటి శ్రీమంతులయొక్క కుటుంబములో పుట్టి దృశ్యసౌఖ్యములచేత జన్మాంతరస్మృతి జ్ఞానము ఆవరణమై కొంతకాలము అనగా బాల్యకాలము గడచినను సూదంటురాయి సూదులను ఆకర్షించునట్లు ఆ దివ్యసంస్కారము ఇంద్రియార్థము లనెడు విషయములనుండి యింద్రియములను ఆత్మధ్యాన విషయమై ఆకర్షించుచుండును. అనగా

విషయవిరక్తి గలుగ చేసి సంస్కారశక్తి ఉపరతిని గలుగచేయును.

**న హి కల్యాణకృత్ కశ్చిత్ దుర్గతిం తాత! గచ్ఛతి॥**

ఓ తండ్రీ! నాయనా! మంగళస్వారూపమగు పరమాత్మను ధ్యానించువాడు దుర్గతిని పొందజాలడు. అనగా మలినమగు సంసారములో నుండజాలడు అని ఆరవ అధ్యాయములో భగవంతుడే ఉపదేశించియున్నాడు. ''స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్'' అని రెండవ యధ్యాయములో గూడా భగవంతుడు దానతిచ్చియున్నాడు. ఈ బ్రహ్మాకారపరమగు నిష్ఠ కొంచముగా నుండినను మహత్తైన సంసారసాగరము నుండి రక్షింపబడును. కావున ఒక్క నిమిషమైనను, అఖండాకారవృత్తియగు బ్రహ్మాకారస్థితి పొందవలయుననియే కోరవలెను. కాని చిన్నచిన్న వృత్తిగలవారి భావమును హృదయములో రానియ్యగూడదు. అష్టావక్రమునీంద్రుడు జనకుని విషయమై యిట్టి బోధయే చేసియున్నాడు.

**ముక్తాభిమానీ ముక్తో హి బద్ధో బద్ధాభిమాన్యపి ।**
**కింవదంతీహ సత్యేయం యా మతి స్సా గతి ర్భవేత్ ॥**

నిత్యముక్త బ్రహ్మభావన గలవాడు ముక్తుడగును. దేహేంద్రియములతో సంబంధించిన బుద్ధిగలవాడు బద్ధుడగును. మీ మతి యెంతో గతి అంతే యను కింవదంతి నిజమే. ఇక వసిష్ఠ భగవంతుడు బోధించిన తత్త్వమును గూడ చూడుడు--

**దేహోఽహం మానపాశేన దృఢం బద్ధోఽసి సర్వతః ।**
**బోధోఽహం జ్ఞాన ఖడ్గేన తన్నికృత్య సుఖీభవ ॥**

ఓ పరమపవిత్రులగు సోదరీ సోదరులారా! దేహమే తానను మాయాపాశముచే గట్టిగ సర్వదా సంసారమునందు బంధమొందితిరి. ఇప్పుడు దేహవిలక్షణమై, సాక్షియై అఖండైకబోధరూప జ్ఞానమే నే ననెడు తీక్ష్ణమైన ఖడ్గముచే అట్టి పాశమును నరికి విముక్తి నొందుదురు గాక !

**కృశోఽతిదుఃఖబద్ధోఽహం హస్తపాదాదిమానహమ్ ।**
**ఇతి భావనరూపేణ వ్యవహారేణ బధ్యతే ॥**

నే నతికృశుడను, బహుదుఃఖబద్ధుడను, కరచరణముల తోటి యశక్తుడనై యేమియు జేయుటకు సాధ్యముగానివాడను, నేను శూద్రుడ, వైశ్యుడ, క్షత్రియుడ, బ్రహ్మణుడ, స్త్రీని అను అనాత్మయైన దేహయం దాత్మబుద్ధితో గూడి మృగప్రాయులై స్వస్వరూపమైన తమ స్థితిని దెలియక బద్ధులగుచున్నారు.

**నాహం దుఃఖీ న మే దేహో బంధః కోఽస్యాత్మన స్థితః ।**
**ఇతిభావన రూపేణ వ్యవహారేణ ముచ్యతే ॥**

నిత్యశుద్ధ స్వయంప్రకాశుడైన నేను దుఃఖి కాను. జననము లేనివాడనైన నాకు దేహ మెట్లు గలుగును? సచ్చిదానంద లక్షణములు గల యాత్మయైన నాకు బంధ మెక్కడిది? ఈలాటి విచారభావరూపవ్యవహారములచే ముక్తుడగుచున్నాడు అని వాసిష్ఠము.

అఖండానందనిరావరణ ప్రకాశబోధ స్వరూపులగు ఆత్మస్వరూపులారా! అచింత్య చిత్రవిచిత్ర వేగముగల మీ మనస్సు మీ యొక్క దేహేంద్రియ కులగుణములను అనుసరించిన భావనలలో పడెనేని అట్టి మనస్సు మిమ్ములను అతల వితల పాతాళలోకముల కవతల తీసికొనిపోయి దయ్యములనుగా మార్చివేయును. అట్టి మనస్సే దేహేంద్రియగుణ కర్మములకు విలక్షణమై, నిత్యమై, శివమై, అమృతమై, ఆనందమై యుండు మీ ఆత్మభావముతో సమన్వయపడెనేని క్షణమాత్రములోనే, మిమ్ములను భూర్భువస్సుత్యాది లోకముల కవతల ఊర్ధ్వముగా తీసికొనిపోయి దైవముగా మార్చును. ఇదే వేదాంతశాస్త్రముయొక్క పరమరహస్యము.

మీయొక్క దేహేంద్రియ కులగుణములను మాత్రము చూచి అధ్యాత్మవిషయములో మీయొక్క అధికారము నిర్దేశించువారు మీకు విషముపెట్టినవారే యగుదురు. ఏలన దేహేంద్రియాది వస్తువులు

నశించిపోవునవి గదా! మీయొక్క దేహేంద్రియ కులగుణములకు విలక్షణమై యుండు ఆత్మప్రాప్తికి తగిన వైరాగ్యబోధోపరతులు అను దైవగుణములను కనిపెట్టి దివ్యాత్మస్వరూపములో ప్రవేశపెట్టెడి అధికారముల నిర్మించువారు మిమ్ములను అమృతమునిచ్చి రక్షించిన వారగుదురు. ఏలన అది నశింపని శాశ్వత దివ్యపదవి గదా! అయితే ప్రకృతికి విలక్షణమై పరమపావనమగు ఈ దివ్యోపదేశము మాలిన్యసంకుల మగు సంసార ధర్మములతో సమన్వయ పరచకూడదు. అట్లైన నిప్పులో నీళ్లు పోసినట్లు, వ్యర్థమగున దేగాక అపాయమును గూడ గలుగచేయును. ఇట్టిబోధ మీ హృదయములో నుండవలసినదేగాని సాంసారిక కర్మకాండక్రియలతో సమన్వయ పరచకూడదు. అది లోకానుసారముగా ప్రయాణము చేయునుగాక! మీరు దానికి విలక్షణులై యుండి దానియొక్క చేష్టలను చూచి ఆనందించెదరు గాక! ఇది కేవలము దైవవిషయమగు ఆత్మధర్మమునకు సంబంధించినది. అయితే ముముక్ష్వవస్థనుండి ముక్తావస్థ గలుగువరకును దైవభక్తియును, గురుభక్తియును విడువరాదు. అది విత్తనమునకు నీళ్లు వంటిది. ఫలము పండువరకు జలముండే తీరవలయును. లేనిచో మీ అనుష్ఠాన నిష్ఠాసాధనలన్నియు వర్షములేని కృషివలె వ్యర్థమని తలంచి దైవవిషయములో నిలకడ పొందుదురుగాక! దీనియొక్క ముఖ్యసార మేమనగా, జ్ఞానాగ్నియందు సమస్తకర్మకట్టెలగు అజ్ఞానమును దహింపచేయుటయు మనస్సను పశువును వధించి స్వబోధజ్ఞానాగ్ని హోమములో హోమించుటయు ఆత్మయజ్ఞమని తెలిసి కొనవలయును. కర్మయజ్ఞములకన్న దీనికి కోటి రెట్లధికఫలము గలదు. ఇది భూపాల గోపాలాదులకును, బ్రాహ్మణబ్రాహ్మణేతరులకును, బాల వృద్ధులకును, స్త్రీ పురుషులకును అనుష్ఠించుటకు తగియుండును. ఇది యీ జన్మములో జీవించియున్నప్పుడే జననమరణ రహితముక్తి యను అమృతమును పానము చేయించును. తక్కిన యజ్ఞములలో గల సోమపానము ఇట్టి మహాపదవిని గలుగజేయశక్తి గలదిగాదు. నిష్కామముతో దైవార్పిత జ్ఞానముతో చేసెనేని కాలాంతరమునకు అంతఃకరణశుద్ధి గలుగవచ్చును. ఈఆత్మ యజ్ఞమునకు

సర్వేంద్రియ నిగ్రహమును, మనఃప్రశమనమును గల్గి ఆత్మసాక్షాత్కార బోధమును ఉదయింపవలయును. ఈ ఆత్మయజ్ఞ విషయమై తైత్తిరీయోపనిషత్తున విశదముగా గనందగును.



# వైరాగ్యము

(వైరాగ్యమును గురించి శ్రీసద్గురు మలయాళస్వాములవారు కృష్ణాజిల్లా, తాడేపల్లె, పెద్దాశ్రమములో ఇచ్చిన యుపన్యాసము యొక్క సారము ఈక్రింద ముద్రితము.)

ఓ దైవాత్మస్వరూపులగు ప్రియమైన సోదరీ సోదరులారా! కరుణామూర్తియగు సర్వేశ్వరుని కృపచే లోకములో కరుణయు, శాంతియు, సద్భక్తియు, విజ్ఞానబోధమును వర్థిల్లునుగాక!

శ్రీజగద్గురు శంకరభగవత్పాదులు వివేకచూడామణిలో ఈలాగున నుపదేశించియున్నారు.

**దుర్లభం త్రయమేవైతద్దైవానుగ్రహ హేతుకమ్ ।**
**మనుష్యత్వం ముముక్షుత్వం మహాపురుషసంశ్రయః ॥**

ఓ మహాజనులారా! భూలోకములో మానవజన్మము లభించుట దుర్లభము. ఒకవేళ లభించినను, మోక్షము గలుగుటకు తగిన ముముక్షుత్వము దుర్లభతరము. మరియు ఒకవేళ ముముక్షుత్వము కలిగినను వైరాగ్యబోధోపరతులుగల గురువు దొరకుట దుర్లభతమము. ఈ మూడును దైవానుగ్రహము సంపూర్ణముగా గల పుణ్యజీవులకు మాత్రమే లభించును. సంపూర్ణ విషయవిరక్తి, కరుణ, శాంతి, బోధోపరతులు గల గురువు దొరకుటయే శిష్యునియొక్క గొప్ప భాగ్యము, భాగ్యహీనులైనచో అట్టి గురువులు దొరకకపోవుటచే, గమ్యస్థానము చేరుటలో పెక్కు ఇడుములు పడవలసియుండునదేగాక, కాలవిలంబనము గూడ గల్గును.

ఒక రైలుయింజను ఎంతవేగముగా వెళ్లుచుండునో దానితో కలసియుండు పెట్టెలుగూడ అంత వేగముతోనే వెళ్లుచుండును. ఎక్స్‌ప్రెస్ ఎంతవేగముగా పోవుచుండునో, మెయిల్ బండియొక్క వేగము ఏలాగున నుండునో, ప్యాసెంజర్ యొక్క గమనము ఎట్లు మందగించి యుండునో, గూడ్సు ఏలాగున చాలనిదానముగా ప్రయాణము చేయవలసి యుండునో ఆలాగున మంద, తీవ్రతర, తీవ్రతమ గుణములతో గూడిన గురువులుగూడ నుందురు. ఎటువంటి గురువులను మనము ఆశ్రయింతుమో, అట్టివారి స్వభావమే సామాన్యజనులకు గల్గును. అయితే కొందరు మాత్రము గురువులకన్న అత్యున్నత పదవియు, అతిపవిత్రతయు, కరుణయు, విరక్తియు గల్గియుందురు. ఇది సామాన్యమార్గము కాదు, విశేషమార్గమని గ్రహించవలయును. అయితే వైరాగ్య బోధోపరతులలో గురువులు మందముగానుండినను, శిష్యులుమాత్రము సదా యున్నతపదవిని బొందవలయునను తలంపు కల్గియుండవలయును, అది గురుశిష్యులకు ఇద్దరికిని శ్రేయోదాయకమే గాని విరుద్ధము కాదు. సంకుచిత హృదయులగు కొందరు గురువులు మాత్రము శిష్యులయొక్క శ్రేయోమార్గమును సహింపక తమ యొక్క మాలిన్యస్థితిలోనికి ప్రయత్నపడియైనను, శిష్యుని గూడ లాగివేయుదురు. ఇది మహాపాపము. ఇట్టి కుటిల హృదయులగు గురువుల మార్గమును శిష్యుడు లక్ష్యపెట్టనక్కర లేదు. కాని గురువులయందు గల భక్తి విశ్వాసములు మాత్రము విడువరాదు. ఇది యొక పవిత్ర ధర్మము. మరియు సామాన్య జనులు అందరికిని గురువు పొందిన పదవి లభించిన చాలుననియే తలంపుగలిగి యుండును. ఎట్లన? పోలీసు సిపాయిగా ఒకరుండిన తన యొక్క పనిని నిర్వహింప తగినంత స్థితికి పుత్రుడు వచ్చిన చాలుననియే విచారముండును. ఒకరు ఇన్స్పెక్టరు అయినచో తన కుమారుని పోలీసు జవాను పనిలో నుంచుటకు ఇష్టపడరు. పుత్రునికిని తండ్రి పనివంటి యుద్యోగము దొరకవలయుననియే కోరిక గలిగి యుండును. ఆలాగున సర్కిల్ యిన్‌స్పెక్టర్లుగాని, సూపరింటెండెంటు గాని యుండిన తమ బిడ్డలను అట్టి యుద్యోగులుగా చేయువలయునని తలంపు గలిగియుండును. వారి సంతానమునకును

అదేమాదిరి విచారముండును. ఈ విషయములో తమ మాదిరి తమ కుమారులను చేయవలయునని తండ్రులకును, తండ్రిపలె నుండవలయునని తనయులకును తలంపు గలుగుట నైజస్వభావమై యుండును. ఏదో ఒకానొకనికి మాత్రమే భిన్న భావము గల్గును. ఇందువలన గురువులయొక్క యోగ్యతను గ్రహించితిమి. శిష్యులయొక్క వర్తనమును తెలియడమైనది.

ఇక భక్తిమార్గములోగాని, నిష్కామకర్మయోగములోగాని లేక యోగమార్గములోగాని లేక జ్ఞానమార్గములోగాని యుండిన వారలైనను ఏధీరుడు, శ్రీని, స్త్రీని జయించలేడో అట్టివాడెట్టి వాడైనను నిఃశ్రేయస్సు నొందజాలడు. అనగా ముక్తి నొందజాలడు. అంతేగాక ప్రపంచములోగూడ శ్రేయస్సు అతనికి గల్గియుండదు. ఆలాగున ఏ ధీమతియైన స్త్రీయు, శ్రీనిన్ని, స్త్రీకి సంబంధించిన విషయమును అనగా పురుష సంసర్గవృత్తినిన్ని జయించలేదో అట్టి నారీమణియును నిఃశ్రేయస్సు నొందజాలదు. అనగా మోక్షము నొందదు. లోకములో కీర్తియున్ను అట్టివారికి గల్గియుండదు. ఇచ్చట ధర్మ యుక్తమగు గృహస్థధర్మమును గురించి ప్రతిపాదించిన విషయము గాదని మాత్రము తలంచవలయును.

ధైర్యశాలురగు ఏ పురుషులుగాని లేక స్త్రీలుగాని జిహ్వోపస్థలనెడు ఇంద్రియ ద్వయమును బంధింపలేరో అట్టివారికి ముక్తి ద్వారము మూయబడి యుండును. ఏ పుణ్యాత్ములు ఈ రెండుద్వారములను మూసియుందురో, అట్టివారికి మోక్షద్వారము సదా తెరచి పెట్టబడియుండును. అనగా ఇది తెరచి యుండువారికి అది మూసియుండును. ఇది మూసియుండువారికి అది తెరచి యుండును. ఇదే మోక్ష విషయమై మనము గ్రహించదగిన రహస్యము.

ఇక ఒక పరమ రహస్యము చెప్పెదను. ఇది హస్తామలకమువలె రెండవవారికి తెలియందగినది గాదు. వారివారి ఆత్మలలో వారికి వారే [illegible] చేసికొనవలయును. అదేమన? భక్తులుగాని, అభక్తులుగాని, పిన్నలుగాని, పెద్దలుగాని అయినను సరియే, స్త్రీలుగాని, పురుషులుగాని అయినను సరియే. ఎవరు ఏ మార్గముల ద్వారముగా జన్మించియున్నారో అట్టివానితో ప్రీతిగలవారికి

పునర్జన్మము సిద్ధము. అట్టి మార్గములో ప్రీతి నశించినవారికి పునర్జన్మము లేదు. ఇది సిద్ధాంతము, సత్యము. ఈ విషయములో ఒక్కొక్కరును విచారణ చేసినచో ఈ జన్మములో జన్మరాహిత్యము గల్గునా? లేక పునర్జన్మము గలుగవలసి యుండునా? అని ఎవరితోను ప్రశ్నచేయ నక్కరలేకనే తెలిసికొనవచ్చును. మరియు ఏ మాతృస్తన్యపానముచే శిశుప్రాయములో నుండి మనము వృద్ధిపొందియున్నారమో, ఏ స్త్రీ యొక్కయు అట్టిదానిని మరల ముట్టలేదో, అట్టివారికి మరల పుట్టుక లేదు. అట్లుగాని వారందరును పుట్టుట, గిట్టుటయను ఘోరభవరోగ దుఃఖసాగరములో తిరిగియే తీరవలయును. మరల యెవరికి పుణ్యసంస్కారము పరిపక్వ దశలోనికి వచ్చునప్పుడు పై చెప్పిన దానిని ముట్ట బుద్ధి దైవకృపచే గలుగలేదో! అట్లైన మరల వారును పుట్టి మాతృస్తన్యము పట్టి పానము చేయవలసిన పనియుండదు. అనగా జనన మరణ రహితమగు దైవపదవిని బొందుదురు. వైరాగ్యము ఎంత కెంత తీవ్రముగా పరిణమించునో, అంతకంత ప్రకృతి నుండి విరక్తియును, పరమపురుష ప్రాప్తియును జీవులకు గల్గుచుండును. దీనికి వారివారి మనోవృత్తియే సాక్షిగా నున్నది. కనుకనే మనస్సే అన్నిటికిని కారణమని మామూలుగా అందరును చెప్పెడు రహస్యమై యున్నది. కావుననే అమృతబిందూపనిషత్తు ఈలాగున చెప్పుచున్నది.

**మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః ।**
**బంధాయ విషయాసక్తం ముక్త్యై నిర్విషయం స్మృతమ్ ॥**

దీని తాత్పర్యము సుగ్రాహ్యము.

1. ఏ మానవుని మనస్సులో, మోక్షము మనకు ఇప్పుడు గల్గునా? అనేక జన్మముల సుకృతవిశేషముచే గలుగవలసిదియే గాని అది అంత సులభమా? ఎన్నియో జన్మములు గడుపవలసియుండునని తోచునో వానికి ఇంకను అనేక జన్మములు జరుగవలసియుండును. ఏమన? అతడు సుకృతకార్యములు చేయని వాడనుట కతని అంతరాత్మయే సాక్షిగా నుండుటచేతనే అనేక జన్మ సుకృత విశేషములు గలుగక మోక్షము గల్గునా? యని సందేహించుటకు కారణమైనది.

2. మఱికొందరు ఈలాగున వచింతురు! ''ఈ జన్మములో మోక్షము ఎచ్చట? అంతఃకరణములో ఎన్నియెూ కోరికలున్నవి. ఇవి యన్నియు నశించవలయును గాదా? మనము ఎన్నియో పుణ్యాకర్మములు చేసినను, మనకు దైవభక్తి గల్గినను, మనోవృత్తులు నశింపవలసియుండును గదా? ఇంకొక జన్మములోగాని, మరియొక జన్మములోగాని ముక్తి గలుగవచ్చును '' అను తలంపుగల అట్టివారికి మూడు జన్మములు మరల గలుగ వలసియుండును. ఏలన? ఆ జీవి పుణ్యాకర్మములును, దైవభక్తియును గల్గియుండినవాడని తన వాక్యముచేతనే వ్యక్తమైనది. అయితే వృత్తి రాహిత్యము మాత్రము గలుగలేదు.

3. మరికొందరు ఈలాగున తలంతురు. అదేమన? మోక్షమన సామాన్యమా? ఎంతపుణ్యము గాని, భక్తి గాని యుండినను మంచి తపస్సు చేసి మనోవృత్తులు నశింపచేయవలయును గదా? ఇంకొక జన్మములో మోక్షము గలుగవచ్చును అని చెప్పువారికి ఒక్క జన్మ మెత్తవలసియుండును. ఆ జన్మములో అతడు తపస్సంపన్నుడై ముక్తి పదవు నొందుటకు తగిన యోగ్యత గల్గియుండును. వీరందరికిని వారి అంతరాత్మలో గల అభిప్రాయములే సాక్ష్యములగుచున్నవి.

4. మరికొందరు ఈలాగున పలుకుదురు. అదేమన? ఇప్పుడు మనకు మోక్షమెక్కడిది? ఈసంకల్పము లన్నియు పోయి నిస్సంకల్పావస్థగల్గి బ్రహ్మాకారవృత్తి గలుగవలసి యుండును గదా? దానికి యోగాద్యనుష్ఠానములతో కొన్ని సంవత్సరములు పట్టును. ఈ జన్మములోనే అట్టి స్థితి గలిగేలాగున ప్రయత్నించవలయును. ఇప్పుడే మనము అట్టి ప్రయత్నము చేయకపోయిన మరియొక జన్మము వచ్చిన, అది ఏలాగుండునో నిశ్చయింప నలవిగాదు గదా! అని చెప్పువారు చాల సుకృతత్ముమలే, పుణ్యమూర్తులే, తపస్సు చేసిన వారే. అయితే వృత్తిరాహిత్యము గలుగలేదు. అమనస్కస్థితి పొందలేదు. మలవిక్షేపములు నశించినవారలే. ఆవరణ మొక్కటి మాత్రము నశింపలేదు. వీరును ఈ జన్మములో మనన నిదిధ్యాసనములచే ఆవరణ రహితము చేయగల్గుదురు. ఈ జన్మములో ముక్తి నొంద గల్గుదురు. దీనికిని వారి మనోఽభిప్రాయమే

కారణమగుచున్నది.

5. అదేరీతిగా, మరికొందరు ఇప్పుడు ముక్తిని పొందక పోయినను త్వరలోనే యీ సంకల్పము లన్నిటిని రహిత మొనర్చుకొని కేవలము బ్రహ్మచింతనలోనే కాలము గడుపవలయును అని తలంపుగల వారికి అభ్యాసబలముచే కొన్ని సంవత్సరములలోనే పూర్ణ ప్రబోధము గల్గును. వారు అమృతత్వము నొందగల్గుదురు. ఆలాగున కొన్ని సంవత్సరములవరకు మనము జీవింపగలుగుదుమా? ఎవరికి తెలియును? ఈ సంవత్సరాంతమునకు సమస్తబంధములను త్రెంచివేసి బ్రహ్మాకారవృత్తిలో కాలము గడుపవలయునని తలంపుగలవారికి అంత కాలము చాలును. ఇదే రీతిగా నెలలు గాని, దివసములుగాని చాలునని తలంపు గలవారికి అంతియే చాలును. వైరాగ్య బోధోపరతులలోను, శ్రవణ, మనన, నిదిధ్యాసనములలోను ఏ మాత్రమైన కొరత యుండునని అంతరాత్మలో గోచరించుచుండినచో, అది కొరతగానే యుండును. ఇదే మనస్సు సాక్షియని చెప్పుదానియొక్క రహస్యము. ఇప్పుడే నేను ముక్తుడను. వైరాగ్యబోధోపరతులు గల్గియుండువాడను, మనననిదిధ్యాసనములు గల్గి సాక్షాత్కారము గల్గియున్నది. విధిప్రకారము సమస్తకార్యములును చేసియుంటినిగదా! నిష్కామపుణ్యకర్మముచే నిర్మలదైవభక్తి, ధ్యానయోగమును, జ్ఞాననిష్ఠయును కొరతలేక నిర్వహించియుంటిని గదా! సద్గురుసేవ శ్రీగురువుల వారికి సంతృప్తి గల్గు వరకు చేసి వారి పరిపూర్ణ అనుగ్రహము గల్గియున్నది. ఈశ్వరభక్తి బహుకాలము చేసి సర్వేశ్వరుని కృప దండిగా గల్గియుండనిచో ఇట్టిమహత్తైన స్థితి గల్గియుండదు. కావున దైవకృపయు గల్గియున్నది. చిరకాలము నిదిధ్యాసనబలముచే బ్రహ్మసాక్షాత్కారవృత్తి నిరంతరము అనర్గళముగా నాయందు ప్రవహించుచున్నది. గురువులచే చెప్పబడిన మహావాక్యముల అర్థము నాకు సుదృఢముగా సార్థకమై యున్నది. నేను కృతకృత్యుడను. పూర్ణమైన దైవాకారబోధము నాకు నిరావరణ సూర్యునివలె హృదయాకాశములో వెల్గుచున్నది గదా! ధ్యాతృ, ధ్యాన, ధ్యేయము లేకమై గోచరించుచున్నవి గదా! కావున నేను ఇప్పుడే ముక్తుడను. సందేహము లేదు

అని భావించువాడు ముక్తుడే. కలగన్నవాడు మేల్కొనిన తర్వాత కలలన్నియు నేలాగున మిథ్యయని తలంచునో, ఆలాగున ఈ మహాత్ముడుగూడ ఇంతవరకు గలిగియుండిన బంధములన్నియు మిథ్యయని తలంచును. కర్మము లన్నియు మిథ్యయని యెఱుంగును. సంశయములన్నియు విలయములై పోయినవి. కర్మములన్నియు భస్మములైనవి. ఓహో! బంధము కనబడుటలేదే! బంధించునది ఒకటైన కానుపించుట లేదే! మాయ యెచ్చటనో మాయమై పోయినదే! అంతయు అమృతమయము, ఆనందమయము, శివమయము! ఓహో! ఇవన్నియు దైవమయము, ఇదియేమి యాశ్చర్యము! లోక మేల ఇది కనుగొనుట లేదు! ఓహో! ఇది యేమి యాశ్చర్యమని అతడు తనలోనే తాను తలంచుకొని ఒకప్పుడు తాండవ మాడుచుండును. మరియొకప్పుడు నవ్వుచుండును. ఇంకొకప్పుడు సమాధినిష్ఠుడై గంటలకొలది కాలము గాని, కొన్ని దివసములు గాని యుండును. వేరొకప్పుడు అవధూతవృత్తిలో తిరుగుచుండును. ఒకప్పుడు అత్యద్భుతముగా అతి గహనములగు వేదాంత భావములను బోధించుచుండును. ఒకప్పుడు పరమప్రసన్నభావముతో నిశ్చేష్టుడై చిత్రపు బొమ్మవలె కూర్చుండును. ఇంకొకప్పుడు నిస్తరంగ సాగరమువలె పరిపూర్ణ బ్రహ్మభావములో మగ్నుడై యుండును. మరియొకప్పుడు మేరుపర్వతమువలె అచలావస్థను పొందియుండును. ఒకప్పుడు పరమ మూఢునివలె ఒకస్థలములో పడియుండును. ఒకప్పుడు సత్యధర్మానుష్ఠానములతో గూడియుండి భక్తులకొరకు ప్రవర్తించుచుండును. అట్లు ప్రవర్తించుట భక్తులయొక్క భాగ్యమనియే తలంచవలయును. జ్ఞానికి లోకముతో ఏయొక్క పనియు లేదుగాని, లోకమునకు జ్ఞానిచే గొప్పలాభము కలదు. ఇప్పుడు వైరాగ్యములో గల భేదములను తెలుపబూనెద.

(1) కొందరికి సూక్ష్మముగా కొన్ని వ్యాధులు అప్పుడప్పుడు బాధ గలుగజేయుచుండును. అట్టి బాధలు గలుగునప్పుడు మాత్రము వారు ఔషధసేవ చేయుదురు. వారు వైద్యుని వెదకవలయునని తలంపు గలగినవారై బాధ శమించునప్పుడు ఆ విచారమును కూడ మరచిపోవుదురు. ఆలాగున

కొందరికి సంసారబాధలు వచ్చినప్పుడు గాని, మహాత్ముల సంసర్గము గలుగునప్పుడు గాని, దైవికగ్రంథములు చదువునప్పుడుగాని లేక వినునప్పుడుగాని మాత్రము దైవకార్యములో ప్రవేశింపవలయునని విచారము కలుగును. ఏదైన నొకతరణోపాయ మగు ధ్యానమును చేయవలయునని తలంపు గల్గి యుండును. అయితే సంసార కార్యములకు భంగము గలుగక చూచుచుండవలయునే కాని, ఇదంతయు విడువరాదని బుద్ధి దృఢపడియుండును. ఇట్టి వైరాగ్యమునకు మందవైరాగ్యమని పేరు. ఇట్టి బుద్ధి గలవారు జన్మజన్మాంతరములకు ఈశ్వరుని చేరగల్గుదురు. అయితే యిట్టి గుణమునకు శుభేచ్ఛ యని పేరు. వీరు పాపమునుండి చాలవరకును విమోచనము గల్గినవారే. అరుణోదయ మేలాగున, రాత్రియొక్క శమనమును, సూర్యోదయము యొక్క గురుతును సూచించుచుండునో, ఆలాగున పై కనుబడిన గుణము పుణ్యసూచకమై, పాపశమనమును తెలుపుచున్నది.

(2) వ్యాధి తీవ్రముగా బాధించునపుడు ఆలస్యము చేయక, ఔషధమునకును, వైద్యము కొరకును ఏలాగున ఆతురపడుదురో, ఆలాగున పుణ్యవృద్ధియు, పాపక్షయము గలుగునప్పుడు ముముక్షుత్వము తీవ్రముగా పరిణమించును. అప్పుడు వెంటనే గురువును వెదకుటకును, బ్రహ్మనిష్ఠ చేయుటకును, ఆందోళనము హృదయములో జరుగుచుండును. ఇట్టిదానికికూడ మందవైరాగ్యములో అంతర్భూతమైన మృదు వైరాగ్యమని పేరు గలదు. వీరికి అనేక జన్మములు అవసరము లేదు. మరియొక్క జన్మముండిన చాలును.

(3) మరికొందరికి వ్యాధి అతితీవ్రముగా గలిగి మరణమాసన్నమైనదని గోచరించిన, అన్ని కార్యముల భారము తగినవారిపై నుంచి, జరుగవలసిన కార్యములన్నియు, జరిపేలాగున ఏర్పాటు చేసికొని, కావలసిన ధనమును తీసికొని, తగిన మనుష్యులను వెంటబెట్టుకొని వైద్యు డుండు స్థలమునకు తాను పోయిగాని లేక తానుండు స్థలమునకు వైద్యుని రప్పించి గాని, అన్ని పనులను మానుకొని చికిత్స చేయించు కొన్నట్లు, వైరాగ్యము అధికరించి

మిథ్యాప్రపంచములో ఏమియు, సత్యముగా కనుపడని అవస్థ గల్గునప్పుడు, అజ్ఞాననివృత్తి యెప్పుడు లభించునో యను పరితాపముతో నిద్రాహారాదులలో గూడ ప్రీతి లేక యెప్పుడెప్పుడు ఇవన్నియు విడచి బైట పోవుదునా? యను తలంపు గల్గియుండుట, తీవ్రవైరాగ్యము గలిగినదానికి గురుతుగా నుండును. వీరికి ఈ జన్మములోనే ముక్తి కలుగును.

(4) ఇక తీవ్రతరవైరాగ్యము. ఈ అవస్థ గల వారికి ముక్తి సమీపముగా నిలచియున్నది. విషయాసక్తిచే ఆవరించబడిన దుర్వృత్తిగల స్త్రీ యైనచో, పరపురుషుడు దగ్గరవచ్చి అనుగుణముగా నుండునప్పుడును, లేక పురుషుడైనచో అనుకూలముగా దుర్వృత్తిగల స్త్రీ వచ్చియుండినప్పుడు, జాతి, మత, వ్యవస్థను గూడ చూడక పురుషుడైన పరస్త్రీతోను, స్త్రీయైన పరపురుషునితోను ఏలాగున లేచి వెళ్ళిపోవుదురో, ఆలాగున తీవ్రతరవైరాగ్యము గల్గినచో, ముక్తి కాంతా విహార సుఖముకొరకు అనగా, అనన్య దైవ భక్తిలో మునుగుటకు లేక బ్రహ్మజ్ఞానామృతములో నిమగ్నుడై, తాపత్రయాగ్ని శమింపచేసికొనుటకొరకు పురుషుడును, స్త్రీయైన, అచంచల దైవ భక్తిగలిగి పరమపురుషుడగు పరమేశ్వరునిలో ప్రవేశించి సంసారదుఃఖ నివృత్తి చేసికొని తాపత్రయాగ్ని శమనము నొందించుకొనుటకు మోక్ష మనెడు సర్వేశ్వరప్రాప్తికి పరుగెత్తుచుందురు. ఇట్టి మనస్తీవ్రత గలవారికి ముక్తి చాల సమీపములోనే యుండును. లేత దూడ పరుగెత్తునప్పుడు ఆవు వెంబడించి పోవునట్లు, ఇట్టి పరమభక్తులను ఎల్లప్పుడు భగవంతుడు వెంటనంటియే యుండును. ఇది సామాన్యజీవులకు గలుగునది గాదు. నిశ్శేషబంధ విచ్ఛేదము గలుగజేయు జన్మము వచ్చియుండువారికి గలిగియుండును. వీరు ధన్యాత్ములు. వీరే పరమభక్తుల సంఘములో చేరినవారు. ఇట్టి విషయములో సామాన్యముగా భక్తి వైరాగ్యములు గల స్త్రీ పురుషులు చాల జాగరూకులై వర్తించవలయును. లేనిచో ప్రమాదము గల్గును. అంతరాత్మలో ప్రబోధము గలిగిన మాత్రమే అట్టివైరాగ్య పద్ధతి నవలంబించవలయును. ఏలన? ఇది కత్తిపై సాము వంటిది. ఒక్కటి రెండు రోజులు నిర్వహించిన చాలదు. జన్మము అంత్యమువరకు

నిర్వహించవలసి యుండును. పై జెప్పిన తరగతిలో చేరినవారలు శ్రీతరిగొండవెంకమాంబగారు, శ్రీమీరాబాయి, శ్రీతుకారాం, శ్రీకృష్ణచైతన్యులు మొదలైనవారలు.

(5) తీవ్రతమవైరాగ్యము. ఇది యువతియు, గొప్పకుటుంబములో ఘోషాసంప్రదాయము గలదియునగు నొక స్త్రీయింటిలో తలుపులన్నియు మూసి నిద్రపోవుచుండగా, ఇల్లు అగ్నిచే దహించబడి వస్త్రములుగూడ కాలిపోవుచుండగా, అగ్నిని చల్లార్చుటకు అనేక పురుషులు చుట్టునుండగా అగ్నితపనము సహింపజాలక తాపనివారణార్థము కనబడిన మార్గముతో పురుషుల మధ్య బయటికి వెళ్లునప్పుడు ఏ వస్తువును ఎత్తుకొనిపోవలయునని తలంపు లేకయు, సిగ్గుగూడ తలంపునకు రాకపోవుచుండునో, ఆలాగున ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవికములగు తాపత్రయముచే తపించు జీవి యీశ్వర కరుణ బడసి ఆత్మజ్ఞానామృతములో మునిగి తాపత్రయాగ్నిశమనము చేసికొనుటకు పరుగెత్తెడు స్వభావము కల్గియుండుట, తీవ్రతమ వైరాగ్యమనంబడును. ఇట్టి వారికి త్వరలో భగవత్కృప లభించును. తాను పోవునప్పుడు తననీడ తన్ను వెంబడించునట్లు, సర్వేశ్వరుండు వీరివెంటనే యుండి అన్నికార్యములను నిర్వహించుచుండును. ఇట్టివారికి తగిన గురువును పరమేశ్వరుండే కలుగజేయుచుండును. ఇది వైరాగ్యములలో చాల గొప్పది. ఇట్టి వైరాగ్యమును గురించి ఇంకను కొన్ని లక్షణములు చెప్పబడి యున్నవి. కిరాతకుల వలలోబడి తప్పించుకొని పోయెడి మృగమేలాగున వెనుకకు చూడక పరుగెత్తి పోవుచుండునో, అదే రీతిగా బోయవాని వలలో చిక్కిన పక్షి తప్పించుకొనిపోవునప్పుడు ఆ ప్రాంతమున ఎక్కడను నిలువక వేగముగా దూరము పోవునట్లు అజ్ఞానజాలము నుండియు, ఆశాపాశమునుండియు, రాగద్వేషాదిబంధనముల నుండియు వీడిపోవుటకును మరణరహితమగు అమృతత్వము పొందుటకును వైరాగ్యభక్తిశ్రద్ధలు గలిగి తీవ్రతమ ముముక్షుత్వము గలిగియుండువారు పరమపావను లగుదురు.

(6) ఇది అతి తీవ్రతమ వైరాగ్యము. ఇది గల్గినవానికి, అప్పుడే ముక్తి గల్గును. ఈ వైరాగ్యలక్షణము ఈలాగున నుండును.

పేడ లో గల తెల్లని పెద్దపురుగు ఎండచే తపించెడు మధ్యాహ్న సమయమున ఇసుకలో వేసిన ఏలాగున నీడకొరకు పరితపించునో, వేడి సహింపక అటునిటు పొరలుచుండునో, ఆలాగున అజ్ఞాన తాపమునుండి వేరుపడుటకును, ఆత్మశాంతిని పొందుటకును, నిరంతరము ఆహారనిద్రలలో గూడ ప్రీతిలేక పరిభ్రమించుచుండుటయు, నీటిలోనుండి బయటపడిన చేప లేలాగున మరల జలములోనికి చేరుటకు తపించుచుండునో, తనుకలాడుచుండునో, ఆలాగున జ్ఞానసాగరుడగు భగవంతునినుండి అజ్ఞానవశముచే ప్రకృతిలోనికి వచ్చిన జీవులు మరల జగదీశ్వరుని యందు చేరుటకు అనగా ఆత్మజ్ఞానము నొందుటకు అంత పరితాపము గల్గియుండవలయును. వీరికి మాత్రమే దృశ్యవృత్తులన్నియు తొలగిపోవును. ఇట్టి వైరాగ్యము లేకుండుటే బ్రహ్మనిష్ఠులలో కొందరు ఉన్నత స్థితి నందకపోవుటకు కారణము. మనుష్యులను నీటిలో ముంచి యుంచిన ఎంత కష్టము గలుగుచుండునో, మత్స్యములను తీరమున పడవేసిన అంతకష్టముగా నుండును. మరియు, ముదిరి తొర్రపడి యుండు వృక్షములోపల నిప్పు మండుచుండిన దానియొక్క ఫల, పల్లవ, పుష్ప లతాదులన్నియు నెట్లు వాడిపోయియుండునో ఆలాగున నెవని యొక్క హృదయకోటరములో అతితీవ్రతమ ముముక్షుత్వ మను అగ్ని రగులు చుండునో అతని సర్వేంద్రియములును నిర్విషయత్వము నొంది యుండును. మరియు చెరువులోగల జలమంతయు నశించునప్పుడు బురదపై నుండు చేపలు ఏలాగున జలముకొరకు పరితపించుచుండునో, యెండచే ఏలాగున మాడుచుండునో, అత్తరి పక్షులు ఒక్కొక్క చేపను ఎత్తుకొనిపోవునప్పుడు తక్కిన మత్స్యములు మరణభయముచేతను, ఎండయొక్క తపనముచేతను, జలదాహముచేతను ఎట్లు వణకుచుండునో, ఆలాగున జీవితకాలము ప్రతినిమిషము క్షయించి పోవుటయు, తన తోటిమానవులను మృత్యుదేవత భయంకరముగా పీడించి ఒక్కొక్కరిని గొనిపోవుట చూచుచు గ్రహించి, ఆత్మజ్ఞానము లేని ఆ జ్ఞానతాపముచే తపించు స్వభావముగలిగి ఆత్మోపలబ్ధికొరకు నిరంతరము పాటుపడిన వానికి ముక్తి అతిత్వరలో దొరుకును. ఇది స్వభావవైరాగ్యము గలిగిన

దానియొక్క లక్షణముగా నుండును. తక్కినవన్నియు అభావవైరాగ్యములు. కనుకనే స్వభావ వైరాగ్యము గలుగక అభావవైరాగ్యముచే ఇల్లు విడిచినచో, కలహమునకును, బాహ్యసుఖమునకును, లోకమును నిందించుటకును, ఇతరులపై అసూయ వహించుటకును, దుర్వృత్తులగు దయ్యములచే పట్టుపడుటకును కారణభూతులై పరిశుద్ధబ్రహ్మనిష్ఠుల పరమపావన మార్గమునకు కళంకము గలుగచేయుటకు కారణమగుచున్నది. ఇట్టి వ్యర్థజీవుల జీవితము సార్థకము కాకపోవుటయేగాక సార్థకజీవితము గడపువారికి వీరివలన కొన్ని బాధలుగూడ గలుగుచుండును. వమనాన్న మేలాగున మనుజులు భుజింపరో, ఆలాగున యథార్థవైరాగ్యము గలవారు విడచి పెట్టిన దృశ్య విషయములను మరల అనుభవింపరు. తాకనే తాకరు. కుక్కలు మొదలైన కొన్నిజంతువులు కక్కినదానిని మరల తినుచుండును. ఆలాగున దృశ్యవిషయములను త్యజించిన వైరాగ్యపురుషుడు దానిని ముట్టడు.

ఇట్టి గుణములే ఋషుల సంతానములగు సోదరీ సోదరులారా! మన కిప్పుడు కావలసియుండునవి.

ప్రతినారీమణియు తనయొక్క వంశమునకు అనగా స్త్రీలకు గౌరవము సంపాదించేలాగున యత్నించవలయును. ప్రత్యేకించి బ్రహ్మనిష్ఠురాండ్రగు వీరమాతలు స్త్రీ సంఘమునకు యశస్సు సంపాదించవలయును. వారందరును మైత్రేయి, సులభ, శార్ఙ్గి, గార్గి, చూడాల మొదలైన బ్రహ్మజ్ఞానఘనీభూతలగు స్త్రీరత్నములను తనయొక్క సోదరీమణులుగా భావించి నిష్ఠ సలుపవలెను. పురుషులవలె స్త్రీలకును మేధాసంపత్తి గలదని తమయొక్క జ్ఞానముచేతను, బ్రహ్మనిష్ఠచేతను, ఆధ్యాత్మిక విద్యచేతను, వ్రతనిష్ఠచేతను, సంయమశక్తిచేతను, తపోమహిమచేతను, యోగసాధనచేతను, సాంఖ్యవిచారణచేతను, భక్తిప్రభావముచేతను పురుషులు సిగ్గుపడేలాగున వర్తించవలయును. అప్పుడు మాత్రమే పురుషులగు పండితులు గ్రంథము లన్నిటిని పరిశోధించి స్త్రీలకు బ్రహ్మవిద్యాధికారము లేదని యెవరైన ఇంతవరకు వ్రాసిపెట్టియుండిన దానిని సవరణచేయుటకు ప్రయత్నించెదరు. ఇకమీద వ్రాయువారు ఆలాగున స్త్రీలను నిందించి వ్రాయుటకు సిగ్గుపడెదరు. అట్లు చేయక యోగినులని చెప్పి

భోగినులైయుండు కొందరి దుష్టకృత్యముల చూచిన చదువుకొన్నపండితులు స్త్రీలకు స్వాతంత్ర్యము లేదనియు, బ్రహ్మవిచారమునకు అర్హతలేదనియు గల శ్లోకములు ఎచ్చటనో పురాతన గ్రంథములలో మాసిపోయియుండిన వానిని మరల స్ఫుటముగా దిద్దుటకు ప్రయత్నింతురు. క్రొత్తగా కొన్ని శ్లోకములు ఆలాటివి ప్రక్క ప్రక్క వ్రాయుటకు ప్రయత్నింతురు. అంతేగాక క్రొత్తక్రొత్త శ్లోకములను పూర్వీకులగు నిర్దోషులైన ఋషిసత్తములపేరుతో నిర్మింతురు. సర్వసముడగు సర్వేశ్వరుని దివ్య నామముతో మోసపు కృత్యముచేసి శ్లోకములు వ్రాయుటకు ప్రారంభింతురు. అంతేగాక భవిష్యత్తున రాబోవు పుణ్యజీవులగు స్త్రీలకుగూడ వీరు కళంకము తెచ్చిపెట్టిన వారగుదురు. రాబోవు ధీరశిరోమణులకును, బ్రహ్మనిష్ఠలో ప్రవేశించెడు నారీరత్నములకును వీరు విషము పోసినవారే యగుదురు.

ఇట్టి మహాపాపమునకు ఒడిగట్టక యుందురుగాక! యనిప్రస్తుత బ్రహ్మనిష్ఠురాండ్రగు సోదరీమణులను ప్రార్థనా పూర్వకముగా కోరుచున్నాను. అదేప్రకారము పురుషులలో కొందరు నిజమైనవైరాగ్య బోధోపరతులను పొందక యోగులమని తలంచి రాగరోగులైపోవుచున్నారు. ఆత్మసోదరులారా! యోగము, భోగము అంధకార ప్రకాశములవలె విరుద్ధధర్మము గల్గియుండును. ఒకటి యుండిన రెండవది యుండదు. చీకటి యుండినప్పుడు ప్రకాశముండదుగదా! ప్రకాశమున్నచోట చీకటి లేదుగదా! ఒక్కపురుషుని దగ్గర స్వంతభార్యయు, వేశ్యయు ఐకమత్యము గలిగి అతనిని సేవింప జాలరుగదా! యోగనిష్ఠకును, భోగపరత్వమునకును ఇంత వ్యత్యాసము గలదని మరువకుడు. నిజమైన వైరాగ్యము గలుగక స్వగృహమును విడువకుడు. ఈ తత్త్వమును తెలియక పోవుటయే అన్ని అనర్థములకును కారణమగుచుండును.

అభావ వైరాగ్యమును గురించి గ్రంథములలో ఈలాగున పేర్కొనియున్నారు. పురాణవైరాగ్యమనియు, శ్మశానవైరాగ్యమనియు, ప్రసూతి వైరాగ్యమనియు, మతవైరాగ్యమనియు, అకాలవైరాగ్యమనియు, కొన్నివైరాగ్యములకు అభావవైరాగ్యము లనియు పేర్లు. ఇట్టి వైరాగ్యము

సార్థకత్వము గలుగజేయక పోవుటయే కాక, అనర్థదాయకమై కూడ పరిణమించును. ముందు నారీమణులకు బోధించినట్లు నరవరులుగూడ రాబోవు బ్రహ్మనిష్ఠులకు విషమును పోయక యుండేలాగున చూడవలయును. మీరును శ్రీశుక, సనక, సనందనాది ఋషివరుల సోదరులని మరువరాదు. అట్టి భావన మీరు చేసినచో, తప్పక మీరును అట్టివారలవలె అగుదురు. మీరు దృశ్యవిషయములోనికి లోబడిపోయినచో విషము పోసినవారే యగుదురు. మీరు నిర్విషయమగు అమృతత్వమునందినచో సుధావృష్టిని కురియించిన వారగుదురు. మీ ప్రతిబంధములను మీరు తొలగించిన, సర్వత్ర మీరు తలుపు తెరచిపెట్టిన వారగుదురు. అట్లైన సర్వజనులును సర్వదైవిక విషయములలోనికిని, నిరాటంకముగా వెళ్ళవచ్చును. అప్పుడు విజ్ఞానభాండాగారము యొక్క కవాటములు అందరికిని ప్రపంచము తెరచిపెట్టి యుంచును. అట్లు చేయనిచో, రాబోవు ముముక్షువులకు సర్వత్ర ప్రతిబంధము గలుగచేసిన వారగుదురని మరువకూడదు. ఇదియే మీకు సవినయముగాను, సభక్తికముగను మనవి చేయవలసిన విషయమై యున్నది. మరియు, గృహస్థాశ్రమములో గల పుణ్యస్త్రీలు గృహధర్మము నిర్వహించియు, పతిశుశ్రూష చేసియు, పిల్లలను లెస్సగా పెంచియు, అతిథి అభ్యాగతులను చక్కగా ఆదరించియు, బ్రహ్మనిష్ఠ చేసికొననభ్యసించవలయును. అప్పుడు మాత్రమే సంసారములో నుండి మోక్షము పొందవచ్చునని అందరికిని గోచరమగును. ఇదియే గృహస్థులు చేయవలసిన పంచమహాయజ్ఞములలో గల గొప్ప బ్రహ్మ యజ్ఞమగును. భర్తలు లేని సోదరీమణులు బ్రహ్మనిష్ఠ, వైరాగ్య మవలంబించి చేయుట ఒకగొప్పకాదు. ఏలన? అది వారి స్వంతధర్మమై యున్నది. గృహస్థాశ్రమములో నుండి విరక్తి గలిగి బ్రహ్మనిష్ఠ సలుపువారి మనస్సనెడు జ్ఞానఖడ్గమునకు ఇరు ప్రక్కల వాడికలిగి యుండును. అట్లు కానివారి వైరాగ్య బ్రహ్మనిష్ఠకు ఒక్కప్రక్కనే పదును గల్గి యుండును. ఇదియే గృహస్థాశ్రమములో గల జ్ఞానుల యొక్క విశేషము. ఆలాగున గృహస్థుడగు పురుషుడు సహధర్మిణితో నుండి బిడ్డలను చక్కగా పోషించి అతిథి సత్కారపరుడై, గృహకృత్యములలో లోటు గలుగక చూచుకొని జ్ఞాననిష్ఠుడై యుండవలయును. అట్లైన మాత్రమే సంసారములో

నుండెడు మన సోదరపురుషులకు, సంసార కార్యము నిర్వహించుచునే ఈశ్వరుని పొందవచ్చునని జ్ఞానము గల్గును. వీరు తమ శరీరము యొక్క అర్థభాగమువలె, సహధర్మిణులను చూచుచుండవలయును. వారికి సహాయము చేయువారు తాము తప్ప మరి యెవరును లేరని, జ్ఞప్తిలో నుంచి జాలిగల్గి వారి దైవికమార్గములకు అడ్డుగలుగ చేయక కావలసిన సహాయముగూడ చేయుచుండవలయును. అట్టి దైవభక్తి పురుషులగు మనకు కలుగక పోయినను అబలలగు స్త్రీలకు కలిగినది గదా! యని సంతోషము గలిగియుండవలయును. పుత్రునియొక్క యశస్సంతయు తండ్రిది గదా! శిష్యుని యొక్క జ్ఞానమహిమ యంతయు గురునిది గదా! ఆలాగున భార్య యొక్క కీర్తి యంతయు, సద్ధర్మయంతయు, జ్ఞానమంతయు, భర్తదేయని తలంచి సంతోష మొందవలయునే గాని, అసూయపడుట సజ్జనులకు స్వభావము గాదు.

గృహస్థధర్మము నిర్వహించుకొని బ్రహ్మజ్ఞానము సాధించిన పురుషుని యొక్క వివేకమనెడు చంద్రాయుధమునకు రెండుప్రక్కలను తీక్ష్ణమగు వాడి గల్గియుండును. కనుకనే బ్రహ్మ వేత్తలందరిలోను, జనకునికి అట్టి జగద్విఖ్యాతి గలుగుటకు కారణమైనది. అట్టి గృహస్థ ధర్మములేని బ్రహ్మచర్య వానప్రస్థ, యత్యాశ్రమములలో నుండి వైరాగ్యబోధోపరతులు గలిగి బ్రహ్మజ్ఞానము గల్గిన జ్ఞానియైనను వానియొక్క మనస్సనెడు వజ్రాయుధము ఒకప్రక్కన మాత్రము సుతీక్ష్ణమైన వాడిగల ఆయుధ మని విజ్ఞులు తలంతురు. కనుకనే ఆత్మజ్ఞానము గల గృహస్థాశ్రమము ఇతరాశ్రమములకన్న శ్రేష్ఠమని కొన్ని శాస్త్రములలో పేర్కొనుటకు కారణమైనది. అట్లు జ్ఞానము లేని గృహస్థాశ్రమము ఇతరములగు మూడాశ్రమములకన్న నికృష్టమని కొన్ని శాస్త్రములలో నిందించుటకును హేతువైనది. ఇట్టిదానినే సంసారఘోరదుఃఖ మనియు, పాపభూయిష్ఠ మనియు, ఇట్టిదానిలోనుండి పావనత్వము గలుగ చేసికొనుటకు మార్గము లేదనియు శాస్త్రములు మొత్తముగా ఉద్ఘోషించుటకు కారణమైనది. ఇప్పుడు మనము వైరాగ్యవిషయమై గ్రహించవలసిన విషయములో ముఖ్యభాగము గ్రహించడమయిన దని తలంచెదను.

ప్రవృత్తి నివృత్తి మార్గములలో గల తారతమ్య మెరింగితిమి. ఇక మనము మనయొక్క హృదయ కవాటమును తెరచిపెట్టే విషయమై పరిశీలించెదము. మీయొక్క విజ్ఞాన భాండాగార గృహద్వారమును సర్వజనులకును, సర్వమతస్థులకును, సర్వదేశస్థులకును తెరచిపెట్టి యుండవలయును. కొన్ని మతములకును, కొన్ని దేశములకును, కొన్ని జాతులకును మాత్రము తెరచుటయు, తక్కినవారికి మూయుటయు సంకుచిత స్వభావమేకాని, వైశాల్యవంతమైన వికాసస్వభావము కాదు. వీరు అనంతుడైన ఈశ్వరుని లేక దైవమును లేక బ్రహ్మమును సొంతునిగా చేసికొని తమయొక్క శుష్క హృదయములో నిమిడించుటకు చూచుట చిన్న పిట్టల నుంచి పెంచెడు పంజరములో పెద్ద యేనుగు ఉండుటకు స్థలము నిచ్చినట్లని తలంచవలెను. నేను ఇంతవరకు గతించిన మతము లన్నిటికిని వందనము లొనర్చుచుందును. క్రైస్తవులతో చర్చిలోనికి ప్రవేశించి పావనమగు శ్రీయేసు యొక్క క్రాసును చుంబనము చేయు చుందును. లెస్సగా మ్రొక్కుచుందును. మహమ్మదీయులతో సహా మసీదులలోనికి వెళ్ళి భక్తితో ప్రార్థన సలుపుచుందును. బౌద్ధులతో కలసి శ్రీబుద్ధదేవుని శరణు పొందుచుందును. యోగులతో గూడి నిర్వికల్ప సమాధిలో లయించియుందును. జ్ఞానులతో గూడి బ్రహ్మసాక్షాత్కార జ్ఞానములో నిలిచియుందును. భక్తులతో గూడి ప్రార్థన భజనకీర్తనలు చేసి ఆనందబాష్పములలో మునిగి తన్మయత్వము నొంది నిశ్చేష్టుడనై యుందును. నిష్కామకర్మయోగుల సంఘములో నుండి కర్తృత్వమును, కర్మఫలాసక్తియును విడిచి మనోవాక్కాయములచే సదా పుణ్య కర్మలు చేయుచుందును. సాంఖ్యుల సంఘములో గూడి తత్త్వములను లెక్కపెట్టి ఇదికాదు, ఇది కాదు అని ఒక్కొక్క దానిని విడచి ఆఖరు సత్తగు సత్యవస్తువులో నిశ్చలముగా నిలిచియుందును. అచలమతస్థులతో కలిసియుండి ఇంద్రియములచేత చలింపని నిశ్చలమగు బ్రహ్మపదవి యను పరిపూర్ణ భావములో నిండి యుందును. వర్తమానయుగములో గల మతములన్నిటికిని ప్రేమతో స్వాగతము నిచ్చుచుందును. భవిష్యత్తున రాబోవు మతములన్నిటికిని యిప్పటినుండియే స్వాగత శుభలేఖలను పంపుచుందును. అందరితోను

వైరాగ్యము, భక్తియు, కరుణయు, సద్బోధము గల్గియుండవలయునని బోధించుచుందును. ప్రతిబంధవములు గల్గినప్పుడు ప్రేమతో సహించుచుందును. అయితే చెప్పవలసిన ధర్మవాక్యములు మాత్రము తప్పక బోధించుచుందును. సర్వమానవులకును స్వస్తిగలిగేలాగున అభిలషించుచుందును. సర్వప్రాణికోట్లకును సౌఖ్యము గలిగేలాగున, సర్వేశ్వరుని ప్రార్థన చేయుచుందును. సర్వసస్యములకును సమృద్ధిగలిగే లాగున ఆత్మలో తలంచుచుందును. సర్వచరాచరములకును శాంతి గలిగేలాగున ఆశించుచుందును.

> వివేకినో విరక్తస్య శమాదిగుణశాలినః ।
> ముముక్షో రేవ హి బ్రహ్మజిజ్ఞాసాయోగ్యతా మతా ॥
>
> గురవో నిర్మలాశ్శాంతాః సాధవో మితభాషిణః ।
> కామక్రోధ వినిర్ముక్తాః సదాచారా జితేంద్రియాః ॥

లోకాస్సమస్తా స్సుఖినో భవంతు



# అనన్యభక్తి

(శ్రీ ఆంగీరసనామ సంవత్సర కార్తిక బహుళ ఏకాదశికి సరియగు 24-11-32వ తేదీన బందరు వైశ్యసమాజములో ''అనన్య భక్తి'' ని గురించి శ్రీసద్గురు మలయాళస్వాములవారు ఇచ్చిన ఉపన్యాససారము.)

అనన్యభక్తిలో కొందరు సంకుచితహృదయులు ఈ లాగున తలంతురు. అదేమన శైవులైనచో శివనామస్మరణయు, శివభక్తులతో సంసర్గమును, శివకథాపారాయణము, శివాలయసేవయు గలిగి యుండవలయునేగాని, యితరదేవతల నామోచ్చారణము గాని, అనగా శ్రీనారాయణ, శ్రీకృష్ణ, శ్రీరామ అని ఉచ్చరించుట గాని, విష్ణు భక్తులతో సహవాసము చేయుట గాని, విష్ణుకథలను వినుట గాని, విష్ణ్వాలయములకు పోవుట గాని చేయరాదనియు,

ఒకవేళ ప్రమాదవశమున అట్లు చేసినచో శివుడు కోపించుననియు, పతివ్రతయైన స్త్రీ తన పతిని విడిచి పరపురుషుని అనుగమించినచో ఏలాగున అతడు ఆ స్త్రీని విడనాడునో ఆలాగున ఈ భక్తుని శివుడు పరిత్యజించుననియు చెప్పుదురు. ఇట్టివారిని వీరశైవు లందురు. అదేరీతిగా వీరవైష్ణవులు కొందరు గలరు. వారును పైజెప్పిన వీరశైవులవలెనే విష్ణుస్మరణయు, విష్ణుభక్తియు, విష్ణుపురాణములను చదువుటయు, విష్ణ్వాలయ సేవయును, విష్ణుభక్తులతో సహవాసమును చేయవలయునే గాని, యితర శివసంబంధమైన యే కార్యమును చేయరాదనియు, ఒకవేళ చేసినచో సాధ్వీమణియైన స్త్రీ యితరపురుషుని అనుగమించిన యేలాగున భర్త విడనాడునో, ఆలాగున భగవంతుడు విడనాడునని వచింతురు. ఇది కల్పితకథయే గాని, సత్యాన్వేషులకు బంబంధించినది కాదు. ఇది స్వార్థపరత్వముతోను, సంకుచిత భావముతోను చెప్పబడిన ఒకవిధమగు భక్తియేగాని విశాలభావముతోను, విశుద్ధబుద్ధితోను చెప్పినది గాదు. పతివ్రతయైన స్త్రీ తన ప్రాణనాథుడగు పతిని సేవించుట ధర్మమే కాని బ్రహ్మనిష్ఠులను, పరిశుద్ధాత్ములగు అతిథులను, వృద్ధులను, అత్తమామలను సేవించుట తప్పు అని ఏ శాస్త్రము చెప్పగలుగును? ఏ భక్తుడు వచింపగల్గును? అయితే పతితో గూడియుండవలసిన ధర్మములు కొన్ని ప్రత్యేకముగా నుండవచ్చును. దానికిమాత్రము లోపము గలుగక వర్తించుట పతివ్రతారత్నమగు నారియొక్క గుణము. అదే రీతిగా తనయొక్క యిష్టదేవతయందు ప్రీతి గలిగియుండుటయు, భక్తితో భజించుటయు, ధ్యానించుటయు మంచిది. ఇతర దైవముతోను, భక్తులతోను ద్వేషము గల్గియుండుట, ఇతరభక్తులను ప్రేమింపకపోవుట విచారణ జ్ఞానములేని భక్తి యనియే విజ్ఞులు తలంతురు. అయితే, పై జెప్పినదిన్ని ఒకవిధమగు భక్తియే. ఈ భక్తి ఇతిహాసములలో వర్ణింపబడియున్నది. అయితే, ఇట్టికాలము దాటిపోయినది. వచ్చుకాలము ఇట్టి సంకుచితమునకు అవకాశము గలుగజేయజాలదు. అది సర్వత్ర ప్రతిబంధము లేని మార్గముగా నుండును. విజ్ఞానరత్నకోశము లన్నిటిని తెరచివేయవలయును. ఎవరెవరు వారివారి బుద్ధికి తగినంత సారమును వివర్శించి గ్రహించేలాగున నుండవలయును. అయితే యిచ్చుట

స్వేచ్ఛాప్రవర్తనచే చెడిపోవుదురేమో యని తలంచనక్కరలేదు. ఏలన? తత్త్వజ్ఞానరసపిపాస గలవాడు విజ్ఞుడగునేగాని, అజ్ఞుడు కాజాలడు. పై చెప్పిన భక్తిలో నిష్ఠగలిగి కొంతకాలము ప్రవర్తించెడు వ్యక్తికి భగవద్ధ్యానముచే హృదయ పరిశుద్ధత గలిగి బుద్ధివైశాల్యము గలిగెడి కాల మొకటి వచ్చును.

2. రెండవభక్తి మరియొకటి గలదు. అది తనయొక్క ఇష్టదేవత, శ్రీశివుడుగాని, శ్రీవిష్ణువుగాని, శ్రీకృష్ణుడుగాని, శ్రీరాములుగాని, అయినను, అట్టి ఇష్టదైవమును స్మరించుటయు, ఇష్టదేవతా నామోచ్చారణము జేయుటయు, ఇష్టదేవతా ప్రీతికర కార్యములు చేయుటయు, ఇష్టదైవభక్తులతో సంసర్గము చేయుటయు, హృదయపుండరీకమధ్యమున నిరంతరము ఇష్టదైవమును కనుగొనుటయు, ఇష్టదైవమందు ధ్యానములో మగ్నులైయుండుటయు, ఇతర భక్తులతో ప్రేమకలిగి వర్తించుటయు, ఇతర దేవాలయములలోనికి వెళ్లుటయు, అచ్చటికి కావలసిన సహాయము చేయుటయు గలిగియుండిన యీ భక్తి అనన్యభక్తి యనంబడును. ఇతడు పై పేర్కొనిన వానికన్న వెయ్యి రెట్లు పవిత్రతయు, మనోవికాసమును గలవాడు. ఇతడు తనయొక్క ఇష్టదైవమందు తనకెంత ప్రీతిగలదో, ఆలాగున ఇతర భక్తులకు గూడ వారి యిష్టదైవమందు ప్రీతిగలిగి యుండునది చూచి సంతోషము నొందును. వానికిని తనవలెనే యుండుటకు వానియొక్క దైవమార్గములను తెరచిపెట్టును. అట్టి భక్తులతో గూడి ఆడును. పాడును. నాట్యము చేయును. కాని, తన ఇష్టదైవమందు మాత్రము మనస్సు లగ్నమైయుండును. దైవరసామృతము పానము చేయును. తృప్తుడగును. ఈ భక్తియే పురాణమందు ఎక్కువగా గనబడుచుండును. మొదట చెప్పిన భక్తుని కిట్టి ఆనందము గలుగుటకు అవకాశము లేదు. వాని హృదయము భేదవాదముల చేతను, శత్రుమిత్ర భావముచేతను, హర్షశోకములచేతను నిలకడ గలుగక చంచలమై యుండును. తనయొక్క ఇష్టదైవస్మరణయందు మాత్రము కొంతసేపు హాయి గలుగవచ్చును. అటువంటివాడు ఈ రెండవ భక్తునితో సమానుడు కాజాలడు. ఇతడు అనర్గళ, ఆనంద ప్రవాహముచే నిండినహృదయము గలవాడగును. ఇతనికి అచ్ఛిన్న తైలధారవలె దైవరసామృతము ప్రవహించుచుండును.

3. మూడవ భక్తి ముందు చెప్పిన రెండింటికన్న విలక్షణముగా మరి యొకటి గలదు. దీని ననుసరించువాడు అనేకత్వములో ఏకత్వము కనుగొనుటయే అనన్యభక్తి యని తలంచును. అనేక పాత్రలలో జలము నుంచిన అన్నిటిలోను సూర్యప్రతిబింబము ఏలాగున ఒకేవిధముగా గోచరించునో లేక అనేకరకములగు మణులలో ఒకేసూత్రము ఏలాగున వ్యాపించియుండునో ఆలాగున పిపీలికాది సమస్త ప్రాణికోట్లలోనే గాక, సర్వపరమాణువులలోను గూడ ఆ పరబ్రహ్మమే, ఆ పరమాత్మయే, ఆతనియొక్క యిష్టదైవమే ప్రకాశించుచుండునని కనుగొనును. పాత్రములయొక్క అకృతులు అనేక ప్రకారములుగా నుండినను, లేక అనేక విధములగు లోహములతో చేయబడినవి యైనను అనేక వర్ణములతో గూడినవిగా నుండినను అన్నిటిలోను భాస్కరుని ప్రతిబింబము ఒకే విధముగా నుండును గదా! ఆలాగున సర్వేశ్వరుండు సర్వచరాచరములలో వెలుగుచుండునని తెలిసికొనును. ముందు చెప్పబడిన భక్తులయొక్క భగవత్స్వరూపములన్నియు ఇట్టి సర్వాంతర్యామియైన యీశ్వరుని నుండి గల్గినవి యనియు, ఆ దివ్యమూర్తులన్నియు సముద్రములోనుండి అలలు ఏర్పడినట్లుండుననియు, తరంగములు ఏలాగున సముద్రమున కన్యములు గావో ఆలాగున అఖండదివ్యమూర్తియగు పరమాత్మనుండియే ఈ భక్తులయొక్క దివ్యఉపాసనామూర్తులు గలిగియుండుననియు గోచరించును. ఇది రెండవభక్తికన్న వేలకొలది రెట్లు విశాలభావముతోను, విశుద్ధగుణములతోను గూడియుండును. పర్వతముల నుండి ఏర్పడిన స్రోతస్సు లన్నియు సముద్రములో ఐక్యమగునట్లు ఈ అవతారము లన్నియు పరబ్రహ్మమునుండి ఉద్భవించినవి యనియు, నదుల నాశ్రయించినవారు క్రమముగా సముద్రమును జేరునట్లు పై పేర్కొనబడిన దైవములలో భక్తి గలిగినను ఆఖరున అందరును ఆ పరమాత్మనే పొందుదురనియు గ్రహింపగల్గును. ఇట్టి భక్తి స్మృతులలోను, ఉపనిషత్తులలో కొన్నిటిలోను పేర్కొనబడియున్నది.

ఇట్టి భావము గలుగని వ్యక్తిగతమైన భక్తియుండిన అనగా పై నిరూపింపబడిన శ్రీశివ, శ్రీకృష్ణ, శ్రీరామ, శ్రీనారాయణభక్తులలో

ఒకదానిలో మాత్రమే మోక్షము గలుగునని వాదించెడు శాస్త్రములను క్రోడీకరించి కోట్లకొలది నిరూపింపగలవారై యితరులయొక్క పవిత్రభక్తి మార్గమును ఖండనము చేయదలంచువాడు ఒకవిధమగు భ్రాంతి ఆస్పత్రులలో గల పిచ్చివారలలో చేరిన ఒక్క భ్రాంతుడనియే విజ్ఞానులు గ్రహింపగల్గుదురు. అయితే ఇతడు బోధహీనులైన పిచ్చివారలవంటివాడు కాజాలడు. వీనియొక్క భక్తికి పరిపక్వదశ గల్గునప్పుడు అజ్ఞానావరణములు దహించిపోయి హృదయ గ్రంథి వీడిపోయి నీటిలో కరిగిన ఉప్పు ఏలాగున నీరైమారునో, ఆలాగున పూర్ణదైవమయమ్మై మారెడు కాలమొకటి వచ్చును. లేక జన్మమొకటి గల్గును. వీరి జీవితము అప్పుడు ధన్యమగును. అప్పుడు పర్వతపంక్తినుండిపొంగి ప్రవహించెడు నది యేలాగున కట్టలన్నిటిని త్రెంచివేసి అతివేగముగా పరుగెత్తి మహాసముద్రములో ఐక్యమెయ్యందునో ఆలాగున ఈ భక్తుడును హృదయముయొక్క ప్రతిబంధములను అనగా హద్దులను భేదించి తీవ్రగతిని పొంది జ్ఞానానందసాగరమయుడగు బ్రహ్మమును తనయొక్క యిష్టదైవమును పొందగలుగును.

నాల్గవది- అన్యముగాక యుండెడి అవస్థనే అనన్యమందురు. అచ్చట అనేకములు లేవు. ఏకమే యుండును. ఆభరణముల నేకములైనను సువర్ణ మేకముగాను, యంత్రము లనేకములై యుండినను, ఇనుము ఏలాగున ఏకముగాను, విగ్రహము బహువిధములుగా కనుపించినను కంచు ఒకటిగాను, వస్త్రము లనేకరకములుగా కనుపించినను దూది ఏకముగానుండునట్లు ఒకే దైవముయొక్క ఏకరూపమే యిూ కానుపించెడు అనేకరూపములని గ్రహింపగల్గును. అదే పూర్ణమైన భక్తి. ఇదే యుత్తమమైన యుపనిషత్ప్రతిపాదిత మగు అనన్యభక్తి. ఇదే వేదములయొక్క అంతమనబడు వేదాంతము. లేక వేదాంతసారము. ఇచ్చటికి కాలక్రమముగా పై నుదాహరింపబడిన భక్తిమార్గములనెడి నదీనదములన్నియు వచ్చిచేరును. ఇది సాగరము. నదీనదము లన్నియు బుజువక్రములై ప్రవహించినను, ఉత్తర, దక్షిణ, పశ్చిమ, పూర్వవాహినులై ప్రవహించినను, చిన్నవి పెద్దవిగా గమించినను, అన్నియు ఈ జ్ఞానసముద్రములోనికే వచ్చి చేరుచుండును. ఇచ్చట చేరువరకు నిమ్నోన్నతము

అనెడు ఉచ్చ-నీచజన్మములెత్తి సుఖదుఃఖము లనుభవించి నిలకడలేక మందమందముగా గాని, తీవ్రముగా గాని ప్రయాణముచేసి వచ్చిచేరును. శ్రమతో నడచివచ్చెడు బాటసారి గమ్యస్థానము చేరి సుఖించునట్లు అనేక జన్మములెత్తి సంసార మరుభూమిలో తాపత్రయాగ్నిచే తపించి ఇచ్చటికి వచ్చెడు జీవులయొక్క శ్రమ అంతరించును. అప్పుడు జీవి అమృతత్వము నొందును, తమస్సులోనుండి ప్రకాశములోనికి ప్రవేశించును. మృత్యువునుండి అమృతములోనికి జొరబడిన వాడగును. అజ్ఞానమునుండి జ్ఞానములోనికి వచ్చిన వాడగును. ఇచ్చట అతని హృదయగ్రంథులన్నియు వీడిపోవును. సంశయము లన్నియు అస్తమించును. కర్మకట్టెలన్నియు కాలిపోవును. అపుడు అసత్తునుండి సత్తులోనికి వచ్చినవాడగును. ఈ పదవిని ఉపనిషత్తు లీలాగున వర్ణించుచున్నవి.

భిద్యతే హృదయగ్రంథి శ్ఛిద్యంతే సర్వసంశయాః ।
క్షీయంతే చాస్య కర్మాణి తస్మిౝ దృష్టే పరావరే ॥
యదా సర్వే ప్రముచ్యంతే కామాయేఽస్య హృది శ్రితాః ।
అథ మర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే ॥
ఏకో వశీ సర్వభూతాంతరాత్మా ఏకం రూపం బహుధా యః కరోతి ।
తమాత్మస్థం యేఽనుపశ్యంతి ధీరాస్తేషాం సుఖం శాశ్వతం నేతరేషామ్॥

దీని అర్థము లన్నియు పైచెప్పిన వానిలో అంతర్భూతములై యున్నవి. ఇచట శ్రీబుద్ధదేవుడు కనుగొనిన నిర్వాణపదవి ఇదే యని గోచరించును. శ్రీ యేసుక్రీస్తు చెప్పిన స్వర్గములో గల తనయొక్క తండ్రి స్థలము ఇది యని కనుగొనును. ఇదే శ్రీ మహమ్మదునిబి బోధించిన ఆకాశములోగల స్వర్గమని గోచరమగును. ఇచ్చటనే శ్రీ శంకరులు ఉపదేశించిన అద్వయ బ్రహ్మభావమని బోధగలుగును. ఇచ్చటనే శ్రీరామానుజులవారును, శ్రీమధ్వులును తెలిపిన పరమ పద మని అవగాహనము గలుగును. శాస్త్రములను మాత్రము పరిశీలించినవారలు వీనిలో కొన్నిటిని పరమపదవు లని నమ్మకపోవచ్చును. అయితే వానిని బోధించిన మహాపురుషు లందరును దుఃఖమును దాటినవారలే.

వారుపదేశించినదే పరమకాష్ఠయనియు, జీవులకు అంత్యప్రాప్యమనియు, కేవలము దుఃఖరహిత పరమానంద పదవియనియు నమ్మియుండిరి. బ్రహ్మమతస్థులయొక్క బ్రహ్మముగూడ ఈ దైవపదవియే యని జ్ఞానము గల్గును. ఆర్యసామాజికులయొక్క యీశ్వరప్రాప్తియు ఈదైవస్థలమే యని జ్ఞప్తిలో గనుగొనగల్గును. అచల సాంప్రదాయులయొక్క అచలమున్ను పరిపూర్ణవాదులయొక్క వాదభేదరహితమున్ను ఇదియే యని బోధగల్గును. ఇచ్చోటనే శూన్యవాదులయొక్క దృశ్యశూన్యపదవి యని గూడ తెలియనగును. యోగులయొక్క నిర్వికల్ప సమాధినిలయమును ఇచ్చోటనే అగును. ఇచ్చోటికి వెళ్ళునపుడే కురుడు, కొబ్బరిపీచునుండియు, చిప్పనుండియు స్వయముగా వేరుపడునట్లు ప్రకృతినుండి ఆత్మ వీడిపోవుచుండును. చింతకాయ పండునప్పుడు దానియొక్క తోడునుండి వదలిపోవునట్లు, మాయోపాధినుండి యీ ఆత్మ విముక్తిపొందును. ఇచ్చో సర్పము కాలపరిపక్వత వచ్చునప్పుడు కుబుసమును విడుచునట్లు అజ్ఞానమనెడు ఆవరణమును మెల్లమెల్లగా ఈ ఆత్మ దైవమయమై విడిచిపెట్టును. సమయము సరిగా వచ్చునప్పుడు పండు చెట్టునుండి స్వయముగా ఊడిపడునట్లు అనాది మాయావృక్షమునుండి ఈ ఆత్మ స్వయముగా విముక్తినొందును. అగ్నిలోవేసి తిత్తితో ఊదబడెడు లోహము లన్నియు ఏలాగున క్రమక్రమముగా అగ్నిమయముగా మారునో అట్లు దృక్కగు ఈ యాత్మయందు దృశ్యములగు దేహేంద్రియములన్నియు ఆత్మమయమై మారుచుండునది కనుగొనవచ్చును. అగాధజలములో పడవేసిన ఉప్పుబొమ్మ చిన్నచిన్నగా కరిగి కరిగి జలమయమై పోవునట్లు ధ్యేయమగు దైవాకారమై మారునట్లు గోచరించును.

ఓహో! ఎంతసుఖము. ఓహో! ఇది అమృతఘనీభూతముగదా! ఓహో! యేమి మాధుర్యము! ఎట్టి అద్భుతము! ఓహో! ఇది అమృత సాగరమా! లేక జ్ఞానగిరియా? ఓహో! ఇచ్చట మనస్సు మననము చేయజాలక నిలిచిపోవుచున్నదే! ఇచ్చట బుద్ధి నిశ్చయము జేయనొల్లక నిశ్చేష్టత్వము నొందుచున్నదే! ఇచ్చట చిత్తము చింతనము చేయజాలక సంకోచించు చున్నదే! ఇచ్చట అహంకారము, అహంకరింపజాలక సోఽహంపరమగుచున్నదే!

ఇదియేమి యాశ్చర్యము! ఏమి మహిమ! ఇచ్చట నాయొక్క మనస్సు అహంకరించియుండు పోలీసు సబ్ ఇన్స్పెక్టరు సూపరింటెండెంటు దగ్గర వినయుడై నిలుచునట్లు వినమ్రమైపోవుచున్నదే! ఇచట నా మనస్సు మదపుటేనుగు సింహము సన్నిధిలో అణగినట్లు అణగిపోయినదే! ఇచట నాయొక్క ఆశలన్నియు త్రాచుపాములు గరుత్మంతుని దృష్టిలో పడిపోయినట్లు, పడిపోయినవే! పరిపరివిధములుగా దృశ్యములపై పరుగెత్తెడు వృత్తులన్నియు, సివంగిని చూచిన జింకలవలె నిశ్చేష్టములై నిలిచినవే! ఇచ్చట అనేక యంత్రోపయంత్రములతో తిరుచుచుండు చక్రములన్నియు, యంత్రముల క్రియలన్నియు, ఇంజన్ నిలిపిన ఆగిపోవునట్లు స్థూలసూక్ష్మకారణములనెడు శరీరత్రయమును, దానియొక్క క్రియలనెడు సంసార చక్రములన్నియు వానియొక్క గుణములనెడు కృత్యములన్నియు ఆగిపోయినవే! ఇచ్చట నాయొక్క అజ్ఞానము శుష్కతృణపుంజము, మండుచుండు మహాగ్నిలో కాలునట్లు కాలుచున్నదే! ఇదేమి చిత్రము! ఇచట కర్పూరము అగ్నిలో జ్వలించునట్లు, కర్మలన్నియు కాలికాలి కనుమరుగై పోవుచున్నవే! పంచదార నీటిలో కరుగునట్లు నాయొక్క దృశ్యమంతయు దైవమయమై దృక్కుగా మారుచున్నదే! సూర్యుడుదయించునప్పుడు చీకటి కనపడనట్లు నాకు అవిద్య గానుపించుటలేదే! కొలిమిలో వేసిన లోహఖండములన్నియు, తోలుతిత్తిచే ఊదునప్పుడు అగ్నిమయమై ప్రజ్వలించునట్లు నా యింద్రియములన్నియు ఈశ్వరమయములుగా మారుచున్నవే! ఇది యేమిచిత్రము! ఇచట తైలము నశించిన దీపము స్వయముగా ఆరిపోవునట్లు, మాయొక్క దృశ్యవాసనలన్నియు నశించుచున్నవి. ఇచట బాడబాగ్ని సముద్రజలమును ఇంకింపజేయునట్లు ప్రకృతి యంతయు పరమపురుషుడుగా మారుచున్నదే! ఇచట దావాగ్ని అడవిని గాల్చునట్లు నాయొక్క మనోభావన లన్నియు మాయమైపోవుచున్నవే! ఓహో! ఇదియేమి చిత్రము!

ఇచట ఘనీభూతమగు మేఘము వర్షించిపోయిన తర్వాత ఆకాశము నిశ్శబ్దముగాను, నిర్మలముగాను ఉన్నట్లు నాయొక్క హృదయాకాశము నిర్మలముగాను, నిశ్శబ్దముగాను ఉన్నది! ఇచట గాలిలేని స్థలములో దీపమువలె

నాయొక్క స్వరూపసాక్షాత్కార జ్ఞానదీపము కదలక నిలుచుచున్నది. చిత్రములో వ్రాసిన బొమ్మలవలె నా దేహేంద్రియములు అన్నియు నిలిచిపోవుచున్నవి.

ఇదియేమి యాశ్చర్యము. ఏమి నాకు ప్రాణము లేదా! నాదేహమిట్లు స్తంభించిపోవుటకు కారణమేమి? విచిత్రముగా గానుపించుచున్నదే! ఇదియేమి? కట్టెలు నశించిన అగ్ని స్వయముగా చల్లారిపోవునట్లు నా మనస్సంస్కారము అన్నియు భస్మమై పోవుచున్నవి. అలలుడిగిన గంభీరసముద్రమువలె సమస్త చలనములుడిగి నేను ఆత్మభావనయందు నిలుకడగల్గి యున్నాను. ఇప్పుడు గదా నేను నేనై యున్నాను!

ఓహో! ఇదియేమి భాగ్యము! ఈశ్వరకృపయా? గురుమహారాజా కరుణయా? లేక నాయొక్క పురాకృత పుణ్యపరిపాకమా? ఓహో! ఆశ్చర్యము! పరమాశ్చర్యము! ధన్యోఽస్మి! కృతకృత్యోఽస్మి! ఆహా! ఈ లోకము గూడ ధన్యము! ఆత్మసోదరులారా! మీరందరును ధన్యులు! దైవాత్మస్వరూపులారా! పరమాత్మ స్వరూపులగు సోదరీ మణులారా! మీరు ధన్యులు. పక్షివర్గములారా! మీరు ధన్యులు! మృగసమూహములారా! మీరు ధన్యాత్ములు! వృక్షలతా గుల్మములారా! మీరు ధన్యులు! వనపర్వత సాగరములారా! మీరును ధన్యులే!



# పురుషప్రయత్నము

1. శివమై, నిత్యమై, అద్వయమై, అమృతమై, శాంతమై, ఆనందమై, అఖిలమై, అద్వితీయమై, వ్యాపకమై, పూర్ణమై, ఆత్మయై, ఈశ్వరుడై, నరులయందు నారాయణుడై, జీవులయందు శివుడై, ప్రాణికోట్లయందు బ్రహ్మమై, అణువులయందు అణువై, మహత్తుల యందు మహత్తై, దివ్యమై, వేదములకు మూలమై, వివేకులకు దైవమయమై యుండు ఏయొక్క సత్తామాత్రమైన పరబ్రహ్మము గలదో అదే గలదు.

2. అది వివేకులకు శివుడుగాను, అవివేకులకు జీవుడుగాను, విజ్ఞానులకు నారాయణుడుగాను, అజ్ఞానులకు నరుడుగాను, యోగులకు బ్రహ్మముగాను, కుయోగులకు ప్రకృతితో గూడినదిగాను గోచరించును.

3. రసవాదముచే తామ్రము సువర్ణమగునట్లును, భ్రమర సహాయముచే కీటకము భ్రమరమగునట్లును, మందతమస్సులో రజ్జువునందు గలిగిన సర్పభ్రమము ప్రకాశసహాయముచే నివృత్తియగునట్లును, మంచి సంస్కారాత్ముడై, శమదమాది సాధనసంపన్నుడై, తీవ్రముముక్షుత్వము గల జిజ్ఞాసువు వైరాగ్య బోధోపరతులు గలవాడును, కరుణాళువును, శాంతుడును, శిష్యవాత్సల్యము గలవానగు, అపరోక్ష బ్రహ్మసాక్షాత్కారము గల్గిన సద్గురువుయొక్క అనుగ్రహమునకు పాత్రుడై అంతఃకరణము లోగల మల, విక్షేప, ఆవరణ అనగా అజ్ఞానదోషములను, శ్రవణ, మనన, నిదిధ్యాసనములచే నివృత్తింపజేయుటలో ప్రయత్నపరుడై యుండినచో, నేత్రమందు కామల రోగము గలవానికి లోకము పీతవర్ణమై కనుపించినను, అంజన రసాయనముచే రోగనివృత్తి కలుగునప్పుడు ప్రపంచముయొక్క యథార్థతత్త్వ మేలాగున గోచరించునో, ఆలాగున వీనికి అజ్ఞానము నివృత్తము కాగా, విజ్ఞానస్వరూపము గలుగునప్పుడు బ్రహ్మసాక్షాత్కార జ్ఞానము గలుగును.

4. అప్పుడు సంపూర్ణ దుఃఖనివృత్తియు, పూర్ణానంద ప్రాప్తియు, జీవన్ముక్తియు జీవకోట్లకు గలుగును.

పంచదశిలోగల శ్లోకమును ఆధారపడియే ఈవ్యాసము వ్రాయడమైనది. ఇది ఉపనిషత్తునందు గలదు. ఈ వ్యాసము యొక్క ముఖ్యోద్దేశ్య మేమన, మనుజులు ప్రయత్నశీలురై యుండవలెననియే. ఇది దైవముయొక్క నియతియనియు, వేదము యొక్క ఆజ్ఞ యనియు, మర్త్యుల కర్తవ్యమనియు, అంతియేగాక ఇది అనివార్యమనియు నిరూపించుటయే యగును. అయితే ముక్త, బద్ధ వ్యవహారభేదములచే భావభేదము గలుగవచ్చును. అయినను బద్ధావస్థలో నుండి ముక్తావస్థలోనికి ప్రవేశము గలిగియుండువారు ఎప్పుడైన ప్రయత్నపరులై యుండే తీరవలయును. లేనిచో ధర్మాధర్మముల

తెలిపెడు వేదమునకు ప్రతిష్ఠ గలుగనేరదు. అంతేగాక బోధకులైన అనగా ప్రవక్తలైన గురువులే అవసరము లేక పోవుదురు. ఇవి రెండును లేని జనసముదాయము మృగసముదాయమునకన్న ఉన్నతపదవి నొందజాలదు. అంతియే కాక దేహాత్మజ్ఞానమునకన్న అధిక జ్ఞానము వీరికి ఉండజాలదు. అట్లుండగా దుఃఖశాంతిని వీరెట్లు పొందగలుగుదురు? మరియు మృగసముదాయము మనుజులచే పాలింపబడునట్లు మరియొక్కరి పాలనలో వీరి జీవితము దుఃఖభూయిష్ఠమై గడువవలసియుండును. ఇది సత్యము. ప్రత్యక్షముగా ప్రపంచమే ఈ విషయమై సాక్ష్యమిచ్చు చున్నది. ఏ జనసంఘము పరిశ్రమ శీలము లేక యుండునో ఆ సంఘము పరిశ్రమశీలురచే పరిపాలింపబడుట లేదా! ఏ మానవుండు వైరాగ్య మవలంబించి పరమపురుషుని ప్రాప్తించు విషయమై ప్రార్థన చేయలేదో అట్టివాడు ప్రకృతి బాధకు లోబడి దుఃఖించుట కనబడలేదా! ఇదియే దీనికి తార్కాణము. ఏ మానవుండు సత్కర్మానుష్ఠాన పరుడై, ధర్మాత్ముడై, వైరాగ్య బోధోపరతులను సమకూర్చుకొని బ్రహ్మనిష్ఠ చేయుచుండునో వాడు ముక్తాత్ముడై నిత్య సుఖమును పొంది లోకపూజ్యుడై యుండుట గనుపించుట లేదా! నదీ ప్రవాహవేగమునకు లోబడిన పడవలు ప్రయత్నము లేనిచో నదీవేగమున కొట్టుకొని పోయి సముద్రములో పడిపోయి యేలాగున శిథిలత్వమును పొందుచుండునో, చుక్కాను, తెడ్లు, యంత్రములు మొదలైనవాటి సహాయముచే ప్రయత్నపరమైన నావ యేలాగున ప్రవాహవేగమును తప్పించుకొని స్వస్థానము చేరి సుఖముగా నుండునో, అదే ప్రకారము ప్రయత్నపరుడగు వాని స్థితి యనియు, ప్రయత్నము లేనివాని గతి యనియు మనము గ్రహించవలెను. మరియు ప్రయత్నశీలురై మంచి శ్రద్ధతో చదువు వారు ఏలాగున ఉన్నతోద్యోగము పొంది ప్రయత్నరహితులైన మనుజులను పాలించుచున్నారో మనము కన్నులార చూచుచున్నాము కదా! మరియు చిన్నతనము నుండి చక్కగా పోషింపబడి వంకర పోనీయక చక్కపరచిన వృక్షమునందు వ్యర్థములైన కొమ్మలను కోసివేసి పోషించిన అది చక్కని వృక్షమై ఉపయోగపడుచుండును. అట్లు చేయనిచో వంకర పోయి వ్యర్థములగు కొమ్మలు పుట్టి ఉపయోగము లేకపోవును. ప్రయత్నము కలదానికిని, లేనిదానికిని

ఇదే దృష్టాంతము. మరియు స్వల్పఖరీదు గల లోహముచే చేయబడు సూక్ష్మ యంత్రము ఎంతో వెలగల దగుచున్నది. ఇదే ప్రయత్నము యొక్కయు, ప్రయత్నము లేమియొక్కయు ప్రభావమని మనము గ్రహించవలెను.

మరియు అతి స్వల్పమగు వెలకు దొరికెడు ఓషధులచే క్రమానుసార మొనర్చబడిన ఔషధము ఎంత వెలగల్గియుండునో, యెన్ని రోగములను హరించునో, లోకమునకు ఎంత ఉపయోగప్రదమో చూచుచున్నాము గదా! ఇదిన్ని ప్రయత్నము యొక్క మహిమయని మనకు చూపుచున్నది.

**ఈక్షణాది ప్రవేశాంతా సృష్టిరీశకృతా భవేత్ ।**

**జాగ్రదాది విమోక్షాంత స్సంసారో జీవకర్తృకః ॥**

ఈక్షణాది ప్రవేశాంతా = ఈక్షణ- వీక్షణమే అనగాసంకల్పమేయనుట, ఆది =ఆదిగా గలిగినట్టియు, ప్రవేశ=ప్రవేశమే, అంతా=అంతముగా గలిగినట్టియు, సృష్టిః = సృష్టి = ఈశకృతా=ఈశ =ఈశ్వరునిచేత, కృతా=చేయబడినది, భవేత్=అగును. జాగ్రదాది విమోక్ష=విదేహముక్తియే, అంతః=అంత్యముగా గల, సంసారః = సంసారము, జీవకర్తృకః = జీవ-జీవుడే, కర్తృకః = కర్తగాగలది యగును. అనగా జీవనిర్మితంబగు ననుట.

మరియు వీక్షణము (సంకల్పము) ఆదిగా గలిగినట్టియు, దేహమందు ప్రవేశమంతముగా గలిగినట్టి సృష్టి ఈశ్వరునిచే చేయబడెననియు, జాగ్రత్స్వప్న సుషుప్తి బంధమోక్ష లక్షణము గల సంసార మంతయు జీవునిచే నిర్మింపబడెననియు శ్రుతియందు తెలుపబడెను.

అయితే జీవేశ్వరులలో నెవనిచే నేది కల్పించబడెనో చెప్పబడుచున్నది.

శ్రుతి॥ **తదైక్షత బహుస్యాం ప్రజాయేయేతి ॥**

అనెడు శ్రుతిప్రకారము ఆ ఈశ్వరుడు బహుప్రపంచరూపముగా నయ్యెద ననెడి సంకల్పమే ఆదిగా గలిగినట్టియు.

శ్రుతి॥ **అనేన జీవేనాత్మనాఽనుప్రవిశ్య ॥**

అనెడు శ్రుతిప్రకారము ఆ యీశ్వరునకు జగంబునందు ప్రవేశమే అంత్యపుగా గల జగత్సృష్టియంతయు ఈశ్వరునిచే కల్పించబడెనని తెలియవలయును. మరియు జాగ్రదవస్థ మొదలుకొని విదేహ ముక్తియే అంత్యముగా గల సంసారమందు జీవున కభిమానము గలిగి యుండుటచేత ఆసంసార మంతయు జీవునిచే కల్పింపబడెనని తెలియవలెను. మరియు ఆ పరమాత్మయే శరీరమందుండి మాయచేత మోహింపబడినవాడై, జీవరూపమును ధరించి సర్వమును జేయుచున్నాడనియు, ఆదేవుడే స్త్రీ అన్నపానాది విచిత్రభోగములచేత జాగ్రదవస్థయందు తృప్తి బొందు చున్నాడనియు, మరియు ఆజీవుడి స్వప్నావస్థయందు తన మాయచేత కల్పింపబబడినప్రపంచతసంబంధ సుఖదుఃఖముల ననుభవించుచున్నా దనియు, మరియు ఆ జీవుడు స్వప్నావస్థయందు తవ మాయచేత కల్పింపబడిన ప్రపంచ సంబంధ సుఖదు:ఖముల ననుభవించుచున్నా డనియు, మరియు ఆజీవుడు సుషుప్త్యవస్థ యందు సకలేంద్రియములు లయించుచుండగా అజ్ఞానము చేత తిరస్కరింపబడి సుఖరూపమును బొందుచున్నాడనియు, మరల నాజీవుడే పూర్వజన్మ కర్మసంబంధవశమువలన స్వప్నజాగ్రదవస్థలం బొందు చున్నాడనియు, ఇట్లు మూడవస్థలనెడి మూడు పట్టణముల యందు ఏ జీవుడు క్రీడించుచున్నాడో ఆ జీవునివల్ల విచిత్రమంతయు పుట్టుచున్నదనియు, మరియు జాగ్రత్స్వప్నసుషుప్త్యాది ప్రంచమును ఏ బ్రహ్మము ప్రకాశింపచేయుచున్నదో ఆ బ్రహ్మము నేనే యని ఎరిగిన జీవుడు సర్వబంధములచే విముక్తుడగుచున్నాడనియు శ్రుతి- కైవల్యోపనిషత్.

స ఏవ మాయాపరిమోహితాత్మా శరీరమాస్థాయ కరోతి సర్వమ్ ।
స్త్రీ అన్నపానాది విచిత్రభోగై స్స ఏవ జాగ్రత్పరితృప్తి మేతి ॥

స్వప్నేఽపి జీవ స్సుఖదుఃఖభోక్తా స్వమాయయా కల్పిత జీవలోకే ।
సుషుప్తి కాలే సకలే విలీనే తమోఽభిభూత స్సుఖరూపమేతి ॥

పునశ్చ జన్మాంతర కర్మయోగా త్సఏవ జీవ స్స్వపితి ప్రబుద్ధః ।
పురత్రయే క్రీడతి యశ్చ జీవస్తతస్తు జాతం సకలం విచిత్రమ్ ॥

**జాగ్రత్స్వప్న సుషుప్త్యాది ప్రపంచం యత్ప్రకాశతే ।**
**తద్బ్రహ్మాహ మితి జ్ఞాత్వా సర్వబంధైః ప్రముచ్యతే ॥**

అని యిట్లు ఆ జాగ్రదాదులు వినబడుచున్నవి. దీని అర్థము పై జెప్పినదే. ఈ శ్రుతివాక్యమునుబట్టి జీవసృష్టియు, ఈశ్వరసృష్టియు రెండును గలవని అర్థమగుచున్నది. అనాత్మవస్తువులోగల ఆత్మ యొక్క తాదాత్మ్యవస్థయే బంధమనియు, అది నివృత్తియగుటయే జీవునికి ముక్తి యనియు గ్రహించవలెను. జ్ఞానవాసిష్ఠములో శ్రీవసిష్ఠ మునీంద్రుడు సర్వవేదాంతశాస్త్రసిద్ధాంతముగా ఈతత్త్వమునే శ్రీరామచంద్రుని కొరకు ఉపదేశించెను.

## జ్ఞానవాసిష్ఠ నిర్వాణ ప్రకరణము

**బహునాఽత్ర కిముక్తేన సంక్షేపాదిద ముచ్య తే ।**
**సంకల్పనం పరో బంధ స్తదభావో విముక్తతా ॥**

ఓ శ్రీరామచంద్రా! అధికముగా అనేకసార్లు చెప్పనేల? సంక్షేపించి చెప్పుచున్నాను. సంకల్పమే బంధంబును, అట్టి సంకల్పము లేకుండుటే ముక్తియు నగుచున్నది.

**ఊర్ధ్వబాహు ర్వదామ్యేవ న చ కశ్చి చ్ఛృణోతి తత్ ।**
**అసంకల్పః పరం శ్రేయః స కిమంతర్న భావ్యతే ॥**

ఓ రామచంద్రా! నేను చేతులు పైకెత్తుకొని చాటు చున్నాడ, అయినను నామాట యెవ్వండును వినుట లేదు. అది యే మాశ్చర్యము? అదేమనగా! సంకల్పరాహిత్యమే పరమశ్రేయము. అనగా మోక్షము. దానినేల ముముక్షువులు లోన భావింపరు?

శ్రీకృష్ణభగవానులు గీతయందు సృష్టి కేవలము ఈశ్వరునిది మాత్రము గాదనియు, జీవునిదికూడ కలదనియు ఉపదేశించుచున్నారు.

**పంచైతాని మహాబాహో కారణాని నిబోధ మే ।**
**సాంఖ్యే కృతాంతే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణామ్ ॥**

హే మహాబాహో = ఓయి అర్జునా, సర్వకర్మణాం = సమస్తకర్మముల యొక్క, సిద్ధయే = సిద్ధికొరకు, కృతాంతే = సిద్ధాంత మందును, సాంఖ్యే = సాంఖ్యశాస్త్ర మందును, ప్రోక్తాని = చెప్పబడిన, ఏతాని = ఈ, పంచ = అయిదయిన, కారణాని = హేతువులను, మే = నాయొక్క (వాక్కువలన) నిబోధ= తెలియుము.

ఓ అర్జునా! వేదాంతమందును, సాంఖ్యశాస్త్రమందును ఎల్లకర్మల సిద్ధికొరకు జెప్పియుండు ఐదు హేతువులను నీకు జెప్పెద వినుము.

**అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్విధమ్ ।**
**వివిధా చ పృథక్చేష్టా దైవం చైవాత్ర పంచమమ్ ॥**

అధిష్ఠానం = దేహమును, తథా = ఆలాగుననే, కర్తా = అహంకారముతో గూడిన జీవుడును, పృథగ్విధం = నానాప్రకారమైన, కరణం = శ్రోత్రాది ఇంద్రియసాధనమును, వివిధా చ = నానావిధమైన, పృథక్చేష్టా = వేర్వేరైన ప్రాణాపానాది వ్యాపారమును, అత్ర = ఇందు, పంచమం = అయిదవది, దైవంచ= ఈశ్వరుడును.

శరీరము, అహంకారముతో గూడిన జీవుడు, ఇంద్రియములు, పంచప్రాణముల వ్యాపారమును వీనికి సాక్షిగా నుండు ఈశ్వరుని ప్రేరేపణ అని ఈ విధముగా సృష్టికి అయిదు కారణములున్నవి.

ఈ శ్లోకమందు ''దైవం చైవాత్ర పంచమం'' అని ఆఖరులో చెప్పుటచే జీవుడు చేయవలసిన కార్యములు నాలుగును సిద్ధపడినచో అయిదవదియైన ఈశ్వరుని కరుణ కలుగునని మనము గ్రహించవలయును. ఎట్లన, సకాలమున వర్షము కురిసినను కర్షకుడు చేయవలసిన దున్నడము, ఎరువువేయడము, సంరక్షించడము, విత్తనము వేయడము అను నాలుగు కార్యములలో జీవుడు చేయవలసిన పని చేయక పోయినచో ఏలాగున కృషి ఫలించును? ఆలాగున విద్యుచ్ఛక్తి యనగా ఎలక్ట్రిక్ అనాది దైవసిద్ధమై యుండినను, యంత్రసహాయ మనెడు జీవ ప్రయత్నము లేనిచో ఏలాగున దీపములై ప్రకాశించుట, యంత్రములై పనిచేయుట మొదలైన జగద్వ్యాపారము కలుగజాలదో, ఆలాగున జీవుడు

చేయవలసిన కార్యము చేసినచో, దేవుడు ఇవ్వవలసిన దానిని ఇచ్చును. ఇదే ఈశ్వర శాసనము. ఈ విషయమై చిన్న కాలము నుండి బాలురు బడిలో చదువుచున్నప్పుడు బోధించుట కొరకు నీతిశాస్త్రము కూడ ఇట్లు చెప్పబడుచున్నది.

**ఉత్సాహ స్సాహసం ధైర్యం బుద్ధిశ్శక్తిః పరాక్రమః ।**
**షడేతే యత్ర తిష్ఠంతి తత్ర దేవోఽపి తిష్ఠతి ॥**

ఉత్సాహః = అనుకొనినపని పూర్తియగువరకు సంతోషముతో చేయుట, సాహసం = మధ్యమధ్యవచ్చెడు ప్రతిబంధములకు జంకక ప్రయత్నించుట, ధైర్యం = తాను సాధింపగలనను బుద్ధిని సన్మార్గములో ఉపయోగపరచుట లేక కార్యాకార్యములను విమర్శించెడు స్వభావము, శక్తిః= భగవంతుడిచ్చిన తను ధన మనస్సుల శక్తిని సన్మార్గములో ఉపయోగపరచుట, పరాక్రమః = ప్రాణహాని కలిగెడు అంత కార్యము వచ్చినను భయపడకుండ తన కార్యములో ప్రవర్తించుట, షడేతే = ఈ యారును, యత్ర = ఏ మానవుని యందు, తిష్ఠంతి = నిలుకడ గలిగియుండునో, తత్ర = ఆ మనుజునియందు, దేవోఽపి = దైవమును, తిష్ఠతి = అనుగ్రహము కలిగియుండును. ఈ శ్లోకమునందును ''తత్ర = ఆ మనుజునియందు, దేవోఽపి = దైవమును, తిష్ఠతి'' అని ఆఖరులో చెప్పుటచే పై జెప్పిన ఆరుకార్యములు జీవుని ప్రయత్నమనియు, ఏడవదిమాత్రము ఈశ్వర ప్రయత్నమనియు తేలుచున్నది. దీనివలనను సృష్టికి జీవేశ్వరు లిరువురును కారణభూతులై గల్గియున్నారు. ఇతవరకు చెప్పిన శాస్త్రముచే ఈశ్వర సృష్టియు, జీవ సృష్టియు గల్గియున్నప్పుడే జగత్కార్యము జరుగుచుండునని తేట తెల్లమగుచున్నది. అనగా జీవేశ్వరులిద్దరును కలిపి పనిచేసిన మాత్రమే జగద్వ్యాపారము చక్కగా జరిగి జీవుడు తనయొక్క పూర్ణత్వ మొందగల్గును.

ఎచ్చట ఈశ్వరసృష్టి మాత్రము గల్గియుండియు, జీవుడు చేయవలసిన పని చేయలేదో, అది ఎడారియో, అడవియో, సముద్రమో అయియుండ వలయును. అట్టిచోట జీవులు పరిణామమొంది అనగా జీవశక్తి ప్రబోధము

గలిగి శోక శాంతిపరమగు ఏసుఖమును పొందజాలరు. దీనికి అనాగరిక జనులును, అడవి మనుష్యులును దృష్టాంతము. మరియు ఏ దేశీయులు పరిశ్రమచే దినదినాభివృద్ధి చెందుచుందురో వారు ఒక కాలములో జగత్తులో ఉన్నత పరిణామము గల్గియుండియు మరల పరిశ్రమ చేయక అదేస్థితిలో నుండు జనులను విదేశీయులు అణగద్రొక్కి వీరిపై అధికారము చలాయించుచు వీరిని బానిసలుగా చేయుచుండుట చూచుట లేదా ! దృష్టాంతముగా ఒక కాలమందు భారతీయులు లోకములో ఉన్నతపదవి నలంకరించియుండిరి. అయితే తర్వాత పుట్టిన వారు పరిశ్రమరహితులై యుండినందువల్ల పఠానులు, మొగలాయిలు, ఫ్రెంచిదేశీయులు మొదలైనవా రనేకులు ఒకరివెంట మరియొకరు భారతదేశముపై దండయాత్ర సలిపి భారతీయుల నణచివేసిరి. పై జెప్పినవారి కన్నను ఇంగ్లీషువారు మంచి పరిశ్రమశీలురగుటచే వీరందరిని అణచి ఇప్పుడు ప్రభుత్వముచేయుచున్నారు. ఇది భారతీయులకు స్వాతంత్ర్యము లేనందుచేతనే గలిగెనని యిప్పుడు కొందరు పలుకుచున్నారు. ఇవి అర్థములేని వ్యర్థపుమాటలేగాని ఇందు సత్య మిసుమంతయు లేదు.

ఎందుకనగా, భారతీయరాజులు రాజ్యపరిపాలనము స్వతంత్రముగా చేయుచుండు కాలములోనే పై జెప్పిన విదేశీయులు వీరిపై బడిరి. భారతీయులు అప్పటికి పరిశ్రమరహితులుగాను, సంఘబలము లేనివారుగాను నుండిరి ముఖ్యముగా జనులయొక్క గుణకర్మల ననుసరించి యెవరెవరిని ఏఏ స్థితిలో నుంచవలయునో అట్లుచేయకపోవుటయే దేశముయొక్క అధఃపతనమునకు కారణము. ఇట్టి సంస్కరణబుద్ధి భారతదేశములో లేకపోవుటచేతను, అనాదికాలములో ఎప్పుడో సంస్కరణము చేసినప్పుడు గల్గిన వర్ణవిభాగమునే ఇప్పటివరకు అవలంబించివచ్చుటచే ఇంత పతనము గల్గుటకు కారణమైనది. ప్రపంచములో ఎచ్చటను ఈలాటి దుఃస్థితి యుండలేదు. వారు గుణకర్మల ననుసరించి జనులను ఆయాకార్యములలో ప్రవేశపెట్టినందుచే బుద్ధిని ఆకార్యములో పూర్తిగా వినియోగపరచినందుచే ఎక్కువ విజ్ఞానము గలవారైరి. ఇట్టి సంస్కరణము భరతఖండములో ఎంతవరకు గలుగదో, అంతవరకు వీరు పరులకు లోబడియుండుట నిక్కము.

యున్నారు. ఇదే సామరితనము లేనిదానికి గురుతని గ్రహించవలెను. ఏ మానవుడు తన వంశములో పూర్వము జన్మించిన గొప్పవారెవరైనా ఉండినచో అట్టి స్థితిని పొందుటకు ప్రయత్నశీలుడుగాక యుండునో, వాడు అట్టి వంశపరంపరలో పుట్టినవాడే కాడు. అదే దానికి గురుతు. ఇది మీ పౌరుషార్థమునకు చెప్పబడిన వచనము. ఇది గురుపరంపరకు కూడ సంబంధించినది. మనము కట్టుచుండు బట్టలు, వ్రాయుచుండు కలములు, పెన్సిళ్లు, కాగితములు, వెలిగించు దీపములు, తినుటకుపయోగపరచు పాత్రలు, నడచుట కనుకూలపడు బండ్లు, రోగముల నుండి రక్షపొందుటకు వాడు ఔషధములు, చదువుచున్న విద్యలు, వేయుచుండు వేషములు, చెప్పు చుండు మాటలు మొదలైనవి సమస్తమును ఇతర దేశీయులవి ఉపయోగపరచు చున్నాము. ఇట్టిస్థితిలో గల జీవచ్ఛవప్రాయులగు జనులు తామే శ్రేష్ఠులని తలంచి యెగురుచుండుట హనుమంతుని సన్నిధిలో కుప్పిగంతులవంటివే గాని మరి యేమియు సత్యము లేదు. వీరి ప్రగల్భపు మాటలన్నియు కూపస్థమండూక డాంబికము వంటివే యగును. ఇది యంతయు పురుష ప్రయత్నము లేకపోవుటచే గలిగిన దురవస్థయేగాని మరి యేమియును కాజాలదు. ఈశ్వరుండు తమకు ఇచ్చియుండు బుద్ధిని సరియగు మార్గములలో వినియోగపరచకపోవుటయే మనుజుల దుఃఖమునకు కారణము. ఈశ్వరునికిని, జీవునికిని నిత్యసంబంధము కలదు. కనుకనే ఈశ్వరుండు తనయొక్క సృష్టిలో జీవులను గూడ భాగస్థులుగా చేయుటకు కారణమైనది.

ఈ విషయమై ఒక్కొక్క దానిని పరిశీలింపుడు. ఏ ధాన్యమునైనను జీవప్రయత్నమగు సంస్కారమొనర్చి భోజ్యానుకూలముగా చేయకపోయిన యెట్లు భజింపగలుగుదురు? ప్రత్తి దైవసృష్టి, వస్త్రములుగా చేయుట జీవసృష్టి, ధాన్యము ఈశ్వరసృష్టి అన్నముగా చేయుట జీవసృష్టి, లోహము ఈశ్వరసృష్టి, ఆయుధములుగాను, యంత్రములుగాను చేయుట జీవసృష్టి, సువర్ణ మీశ్వరసృష్టి, ఆభరణములుగా జేయుట జీవసృష్టి, వృక్షములు ఈశ్వరసృష్టి, గృహాది ఉపకరణములుగా జేయుట జీవసృష్టి, భూమి ఈశ్వరసృష్టి, మృత్తికను పాత్రములు మొదలగు వివిధవస్తువులుగాను, ఉపయోగ యోగ్యములుగాను

జేయుట జీవసృష్టి, జలాగ్నులు ఈశ్వరసృష్టి; భాగానుక్రమముగా ఆవిరిగామార్చి యంత్రాదులను నడుపుట జీవసృష్టి, వాయ్వాకాశాదులు ఈశ్వరసృష్టి, యంత్రసహాయముచే వాటిని గ్రహించి ఉపయోగార్థముగా నొనర్చుట జీవసృష్టి, మనుజుడై పుట్టుట ఈశ్వరసృష్టి, సంస్కారమొనర్చి ద్విజత్వ బ్రహ్మత్వాదుల గలుగజేయుట జీవసృష్టి. ఈలాగుననే సమస్త విషయములను గురించి మీరు దీర్ఘముగా విచారించిన ఈశ్వర సృష్టియు, జీవసృష్టియు కల్గియున్నప్పుడే అది అర్థవంతమగునని బోధపడును. కేవలము ప్రకృతికి బద్ధులై యుండుట జడస్వభావము. ప్రకృతి నతిక్రమించి పరమ పురుషుని పొందుట చైతన్యము కలవారి నైజస్వభావము. ఇది మీరు గ్రహింపకపోయినచో నావచే సముద్రము దాటుటకును, విమానముచే ఆకాశము ఉల్లఘించుటకును, అగాధజలము యొక్క అధోభాగమునకు పోవుటకును మీరు సమర్థులు కాజాలరు. వెయ్యేల! అగ్నిని ఉపయోగపరచి పచనముచేసి తినుటకును, కూపసరోవరాదులచే జలమును సంరక్షించి ఉపయోగపరచి త్రాగుటకుకూడ శక్తిలేనివారై కేవలము పశుప్రాయులై పోవుదురు. ఆలాగున ఇప్పుడు జీవుడుగా నుండువానిని శివుడుగా ఈ జీవుడే సృష్టించవలెను. శివుడే జీవుడై యుండినందువల్ల తనకు కావలసిన సామగ్రులన్నియు ఈ జీవునియం దమర్చియున్నాడు. దానిని మీరు ఉపయోగపరచుకొన్న చాలును. అప్పుడు మీరు ధన్యాత్ములగుదురు. ఇదే పురుషప్రయత్నము. దీనికి కావలసిన కౌశలములన్నియు ఈశ్వరుండు మీయందే యుంచియున్నాడు. అది మీకు స్వయముగా తెలియక పోయినచో ఆ ఈశ్వరుండు వేదశాస్త్రముల మూలముగా మీరు తెలిసికొనవలెనని తెలిపియున్నాడు. తెలిసికొనుటకు శక్తిలేనిచో తెలిసినవారి నాశ్రయించి తెలిసికొనుమని చెప్పియున్నాడు. అంతేకాక తెలియనివారు తెలిసికొనుటకు మహాపురుషులను సృష్టించి భూలోకమునకు పంపి వారి హృదయములోనుండి మీకు చెప్పుచున్నాడు.

ఇదియును గాక శోకశాంతియు, ఆనందప్రాప్తియు గావలయునని మీహృదయములో గూర్చుండి మాకు సదా స్ఫురితి గలుగచేయుచున్నాడు. కొంచము మీయొక్క శ్వాసోచ్ఛ్వాసములలో మనస్సును నిశ్చలపరచి చూచిన

గలుగజేయుట ఈలాటి కార్యముల చేయుట లేదనియు, ఆ సుకృత దుష్కృతములు వారివారి జన్మాంతర కర్మానుసారముగా గలుగుచుండుననియు, అయితే ఈ కారణము తెలిసికొనందగిన జ్ఞానము, అజ్ఞానముచేత ఆవరింపబడి నందుచేత తెలిసికొన జాలక ప్రాణికోట్లు మోహములోబడి దుఃఖించు చున్నారనియు భగవంతుడే ఆనతిచ్చియున్నాడు. అయితే భక్తులు చేయుచుండు భజన, ప్రార్థన, ధ్యాన, జప, పూజా, దాన, ధర్మాది పుణ్యకర్మములు వ్యర్థములై పోవునేమో యని సందేహపడ నక్కరలేదు. వీనివల్ల మంచి ఔషధముచే వ్యాధి శమించునట్లు అజ్ఞానము నశించి జ్ఞానోదయము గల్గును అని క్రింది శ్లోకముచే భగవంతుడే ఉపదేశించుచున్నాడు.

**జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశిత మాత్మనః ।**
**తేషా మాదిత్యవత్ జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్ ॥**

ఎవరికి తమ అజ్ఞానము జ్ఞానముచేత నశింపజేయబడునో వారికి జ్ఞానము సూర్యునివలె పరమాత్మను స్పష్టముగా ప్రకాశింపచేయుచున్నది.

పై జెప్పిన భక్తి, వైరాగ్య, ధ్యానాదులచే అంతఃకరణములోని యజ్ఞానము నశించుననియు, అది నశించునప్పుడు సాక్షాద్బ్రహ్మజ్ఞానము కలుగు ననియు, దుఃఖము లన్నియు నశించు ననియు, పూర్ణ సౌఖ్యము కలుగుననియు భావము. ''తేషా మాదిత్యవత్ జ్ఞానం'' అని చెప్పుటచే అజ్ఞానదశ ఆశ్వయుజ అమావాస్య రాత్రి కారుమేఘముచే కప్పబడిన కారుచీకటివంటిదనియు, ఆచీకటిలో దగ్గరనుండు పదార్థములు కూడ తెలియజాలనట్లు తనలో నుండు తనయాత్మను దీనియొక్క జన్మాంతర సంస్కారరూపమును కూడా దెలియజాల వనియు, జ్ఞానోదయమైనప్పుడు సూర్యోదయము గల్గినట్లుండు ననియు, అప్పుడు సమస్త కర్మ రహస్యములును, ఈశ్వరసాక్షాత్కారజ్ఞానమున్ను జీవకోట్లకు కరతలామలకమువలె స్పష్టముగా గోచరించుననియు భావము. ఈశ్లోకములో సాక్షాద్భగవంతుడే ''యేషాం'' అని పూర్వపాదములో ప్రయోగించి రెండవపాదములో ''తేషాం'' అని ప్రయోగించుటచే తనయొక్క సమత్వమును, దయాళుత్వమును, సత్యత్వమును వెల్లడి చేయుచున్నాడు.

అనగా ఏ ప్రాణులకో, ఆ ప్రాణులకని యర్థము.

ప్రశ్న :- అట్లైన, అ.10 శ్లో.4,5.

**బుద్ధిర్జ్ఞాన మసమ్మోహః క్షమా సత్యం దమశ్శమః ।**
**సుఖం దుఃఖం భవోఽభావో భయం చాభయమేవ చ ॥**

**అహింసా సమతా తుష్టిస్తపో దానం యశోఽయశః ।**
**భవంతి భావా భూతానాం మత్త ఏవ పృథగ్విధాః ॥**

అని భగవంతుడు ఏల చెప్పవలయును?

బోధసామర్థ్యముగల నిర్మల బుద్ధి, జ్ఞానము, మోహము లేకపోవుట, ఓర్పు, సత్యము, బాహ్యేంద్రియ నిగ్రహము, అంతరింద్రియ నిగ్రహము, శాంతి, సుఖదుఃఖములు, ఉత్పత్తినాశములు, భయము, భయములేకపోవుట, హింసచేయకపోవుట, సమచిత్తత్వము, సంతుష్టి, తపస్సు, దానము, కీర్తి, అపకీర్తి ఈపలువిధములైన గుణములు ప్రాణిసమూహములకు నాచేతనే కలుగుచున్నవి. ఇట్లు చెప్పుటచే భగవంతునివలననే పై చెప్పిన జ్ఞానాజ్ఞాన సుఖ దుఃఖములు గల్గుచుండునని చెప్పునప్పుడు ప్రాణికోట్లకు ఏమి స్వాతంత్ర్యము కలదు?

ఉత్తరం :- ఇదిన్ని పై జెప్పిన ప్రకారవముగా వారివారి సుకృత దుష్కృతముల కనుగుణమగు అంతఃకరణ సంస్కారమూలమున జీవులకు గల్గుచుండునను అర్థమేగాని వేరు గాదు. ఈశ్లోకములకు భాష్యకారులు వ్రాసిన యర్థము చూడుడు. ''మత్తఏవ'' అను పదమునకు వారివారి కర్మము ననుసరించిన ఫలము అంతర్యామియగు భగవంతునిచే గలుగుచుండునని భావము. కనుకనే ''పృథ గ్విధాః'' అని ప్రయోగించడమైనది. అనగా జీవకోట్ల కర్మములు అనేక విధములుగా అగుటచే ఫలమును అనేకవిధములుగా పరిణమించుచున్నది. ఎట్లన! ప్రభువుచేతనే ప్రజలకు మంచిపదవియు, చెడుపదవియు గలుచుచుండునని చెప్పునప్పుడు దానికి ఏ యర్థమో ఆ యర్థమే యిచ్చుటగూడ గ్రహించవలయును. మంచి సద్గుణములు గల్గి యున్నతవిద్యలో నుత్తీర్ణుడైనవానికి ఉన్నత పదవియగు ఉద్యోగమును, చెడుపనిచేసినవానికి దానికి

నేను నిన్ను సమస్తపాపముల నుండి విడిపింపగలను. దుఃఖింపకుము.

ఉత్త :- ఈ శ్లోకము గీతయొక్క అంత్యోపదేశము. అవతల గీతోపదేశము లేదు. ఇది సర్వకర్మపరిత్యాగపరమగు సన్న్యాసాశ్రమము యొక్క అంత్యముగా నున్నది. కనుకనే ఈ అధ్యాయమునకు మోక్షసన్న్యాసయోగమని శ్రీభగవంతుడే దివ్యనామధేయ మిడెను. మోక్షసన్న్యాస మనగా మోక్షమును గూడ సన్న్యసించెడు యోగమని అర్థము. మోక్షావస్థ గూడ సన్న్యసించుట ముక్త్యవస్థయందే గల్గును. అంతవరకు మోక్షాపేక్ష జీవకోట్లకు ఉండును. ఈ శ్లోకమునకు భాష్యకర్తలగు శ్రీశంకర శ్రీరామానుజ శ్రీమధ్వాచార్యులును, వారి అనుయాయులును వారివారి సంప్రదాయపరముగా అర్థమును నిర్ధారణ చేయుటలో వారి బుద్ధి అంతయు దారబోసియున్నారు. అయితే భాష్యత్రయమును పరిశీలించిన అందరి అభిప్రాయమును దైవనిష్ఠాపరులై నిరంతరముండువారికి ఇతరములైన నిత్యనైమిత్తికాది, శ్రాద్ధతర్పణ సంధ్యావందనాది కర్మలు అవసరము లేదని గోచరించుచున్నది. ఏలన? నిత్య నైమిత్తిక శ్రాద్ధ తర్పణాదికర్మలు అవిద్యతో చేరినవి. ఇది పరుల సహాయము చేతనే నిర్వహింపబడవలసి యుండును. కేవల విరక్తునికిని, బ్రహ్మానుసంధానపరునికిని పై జెప్పిన కర్మల నాచరింపవలసియుండిన చిత్తవిక్షేపము కలుగుటకు అవకాశము వచ్చును. అంతేగాక సర్వకర్మలు విధిప్రకారమనుష్ఠించి కృతకృత్యత్వము నొందిన వారికే ముక్తిగల్గును. ఆలాగున ముక్తి గలవానికి మరల కర్మ లవసరము లేదని ఉపనిషత్తుయొక్క సిద్ధాంతము.

కావున అట్టి కర్మలు విడిచి నందుచే శాస్త్రవిధిని అతిక్రమించుట యగునో యను భీతి అవసరము లేదని తెలుపుటకొరకు ఈ శ్లోకము ప్రవర్తించుచున్నది. మరియు కర్మలచే గలిగెడు ఫలము అతి స్వల్పము. జ్ఞానముచే గలిగెడు ఫలము అనంతము. కర్మలచే గలిగిన ఫలమునకు పరిమితి గలదు. జ్ఞానముచే గలిగెడు ఫలము పరిమితి లేనిది. అంతియే గాక సర్వనదీనదములు, సముద్రములో లయము నొందును. సముద్రము నద్యాదులలో లీనము గానట్లు ఆత్మజ్ఞాన నిష్ఠలో సర్వకర్మలును విలీనమై

పోవును. కనుకనే నాల్గవ అధ్యాయమున,

**''సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే''**

అనగా సమస్త కర్మలును జ్ఞానమునందు సమాప్తి పొందుచున్నవి. మరియు

**యథైధాంసి సమిద్ధోఽగ్ని ర్భస్మసాత్కురుతేఽర్జున ।**
**జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా ॥**

అర్జునా! చక్కగా ప్రజ్వలించు నిప్పు కట్టెల నేలాగున భస్మము చేయుచున్నదో, ఆలాగున అధ్యాత్మజ్ఞానమను నగ్ని సమస్త కర్మలను కాల్చి భస్మముగా చేయుచున్నది అని చెప్పబడెను.

కనుక భాష్యకర్తలు ఆత్మజ్ఞానమునకు అనగా ''భగవదనుసంధాన పరమగు నిష్ఠకు ప్రతిబంధములగు కర్మలను విడిచి పెట్టి భగవదనుసంధాన పరుడవు గమ్ము.'' అనియే శ్రీరామానుజాచార్యులు అర్థమును వ్రాసిరి. ఇది యెటువంటి దనగా! సూర్యోదయము అయిన తర్వాత దీపము నెట్లు అక్కర లేదని చెప్పుదురో, చీకటిచే మరల భయము కలుగదని తెలుపుదురో అట్లే యుండును. మరియు క్రింది యుద్యోగస్థుని అధీనములో పనిచేయు నౌకరి సర్వమునకు అధికారియగు పైవారి పనిలో నియుక్తులై యుండిన ఏలాగున పైయధికారి ''క్రింది యుద్యోగస్థుడు నిన్ను ఏమియు చేయడు. భయపడనక్కరలేదు. ఆ క్రింది యుద్యోగికి నేను తెలిపెదను'' అని చెప్పునో ఆ రీతిగా ఈ శ్లోకార్థమని గ్రహించవలెను. కనుకనే అష్టమాధ్యాయమున ఆఖరున ఈ క్రింది శ్లోకము శ్రీభగవానుడు ఉపదేశించుటకు కారణమైనది--

**వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ దానేషు యత్పుణ్య ఫలం ప్రదిష్టమ్ ।**
**అత్యేతి తత్సర్వమిదం విదిత్వా యోగీ పరం స్థానముపైతి చాద్యమ్॥**

యోగులు వేదార్థములు తెలిసికొనుటయందేమి, క్రతువులు చేయుటయందేమి, తపస్సులు చేయుటయందేమి, దానముల యందేమి, చెప్పియుండు ఫలములను అతిస్వల్పముగా తలంచి యాది కారణమై

మనుష్యమాత్రులలో ఎవరైనను పై జెప్పిన ప్రకారముండిన వారైన దైవకృపకు పాత్రులై ముక్తులు గాగలరని భావము.

ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః ।
అనేక జన్మ సంసిద్ధ స్తతో యాతి పరాం గతిమ్ ॥

ధ్యాన యోగమును చేయువాడు ప్రయత్నమువలన యత్నము చేయుచున్నవాడై పిమ్మట పరిశుద్ధాత్ముడై అనేక జన్మ పుణ్య సంస్కారము, గురు శుశ్రూష, దైవభక్తివల్ల సిద్ధుడై ఆ పిదప సర్వోత్కృష్టగతిని పొందుచున్నాడు. దీనియందు ''అనేక జన్మ సంసిద్ధః'' అని ప్రయోగించుటచే అనేక జన్మముల నుండి తీవ్రతరముగా బ్రహ్మనిష్ఠావిషయమై ప్రయత్నించినందువల్ల సమస్తదోషములు నశించినవాడై హృదయసంస్కారముగల్గి పరిపక్వమైన జ్ఞానము ఉదయమైన మాత్రమే సర్వోత్కృష్టమగు ముక్తి పదవిని బొందగల్గునని భగవంతుడు ఉపదేశించుచున్నాడు.

యతో యతో నిశ్చరతి మనశ్చంచల మస్థిరమ్ ।
తతస్తతో నియమ్యైతదాత్మన్యేవ వశం నయేత్ ॥

చంచలమై అస్థిరమైన మనస్సు ఏయే విషయముల యందు దిరుగుచున్నదో, ఆయా విషయములలో నుండి దానిని తప్పించి యాత్మ యందుండునట్లు తన స్వాధీనము చేసికొనవలయును. ఇట్లు యోగాభ్యాసబలమున యోగియొక్క మనస్సు ఆత్మయందే శాంతిని పొందుచున్నది. ఈశ్లోకములో దైవ భావమునుండి మనస్సు ఏయే విషయముల లోనికి బోవుచుండునో, ఆయా విషయములనుండి ఆత్మధ్యాన బలముచేత వశీకరించి దైవ ధ్యానములో నిలుపవలెనని చెప్పునప్పుడు గూఢ ప్రయత్నముండవలయుననియే తేలుచున్నది. భగవానుడు ఇప్పుడు ఉపదేశించిన మనో నిగ్రహము సామాన్యజనులకు కూడ సులభ సాధ్యమైనది.

ఇది గాక మనోనిగ్రహమునకు రెండవ మార్గమొకటి యున్నది. అది మనస్సు ఏయే విషయములపై బోవుచుండునో దానిని కనిపెట్టి మనస్సునే తాను చూచుచుండవలయును. ఈనిష్ఠ కుదిరిన, మనస్సు దృశ్యముగా అనగా తన

ఆత్మకన్యముగా గోచరించును. అప్పుడు ఆత్మ ధృక్కనియు, మనస్సు ప్రభువుదగ్గర సేవకునివలె ఆత్మ యొక్క పరిచారకుడనియు గోచరించును. ప్రభుబుద్ధి ఆత్మయందు గల్గిన భృత్యుడైన మనస్సును తన యిష్టానుసారముగా నడిపెడు శక్తిగల్గును.

మూడవ మార్గము మరియొకటి యున్నది. ఆత్మయందు సత్యజ్ఞాన బుద్ధి గల్గి మనస్సు విషయములపై చేసెడు చేష్టలను వీక్షించుచుండవలయును. అప్పుడు కుత్సిత స్వభావముగల యీ మనస్సు యొక్క కృత్యములను జూచి పరమాశ్చర్యము గల్గును. ఓహో! ''లేని మనస్సు యొక్క మహిమ చూడుడు'' అని ఆత్మలో ఒకవిధమగు అమితానందము గల్గును. దీనివల్ల మనస్సు యొక్క కుచేష్ట లుడిగి పోవును.

నాల్గవ మార్గము మరియొకటి గలదు. మనస్సు విషయములలో పోవునప్పుడు దానిచే గలిగెడు అపాయమును దీర్ఘముగా విచారించుటయు, తనయొక్క పవిత్రతయు, ఉన్నతపదవియు తలంచుకొనుటయు చేసిన భీతిగల్గి మనస్సును వెంబడించి మరల తిరిగెడు స్వభావముండదు.

అయిదవ మార్గ మింకొకటి గలరు. అది అన్నిటికి ఎత్తైన పదవిగా నున్నది. మనస్సు ఏ విషయముపై బోవుచుండునో, అచ్చట అంతయు భక్తుడైనచో దైవభావనయు, జ్ఞానియైనచో బ్రహ్మభావనయు చేయుచుండవలయును. అప్పుడు ఆత్మకు అనగా దైవమునకు అన్యమై యేమియు లేదు. ఇవన్నియు కారణ స్వరూపము. సముద్రమునుండి గలిగెడు తరంగ బుద్బుదాదులు సముద్రమునకన్న నన్యము గానట్లు ఈ కానుపించు జగత్తంతయు కారణరూపమగు దైవమునకు అన్యము గాదను బోధ గల్గును. అప్పుడు మనస్సను ఒక వస్తువే లేకపోవును.

**చంచలం హి మనః కృష్ణ ప్రమాథి బలవద్దృఢమ్ ।**
**తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్ ॥**

కృష్ణా! మనస్సు మిగుల చంచలమైనదియు, చిక్కులు పెట్టునదియు, మహాబలముతో గూడినదియు, విషయములలో దృఢముగా

బంధింపబడినదియు, స్వాధీనము గానిదియు గదా! నేనిట్టి మనస్సును నిగ్రహించుట గాలిని నిగ్రహించుటవలెచేయనలవికాని దానినిగా దలచుచున్నాను అని మనో నిగ్రహవిషయమై అర్జునుడడిగిన దానికి శ్రీకృష్ణ భగవానులు అనుగ్రహించిన ఉపదేశము గ్రహించినచో ప్రయత్న మవసరమో, అనవసరమో అని మీకే గోచరించును. ఈక్రింది శ్లోకమును జూడుడు.

**అసంశయం మహాబాహో! మనో దుర్నిగ్రహం చలమ్ ।**
**అభ్యాసేన తు కౌంతేయ! వైరాగ్యేణ చ గృహ్యతే ॥**

అర్జునా! మనస్సు చంచలమైన దనియు, నిగ్రహింప శక్యము గానిదియు అనుటకు సంశయము లేదు. సత్యము అట్లుండినను ఆత్మానుసంధానాభ్యాసముచేతను, విషయ వైరాగ్యముచేతను (అనగా విషయములందు దోషమును తెలిసికొనుచుండుటచే నట్టి వానియందలి నిరాశచేతను) అట్టి మనస్సును స్వాధీనము చేసికొనవచ్చును. ఈ శ్లోకములోను అభ్యాస వైరాగ్యములు లేనివారు ఈశ్వరుని పొందజాలరనియు, అభ్యాస వైరాగ్యములు జీవకోట్ల కవసరములనియే శ్రీ భగవానులవారి ఆశయమని గోచరించుటలేదా? కృష్ణా, గోదావరి మొదలగు నదులకు ఆనకట్టలు బలముగా కట్టినందుచే గదా జలమును స్వాధీనములో నుంచి అనుకూల ప్రకారము వ్యవసాయదారులు ఉపయోగపరచి పుష్కలముగా పైరు పండించి సౌఖ్యముగా నున్నారు! మానవ ప్రయత్నము అవసరము లేదని తలంచియుండిన వర్షజలమంతయు వృథాగా సముద్రములో పడిపోవుటచే జనుల యవస్థ యెంత దుఃఖకరముగా నుండునో తెలిసికొనవచ్చును గదా! ఆలాగున చెరువులు మొదలైనవి నిర్మించకయు, నూతులు త్రవ్వకయు ఉండిన అట్టి ప్రదేశము మానవ నివాస యోగ్యమగునా? వట్టి ఎడారియనియే అట్టి స్థలమునకు పేరు గల్గును గాని మరియేమియు నుండదు. దీనివల్ల ఈశ్వరుడు జీవుల కిచ్చిన ప్రయత్నము చేయవలయుననియే గోచరించును.

**అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః ।**
**వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తుముపాయతః ॥**

ఆత్మస్వాధీనము లేనివానికి యోగసమాధి మిక్కిలి ప్రయాసమని తలంచుచున్నాను. చిత్తస్వాధీనము గలవాడు తగిన యుపాయములచేత ప్రయత్నపడి యోగి కావచ్చునని నా అభిప్రాయము. దీనియందు ''అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః'' అని భగవంతుడు తనయొక్క దృఢాభిప్రాయమును జెప్పుటచే జీవకోట్లకు శ్రేయస్కర పదవి లభించుటకు తగిన ప్రయత్న మవసరమనియే ప్రతిజ్ఞాపూర్వకముగా భగవంతుడుపదేశించుచున్నాడు. ''శక్యోఽవాప్తు ముపాయతః'' తగిన సాధన గలవానికి సాధ్యము లేని కార్యమే లేదనియే భగవదాశయ మని భగవానులే ప్రమాణము జేయుచున్నారు. నావ లేనిచో సముద్రము ఎట్లు తరింపజాలడో, నావ యేలాగున పురుషప్రయత్నముగా నుండునో, ఆలాగున దేనికైనను దానికి తగిన సామగ్రియుండిన మాత్రమే అది నిర్వహింప గల్గును అని స్పష్టమగుచున్నది. ప్రయత్నపరులు విమానముచే ఆకాశమును, రైలుచే భూమిని, ఓడచే సముద్రమును దాటుట చూచుట లేదా? ఒక వేళ స్వభావ సృష్టి ననుసరించిన దైవనియతి ననుసరించినను తనయొక్క పూర్ణపదవి నొంద గలుగవచ్చునను ప్రయత్నముండిన త్వరలోనే గమ్యస్థానము చేరవచ్చును. ఎట్లన ప్రవాహముచే కొట్టుకొనిపోయెడు దారువులు మొదలైనవి క్రమముగా సముద్రములో పోయిచేరినను, ప్రయత్న పరమగు యంత్రసహాయ మైన ఓడ యుండిన ఎంతత్వరలో గమ్యస్థానము చేరవచ్చునో ఇదిన్ని అటువంటిదే యగునని గ్రహించవలయును. మరియు నదిలో కొట్టుకొనిపోయెడు కొయ్యలు సుడిలో చుట్టుకొనినను చుట్టు కొనవచ్చును. లేక ఒడ్డునచేరి నిలిచినను నిలిచిపోవచ్చును. పురుషప్రయత్నముండిన ఈ రెండు ఆటంకములను తప్పించుకొని పోవచ్చును గదా!

> ఉద్ధరే దాత్మనాత్మానం నాత్మాన మవసాదయేత్ ।
> ఆత్మైవ హ్యాత్మనో బంధు రాత్మైవ రిపురాత్మనః ॥

సంస్కరింపబడిన ఆత్మచేత సంసారసాగరమగ్నుడైన తన్ను తానే ఉద్ధరించుకొనవలయును. తన్ను తాను అధోగతిని బొందింపగూడదు. ఏమన?

తనకు వశీకృతమైన మనస్సే బంధు వగును. తనకు స్వాధీనముగాని మనస్సే పరమశత్రువుగాను అగుచున్నది.

ఈ శ్లోకములో నాల్గు విషయములు ముఖ్యములు. 1. తన ఆత్మను తానే దుఃఖ కార్యములలో ప్రవేశపెట్టి దుఃఖింపచేయరాదనియు, 2. వివేకజ్ఞానము సంపాదించి దుఃఖములో నుండు ఆత్మను తనకు తానే ఉద్ధరించు కొనవలయుననియు, 3. నిర్విషయస్థితిగల్గి వశపడిన మనస్సు పరమ మిత్రునివలె తనకుపకారము చేయుచుండుననియు, 4. వృత్తులతో గూడిన మనస్సు విషయములో ప్రవేశించిన అదే పరమ శత్రువువలె తన ఆత్మకు అపకారము చేయుచుండుననియు శ్రీభగవాను లుపదేశించుచున్నారు. దీనియందు గూడ దుఃఖనివృత్తి పరమగు సౌఖ్యమును ప్రయత్నపూర్వకముగా సంపాదించు కొనవలెననియే గోచరమగుచున్నది.

**బంధురాత్మాత్మనస్తస్య యేనాత్మైవాత్మనా జితః ।**
**అనాత్మనస్తు శత్రుత్వే వర్తేతాత్మైవ శత్రువత్ ॥**

ఎవడు తన మనస్సు చేత దేహేంద్రియాది సమూహమును జయించుచున్నాడో అట్టివానికి తన మనస్సు ఉపకారి యగును. ఆ యింద్రియజయము లేనివానికి మనస్సు శత్రువుగా నుండును.

ఈ శ్లోకమునకు శ్రీ రాఘవేంద్రస్వాములవారు ఈలాగున అర్థమును వ్రాసియున్నారు. ఎవడు ప్రకృతిని జయించి పరమాత్ముని పొందునో వానికి ఆ పరమాత్మయే పరమబంధువై యుండి సర్వవిధములుగా ఉపకారము చేయుచుండును. ఎవండు ప్రకృతిని జయింప జాలక ప్రకృతిలో పడి యుండునో, అట్టివానికి ఆ ప్రకృతియే మహా అపకారివలె ద్రోహము చేయుచుండును.

ప్రశ్న :- శ్రీ భగవానుడు వేదాధ్యయన తపోదాన యోగాదులగు పురుషప్రయత్నముచేత తన్ను పొందజాలరనియు, తన కృపకు పాత్రులైన వారికే తన్ను దర్శించుటకును, యథార్థజ్ఞానమును తెలిసి కొనుటకును, తనలో

ఐక్యమగుటకును సాధ్యమగు నని చెప్పుచుండగా మీరు చెప్పినలాగున స్వప్రయత్నము వ్యర్థము గదా? ఈ క్రింది శ్లోకమును చిత్తగింపుడు.

నాహం వేదై ర్న తపసా న దానేన న చేజ్యయా ।
శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా ॥

ఓ అర్జునా! ఇప్పుడు నీవు నాయొక్క విశ్వరూపదర్శనమును ఏలాగున సంపూర్ణానందకరముగా దర్శించి యున్నావో, అట్టి దర్శనము వేదములు కడవరకు చదివినవారలకు గాని, కృచ్ఛ్ర చాంద్రాయణాది తపస్సు చేసినవారికి గాని, అనేకవిధములగు దానములు చేసినవారికి గాని, యజ్ఞాదిక్రతువులు చేసినవారికి గాని లభించునది కాదు.

ఉత్త:- ఈ శ్లోకములో స్వప్రయత్నము అవసరము లేదని కాదు. ఇది మనుష్యులయొక్క గర్వము నణచుటకు ఉపదేశింపబడినది. కొందరు మేము వేదము చదువు కొన్నవారమనియు, మరికొందరు మేము తపస్వులమనియు, మరికొందరు మేము అనేకదానముల జేసినవారమనియు, మరికొందరు మేము యాగాదిక్రతువులు చేసిన వారమనియు అహంకారపరులై యుందురు. అయితే అనన్యభక్తి యొక్కటి లేనిచో భగవత్ప్రాప్తికి మార్గము గలుగదని తెల్పుట కొరకు ఈ శ్లోకము నుపదేశించడమైనది. మరియు వేదములు చదువుటకును, తపస్సు చేయుటకును, దానములిచ్చుటకును, యాగము లొనర్చుటకును, శక్తిలేని జనులకు మోక్షము లభించునా? యని సందేహపడ నక్కరలేదని తలంచి భగవానుడు అనన్యభక్తి యొక్కటియే ముక్తికి సాధనమని తెల్పి బీదభక్తులపై కరుణగల్గి ఈ శ్లోకమును అనుగ్రహించియున్నారు. అనన్యభక్తి గల్గియుండుట గూడ గొప్ప ప్రయత్నము గదా?

భక్త్యాత్వనన్యయా శక్య అహమేవంవిధోఽర్జున ।
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప ॥

శత్రుతాపనుడవైన యో యర్జునా! ఈ విశ్వరూపాకారుడనగు నన్ను అనన్యచిత్తముతో గూడిన అచంచలమైన భక్తి ఒక్కదానిచే మాత్రమే తెలిసికొన

సాధ్యమగును. అట్టి భక్తిచేతనే నన్ను దర్శించుటకును, నాయొక్క యథార్థతత్త్వము తెలిసికొనుటకును, నాయందు ఐక్యము నొందుటకును శక్యమగును.

దీనియందు అనన్యభక్తికి ప్రాధాన్యము ఇవ్వబడెను. అనన్యభక్తిని సంపాదించుకొనవలయునని భావము. అట్టైన దైవజ్ఞానము గోచరించును. భగవద్దర్శనము లభించును. భగవంతుని పొంది సుఖించవచ్చును. ఈ శ్లోకముచే అన్యవిషయముల నుండి మనస్సును మరల్చుకొని కేవల భగవదాకారముతో గూడి యుండవలె నని చెప్పుటచే ప్రయత్న మవసరము లేదని కాదు.

అంతకాలే చ మామేవ స్మరన్ముక్త్వా కలేబరమ్ ।
యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః ॥

ఎవ డంత్యకాలమందు నన్నే ధ్యానించుచున్నవాడై శరీరరమును వదలుచున్నాడో వాడు నన్ను జెందుచున్నాడు. ఇందుల కెంతమాత్రము సందేహము లేదు.

ఈ శ్లోకములో ''అంతకాలే చ'' అని చెప్పుటచే కొంత కాలము భక్తి గల్గి విడిచి పెట్టకూడదనియు, అంత్యకాలమువరకు ఉండవలెననియు తెలుపబడుచున్నది. మరల ''యఃప్రయాతి'' అని బోధించుటచే మనుష్యమాత్రులలో ఎవడైనను ఇట్టి భక్తి గల్గిన భగవత్ప్రాప్తి గల్గుననియు, ''నాస్త్యత్ర సంశయః'' అట్లు ప్రతిజ్ఞ చేయుటచే అనన్యభక్తి గలవారెవరైనను వారికి ముక్తి గల్గుటలో సందేహము లేదనియు భగవాను డుచ్చస్వరముతో ప్రతిజ్ఞ చేయుచున్నాడు.

అభ్యాస యోగయుక్తేన చేతసా నాన్యగామినా ।
పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచింతయన్ ॥

అర్జునా! ఎవం డభ్యాసయోగముతో గూడుకొని యితర సంకల్పములు లేని చిత్తముతో దివ్యరూపుడైన పరమపురుషుని (నపరబ్రహ్మమును) ధ్యానము చేయుచున్నాడో, వాడాపరమాత్మనే

పొందుచున్నాడు.

దీనిలో అభ్యాసయోగముచేత అన్యవిషయములలో బోవని మనస్సుచేత నిరంతరము పరబ్రహ్మమందు ధ్యానాసక్త చిత్తము గలవానికే దైవప్రాప్తి గల్గునని చెప్పునప్పుడు ప్రయత్న ముండవలయుననియే గోచరమగుచుండును. ఈ పై శ్లోకమును వినిన కొందరు అంత్యకాలములో భగవత్ స్మరణయుండిన మోక్షము గల్గునని భగవంతుడు చెప్పియుండగా ఇప్పటి నుండియే యేల భక్తి సలుపవలయునని ప్రశ్నింతురు. అట్టివారితో తమ పుత్రులను సంవత్సరము పూర్తిగా ఏల వ్యయప్రయాసములకు ఓర్చుకొని విద్య నభ్యసించుటకు పాఠశాలకు పంపవలయుననియు, పరీక్షరోజున వెళ్ళి ప్రశ్నలకు ఉత్తరము ఇచ్చి పరీక్షలో ఉత్తీర్ణుడు గాకూడదా! యనియు అడిగిన చాలును. మరియు వ్యవసాయదారుడు ఏల పైరుబెట్టి పరిపక్వకాలమువరకు సంరక్షణ చేయవలెననియు, అందరును పైరు కోయుసమయములో మీరును వెళ్ళిన చాలదా? యని అడిగిన చాలును. సోదరులారా! హృదయములో ఏ సంకల్పము రూఢిగా నుండునో, అదే స్వప్నములో గోచరించునుగాని అంతఃకరణములో లేని విషయము ఏలాగున స్వప్నములో గనపడదో, ఆలాగున అంత్యకాలములో మనస్సు దైవవిషయములో ఐక్యముగల్గుటకు బహుకాలమునుండి హృదయమున దైవధ్యానముండవలయును. దీనిని ఆరవ అధ్యాయములో స్పష్టముగా భగవంతుడు తెలిపియున్నాడు.

ప్రశ్న :- ఈ క్రిందిశ్లోకముచే అర్జునునికి ఉపదేశించినది చిత్తగింపుడు. దీనివల్ల మనుష్యప్రయత్నముచేత దివ్యజ్ఞానము గలుగదనియు, సర్వేశ్వరానుగ్రహముచేతనే దివ్యదృష్టిగల్గుననియు, అప్పుడే సాక్షాత్ దైవాకారము గనపడుననియు బోధించుట లేదా!

**న తు మాం శక్యసే ద్రష్టు మనేనైవ స్వచక్షుషా ।**
**దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరమ్ ॥**

ఈ ప్రాకృతములైన నీకన్నులతో నా దివ్యస్వరూపమును జూడజాలవు. నీకు దివ్యదృష్టి నిచ్చుచున్నాను. దానిచే ఈశ్వర సంబంధమైన నా

యోగమహిమను జూడుము.

ఉత్తరము :- పై జెప్పిన శ్లోకముచేత పురుష ప్రయత్నమవసరము లేదని కనుపింపదు. ఏలన? ఈయధ్యాయమున మూడవ శ్లోకములో భగవంతుని యొక్క దివ్యరూప దర్శనముకొఱకు అర్జునుండు పరమభక్తితో వేడుకొన్నట్లు కనబడుచున్నది. భక్తునియొక్క ప్రార్థనను త్రోసివేయజాలక తనయొక్క దివ్యరూపదర్శనమును చూచుటకు తగిన అమానుషదృష్టిని గలుగజేసి రని గోచరించుచున్నది.

**ఏవ మేతద్యథాఽఽత్థ త్వ మాత్మానం పరమేశ్వర ।**
**ద్రష్టు మిచ్ఛామి తే రూప మైశ్వరం పురుషోత్తమ ॥**

ఓ పరమేశ్వరా! నీవు చెప్పినది, యథార్థమే. మీ యాత్మస్వరూపమెట్టి దని తాము తెలియజేసితిరో అట్టి ప్రభావముగల మీ స్వరూపమును దర్శించుటకు మిక్కిలి కోరికగలవాడనుగా నున్నాను.

అని కనిపించుటచే అర్జునునియొక్క భగవద్దర్శన విషయమైన ప్రయత్నము గోచరించుచున్నది. ముందు చెప్పిన శ్లోకములో ప్రాకృతమైన యీ దృష్టిచే అప్రాకృతమగు భగవత్సాక్షాత్కారము చూచుటకు శక్యము గాదనియు, అది అప్రాకృత దృష్టిచేతనే చూచుటకు శక్యమగుననియు చెప్పుటచే మానవులకందరికిని, దివ్యదృష్టి గలుగువరకు ఈశ్వర సాక్షాత్కారము గోచరము గాజాలదనియు, అట్టి దివ్యదృష్టి భగవదనుగ్రహముచేతనే గలుగవలయుననియు గోచరమగుచున్నది. ఇట్టి దివ్యదృష్టికి యోగదృష్టియనియు, జ్ఞానదృష్టియనియు, సమ్యక్దృష్టియనియు, దైవదృష్టియనియు, అప్రాకృతదృష్టియనియు పేర్లు గలవు. ఇప్పుడు సామాన్యజనులకు గల్గిన దృష్టి పంచభూతాత్మకమైనది. ఇది జడము. జడములచేత చైతన్యము ప్రకాశింపజాలదు. చేతనత్వము చేతనే జడములు ప్రకాశించవలసియుండును. కనుక ఈ దృష్టి, ఏ యాత్మచేత ప్రకాశించుచున్నదో, అట్టిదానిలో నిలకడ కల్గినవారికి దివ్యదృష్టిగల్గును. కొన్నిగ్రంథములలో మనుజులకు నవద్వారములే చెప్పబడి యుండును. కఠోపనిషత్తులో పదునొకండు ద్వారములు

చెప్పబడియున్నవి. అయితే అజ్ఞానదశలో ఈరెండు దృష్టులు వికాసము పొందియుండవు. జ్ఞానము గల్గునప్పుడు అనగా ప్రకృతి నతిక్రమించినప్పుడు, ఈరెండు ద్వారములు తెరువబడును. అప్పుడు ఈశ్వరసాక్షాత్కార దర్శనము లభించును. ఈ కన్ను నశ్వరమగుటచే దీనివలన చూడబడు వస్తువులుగూడ నశించునవే. కనుకనే సామాన్యజనులకు పంచభూతాత్మక ప్రపంచము గనపడుచుండునే గాని సర్వపరమాణువులలో సహా వెలుగుచుండు ఈశ్వరుడు గనపడుటలేదు. కారణమేమన? ఈశ్వర సంబంధదృష్టి వీనికి యికను తెరవబడలేదు. కనుకనే యీశ్వరునికి త్రినేత్రుడని పేరుగల్గినది. ఆలాగున జీవుల యొక్క జీవగుణము నశించి శివత్వము నొందునప్పుడు మూడవకన్ను తెరవబడును. కనుకనే అట్టివారిని ఈశ్వరస్వరూపులుగా మనము పరిగణించుచున్నాము. ఆ రెండు దివ్యదృష్టులలో ఒకటి బ్రహ్మరంధ్రము తెరువబడుట యనియు, రెండవది కుండలీబోధము, లేక సుషుమ్నాద్బోధము గల్గుటయనియు యోగాశాస్త్రములో చెప్పెడు రహస్యమైయున్నది. దీనినే బుద్ధమతములో నిర్వాణము గల్గుటయనియు, తక్కిన మతస్థులలో ప్రబోధము గల్గుటయనియు జ్ఞానము గల్గుట యనియు, హృదయగ్రంథి విచ్ఛేదము గల్గుటయనియు మొదలుగాగల పలు పేర్లచే వ్యవహరించుచుందురు. సుషుమ్నానాడి మూలాధారము నందుండుననియు, బ్రహ్మరంధ్రము భ్రూమధ్యమందుండుననియు యోగజ్ఞులు బలుకుదురు. ఎవరికి ఎంతవరకు జిహ్వేంద్రియమును, గుహ్యేంద్రియమును తెరువబడియుండునో, వారికి కుండలినియు, బ్రహ్మరంధ్రమును మూయబడియుండును. ఎవరికి జిహ్వేంద్రియ గుహ్యేంద్రియములు మూయబడియున్నవో, వారికి బ్రహ్మరంధ్రమును, సుషుమ్నాగ్రమును తెరుబడియుండును. ఇదే దీనిలో గల పరమరహస్యము. మానవుల దృష్టికి గోచరము కాని సూక్ష్మక్రిములు యంత్ర సహాయముచే ఏలాగున స్పష్టముగా కనుబడుచుండునో, జ్ఞానదృష్టి గల్గునప్పుడు ఆలాగున సామాన్యజనులకు గోచరము గాని దైవమును, దైవరహస్యమును గోచరమగును. దీనికి అతీంద్రియజ్ఞాన మావశ్యకము. సామాన్యజనులు ఇంద్రియ జ్ఞానమునకు లోబడియుందురు. అతీంద్రియజ్ఞానికి ఇంద్రియాతీత

జ్ఞానము గల్గినను. ఇదే యింద్రియ నిగ్రహముయొక్క ఫలమని గ్రహించవలయును. కావుననే అట్టివారిని అమానుష ప్రజ్ఞగలవారని పిలిచెడు రహస్యము. సామాన్యజనులకు మానుషప్రజ్ఞమాత్రమే గల్గియుండును.

**యదా తే మోహకలిలం బుద్ధిర్వ్యతితరిష్యతి ।**
**తదా గంతాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ ॥**

ఎప్పుడు నీయొక్క బుద్ధి మోహస్వరూపమైన అవివేకమను కల్మషమునుండి దాటునో, అనగా నీని అంతఃకరణములో సంపూర్ణ విషయరాహిత్యము గల్గనో, అప్పుడు నీవు ఇకమీద వినవలసినదియు, ఇంతవరకు గురువులచేతను, శాస్త్రములచేతను విన్నదియు గోచరమగును. మరల మీకు వినందగినది మరియొకటి యుండదు. మనస్సు నిర్మలమై నిర్విషయస్థితి పొందినమాత్రమే వేదాంతార్థము గోచరమగును. ఎంతవరకు మనస్సు ప్రకృతినుండి దాటజాలదో అంతవరకు వేదసారమగు ఉపనిషచ్ఛ్రుతిపాద్యార్థమగు బ్రహ్మమును ఏ జీవియు బొందజాలదని దీనివలన గోచరమగుచున్నది. కనుక ప్రయత్నపూర్వకముగా ప్రకృతి గుణములను రహిత మొనర్చవలెననియే భగవదాశయముగాని ప్రయత్నరహితుడై యుండవలెనను నర్థముకాదు. ఈ నిర్వేదస్థితియే దివ్యదృష్టియొక్క ఉనికియని గ్రహించవలయును.

**ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ! మనోగతాన్ ।**
**ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞస్తదోచ్యతే ॥**

అర్జునా! ఎప్పుడు తన ఆత్మయందే పరమాత్మభావముచే ఆనందించుచున్నవాడై మనస్సులో గల్గియుండు సమస్త విషయ వాంఛలను విడుచుచున్నాడో, అప్పుడు అచంచలమైన జ్ఞానము గలవాడని చెప్పబడుచున్నాడు. ఈ శ్లోకములో ''సర్వాన్ కామాన్'' అని చెప్పుటచే కొన్ని సంకల్పములను మాత్రమే విడిచిన చాలదనియు, నిశ్శేష సంకల్పరాహిత్యము గలుగవలెననియు గోచరమగుచున్నది. మఱియు ''జహాతి'' అని చెప్పక ''ప్రజహాతి'' అని యుపదేశించుటచే ప్రయత్న పూర్వకముగా

సర్వవృత్తులను హృదయమునుండి పారదోలవలె నని భగవాను డుపదేశించుచున్నాడు.

**యదా సంహరతే చాయం కూర్మోఽంగానీవ సర్వశః ।**
**ఇంద్రియాణీంద్రియార్థేభ్యస్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥**

యోగి ఎప్పుడు, తాబేలు తన యవయవములను లోపలికి ముడుచుకొనునట్లు తన యింద్రియముల నన్నిటిని విషయముల నుండి లోనికి ఇమిడించుకొనునో, అప్పుడు వాని బుద్ధి లేక జ్ఞానము అచంచలమైనదని చెప్పబడును.

ఒక్కొక్కరికిని యిట్టి యవస్థ గల్గియుండినచో ఇంద్రియనిగ్రహము గల్గినదని గ్రహించుకొనవచ్చును. దీనివల్ల బాహ్యేంద్రియములును, అంతరింద్రియములును స్వాధీనపడినవానికే దృఢ ప్రబోధము గల్గును. దీనినే శమమనియు, దమమనియు గ్రహించవలెను. ఇట్టి శమదమములు లేనివాడు అపాయములో పడిపోవుట నిక్కము. వీనికి ఆత్మశక్తికన్న ప్రకృతిశక్తి బలీయమైయుండును. తాబేలుకు జనుల చేతగాని, జంతువులచేతగాని అపాయమని తోచునప్పుడు సర్వావయవములను ముడుచుకొనుశక్తి యుండుటచే అన్ని బాధలనుండి తప్పించుకొని పోవుచున్నది. ఈలాగున నుండుటయే స్వాధీనమైన యింద్రియములు గలవానికి గురుతుగా నుండును. ఇచ్చట గూడ ప్రయత్నముండవలయు ననియే భగవదాశయమై యున్నది.

**తేషా మహం సముద్ధర్తా మృత్యుసంసార సాగరాత్ ।**
**భవామి న చిరాత్పార్థ! మయ్యావేశిత చేతసామ్ ॥**

ప్రశ్న :- భగవద్ధ్యానాసక్త చిత్తముగలవారిని అచిరకాలములోనే సంసారసాగరము నుండి నే నుద్ధరించుచున్నాను అని భగవాను డుపదేశించలేదా! ఇచ్చట పురుషప్రయత్న మెద్దిగలదు?

ఉత్త:- ఈ శ్లోకములో భగవదర్పిత చిత్తముగలవారిని నిర్దేశించుటకు ''తేషాం'' అని ప్రయోగించియున్నారు. భగవదర్పితచిత్తము గలుగజేయుట

గొప్ప సంస్కారపూర్వక ప్రయత్నము లేనిచో గలుగదుకదా! ఈ శ్లోకముయొక్క పై శ్లోకమును జూడుడు.

**యే తు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః ।**
**అనన్యేనైవ యోగేన మాం ధ్యాయంత ఉపాసతే ॥**

ఎవరు నేనే యుత్కృష్టగతిగా గలవారలయి సమస్తకర్మములను నాయందు సమర్పించి ఆత్మధ్యాన పరాయణులై, అచంచల ధ్యానయోగమగు సమాధిచేత నన్ను ధ్యానించుచున్నవారలై యుందురో అట్టివారిని శీఘ్రకాలములోనే జననమరణ దుఃఖములతో గూడిన సంసారసాగరమునుండి యుద్ధరించెదను అని యుపదేశించుటచే సమస్త కర్మములను భగవంతునియందు సమర్పించి అచంచలమైన భగవద్ధ్యాన యోగములో నుండువారిని మాత్రము అని భగవానుడుపదేశించునప్పుడు అది లేనివారికి గతి లేదని స్పష్టమగుచుండునుగదా! ఈ శ్లోకములో ''యే తు'' అని ప్రయోగించుటచే పై జెప్పిన నిష్ఠగల వారెవరైనను అట్టివారిని అని గ్రహించవలయును. భగవానుని యొక్క విశాల కరుణాస్వభావము దీనివల్ల గోచరమగుచున్నది.

గీత అంతటను ఈ యర్థమునే శ్రీ భగవాను డుపదేశించి యున్నాడు. అట్లు గానిచో పాపియైన వానికి పుణ్యలోకప్రాప్తియు, పుణ్యాత్మునికి నరకలోకప్రాప్తియు, ముముక్షువు కానివానికి మోక్షలోక ప్రాప్తియు, ముక్తునికి బంధమున్ను గలిగే లాగున నుండును గదా! ఇది న్యాయ విరుద్ధముగా నుండును.

ప్రశ్న :- సర్వేశ్వరుడు సర్వశక్తుడు, సర్వస్వతంత్రుడు, సర్వజ్ఞుడు, సర్వవ్యాపకుడై యుండునప్పుడు తన యిష్టానుసారముగా చేయకూడదా?

ఉత్తరము :- భగవంతుడు సర్వశక్తుడు సర్వజ్ఞుడని చెప్పినది నిజము. అందుచే అవినీతిగా ప్రవర్తించువాడని యర్థము గాదు. సృష్ట్యాది సమస్త కార్యములు చేయుటకును, పిపీలికాది బ్రహ్మపర్యంతము గల సర్వప్రాణికోట్ల హృదయము తెలిసికొనుటకును శక్తుడని భగవద్విశేషణము చెప్పినదే గాని మరియొక్కటి కాదు. రాష్ట్రమునకు సర్వస్వతంత్రముగల సార్వభౌముడని

ఒక్కరిని చెప్పినచో, ప్రయత్నము చేయక సోమరులై యుండువారికి ఉన్నతోద్యోగము నిచ్చువాడనియు, సర్వశాస్త్రములు చక్కగ చదివి సర్వలక్షణ యుక్తులైనవారికి ఉద్యోగమివ్వక త్రోసివేయువాడుగా నుండునని యెవ్వరైనను చెప్పుదురా? ఆలాగున శిష్టాచారులను శిక్షించుటయు, దుష్టాచారులను రక్షించుటయు అని అర్థము గాదు. వారివారి యోగ్యతలను బట్టి రక్షణ శిక్షణములకు మరియొక్కరి సహాయము లేకనే చేయ సమర్థుడనియే అర్థము గాని మరియొకటి కాదు. లేనిచో భగవదాదేశముగా నుండు ధర్మశాస్త్రములకే హాని వాటిల్లును గదా?

ప్రశ్న - అట్లైన భగవంతుడు కరుణాళువు, నిరుపమాన వాత్సల్యకృపానిధి, అవ్యాజప్రేమస్వరూపుడు అని యేల వర్ణన చేయవలయును?

ఉత్త - దీనివల్ల భగవంతునియొక్క కారుణ్యసాగరమునకు కొరత గలుగదు. ఏలన? కరుణామూర్తియగు ఒక్క ప్రభువుదగ్గరకు బీదలు అత్యల్పముగా పత్రపుష్పఫలములను తెచ్చి సమర్పించి ఏలాగున గొప్పకార్యము కొరకు ప్రార్థన చేయుచుందురో, అట్టి ప్రార్థన నంగీకరించి ప్రభువు వారిపై అనుగ్రహము గల్గి వారలను కృతార్థుల జేసి పంపునో, ఆలాగున భగదర్పిత చిత్తముగలవారై భగవద్ధ్యానపరాయణు లగు భక్తులయొక్క స్వల్పప్రార్థనచేతనే భగవంతుడు సంతుష్టాంతఃకరణుడై వారికి ఉత్కృష్టపదవి యగు మోక్షమును గలుగచేయువాడని మాత్రమే అర్థము గాని మరియొకటి కాదు. ఇది భక్తి మార్గమునకు సమన్వయించినది. మరికొందరు వారివారి కర్మానుసార ఫలమును గలుగజేయువాడు భగవంతుడు గాని మార్పుగలుగ చేయువాడు గాడని చెప్పుటగూడ గలదు. ఇది సత్యము. అట్లైన భగవత్ప్రార్థనకు ఫలము లేక పోవునా యని సందేహింపనక్కర లేదు. ప్రార్థనకు తగిన భగవత్కృప గల్గుచుండును. ఇదే భగవంతుడు సత్యస్వరూపుడనియు, న్యాయశీలుడనియు చెప్పుదానికి నిజమైన అర్థముగా నుండును. అట్లు గానిచో జీవకోట్లు కేవలము సోమరులై, కృతకృత్యులుగాక పోదురు. ఈ విషయమై యెన్నియో చరిత్రములును, శాస్త్రములను గలవు. ఇదే నిజమైన సత్యధర్మస్వరూపు డగు

భగవంతుని యొక్క గుణమైయుండును. అట్లుగానిచో భక్తులకు అనేక విధములగు కష్టములు గల్గుటకు అవకాశమే లేకపోయి యుండును. అయితే కర్మముయొక్క రహస్య మతిగహనము. అతీంద్రియజ్ఞానులకు గూడ తెలిసికొనుట దుస్తరముగా నున్నది. ఉత్తరక్షణములో ఏమి జరుగుబోవు చుండునని తెలిసి కొనుటకు దేవతలకు గూడ అశక్యమని శాస్త్రము చెప్పుచున్నది.

కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః ।
అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః ॥

అనుష్ఠేయం కర్మ ఇది యనియు, అనుష్ఠేయంవుగాని కర్మ పలానిదనియు, నైష్కర్మ్యసిద్ధి యిది యనియు, నీ మూడుస్థితులను చక్కగా తెలిసికొనవలయును. ఈ కర్మాకర్మ వికర్మలయొక్క యథార్థస్థితి తెలియుట కశక్యమైనది. అనగా అతీంద్రియ జ్ఞానులకు మాత్రమే గోచరమగునని భావము. కనుకనే పై శ్లోకములో

కిం కర్మ కిమకర్మేతి కవయోఽప్యత్ర మోహితాః ॥

కర్మ యెట్టిది? అకర్మ యెట్టిది? అను ఈ విషయమునందు పండితులు గూడ మోహమును బొందియున్నారు, అనగా యథార్థము తెలియక భ్రమజెందియున్నారని చెప్పబడెను. ''కవయోఽప్యత్ర మోహితాః'' అని ప్రయోగించుటచే ఏ సమయములో ఏ కార్యము ఏలాగున చేయవలయునో, ఏ కర్మకు ఏ ఫలము గలుగునో ఇట్టి విషయములను ఆ యా సమయములలో నిస్సంశయముగా తెలుపు వారిని కవులని చెప్పుదురు. అట్టివారే కర్మ, అకర్మ, వికర్మ విషయములలో మాయామోహముచే యథార్థము తెలియక భ్రమచెంది యున్నారని శ్రీభగవానులే యుపదేశించినప్పుడు సామాన్యజనులు ఏమి చేయగల్గుదురు?

అవశ్యమనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్ ।
నాభుక్తం క్షీయతే కర్మ కల్పకోటి శతై రపి ॥

ఈ శ్లోకముచే నూరు కల్పకోట్లకాలము పోయినను వారు వారు చేయు శుభాశుభ కర్మములయొక్క ఫల మనుభవించియే తీరవలె నని శాస్త్రము చెప్పుట లేదా? ఇక ఈ విషయమై శ్రీభగవానుడు సృష్టికాలమున జీవులకు బ్రహ్మదేవుడు ఏ ధర్మము నుపదేశించి పంపియున్నాడని చెప్పెనో ఆ విషయమును జూడుడు-

**సహయజ్ఞాః ప్రజాస్సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః ।**
**అనేన ప్రసవిష్యధ్వ మేషవోఽ స్త్విష్టకామధుక్ ॥**

సృష్టికాలమున ప్రజాపతి యజ్ఞములతో గూడ ప్రజలను సృజించి యిట్లు పలికెను. ''మీరు ఈ యజ్ఞముచేత వృద్ధి జెందుడు. ఇది మీకు కోరిన కొరికలన్నిటి నిచ్చునది యగు గాక!''

ఈ శ్లోకముచే పితామహుండగు బ్రహ్మదేవుడు సృష్టికాలములో ప్రజలతో ఈలాగున ఉపదేశించి పంపియున్నాడు. ''మీరు యజ్ఞములను జేయుడు. ఈ యజ్ఞములు మీకు సర్వాభీష్టఫలమును గలుగజేయును గాక'' యని ప్రతిజ్ఞ జేసి పంపినాడు. ఇచ్చట యజ్ఞశబ్దముచే అగ్నిష్టోమాది కర్మలని మాత్రము తలంపరాదు. మన్వాది స్మృతులలో 1. బ్రహ్మయజ్ఞము 2.పితృయజ్ఞము, 3. దైవయజ్ఞము, 4.భూతయజ్ఞము, 5. నృయజ్ఞము వీనిని పంచమహాయజ్ఞములందురు. ఈ యజ్ఞములచే పంచమహాపాపములు గూడ నశించి జీవుడు పునీతుడై బ్రహ్మలోకమును బొందును అని చెప్పబడియున్నది. గీత 4వ అధ్యాయములో భగవానుడే 14 విధములగు యజ్ఞములు చెప్పియున్నాడు. ఆ భాగమును పాఠకులే తెలిసికొనుట మంచిది. లేనిచో గ్రంథబాహుళ్య మగునని విడిచిపెట్టడమైనది. దీనియందు ఆత్మధ్యానము, అధ్యాత్మయోగము, ప్రాణాయామము, స్వస్వరూపానునిష్ఠ, ప్రణవాది జపము మొదలైనవన్నియు యజ్ఞములలో పేర్కొనియున్నారు. కావున శ్రీభగవానులు బోధించిన రీతిగా దేనివల్ల మీకు శోకశాంతియు, ఆనందప్రాప్తియు గల్గునో దానిని యజ్ఞమని గ్రహించవలెను. అది జీవకోట్లకు అవశ్యకర్తవ్యమని బ్రహ్మదేవుడు ప్రతిజ్ఞజేసి చెప్పుచున్నాడు. ఈ యజ్ఞవిషయమై

తైత్తిరీయోపనిషత్తున ఆత్మయజ్ఞమని యుపదేశింప బడియున్నది. అదిన్ని ముముక్షువులు ఆ గ్రంథము నుండి తెలిసికొనవచ్చును. ''ప్రసవిష్యధ్వం'' అని యుపదేశించుటచే దీనివల్ల మీరు వృద్ధిని బొందుదురుగాక, మరియు ''కామధుక్'' అని చెప్పుటచే కామధేను వేలాగున సమస్తమగు కోరికలను గలుగచేయునో, ఆలాగున మీరు దేనిని కోరినవారలై యుందురో దానికనుగుణమైన సాధన చేయుడు అని వ్యక్తమగుచున్నది.

**ఇష్టాన్ భోగాన్ హి వో దేవా దాస్యంతే యజ్ఞభావితాః ।**
**తైర్దత్తా న ప్రదాయైభ్యో యో భుంక్తే స్తేన ఏవ సః ॥**

యజ్ఞములచేత సంతోషింపచేయబడిన దేవతలు మీ కొరకు అభీష్టములైన భోగములను ఈయగలరు. ఆ దేవతలచేత ఇయ్యబడిన సౌఖ్యవస్తువులను ఆ దేవతలకొరకు ఇయ్యక ఎవ్వడు భుజించుచున్నాడో వాడు చోరుడే యగును.

ఇచట భగవంతునిచే ఇయ్యబడిన అన్నాదివస్తువులను భగవదారాధనచేయక లేక అతిథి అభ్యాగతుల కియ్యక యెవరు భుజింతురో వారు చోరులతో సమానులనియే భగవంతునిచే చెప్పబడుచున్నారు. ఎట్లన? ఒకరు గుత్తకు నిచ్చిన భూమిలో నుత్పత్తియగు ధాన్యాదులు భూస్వామికి భాగము ప్రకారమీక తానే తినువాడు దొంగ గాడా? లేక గొర్మెంటు కివ్వవలసిన పన్ను ఇవ్వక భూమిని పండించి తినువాడు శిక్షితుడు గాకపోవునా? అదేప్రకారము భగవదారాధన, అతిథిపూజ చేయక భుజించువాడు దైవసన్నిధిలో చోరుడగును. దీనికి అంతరార్థము మరియొక విధముగా నున్నది. భగవంతునిచే నొసంగబడిన మనయొక్క దేహేంద్రియ మనోబుద్ధ్యాదులన్నిటిని భగవద్ధ్యానమందు వినియోగపరచి భగవత్సేవలో నుపయోగపరచవలెననియు, అట్లుచేయక విషయ సౌఖ్యములకొరకు అట్టి యింద్రియాదులను వినియోగపరచినవాడు గూడ చోరుడనియు, భగవత్కారుణకు దూరుడనియును గూడ గ్రహించవలెను. ఈ యజ్ఞశబ్దమును శ్రీరామానుజాచార్యులు ఇట్లుపదేశించియున్నారు. దీనినే పంచయజ్ఞములనియు, పంచసంస్కారములనియు శ్రీవైష్ణవ

సాంప్రదాయకులు తలంతురు.

**తపః పుండ్రః తథా నామ మంత్రో యాగశ్చ పంచమః ।**

1. శంఖచక్రాది ధారణ, 2. ఊర్ధ్వపుండ్రము 3. భగవన్నామమునకు అనుగుణమగు దాసపేరు, 4. శ్రీ అష్టాక్షరి మంత్రజపము, 5. భగవదారాధన, ఇవి మనుష్యులు చేయవలసిన పంచయజ్ఞములనందురు. ఇవి విధిప్రకారము చేసియే తీరవలయును.

**యజ్ఞశిష్టాశినస్సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః ।**
**భుంజతే తే త్వఘం పాపా యే పచంత్యాత్మకారణాత్ ॥**

దైవయజ్ఞాదులను చేయుగా మిగిలిన యన్నమును భుజించునట్టి సత్పురుషులు సర్వపాపములచేతను విడువబడుదురు. ఎవరు ఆలాగున దైవధ్యానాదియజ్ఞములు చేయక తమకొరకే వండి తినుదురో, ఆ పాపులు పాపమునే భుజించుచున్నారు.

దీనిలో చెప్పబడిన యీ యజ్ఞమునకు మనుస్మృతిలో చెప్పిన యజ్ఞమైన గ్రహింపవచ్చును. లేక గీత నాల్గవయధ్యాయములో చెప్పబడిన యజ్ఞమైన గ్రహింపవచ్చును. లేక శ్రీవైష్ణవ సంప్రదాయ దైవారాధన యజ్ఞమైన గ్రహింపవచ్చును. ముఖ్యముగా మనుజుడు ప్రతిరోజును దైవధ్యానకార్యములు శక్తికొలది చేసి, శక్తికి తగినంత అతిథులను పూజించి భుజింపవలయుననియే తెలియుచున్నది. అట్లుచేయక తినువారు పాపాత్ములనియు, వారు భుజించుపదార్థములు పాపములనియు గ్రహించవలెను. ఇదే భగవదాశయమని తోచుచున్నది. పై ప్రకారము దైవధ్యానాదులు చేసిన తర్వాత భుజించువారు సమస్తపాపములనుండి విముక్తులగుదురని శ్రీభగవానులే యుపదేశించి యున్నారు. పంచయజ్ఞవివరము-

**అధ్యాపనం బ్రహ్మయజ్ఞః పితృయజ్ఞస్తు తర్పణమ్ ।**
**హోమో దైవో బలిర్భౌతో నృయజ్ఞోఽతిథి పూజనమ్ ॥**

దీని యర్థము పైన వ్రాసినదే. ఇట్లు ప్రతిదినమును గృహస్థుడు కృషి

వ్యాపార, ఉద్యోగాదులచే గలిగెడు పాపములనుండి విముక్తుడగును. చేయనివాడు బద్ధుడగును.

ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహ యః ।
అఘాయు రింద్రియారామో మోఘం పార్థ స జీవతి ॥

అర్జునా! ఎవ్వడు ఈ పూర్వోక్తప్రకారముగా దైవాజ్ఞచే ప్రవర్తింపచేయబడిన జగద్ధర్మమును ఈ లోకమునందు అనువర్తింపడో, వాడు పాపమే యాయువుగా గలవాడును, ఇంద్రియములచేత విషయాసక్తుడైనవాడును గావున వ్యర్థమగునట్లు బ్రతుకుచున్నాడు. ''అఘాయుః'' అని భగవానుడు చెప్పుటచే పై జెప్పినట్లు దైవారాధన భగవద్ధ్యానము చేయక భజించువాడు పాపజీవి యనియే గ్రహించవలయును.

యత్వేత దభ్యసూయంతో నానుతిష్ఠంతి మే మతమ్ ।
సర్వజ్ఞాన విమూఢాంస్తాన్ విద్ధి నష్టానచేతసః ॥

ఎవరు నాయొక్క యీ యాజ్ఞను నిందించువారలై, అనువర్తించరో, చెడిన జ్ఞానముగల, ఎల్లజ్ఞానముల యందు మిక్కిలి మూఢులైన వారలను చెడినవారలనుగా తెలియుము.

దైవప్రేరితమగు ఆజ్ఞను అతిక్రమించినవారలై, పురుషప్రయత్న రహితులైనవారు చెడిన మనస్సుగలవారనియు, వ్యర్థజీవులనియు భగవదాశయమై యున్నది.

ఇంద్రియ స్యేంద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ ।
తయోర్న వశమాగచ్ఛే త్తౌ హ్యస్య పరిపంథినౌ ॥

ప్రతియింద్రియముయొక్క శబ్దాది విషయములందు రాగద్వేషములు (అనగా ఇష్టమందు ప్రీతియు, అనిష్టమం దప్రీతియు) నెలకొనియున్నవి. ఆ కారణమువలన ఆ రాగద్వేషములకు అధీనత్వమును బొందకూడదు. మనుజునికి ఆ రాగద్వేషములు శ్రేయో మార్గమునకు పరమశత్రువులై యున్నవి.

**తస్మాత్త్వ మింద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ ।**
**పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞాన విజ్ఞాన నాశనమ్ ॥**

ఓయి అర్జునా! ఆ కారణమువలన, నీవు మొదటనే సర్వేంద్రియములను ఇంద్రియవార్థవములనుండి అనగా విషయంవములనుండి వశీకరించి, ఆత్మజ్ఞానమును, అనుభవజన్యజ్ఞానమును నశింపజేయునదియును, పాపస్వరూపమైన యీ ఆశను లెస్సగా విడువుము.

దీనియందు విషయాశ జ్ఞానమును, విజ్ఞానమును గూడ నశింపచేయునది, మహాపాపస్వరూపమైనదనియునగునని భగవాను లుపదేశించుచున్నారు. జ్ఞానమనగా శాస్త్రముచేతను, ఆచార్యుని చేతను, గ్రహించిన ధర్మాధర్మముల యొక్కయు, పుణ్యాపుణ్యముల యొక్కయు, బంధమోక్షముల యొక్కయు జ్ఞానము, విజ్ఞానమనగా గురశాస్త్రోక్తముగా గ్రహించిన దానిని అనుష్ఠానములో బెట్టి దాని వల్ల గల్గిన అప్రాకృతమగు దైవజ్ఞానము అనగా ఆత్మసాక్షాత్కార బోధము విజ్ఞాన మనంబడును. ఈ రెండింటిని విషయబుద్ధి నశింపచేయును. ఇది బ్రహ్మవేత్తకు గొప్ప ప్రతిబంధమైన మహా శత్రువుగా నున్నది. కనుకనే భగవానులు ''జహి'' అనిచెప్పక ''ప్రజహి'' అని యుపదేశించుటకు కారణమైనది. ''జహి'' శబ్దమునకు విడిచి పెట్టుము. ''ప్రజహి'' శబ్దమునకు ప్రయత్నపూర్వకముగా విడిచిపెట్టుము. అనగా వెనుకను ముందును చూడక వెంటనే త్యజింపుమని యర్థము.

ఇట్లు భగవాను లుపదేశించుటచే, పురుషప్రయత్నము సర్వకాల సర్వావస్థలలోను ఉండవలయుననియే అర్థమగు చున్నది.

**ఇంద్రియాణి పరాణ్యాహు రింద్రియేభ్యః పరం మనః ।**
**మనసస్తు పరా బుద్ధి ర్యో బుద్ధేః పరతస్తు సః ॥**

జ్ఞాననిష్ఠులు ఇంద్రియములను, దేహాదులకంటె అధికములని చెప్పుదురు. ఆ ప్రకారముగానే మనస్సు ఇంద్రియముల కంటె ఉత్కృష్టమైనది. నిశ్చలాత్మకబుద్ధి, మనస్సుకంటె నుత్కృష్టమైనది. ఏయాత్మ బుద్ధికంటె పరమైసాక్షిగానున్నదో, అదే పరమాత్మస్వరూపమని గ్రహించవలయును.

ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మాన మాత్మనా ।
జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్ ॥

ఓయి అర్జునుడా! ఈ ప్రకారముగా బుద్ధికంటె వ్యతిరిక్తమయిన ఆత్మను ఎరింగి ఆత్మచేత ఆత్మను, లెస్సగా నిగ్రహించి నిగ్రహింపరాని కామస్వరూపమైన శత్రువును అంత మొందింపుము.

ఇట్లు గీత, కర్మయోగమైన మూడవ అధ్యాయములో ఆఖరున గురుశాస్త్రోక్తప్రకారము ప్రయత్నపరుడైయుండి ప్రకృతిగుణమును రహిత మొనర్పవలని భగవానులుపదేశించియున్నారు. అది యేలాగున చేయవలయునో, దానియొక్క రహస్య మార్గము గూడ ఈరెండు శ్లోకములలో తెలిపియున్నారు. ఇది మంచి బ్రహ్మనిష్ఠుల సహాయముండిన మాత్రమే తెలిసికొన సాధ్యపడును. మొట్టమొదట ఇంద్రియార్థములు అనగా దృశ్యవిషయము. దానికి సమీపమున నున్నది దేహము. దేహమునకు దగ్గరనున్నవి కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియములు. వానికి సమీపమున నున్నది మనస్సు. మనస్సునకు దగ్గరనున్నది బుద్ధి. బుద్ధికి సాక్షిగానున్నది ఆత్మ. ఇవి ఒక్కొక్కటిన్ని వెయ్యి రెట్లు సూక్ష్మసూక్ష్మములై యున్నవి కావున శ్రేష్ఠములైనవి. వానిని నిగ్రహించు రహస్యమేదనగా ధ్యానకాలములో ధ్యేయాకారస్థితిలో నుండి మొట్టమొదట దృశ్యమునుండి మనస్సును వేరుపరచుకొనవలెను. తర్వాత దేహమునుండి ఇంద్రియములనుండి, మనస్సునుండి, బుద్ధినుండి వేరుపరచుకొనుచు వచ్చి ఆఖరున స్వస్వరూపమగు ఆత్మయందు దైవభావముగా నిలువవలెను. అప్పుడు మాత్రమే సంపూర్ణ విషయత్యాగము, అనగా మూలప్రకృతి విలయము గల్గును. ఇచ్చట కేవలము దైవస్వరూపభావనమాత్రము గల్గియుండవలయును. అది గలుగుటకు ధారణాధ్యానములలో బలముగల్గి యుండవలయును. ఈ స్వరూపములో నిశ్చలముగా నిలకడ గలుగ శక్తిలేనివారికి యోగము సహాయము గలుగచేయును. ఈలాగున చేయవలెనని యుపదేశపూర్వకముగా చెప్పుటచే పురుషప్రయత్న మావశ్యకము.

**తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్ ।**
**దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాంతి తే ॥**

నిరంతరము ఎడతెగని ధ్యానయోగమందుండెడి, విశ్వాసపూర్వకముగా సేవించుచున్న వారలకు, ఏ జ్ఞానయోగము చేత బ్రహ్మప్రాప్తి గలుగునో అట్టి జ్ఞానయోగము నిచ్చుచున్నాను. ఏ బుద్ధి యోగముచేత వారలు నన్ను పొందుచున్నారో అట్టి దైవప్రాప్తి ఉపాయమును వారి హృదయములో ప్రబోధము నొందజేసెదను.

**తేషా మేవానుకంపార్థ మహ మజ్ఞానజం తమః ।**
**నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా ॥**

ముందు చెప్పబడిన నిరంతరధ్యానాసక్తిగల వారి యొక్క అనాదికాల ప్రవర్తమానమై వచ్చుచుండు అజ్ఞాన మనెడు కారుచీకటిని వారి హృదయాంతరాళములో నేనుండి ప్రకాశమైన జ్ఞానదీపమును వెలుగజేసి అట్టి పరమభక్తుల పైగల కరుణ ఒక్కదానిచేత మాత్రమే వారి మోహాంధకారమును రహిత మొనర్చుచున్నాను.

ఈ శ్లోకముచేతను చిత్తైకాగ్రతగల్గి నిరంతరము ధ్యానము చేయు భక్తులపై కరుణ గల్గి వారియొక్క అజ్ఞానతిమిరమును నశింపజేయుచున్నానని శ్రీభగవాను డుపదేశించెనే కాని అట్టి ప్రయత్నము లేనివారి అజ్ఞానము నశింపచేసెద నని చెప్పలేదు.

**సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః ।**
**యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్ ॥**

నేనెల్లభూతములలోను సముడుగా నుండువాడను. నాకు నిష్టుడు గాని, అనిష్టుడుగాని లేడు. అయితే ఎవండు భక్తిశ్రద్ధలతో నన్ను ధ్యానించుచున్నాడో అట్టివాడు నాయందున్నవాడు. వానియందు నేనును సదాయుండువాడను.

ఈ శ్లోకముచేత ప్రయత్న మనసరమా? అనవసరమా? అను సందేహమునకు సమాధానము ఏర్పడుచున్నది. ఏలన? భగవంతునికి,

బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర స్త్రీ పురుషాది భేదము లేదనియు, ఆలాగున బ్రహ్మచర్య గృహస్థ వానప్రస్థ సన్న్యాసాది ఆశ్రమ భేదము లేదనియు, నాలాగున దైవాసుర రాక్షసాదిభేదము లేదనియు, ఎవరైనను భక్తిశ్రద్ధా వైరాగ్యములతో ధ్యానించువారుండిన వారిలో గల తనయొుక్క దైవస్వరూపము గోచరమగుచుండుననియు, వారికి తనయందుగల యీశ్వరత్వము గోచరించుననియు శ్రీభగవానులే యుపదేశించి యున్నారు. ఏ జాతివారైననేమి? ఏ లోహముతో, ఏ ఆకృతితో, ఏ వర్ణముతో నుండిన పాత్రయైనను దానిలోని జలము నిశ్చలముగాను, నిర్మలముగాను ఉండిన సూర్యప్రతిబింబము గనపడునుగదా! మలిన జలముగల పాత్రలో సూర్యబింబము కనుపించకపోవుటలో, నిర్మలోదకమున కనుపించుటలో సూర్యునియందేమి పక్షపాతము గలదు? గ్రీష్మఋతువులో దాహముతో పరితపించువారెవరైనను గంగానది తన వద్దకు వచ్చిన వారికి తాపమును, దాహమును శమింపచేయుచున్నది. తీర్థతీరమునకు పోనివారి తపన దాహములు శమింపచేయక పోవుటలో గంగాభవాని యందు ఏమి పక్షపాతము గలదు? కల్పవృక్షము దగ్గరకు వెళ్లి ప్రార్థించువారు అభీప్సితసిద్ధులై వచ్చుటకును, అట్లు ఆశ్రయింపనివారి శ్రమ నివృత్తి గలుగలేదని చెప్పుటలోను కల్పవృక్ష సమత్వమునకు ఏమి భేదము గలదు? ఆలాగున, భక్తిశ్రద్ధా వైరాగ్యములతో ధ్యానము చేయు వారెవరైనను, భగవత్ జ్ఞానామృతమును పానముజేసి ధన్యులగుచున్నారు. ఆలాగున చేయనివారు ఘోరసంసార మరుభూమిలో తాపత్రయాగ్ని యను గ్రీష్మఋతువుచే తపించుచున్నారు. కావున పురుషప్రయత్న మవసరమనియే యీశ్వరాజ్ఞయై యున్నది.

**యశ్శాస్త్ర విధి ముత్సృజ్య వర్తతే కామకారతః ।**
**న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాం గతిమ్ ॥**

ఎవడు దైవాజ్ఞయగు శాస్త్రనియమము ననుసరించక స్వేచ్ఛామార్గమున వర్తించుచున్నాడో అట్టివాడు తనయొుక్క అనుష్ఠానముయొుక్క సిద్ధిని బొందజాలడు. వానికి ఇహమందైన సౌఖ్యము లభింపదు. పరలోకమందును

ఉత్కృష్టపదవి యేమియు దొరకదు.

ఈ శ్లోకముచే దైవనియమ మగు పురుషప్రయత్నము చేయనివానికి ఏ కార్యమైనను సిద్ధింపజాలదనియు, ఇచ్చట సుఖముండదనియు, పరములో అసలే సద్గతి లేదనియు శ్రీభగవాను లుపదేశించియున్నారు. దీనికన్న పురుషప్రయత్న విషయమై శ్రీభగవాను లేమి యుపదేశింపవలెను?

**గుణానేతా నతీత్య త్రీ౯ దేహీ దేహసముద్భవా౯ ।**
**జన్మమృత్యుజరాదుఃఖై ర్విముక్తో௨మృత మశ్నుతే ॥**

ఎవడు దేహోత్పత్తి కారణములైన సత్త్వరజస్తమోగుణములను యోగమునచేతను, జ్ఞానమునచేతను దాటిపోవుచున్నాడో, వాడు జన్మమృత్యుజరాదుఃఖములనుండి విడువబడినవాడై మోక్షమును జెందుచున్నాడు.

ఇట్లు బోధించుటచే యోగజ్ఞానములచే త్రిగుణములను రహిత మొనర్పవలెననియే భగవదాశయమై యున్నది. అట్లుచేయని వానిగతి యీక్రింది శ్లోకములో భగవానులే యుపదేశించియున్నారు.

**అశ్రద్దధానాః పురుషా ధర్మస్యాస్య పరంతప ।**
**అప్రాప్య మాం నివర్తంతే మృత్యుసంసార వర్త్మని ॥**

ఓ అర్జునా! యీ ఆత్మజ్ఞానధర్మమును శ్రద్ధాభక్తులతో అనుష్ఠింపని పామరులైన మనుజులు నన్ను పొందక మత్యురూపమైన సంసారమార్గమందు పుట్టుచు గిట్టుచు ఘటీయంత్రములవలె దిరుగుచుందురు.

**న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే ।**
**తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విందతి ॥**

ఈ లోకమందు ఆత్మజ్ఞానముతో సమానమగు పవిత్ర పదార్థము మరియొకటి లేదు. అట్టి జ్ఞానసిద్ధిని యోగనిష్ఠుడు అనుష్ఠాన పరిపక్వత గల్గునప్పుడు తానే తనయందు బొందుచున్నాడు.

ధ్యానయోగముయొక్క పరిపక్వదశ గల్గినప్పుడు తనలో నుండు భగవత్స్వరూపమును తనలోనే పొందుచుండును. అనగా జ్ఞానసుఖము ననుభవించుచుండును. దీనివల్ల పరిపక్వ దశగలుగక పోవుటయే దైవసాక్షాత్కార జ్ఞానము గలుగక పోవుటకు కారణమని ముముక్షువులు గ్రహించవలెను. బీజమునుపెట్టి పెంచినను కాలపరిపాకము గలుగనిచో ఫలము గలుగదుగదా! అయితే శ్రద్ధతో పెంచిన త్వరలో ఫలము లభించును. అట్లు గానిచో కాలదీర్ఘతగల్గుటనైజము. ఈ శ్లోకమున్ను ప్రయత్నమునే ప్రబోధించుచున్నది.

**శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పర స్సంయతేంద్రియః ।**
**జ్ఞానం లబ్ధ్వా పరాం శాంతి మచిరేణాధిగచ్ఛతి ॥**

గురువాక్యము, శాస్త్రము, ఈశ్వరుడు ఈ మూడింటిలో భక్తిశ్రద్ధలు గలవాడును, జ్ఞానప్రాప్తియందు అత్యాసక్తి గలవాడును, ఇంద్రియ నిగ్రహముగల పురుషుడు బ్రహ్మజ్ఞానమును పొందును. అట్టి దైవసాక్షాత్కార జ్ఞానమును బొంది అతిశీఘ్రములో నుత్కృష్టమైన చిత్తోపరతి పరమగు మోక్షమును బొందును.

కనుక శ్రద్ధగలవాడు మాత్రమే త్వరలో సర్వదుఃఖరహితపరమగు ఉత్కృష్టగతిని పొందగల్గును.

**శక్నోతీహైవ యస్సోఢుం ప్రాక్ఛరీర విమోక్షణాత్ ।**
**కామక్రోధోద్భవం వేగం స యుక్తస్స సుఖీ నరః ॥**

ఎవడు ఈ దేహమును విడుచుటకంటె ముందు ఈ లోకమునందే కామక్రోధములవలన బుట్టిన వికారములను సహించుటలో సమర్థుడగుచున్నాడో, వాడే ఇంద్రియనిగ్రహము గల యోగియును, ఆత్మజ్ఞానము గల నిత్యసుఖియు నగుచున్నాడు.

ఈశ్లోకములో ''ఇహ'' అనియు ''ప్రాక్ఛరీర విమోక్షణాత్'' అనియు శ్రీభగవాను లుపదేశించుటచే ఈలోకమందున్నప్పుడే హర్షశోకములచే గల్గెడు వికారములను జయించువాడై యుండవలెననియు, ఈ శరీరము ఉండునప్పుడే

జ్ఞానమును పొందవలెననియు, శరీరబలము, జనసహాయము, ధనసమ్పృద్ధి గల్గియున్నప్పుడే అట్టి దైవసాక్షాత్కార జ్ఞానమును పొందవలెననియు ఉపదేశించుచున్నారు. ఈ లోకము విడిపోయిన తర్వాత ఏమి చేయుటకును సాధ్యపడదనియు, శరీరబలము, జనసహాయము, ధనసమ్పృద్ధి తగ్గిపోయిన తర్వాత సత్కార్యముచేయుటకు అనుకూలపడదనియు తెలిసికొని ముందుగానే జాగ్రతపడవలెనని పరమకారుణికుడుగు భగవానుడు జీవులయొక్క మాయా మహామోహమునుజూచి ఉపదేశించియున్నాడు. ఇహములో ఈ దేహముతో నున్నప్పుడు ఆత్మకు ఎంత వికాసముగాని, విశుద్ధతగాని, సౌఖ్యముగాని గల్గియుండునో పరమందును ఆలాగే యుండుననియు, దానిననుసరించిన జన్మమే మరల గల్గుననియు కఠోపనిషత్తు నందు నచికేతునికొరకు యమధర్మరాజు ఉపదేశించియున్నాడు. కనుక యిచ్చటనే మోక్షము గలిగినవానికి ఎచ్చటను మోక్షమే సందేహము లేదు. కావున జనులారా! మాయామోహములో చిక్కుకొని ఆత్మను పరిశుద్ధము చేయక ప్రపంచవాసనలతో హృదయము చెడియుండిన పరమందును, మరల రాబోవు జన్మమందును మీకు సౌఖ్యము గలుగజాలదు. మరియు ఉత్తరక్షణములో మనము జీవించియుండి ఆత్మశుద్ధి చేసికొనవచ్చునని తలంచుట కవకాశము లేదు. ఏ నిమిషములో ప్రాణము ఈగూడును విడిచిపోవునో తెలియజాలము. కావున తత్క్షణమే హృదయమును నిర్మలము చేసికొనుడు.

నష్టో మోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదా న్మయాఽచ్యుత ।
స్థితోఽస్మి గతసందేహః కరిష్యే వచనం తవ ॥

అచ్యుతా! నీయనుగ్రహమువలన నాయవివేకము తొలగిపోయెను. జ్ఞానము లబ్ధమాయెను. సందేహము నివర్తించెను. నీయాజ్ఞను శిరసావహించుటకు సిద్ధముగా నున్నాను.

ఈ శ్లోకములో అర్జునునియొక్క అంత్యసందేశము తెలుపడమైనది. దీని పై శ్లోకములో ఓ అర్జునా! నేను చెప్పిన ధర్మరహస్యము లన్నియు ఏకాగ్రబుద్ధితో తెలిసికొన్నావా? నీ మోహము తొలగిపోయినదా?

యథార్థతత్త్వమును ఎరిగితివా? అని శ్రీభగవానులే అడిగియున్నారు. ఎందుకనగా రెండవ అధ్యాయములో ''కర్మణ్యేవాధికారస్తే'' అని భగవాను లుపదేశించియున్నారు. మరియు ''స్వధర్మ మపి చావేక్ష్య'' అని తెలిపియున్నారు. అనగా ఈశ్వర నియమధర్మమును నిర్వహించుట జీవుల కర్తవ్యము అని ముందుపదేశింపబడెను. అది యుద్ధము లోగల మోహముచే అర్జునుడే మరచిపోయినాడు. అట్టి స్వధర్మకార్యమును నిర్వహింపచేయుటయే శ్రీగీతయొక్క ఆశయమై యున్నది. కనుకనే భగవదనుగ్రహముచేత అనగా భగవదుపదేశముచేత ''గతసందేహః'' ''నష్టోమోహః'' అనగా సందేహమంతయు తొలగిపోయినది. మోహమంతయు నశించినది. ''స్మృతిర్లబ్ధా'' నిశ్చయ జ్ఞానము లభించినది. ''కరిష్యే వచనం తవ'' మీ యుపదేశముచే ఇక చేయవలసినది మీ యాజ్ఞ యని తెలిసికొంటిని. అనగా భగవదాజ్ఞాపరమగు పురుషప్రయత్నము చేయుట యథార్థధర్మమని గ్రహించితిని. కావున మీ యాజ్ఞానుసారముగా చేయగలవాడను అని ఇట్లు చెప్పుటచే స్వప్రయత్నరహితుడైన అర్జునుడు భగవదుపదేశముచే చేయవలసిన కార్యము నెరింగినవాడై తన కార్యము చేయందగినదని నిశ్చయించుకొన్నాడు. ఇక పురుషప్రయత్న మవసరమా? అనవసరమా? అని చెప్పనక్కరలేదని తలంచెదను. ఇక బ్రహ్మనిష్ఠులు ఎట్టి అనుష్ఠానముచేత ఈశ్వరుని పొందగలరో ఆ విషయము శ్రీభగవంతుడు పదునెనిమిదవ అధ్యాయములో నిగూఢముగా బోధించియున్నాడు. సాధకు లందరును అయ్యది గ్రహించతగిన దని తలంచి యిచ్చట పొందుపరచడమైనది.

**సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ తథాఽఽప్నోతి నిబోధ మే ।**
**సమాసేనైవ కౌంతేయ! నిష్ఠా జ్ఞానస్య యా పరా ॥**

ఓ అర్జునా! నైష్కర్మ్యసిద్ధిని అనగా నిష్కామకర్మ యోగముచేతను, ఈశ్వరారాధనచేతను, అతఃకరణశుద్ధి గల్గిన పిదప పరబ్రహ్మను పొందుటకు త్రోవయైన, సులభమార్గమై మిక్కిలి శ్రేష్ఠమైన జ్ఞాననిష్ఠను నీకు సంక్షేపముగా చెప్పెద వినుము.

ఈశ్లోకమందు ''నిష్ఠా జ్ఞానస్య యా పరా'' అని యుపదేశించుటచే, సర్వోత్కృష్టమైన జ్ఞానముయొక్క ఆఖరునిష్ఠ అనగా బ్రహ్మ నిష్ఠయొక్క కొసయని భావము. మరియు ''సమాసేనైవ'' అనుటచే ఇంతవరకు బహుళముగా చెప్పుచు వచ్చిన ఈగీతాశాస్త్రముయొక్క సారసంగ్రహమని భావము. ఈశ్లోకమునకు మతత్రయాచార్యులును, వారి అనుయాయులును విశాలముగా అర్థము వ్రాసియున్నారు.

> బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాऽऽత్మానం నియమ్య చ ।
> శబ్దాదీ౯ విషయాంస్త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్య చ ॥

విశుద్ధయా = గుణత్రయ రహితమైన, బుద్ధ్యా = నిశ్చయ బుద్ధితో, యుక్తః = కూడినవాడై, ధృత్యా = ధైర్యముచేత, ఆత్మానం = ఆత్మను, నియమ్యచ= వశీకరణముచేసికొని, శబ్దాదీ౯ = శబ్దస్పర్శ రూపరసగంధాదులైన, విషయా౯= ఇంద్రియార్థవిషయములను, త్యక్త్వా = విడిచి, రాగద్వేషౌ = ప్రీతి అప్రీతులను, వ్యుదస్యచ = అంతః కరణమునుండి తొలగించి,

గుణత్రయరహితమైన బుద్ధితో గూడినవాడై, ధైర్యము గల మనస్సుగలవాడై, ఆత్మను పరమాత్మయందు చక్కగా ధ్యానయోగముచేత నిలిపి శబ్దాదివిషయములను అతఃకరణములో రానీయక చూచుకొని రాగద్వేషములను వదలిపెట్టవలెను.

> వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః ।
> ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః ॥

వివిక్తసేవీ = ఏకాంతమందుండువాడై, లఘ్వాశీ = అల్పాహారము చేసెడు స్వభావముగలవాడై, యతవాక్కాయమానసః = నియమింపపబడిన మనోవాక్కాయములు గలవాడై, అనగా త్రికరణ నిగ్రహము గలవాడై, నిత్యం = నిరంతరము, ధ్యానయోగపరః = ధ్యానయోగమందు అత్యధిక ఆసక్తిగలవాడై, వైరాగ్యం = విషయవిరక్తిని, సముపాశ్రితః =లెస్సగా అనుష్ఠించినవాడై.

బ్రహ్మనిష్ఠకు ప్రతిబంధము గలుగజేయని ప్రదేశములలో నుండువాడై,

శుద్ధమై నిర్మలమైన కొంచము ఆహారము భుజించు స్వభావముగలవాడై, లేక కఠినమై, దాహమును గలుగజేసెడి పదార్థములు భుజింపనివాడై, మృదువై, నిర్మలమైన ఆహారముచేయు స్వభావముగలవాడై, వాక్కును, మనస్సును, శరీరమును, స్వాధీనములోనిలిపి సదా ధ్యానయోగమునం దత్యధిక ఆసక్తిగలవాడై, లెస్సగా సమస్త విషయములలో వైరాగ్యము గలవాడై.

**అహంకారం బలం దర్పం కామంక్రోధం పరిగ్రహమ్ ।**
**విముచ్య నిర్మమః శాంతో బ్రహ్మభూయాయ కల్పతే ॥**

అహంకారం = అహంకారమును, బలం = ధనజనములతో గూడిన బలమును, దర్పం = దుర్మార్గప్రవృత్తిని, కామం = దృశ్యవస్తువులపై కోరికను, క్రోధం = కోపమును, పరిగ్రహం = బాహ్యవస్తు పరిగ్రహమును లేక పరులవస్తువును స్వీకరించుటను, విముచ్య = నిశ్శేషముగా విడిచి, నిర్మమః= మమకార రహితుండై, శాంతః = ప్రకృతిదోషము శమించినవాడు అగు బ్రహ్మనిష్ఠుడు, బ్రహ్మభూయాయ = బ్రహ్మసాక్షాత్కారజ్ఞానము కొరకు కల్పతే= అర్హత గలవాడగు చున్నాడు.

కావరమును, మమతను, కోరికను, క్రోధమును, దానాది పరిగ్రహమును, దురహంకారమును విడిచి ప్రశాంతబుద్ధిగల జ్ఞాననిష్ఠుడు పరబ్రహ్మమును బొందుటకు సమర్థుడగుచున్నాడు.

ఈ నాలుగు శ్లోకములు వరుసగా సమన్వయపరచి యిట్టి గుణములు గలవాడే యీశ్వరజ్ఞానము గల్గుటకు యోగ్యతగలవాడని భాష్యకర్తలు వచించియున్నారు. పరిగ్రహశబ్దమునకు బ్రహ్మనిష్ఠకు ఎంతమాత్రము అన్నవస్త్రవసతులు కావలయునో దానికన్న ఎక్కువ స్వీకరించగూడదని శ్రీశంకరభాష్యములో వచించియున్నారు. అధికరించిన స్వీకారము పరిగ్రహమను దోషమునకు సంబంధించును. ఇక గీత విషయమై యెక్కువ వ్రాయనక్కరలేదు. ఈ నాల్గుశ్లోకములను విరక్తులై బ్రహ్మనిష్ఠ చేయువారు నిరంతరము పఠించుచుందురు. ఇంటిలోపల దీపముండిన యేలాగున చీకటి జొరబడదో ఆగున దీనిని స్మరించువారి హృదయములోనికి అజ్ఞానము

దూరదు. గారుడమంత్రము జపించువాని దగ్గరకు విషసర్పములు ఎట్లు చేరవో ఆలాగున శ్రీకృష్ణభగవానులచే ఉపదేశించబడిన యీ దివ్యమంత్రమును స్మరించువారిని విషయములనెడు విషసర్పములు చేరవు. రక్షాయంత్రము కట్టిన వారిని దయ్యము లెట్లు చేరవో ఆలాగున భగవద్రక్షయగు దీనిని ధరించువానిని ప్రకృతిగుణములనెడు పిశాచములు చేరవు. పురుషప్రయత్న మెంతవరకుండునన జీవత్వము నశించి శివత్వము గలుగువరకే యుండును. నదియొక్క ప్రవాహగమనము సముద్రమును చేరువరకు గదా యుండును. కీటకము భ్రమరత్వమును పొందువరకు ప్రయత్నముండును. అచ్చట ద్వైతము నశించి అంతయు దైవమయమై యుండును. అంతయు ఒకే యీశ్వరమయమై కనపడును. సంపూర్ణ శోకశాంతియు, ఆనందప్రాప్తియు గల్గును.

## శ్రీవాసిష్ఠ రామాయణము ముముక్షువ్యవహారప్రకరణము.

(శ్రీరామవసిష్ఠ సంవాదము)

సర్వమేవేహ హి సదా సంసారే రఘునందన ।
సమ్యక్ప్రయుక్తా త్సర్వేణ పౌరుషాత్సమవాప్యతే ॥

ఈ సంసారమున నెవ్వడెక్కాలమున నెద్దాని నొనర్ప నిశ్చయించినను వానిచే జక్కగ ప్రయోగింపబడిన పౌరుషముననే దానిం బడయవలయును గాని వేరు మార్గము లేదు.

**పౌరుషం స్పందఫలవత్ దృష్టం ప్రత్యక్షతో న యత్ ।**
**కల్పితం మోహితైర్మందై ర్దైవం కించిన్న విద్యతే ॥**

కొందరు మూఢులు తామొనర్చు కర్మములకు దగిన ఫలముల ననుభవించుచు నట్టి కర్మములను దమ యజ్ఞానవృత్తిచే తెలియక కేవలమోహావిష్టులై దైవంబను పేరు గల్పించుకొనియెదరు. అంతియేగాక దైవమను వస్తువు వాస్తవముగా తన కర్మమున కన్యముగా ఫలము నిచ్చునది లేదు.

**సాధూపదిష్టమార్గేణ యన్మనోఽజ్గ విచేష్టితమ్ ।**
**తత్పౌరుషం తత్సఫల మన్యదున్మత్త చేష్టితమ్ ॥**

సజ్జను లుపదేశించు మార్గమున మనస్సును, ఇంద్రియములను బ్రవర్తింపజేయగల్గు నంగాదుల వ్యాపారము పౌరుషమనంబడును. ఇవ్విధమైన పౌరుషమే ఫలదాయకమైనది. అట్లుగాక స్వేచ్ఛచే బనులుచేయుట యున్మత్తచేష్ట యనంబడును.

**పౌరుషేణ ప్రయత్నేన త్రైలోక్యైశ్వర్యసుందరామ్ ।**
**కశ్చిత్ప్రాణి విశేషో హి శక్రతాం సముపాగతః ॥**

సామాన్యమైన యొక్క ప్రాణి విశేషము తన పురుషప్రయత్నమువలన నే కదా ఇంద్రపదవినొందెను! ఈ తీరుననే ఒక్కొక్క ప్రాణి, పౌరుషంబుననే బ్రహ్మదేవుడనియు, లక్ష్మీపతియనియు, చంద్రశేఖరుడనియు నసదృశపదంబుల ననుభవించుచుండెదరు. పౌరుషంబునకు నసాధ్యం బగునది యెద్దియును లేదు.

**ప్రాక్తనం చైహికం చేతి ద్వివిధం విద్ధి పౌరుషమ్ ।**
**ప్రాక్తనోఽద్యతనేనాశు పురుషార్థేన జీయతే ॥**

ఓయి రామచంద్రా! ప్రాక్తనమనియు, నైహికమనియు ఆ పౌరుషంబు ద్వివిధమని తెలియుము. అందు ప్రాక్తన మన పూర్వభవమున నొనర్చియుండిన పౌరుషము. ఐహిక మన నీ జన్మంబున జేసెడు ప్రయత్నము. వానిలో నైహికము ప్రాక్తనపౌరుషమును జయించును.

**ప్రవృత్తిరేవ ప్రథమం యథాశాస్త్రవిహారిణామ్ ।**
**ప్రభేవ వర్ణభేదానాం సాధనీ సర్వకర్మణామ్ ॥**

వర్ణభేదంబు గన్గొనుటకు వెలు గత్యావశ్యకం బగునట్లు సకల కర్మంబులకు శాస్త్రానుసారమైన ప్రవృత్తి యావశ్యకంబైన మొదటి సాధనము.

**యథా సంయత్యతే యేన తథా తేనానుభూయతే ।**
**స్వకర్మైవేతి చాస్తేఽన్యా వ్యతిరిక్తా న దైవదృక్ ॥**

ఏనరు డేకర్జంబు నేతీరున నొనర్చు నన్నరునిచే నక్కార్యఫల మాతీరుననే యనుభవింపబడును. ఇట్లు సమస్తమును పౌరుషమున జేరినదియేగాని, దైవమనునది ప్రత్యేకముగా కర్మమున కన్యముగా లేదు.

ద్వౌ హుడావివ యుధ్యేతే పురుషార్థౌ పరస్పరమ్ ।
ప్రాక్తన శ్చైహికశ్చేతి శ్యామ్యత్యత్రాల్పవీర్యవాన్ ॥

రామభద్రా! ఆ ప్రాక్తన ఐహికపౌరుషంబులు రెండును రెండు మేకపోతులవలె జగడం బొనర్చుచుండును. వానియందేది అధికశక్తిమంతం బగు నది జయము జేకొనును.

అనర్థః ప్రాప్యతే యత్ర శాస్త్రితాదపి పౌరుషాత్ ।
అనర్థకర్తృ బలవత్త త్ర్పజ్ఞేయం స్వపౌరుషమ్ ॥

ఇట్లు శాస్త్రానుసారమైన పౌరుషమొనరించుచుండిన నొకప్పుడు అనర్థము సంభవించెనేని యిప్పటి పురుషకారము దుర్బలమైనదనియు, జన్మాంతరీయ దుష్కర్మ ప్రబలమైనదనియు తెలియదగినది.

పరం పౌరుష మాశ్రిత్య దంతైర్దంతాన్ విచూర్ణయన్ ।
శుభేనాశుభముద్యుక్తం ప్రాక్తనం పౌరుషం జయేత్ ॥

అత్తరి మనప్రయత్నము చాలదని యెంచి సర్వోత్తమమైన పురుషకారము జేకొని దంతఘర్షణము జేయుచు పట్టుబట్టి ప్రాక్తన పౌరుషము నణగజేయవలయును.

ప్రాక్తనః పురుషోర్థో౽సౌమాం నియోజయతీతి ధీః ।
బలాదధస్పదీకార్యా ప్రత్యక్షా దధికా న సా ॥

ప్రత్యక్షంబగు నైహికమునకంటె ప్రాక్తనకర్మ మెన్నటికి మిన్న యగునది కాదు. కావున పురుషుడు ప్రాక్తనకర్మంబు సర్వవిషయములందును నన్నిట్లు నియోగించును అను బుద్ధిని ఖండించి విడువదగును.

తావత్తావత్ప్రయత్నేన యతితవ్యం సుపౌరుషమ్ ।
ప్రాక్తనం పౌరుషం యావ దశుభం శామ్యతి స్వయమ్ ॥

అట్లు విడిచి జన్మాంతరీయమగు దుష్కర్మవాసన నాశమొందువరకు పట్టిన ప్రయత్నము విడువక కడవరకు నొకమనంబుననే పౌరుష మొనరించు

చుండినయెడల ప్రాక్తనకర్మము బలహీనమై తనకు తానే శమించును.

న గంతవ్య మనుద్యోగై స్సామ్యం పురుషగర్దభైః ।
ఉద్యోగస్తు యథాశాస్త్రం లోకద్వితయసిద్ధయే ॥

శాస్త్రమార్గము నతిక్రమించక చేసిన యుద్యోగము ఐహికాముష్మిక ఫలదాయి గావున కేవల దైవావలంబులై యుద్యోగహీనులైన గాడిదలవంటి పురుషుల బోలుట యుచితము గాదు.

శుభేన పౌరుషేణాశు శుభమాసాద్యతే ఫలమ్ ।
అశుభేనాశుభం నిత్యం దైవం నామ న కించన ॥

ప్రపంచమున శుభమైన పౌరుషమువలన శుభఫలమును, అశుభమైన పౌరుషమువలన నశుభఫలమును లభించునుగాని, దైవమను పదార్థం బెద్దియు కర్మమున కన్యముగా లేదు. అనగా కర్మానుగుణముగా దైవము సాక్షిగా నుండి ఫలము నిచ్చుచుండును.

స చ సచ్ఛాస్త్ర సత్సంగ సదాచారై ర్నిజం ఫలమ్ ।
దదాతీతి స్వభావోఽయ మన్యథా నార్థసిద్ధయే ॥

అట్టి నియమముగల పౌరుషము సచ్ఛాస్త్ర సత్సహవాస సదాచారములచేత దనకనుగుణమగు ఫలం బొసంగును. త్రిత్రికరణ విహీనమగు పౌరుషము ఫలకారి కానేరదు. ఇదియే పౌరుషస్వభావము.

తజ్జయాయ యతంతే యే న లోభ లవలంపటాః ।
తే దీనాః ప్రాకృతా మూఢా స్థితా దైవపరాయణాః ॥

ఎవ్వారలు ప్రాక్తన పౌరుష జయము కొరకు ప్రయత్నింపక విషయాసక్తులై యుండెదరో, దైవపరాయణులైన యట్టివారు దీనులై ప్రాకృతులై మూఢులై యుండెదరు.

క్రమేణోపార్జితేఽప్యర్థే నష్టే కార్యా న ఖేదితా ।
న బలం యత్ర మే శక్తం తత్ర కా పరివేదనా? ॥

శాస్త్రక్రమమున నార్జించిన యర్థము వ్యర్థమయ్యేనేని దానికొరకు చింతింపరాదు. మన ప్రయత్నమునకు మించియుండు దానింగూర్చి వ్యసనమెందుకు?

**ఈశ్వరప్రేరితో గచ్ఛేత్ స్వర్గం నరకమేవ వా ।**
**స సదైవ పరాధీనః పశురేవ న సంశయః ॥**

జన్మాంతర కర్మమున్నట్లు స్వర్గసుఖమైనను, నరకదుఃఖమైనను పరమేశ్వరుడిచ్చునని యైహికపౌరుష ముపయోగించక పరాధీనుడైయుండు నరుండు పశువే యనుటకు సందియము లేదు.

**యే సముద్యోగ ముత్సృజ్య స్థితా దైవపరాయణాః ।**
**తే ధర్మమర్థం కామం చ నాశయంత్యాత్మవిద్విషః ॥**

అట్లు జన్మరాహిత్యము గలుగజేసెడు సముద్యోగము చేయక ఎవ్వరు దైవమిచ్చునని తలంచి యుందురో వారు తమకు తామే శత్రువులై ధర్మార్థకామముల పాడుచేసుకొనెదరు. మోక్షశబ్దము వీరికి దూరస్థము నిత్యసుఖసందాయకములగు పురుషార్థముల నిట్లు దమకు దామే పోగొట్టుకొనియెడువారు ప్రస్తావనార్హులు కారు.

**ప్రత్యక్ష ప్రముఖై ర్నిత్యం ప్రమాణైః పౌరుషక్రమః ।**
**ఫలితో దృశ్యతే లోకే దేశాంతరగమాదికః ॥**

ప్రత్యక్షము, అనుమానము, శబ్దము అనియెడు మూడు విధములగు ప్రమాణములచేత ఈ పౌరుషమే ఫలదాయకమని నిశ్చయింపవచ్చును. ఎట్లన? అడుగుపెట్టక నడుచుటకును, నోరువిడక మాటలాడుటకును గానేరదు గాన, ప్రత్యక్ష ప్రమాణము అనుమానము ననుసరించి అత్యుత్తమమైన ఫలము ననుభవించుచుండు మహాత్ముల గని వీరు బహు ప్రయత్నముచే నిప్పదవిని బొందియున్నారని యోచించెదము. చూడకున్నను శబ్దరూపములగు సచ్ఛాస్త్రములు పురుషుని గురించి ధర్మమార్గ ముపదేశించును.

అయ్యుపదేశము ''సత్యం వద'' ''ధర్మం చర'' ''నానృతం బ్రూయాత్'' అనునవి విధి వాక్యరూపముగా నుండును. పురుషుని దైవమే యాయాకాలమున కర్మానుగుణముగా ప్రేరేపించి తదనుగుణంబుగ శుభాశుభంబుల నొసంగునట్లైన నవ్విధివాక్యంబులు వ్యర్థము లగును గదా!

**నాకృతిర్న చ కర్మాణి న స్పందో న పరాక్రమః ।**
**తన్మిథ్యాజ్ఞానవద్రూఢం దైవం నామ కిముచ్యతే ॥**

దైవమనుదాని కేయవస్థయైనను, రూపమైనను, కర్మములైనను, చలనమైనను, పరాక్రమమైనను తన కర్మమున కన్యముగా లేదు. శశవిషాణమను శబ్దము రూఢమైయున్నట్లు దైవ శబ్దము కర్మకు అన్యముగా మిథ్యాజ్ఞాన జనకమై యున్నది.

స్వకర్మ ఫలసంప్రాప్తా విద మిత్థ మితీతి యాః ।
గిరస్తా దైవనామ్నైతాః ప్రసిద్ధిం సముపాగతాః ॥

తానొనర్చునెల్ల కర్మములవలన బడయు ఫలంబులను గురించి చెప్పబడు పలుకులు దైవమను పేర ప్రసిద్ధములై యున్నవి.

**తత్రైవ మూఢమతిభిః దైవమస్తీతి నిశ్చయః ।**
**ఆత్తో దురవబోధేవ రజ్జ్వామివ భుజంగమః ॥**

రజ్జువుంగని సర్పమని భ్రమించురీతి మూఢులగు కొందరు దైవమొక్క నిశ్చితపదార్థమని యజ్ఞానముచే విశ్వసించి స్వప్రయత్న దూరులై చెడుదురు.

**దైవేన త్వభియుక్తోఽహం తత్కరోమీదృశం స్థితమ్ ।**
**సమాశ్వాసన వాగేషా న దైవం పరమార్థతః ॥**

నాయదృష్టమున్నట్లు నేను సుఖదుఃఖముల ననుభవించెదను అని యిట్లు పలికిన నుడువులన్నియును, తానేదైన దుఃఖములను బొందియున్నపుడు తన మనస్సుకు సమాధానము గలుగజేకొనెడు కొరకును, మరి యొకడు వ్యసనగ్రస్తుడై యున్నప్పుడు వాని మనస్సునకు సమాధానము గలుగజేసెడి

కొరకును చెప్పందగు మాటలేగాని పరమార్థంబు గాదని విశ్వసింపవలయును.

**కాలవిద్భిర్వినిర్ణీతం పాండిత్యం యస్య రాఘవ ।**
**అనధ్యాపిత ఏవాసౌ తద్జ్ఞశ్చై ద్దైవముత్తమమ్ ॥**

ఓయి రఘునందనా! కాలజ్ఞు లెవ్వానిం గని, వీనికి సర్వోత్తమమైన పాండిత్యము గల్గునని చెప్పెదరో, వాని నెవ్వరైనను శిక్షింపకయే వాడును విద్యాభ్యాసమొనర్చకయే యుండి తానై దివ్యపాండిత్యము సంప్రాప్తం బయినప్పుడు దైవమే ముఖ్యకారణమని నమ్మవచ్చును.

**విశ్వామిత్రేణ మునినా దైవముత్సృజ్య దూరతః ।**
**పౌరుషేణైవ సంప్రాప్తం బ్రాహ్మణ్యం రామ ! నాన్యథా ॥**

ఓయి రామచంద్రా! ఈ విశ్వామిత్ర మునివరుడు దైవంబును దూరముగా విడిచి పౌరుషమొనర్చియే బ్రాహ్మణత్వము సంపాదించెనుగాని వేరు లేదు.

**పౌరుషం సర్వకార్యాణాం కర్తృ రాఘవ ! నేతరత్ ।**
**ఫలభోక్తృ చ సర్వత్ర న దైవం తత్ర కారణమ్ ॥**

సమస్త కార్యంబులకును పౌరుషంబే కర్తగాని యన్యంబు గాదు. తత్కర్మఫలము ననుభవించునదియు పౌరుషం గాని దైవము గాదు.

**సిద్ధస్య పౌరుషేణేహ ఫలస్య ఫలశాలినా ।**
**శుభాశుభార్థ సంపత్తి ర్దైవశబ్దేన కథ్యతే ॥**

పురుషుండొనర్చు పౌరుషము ఫలించుటవలననైన, శుభాశుభ ఫలప్రాప్తికి దైవవాదులు దైవమనుపేరు గల్పించుకొనియున్నారు. ఇంతియేగాని వేరుగా తన కర్మమున కన్యముగా దైవము లేదు.

**యా మనోవాసనా పూర్వం బభూవ కిల భూరిశః ।**
**సై వేయం కర్మభావేన నృణాం పరిణతిం గతా ॥**

ప్రాణులయొక్క మనంబున నిలిచియుండి యిప్పుడు ఫలోన్ముఖము

లగుచు నుండెడు నానావిధములగు పూర్వజన్మవాసనలే జన్మాంతర కర్మమని చెప్పంబడును.

**ఏవం కర్మస్థ కర్మాణి కర్మప్రౌఢా స్వవాసనా ।**
**వాసనా మనసో నాన్యా మనో హి పురుషః స్మృతః ॥**

ఇట్లెవ్వరు కర్మముల నొనరించి యుండెదరో వారివారి కర్మము లప్పటి పుట్టుపున ఫలదాయకములుగా నుండును. ఆ కర్మమే వాసన యనబడును. ఆ వాసన మనంబునకంటె భిన్నమైనది కాదు. మనస్సే పురుషుడని చెప్పబడినది.

**మనశ్చిత్తం వాసనా చ కర్మ దైవం చ నిశ్చయః ।**
**రామ! దుర్నిశ్చయస్యైతా స్సంజ్ఞా సద్భిరుదాహృతాః॥**

అయిన నీమనం బను పదార్థం బొక్కొక్క కాలమున నొక్కొక్కవికారమునకు లోబడియుండుటచేత దీనిస్వరూపము నిరూపింప నసాధ్యము కావుననే, దీనికి మనంబనియు, జిత్తమనియు, వాసన యనియు,దైవమనియు, నానాప్రకారములైన నామము బ్రాజ్ఞు లుంచియున్నారు.

**ఏవం పురుషకారేణ సర్వమేవ రఘూద్వహ! ।**
**ప్రాప్యతే నేతరేణేహ తస్మాత్స శుభదోఽస్తు తే ॥**

ఇట్లు పురుషప్రయత్నమువలననే సమస్తము పొందనగునుగాని వేరు లేదు. కావున నోరఘూద్వహా! శుభఫలప్రదమైన యా పురుషకారంబును నీవు నిరంతర మొనర్చు నుండవలెను. అయ్యది నీకు శుభకారి యగుగాత! యనిన రామచంద్రు డిట్లనియె.

**ప్రాక్తనం వాసనాజాలం నియోజయతి మాం యథా ।**
**మునే తథైవ తిష్ఠామి కృపణః కిం కరోమ్యహమ్ ? ॥**

ఓ మునివర్యా! పూర్వజన్మవాసన నన్ను ఎట్లు నియోజించునో, అట్లా యా కర్మములొనర్చుచు వాసనకధీనుఁడనైయున్నాను. దీనుడనైన నేనేమి చేయగలను?

వసిష్ఠుడు :-

**అత ఏవ హి రామ త్వం శ్రేయః ప్రాప్నోషి శాశ్వతమ్ ।**
**స్వప్రయత్నోపనీతేన పౌరుషేణైవ నాన్యథా ॥**

ఓయి రామచంద్రా! నీవు జన్మాంతరముల నొనరించిన కర్మముల సంస్కారమే వాసన యనంబడెనుగదా! అట్టి కర్మములు లేకుండిన వాసన యెట్లు పుట్టును? కాన పురుషకారమువలననే నీకు శాశ్వతశ్రేయము లభించును.

**ద్వివిధో వాసనావ్యూహః శుభశ్చైవాశుభశ్చ తే ।**
**ప్రాక్తనో విద్యతే రామ! ద్వయోరేకతరోఽథవా ॥**

వాసనాసముదాయము శుభ మనియు, నశుభమనియు రెండుతెగలు గలది. నీ ప్రాక్తన కర్మమును వానిలో నొకటియై యుండును.

**వాసనౌఘేన శుద్ధేన తత్ర చే దద్య నీయసే ।**
**తత్క్రమేణ శుభేనైవ పదం ప్రాప్స్యసి శాశ్వతమ్ ॥**

అయ్యది శుభవాసనగానుండి దానిచేత నిప్పుడు నియోగింపబడితివేని యిప్పుడు నట్టి శుభకర్మములను హెచ్చించుచు వచ్చిన యెడల శాశ్వతపదము బొందగలవు.

**అథ చే దశుభో భావస్త్వాం యోజయతి సఙ్కటే ।**
**ప్రాక్తనస్తదసౌ యత్నా జ్జేతవ్యో భవతా బలాత్ ॥**

అట్లు లేక యశుభవాసన నిన్నాక్రమించి సంకటమున నియోగించునేని యప్పుడు నీవు బలమైన పురుషకారముచేత శుభకర్మముల నొనర్చి యయ్యశుభవాసనను జయింపవలెను.

**ప్రాజ్ఞ శ్చేతన మాత్రస్త్వం న దేహస్త్వం జడాత్మకః ।**
**అన్యేన చేతసా తత్తే చేత్యత్వం క్వేవ విద్యతే? ॥**

ప్రాజ్ఞుడవైన నీవు చైతన్యపదార్థమవే కాని జడమైన దేహమవు కావు. కేవల చైతన్యస్వరూపుడవగు నిన్ను మరియొక పదార్థము ప్రేరేపించు టెట్లు?

అన్యస్త్వాం చేతయతిచేత్తం చేతయతి కో ఽపరః? ।
క ఇమం చేతయే త్తస్మా దనవస్థా న వాస్తవీ ॥

అట్లు నిన్ను ప్రేరేపించు పదార్థ మొక్కటి గలదేని యా పదార్థమును బ్రేరేపించు పదార్థ మెద్ది ? ఇత్తెరంగున అనవస్థా ప్రసంగమగును. ఇట్టి యనవస్థ తుదముట్టనిది.

అవ్యుత్పన్నమనా యావ ద్భవానజ్ఞాతతత్పదః ।
గురుశాస్త్ర ప్రమాణైస్తు నిర్ణీతం తావదాచర ॥

అయినను నీవు ఏ కార్యముల నొనరించవలయునో, యా కార్యముల తెలియుట సులభము గాదు. తెల్వి గల్గెడివరకు సదాచారసంపన్నులైన మన పూర్వికు లెవ్విధమున పనుల నొ నర్చుచుండిరో, శాస్త్రము లెవ్వానిం బోధించునో వాని చేకొని యాచరింపుము. పౌరుషముచే శ్రేయము బొందుము.

మరియు శ్రీ జ్ఞానవాసిష్ఠమున ముముక్షుప్రకరణమందు ఈ లాగున కనుపించుచున్నది.

శ్రీ వసిష్ఠ ఉవాచ -

సర్వదా సర్వమేవేహ సంసారే రఘునందన ।
సమ్యక్ప్రయుక్తాత్సర్వేణ పౌరుషా త్సమవాప్యతే ॥

దాశరథీ! ఈ సంసారమునందు ఎపుడును అందఱిచేతను లెస్సగా ప్రయోగించబడిన పురుషప్రయత్నమువలన సమస్తంబును పొందబడును.

ఉచ్ఛాస్త్రం శాస్త్రితం చేతి ద్వివిధం పౌరుషం స్మృతమ్ ।
తత్రోచ్ఛాస్త్ర మనర్థాయ పరమార్థాయ శాస్త్రితమ్ ॥

శాస్త్రము నతిక్రమించినదియు, శాస్త్రము ననుసరించినదియునని పురుషకారము రెండు విధముల చెప్పబడును. అందు శాస్త్రము నతిక్రమించినది అనర్థము కొఱకును, శాస్త్రము ననుసరించినది పరమపురుషార్థము కొఱకును సాధకమగును.

**ఆబాల్యాదల మభ్యస్తై శ్శాస్త్రసత్సంగమాదిభిః ।**
**గుణైః పురుషయత్నేన స్వార్థ స్సంప్రాప్యతే యతః ॥**

బాల్యమునుండి అభ్యసింపబడునట్టి సచ్ఛాస్త్రము, సత్సాంగత్యము, సత్యధర్మానుష్ఠానము, సత్ప్రయత్నములు మొదలగు సుగుణములతో గూడిన పురుషప్రయత్నముచేత ఇష్టమగు పురుషార్థము పొందనగును.

**శుభాశుభాభ్యాం మార్గాభ్యాం వహంతీ వాసనాసరిత్ ।**
**పౌరుషేణ ప్రయత్నేన యోజనీయా శుభే పథి ॥**

మంచి చెడులను రెండుమార్గములచే ప్రవహించునట్టి వాసన యను నదిని, పురుషప్రయత్నముచేత చెడుమార్గమునుండి తప్పించి మంచిమార్గమునందు నడిపింపవలయును.

ఈ శ్లోకవముచే ప్రవాహ వేగవమునకు లోబడిపోయెడు నావను, ప్రయత్నముతో చుక్కాను, తెడ్లు మొదలగు యంత్రముల సహాయముచేత ఏలాగున చక్కనిమార్గములో నడిపి నిశ్చితస్థానమును చేరుదురో, ఆలాగున అశుభవాసనావశమై పోయెడు మనస్సును, సుబుద్ధిచేతను, ఆచార్యోపదేశముచేతను, సచ్ఛాస్త్రవిచారణచేతను, విషయవాసనా ప్రవాహవేగమునుండి తప్పించువారు నిర్దిష్టఫలమును పొందగల్గుదురు. చుక్కాను, తెడ్లు మొదలైన సహాయములు లేనివారు ప్రవాహవేగమునకు లోబడి సముద్రములో ప్రవేశించి అపాయమును బొందునట్లు గురు, దైవ, శాస్త్రములయందు నిష్ఠ లేనివారు పురుషప్రయత్న రహితులైనందుచే కర్మమునకు బద్ధులై దుఃఖము నొందుదురు. శ్రీవసిష్ఠభగవానులు ఉపదేశించు ఈ యొక్క శ్లోకమే ముముక్షువులకు చాలును, కనుకనే దీనికి ముముక్షు ప్రకరణమని పేరు గల్గినది.

**అశుభేషు సమావిష్టం శుభేష్వేవా ఉవతారయేత్ ।**
**స్వం మనః పురుషార్థేన బలేన బలినాం వర!॥**

బలవంతులలోన శ్రేష్ఠుడవగు శ్రీరామచంద్రా! చెడు పనులయందు

ప్రవేశించిన తనదు మనసును పురుషప్రయత్నముచేత మంచిపనులయందు ప్రవేశపెట్టవలయును.

**అశుభాచ్చాలితం యాతి శుభం తస్మాదపీతరత్ ।**
**జంతో శ్చిత్తం హి శిశువత్ తస్మాత్తచ్చాలయే ద్బలాత్ ॥**

బాలకుడు ఒక వస్తువు నుండి తొలగింప, ఇంకొక వస్తువు పైకి పోవునట్లు ప్రాణియొక్క మనస్సు చెడుపని నుండి తొలగించెనేని మంచి పనిని, మంచి పని నుండి తొలగించెనేని చెడుపనిని పూను చుండును. కావున పురుష ప్రయత్నముచే మంచి పని నుండి మనసును తొలగనీయక ప్రవర్తించేలాగున చూడవలయును.

ఓయి మనస్సను చిన్నవాడా! పేరు చేతను, అర్థము చేతను విషయము కంటె నెక్కుడైన విషయముల జోలికి పోవకుము, సుఖ దుఃఖముల యందు సమదృష్టి గలిగియుండుము అని వేగిరపడక మెల్ల మెల్లగా పురుష ప్రయత్నముచే బ్రతిమాలుచు మనస్సను బాలకుని ఊఅడింప నగును.

ప్రాగభ్యాస వశాజ్జాతో యదా తే వాసనోదయః ।
తదాఽభ్యాసస్య సాఫల్యం విద్ధి త్వ మరిమర్దన ॥

శత్రువుల నశింపజేయునట్టి శ్రీరామచంద్రా! ఎపుడు నీకు తొల్లింటి యభ్యాసవశమువలన అశుభవాసనకంటె శుభవాసన అభివృద్ధినొందునో అప్పుడు అభ్యాసము సఫలమాయె నని తలంపుము.

కర్మ విషయమై ఒక పరమరహస్యము గలదు. అదేమన ఇప్పుడు ఏ కర్మ ప్రవర్తమానమై యుండునో, దానికి ప్రతి నిమిషమును అనుభవముచేత తరిగిపోయెడు స్వభావము గలదు. ప్రయత్నపరముగా చేసెడు ధర్మపరమగు కర్మమునకు పెరిగెడు స్వభావము గలదు. శుక్లపక్ష చంద్రుడు దినదినాభివృద్ధి పొంది రాగారాగా చీకటి యేలాగున క్షయము నొందుచుండునో, ఆలాగున దృఢ ప్రయత్నముతో అనుష్ఠించు నిష్ఠ బలపడిరాగా కర్మము నష్టమై పోవును.

సందిగ్ధాయామపి భృశం శుభామేవ సమాహర ।
శుభాయాం వాసనావృద్ధౌ తాత! దోషో న కశ్చన ॥

శుభవాసన, అశుభవాసన యీ రెండింటిలో ఎచ్చు తగ్గులు తెలియకున్నను శుభవాసననే మిగుల నభ్యసింపుము. శుభవాసన అభివృద్ధి నొందినందున ఎట్టి దోషమును ఉండనేరదు.

**అవ్యుత్పన్నమనా యావ ద్భవానజ్ఞాతతత్పదః ।**
**గురుశాస్త్ర ప్రమాణైస్తు నిర్ణీతం తావదాచర ॥**

ఎంతవరకు నీవు చిత్తశుద్ధిలేక బ్రహ్మవస్తువును తెలిసికొనజాలకుందువో, అంతవరకు గురువులచేతను, శాస్త్రప్రమాణముల చేతను నిర్ణయింపబడిన ధర్మమును చేయుచుండుము.

**తండులస్య యథా చర్మ యథా తామ్రస్య కాలిమా ।**
**నశ్యతి క్రియయా పుత్ర! పురుషస్య తథా మలః ॥**

స్వాభావికమగు మలము పురుషప్రయత్నముచేత నెటుల బోవునంటివేని వినుము. తండులము (బియ్యము) యొక్క పై నున్న పొట్టు దంపడము మొదలగువానిచేత నెట్లు పోవుచున్నదో, పులుపు మొదలగు రసములచే రాగియొక్క చిలువము ఎట్లు పోవుచున్నదో, లేక రసవాద విద్యచే తామ్రమువేలాగున సువర్ణమగుచుండునో, అట్లు యోగము, జ్ఞానము మొదలగు క్రియలచేత పురుషునియొక్క అజ్ఞాన రూపంబగు మలమును పోవుచున్నది.

**జీవస్య తండులస్యేవ మలం సహజమప్యలమ్ ।**
**నశ్యత్యేష న సందేహ స్తస్మాదుద్యమవాన్భవ ॥**

పుత్రా! జీవునియొక్క మలము సహజసిద్ధంబైనను, తండులముయొక్క తవుడు దంపడమువల్ల ఎట్లు నశించుచుండునో, ఆలాగున పురుషప్రయత్న పరమగు ధ్యాన జ్ఞానములచేత పురుషుని యొక్క మాయామలముగూడ నశించుచున్నది. కావున ప్రయత్నవంతుడవు గమ్ము.

**అవిద్యాం శ్లేష్మయా శ్లేష్మః క్షాళయన్నేవ తిష్ఠతి ।**
**మలం మలేనాపహర న్యుక్తిజ్ఞో రజకో యథా ॥**

ఉపాయజ్ఞుడగు చాకలివాడు వస్త్ర గతమగు మలమును చవుడు మొదలగు మలము చేతనే పోగొట్టునటుల శ్రేష్ఠుండు శుద్ధసత్త్వజన్యముగాన నుత్కృష్టమును, విమలవాసనారూపమునగు విద్యచే మలవాసనారూపం బగు నవిద్యను క్షాళనము చేయుచునే ఉన్నాడు.

న శాస్త్రేణాపి గురుణా దృశ్యతే పరమేశ్వరః ।
దృశ్యతే స్వాత్మనైవాత్మా స్వయా సత్త్వస్థయా ధియా ॥

ఆత్మవస్తువు, శాస్త్రముచేతగాని, గురువుచేతగాని మీ యొక్క ప్రయత్నపూర్వపరమగు శ్రద్ధ లేనిచో చూడ శక్యము గానేరదు. మఱియు తన ప్రయత్నము చేతనే సత్వగుణనిష్ఠమగు బుద్ధి చేతనే చూడ సాధ్యపడుచుండును.

క్షీణవాసనయా బుద్ధ్యా కర్మ యత్క్రియతేఽనఘ ।
తద్దగ్ధ బీజవద్భూయో నాంకురం ప్రవిముంచతి ॥

ఏకర్మము బ్రహ్మనిష్ఠులచే వాసనారహితమగు బుద్ధితో చేయబడునో, ఆకర్మము పొరిటిపోయిన విత్తనములవలె తిరిగి సుఖ దుఃఖరూపమగు నంకురమును గలిగింపదు. బ్రహ్మనిష్ఠుల కర్మ యీలాగున నుండును. బ్రహ్మబుద్ధిలేనివారి కర్మ పచ్చివిత్తనమున పైరు పెట్టే లాగున నుండును.

కర్తవ్య మాచరన్కామ మకర్తవ్య మనాచరన్ ।
తిష్ఠతి ప్రకృతాచారో యస్స ఆర్య ఇతి స్మృతః ॥

ఎవడు చేయనగు దానిని చేయుచు, చేయతగని దానిని చేయకయు, ఆవశ్యక కర్మాచరణపరుడై యుండునో వాడు ఆర్యుడని చెప్పబడుచున్నాడు. అనగా పురుషులచే ఏ ధర్మము చేయందగినదని శాస్త్రనిర్ణీతముగానుండునో, అట్టిదానిని చేయువాడే ఆర్యుడనంబడును.

భూమిః ప్రోదితమాత్రాంత రమ్ఫుతాంకురికేవ సా ।
వివేకేనాంబుసేకేన రక్ష్యా పాల్యా ప్రయత్నతః ॥

యేనాఽంశేనోల్లసత్యేషా విచారేణోదయం నయేత్ ।
తమేవానుదినం యత్నాత్కృషీవల ఇవాఽంకురమ్ ॥

జ్ఞానభూమిక యగు శుభేచ్ఛ కలిగినంతమాత్రమున దానిని అమృతాంకురమునుబోలె వివేకజ్ఞాన మను జలసేకంబుచే రక్షించుచు ప్రయత్నముచే కాపాడవలయును.

ఈ జ్ఞానభూమిక యే యంశముచే ప్రకాశించునో, ఆ యంశమును యత్నముతో ప్రతిదినంబును కృషీవలుడు సస్యములనువలె వృద్ధినొందింప వలయును. అనగా చిన్నమొక్కను ఎరువు, జలములచే కర్షకుడు ఏలాగున పెంచుచుండునో, ఆలాగున విజ్ఞాన ముదయ మయినను, భక్తివైరాగ్యబోధలచే వృద్ధిపరచుచుండవలయును.

య ఏవ యత్నః క్రియతే బాహ్యార్థోపార్జనే జనైః ।
స ఏవ యత్నః కర్తవ్యః పూర్వం ప్రజ్ఞా వివృద్ధయే ॥

ఏలాగున సకలజనులును ప్రపంచ ధనార్జనవిషయమై యెట్టి ప్రయత్నము చేయుచుందురో, అట్టి యత్నమును ముముక్షువులైనవారు మొదట ప్రజ్ఞాభివృద్ధికొరకు చేయవలెను.

సీమానం సర్వదుఃఖానా మాపదాం కోశముత్తమమ్ ।
బీజం సంసార వృక్షాణాం ప్రజ్ఞామాంద్యం వినాశయేత్ ॥

సకల దుఃఖములకు పొలిమేర అయినట్టియు, ఆపదలకు నివాసంబైనట్టియు, సంసారవృక్షములకు బీజమైనట్టిదియునగు బుద్ధిమాంద్యమును ప్రయత్నపూర్వకముగా నశింపచేయువలయును. ఈ బుద్ధిమాంద్యమునకే ఆలస్యమనియు, సోమరితన మనియు, అశ్రద్ధ యనియు పేర్లు. ఇది అన్ని ఆపత్తులకు కారణమైనది.

ఉభాభ్యామేవ పక్షాభ్యాం యథా ఖే పక్షిణాం గతిః ।
తథైవ జ్ఞానకర్మభ్యాం జాయతే పరమంపదమ్ ।

ఏలాగున పక్షులకు ఆకాశమున సుఖముగా సంచరించుటకు రెండు పక్షములు అవసరమో, ఆలాగున జీవునికి పరమపదమును ప్రాప్తించుటకు బ్రహ్మజ్ఞాన మను పక్ష మొకటియు, నిష్కామ కర్మయోగానుష్ఠాన మను పక్షమొకటియు నుండవలయును.

ఇంతవరకు చెప్పబడినది శ్రీవసిష్ఠులు జ్ఞానవాసిష్ఠమున శ్రీరామచంద్రుల కుపదేశించిన విషయము.

**క్రియాయుక్తస్య సిద్ధస్స్యా దక్రియస్య కథం భవేత్ ।**
**న శాస్త్ర పాఠమాత్రేణ యోగసిద్ధిః ప్రజాయతే ॥**
**న వేషధారణం సిద్ధేః కారణం న చ తత్కథా ॥**

అనుష్ఠానము గలవానికి గలిగెడు సిద్ధి అనుష్ఠానము లేని వానికి ఏలాగున సిద్ధించును? అట్టి యోగసిద్ధి శాస్త్రపఠనమాత్రముచేతగాని, వేషధారణముచేతగాని, బాగుగ ఇతరులకు బోధించుటకు నేర్చుకొనుటచేత గాని లభింపదు. నిష్ఠగలవానికి మాత్రమే లభించును అని యోగశాస్త్రము.

**మలినో హి యథాఽఽదర్శో రూపాలోకస్య న క్షమః ।**
**తథాఽవిపక్వకరణ ఆత్మజ్ఞానస్య న క్షమః ॥**

మలినమైన అద్దములో నేలాగున తనరూపము కనపడదో, ఆలాగున పరిపక్వముకాని అంతఃకరణము గలవారికి తనలో తానై వెల్గుచుండు దైవ జ్ఞానము గోచరము గాదు అని మునిభావ బోధిని.

**ఆత్మా క్షేత్రజ్ఞ సంజ్ఞోఽయం సంయుక్తః ప్రాకృతైర్గుణైః ।**
**తైరేవ విగతశ్శుద్ధః పరమాత్మేతి గద్యతే ॥**

ఆత్మ యనియు, క్షేత్రజ్ఞుడనియు పేరుగల యీ ఆత్మ వస్తువు ప్రకృతి గుణములచేత బద్ధుడై జీవుడను పేరుగల్గి యుండును. అట్టి ప్రకృతికి సంబంధించిన త్రిగుణవయులనుండి బ్రహ్మ నిష్ఠానుష్ఠానవయుచే శుద్ధుడై వేరుపడునప్పుడు పరమాత్మయనియు, పరబ్రహ్మమనియు చెప్పబడుచుండును

అని విష్ణు పురాణము.

యథా సిద్ధ రసో లోహ త్రయం చైక ప్రకారతః ।
కుర్యాత్స్వర్ణం తథా భక్తి రథ చైవం గుణత్రయమ్ ॥

ఏలాగున సిద్ధరసము ఇనుము, రాగి, ఇత్తళి మొదలైన లోహములను ఒకేప్రకారమగు సువర్ణముగా చేయునో, ఆలాగున అచంచలమైన దైవ భక్తి జీవునియొక్క సత్త్వరజస్తమోగుణముల రహితమొనర్చి శుద్ధజ్ఞానస్వరూపునిగా చేయును అని యోగశాస్త్రము.

న సౌఖ్యాల్లభతే పుణ్యం కాయక్లేశాదవాప్యతే ।
మంథనేన యథా క్షీరాన్నవనీతం ప్రజాయతే ॥

మర్దనా దిక్షుదండానాం రసో యద్వత్ప్రజాయతే ।
తద్వచ్ఛరీర దండేన మహాధర్మః ప్రజాయతే ॥

ఎవడు సోమరితనముచే శరీర సుఖమును మాత్రము గోరుచుండునో, అట్టివానికి పుణ్యము లభింపదు. కాయక్లేశము సహించువానికే పుణ్యము లభించును. అదెట్లన, మథనము వినా క్షీరము నుండి నవనీతమేలాగున జనింపదో, మర్దనము లేనిచో చెరకు నుండి రసము జనింపదో, ఆలాగున శరీర పరిశ్రమ చేయనివానికి జ్ఞానము సిద్ధింపదు. కాయక్లేశమును సహించు స్వభావము గలవానికి దేహములో వెల్గుచుండు మహాధర్మ మను దైవము ప్రత్యక్షమగును అని పద్మపురాణము.

వాంఛంతి జన్మ మానుష్యం భువి దేవాశ్శతక్రతుః ।
చిద్విద్యాయాం పరోఽపాస్తో యతో నాన్యోఽధికారభాక్ ॥

ఇంద్రుడును, దేవతలు ఎప్పుడెప్పుడు భూలోకములో మనుష్యజన్మము లభించునో యని వాంఛించుచుందురు. ఏలన? బ్రహ్మ విద్యను సాధించి ముక్తిని బొందుటకు మనుష్య శరీరము తప్ప వేరు ఏ జన్మము నెత్తిన వారికిని సాధ్యపడదు. దేవతలు గూడ కామ్య కర్మఫల మనుభవించుట కొరకు స్వర్గలోకమును బొందియున్నారు. మనుష్యజన్మము దేవతలకన్న శ్రేష్ఠమైనదని శ్రీదత్తాత్రేయులవారు

వచించిరి. అట్టి మానవజన్మము దొరికియు, ధర్మనిరతులై యీశ్వరుని పొందక పోవుట ఏమి ఆశ్చర్యము! అట్టివాడు మేరుపర్వతాగ్రమునుండి యీశ్వరస్థానమగు కైలాసమును పొందక మోహముతో భూమిలోనికి దుమికినవాని వంటివాడని భావము.

అహింసా సత్యమస్తేయం శౌచమింద్రియ నిగ్రహః ।
దానం దమో దయా క్షాంతి స్సర్వేషాం ధర్మసాధనమ్ ॥

అహింస, సత్యము, దొంగిలింపక యుండుట, బాహ్యాభ్యంతరశుద్ధి, ఇంద్రియనిగ్రహము, దానము, బాహ్యేంద్రియములను స్వాధీనములోనుంచుట, ప్రాణికోట్లలో దయ, ఓరిమి అను ఈ ధర్మములు సర్వజనులకు సమానముగా అనుష్ఠేయములు. దీని వలన జనులకు ఊర్ధ్వలోకప్రాప్తి గల్గును అని యాజ్ఞవల్క్యు లుపదేశించిరి.

అంతస్సంగం బహిస్సంగ మాత్మసంగం పరిత్యజేత్ ।
సర్వసంగ నివృత్తాత్మా పశ్యేదాత్మాన మాత్మని ॥

ముముక్షువైనవాడు మొదట మనస్సు యొక్క బంధమును విడువవలయును. మరల బాహ్యప్రతిబంధములను విడిచిపెట్ట వలయును. తర్వాత ఆత్మబంధమగు మూలావిద్యను విడువవలయును. అనగా జీవోపాధిని నివృత్తింపచేయవలయును.

దీనియందు మొదట అంతస్సంగము విడిచిన తర్వాత బాహ్యసంగమును విడిచేలాగున ఉపదేశింపబడెను. దీనియందు గొప్ప రహస్యము గలదు. ఇప్పుడు సామాన్యముముక్షువులు బాహ్యసంబంధముల నన్నిటిని విడుచుచుందురే కాని, లోపల బాహ్యసంబంధులతోను, బాహ్యవృత్తులతోను గల సంబంధమును కలుగ జేసెడి మన స్సంకల్పమును విడుచుట లేదు. ఇట్టి కారణముచేతనే, నిర్వృతి నిష్ఠలో గలగకపోవుచున్నది. దీనియందు మూడు విధములగు త్యాగములు చెప్పబడెను. మొదటిది అంతరంగత్యాగము. తర్వాత బాహ్యత్యాగము. మూడవది ఆత్మత్యాగము. అనగా ధ్యాతను విడిచి ధ్యేయాకారస్థితిని

పొందవలయు ననుట.

**తిలమధ్యే యథా తైలం క్షీరమధ్యే యథా ఘృతమ్ ।**
**పుష్పమధ్యే యథా గంధః ఫలమధ్యే యథా రసః ॥**
**కాష్ఠాగ్నివత్ప్రకాశేత ఆకాశే వాయువచ్చరేత్ ।**

నువ్వులయందు నూనెవలెను, పాలయందు నేయివలెను పుష్పమునందు సుగంథమువలెను, ఫలమునందు రసమువలెను, కట్టెయందు నిప్పువలెను, ఆకసంబునందు గాలివలెను అన్నమయాది పంచకోశ దేహంబులందు ఆత్మ వ్యాపకమై యుండును.

ఈశ్లోకముచే పై జెప్పినట్లు ప్రయత్నము లేనిచో, ఎలాగున తిలము నుండియు తైలము వేరుజేయ సాధ్యపడదో, ఆలాగున యోగము చేతను, జ్ఞానముచేతను, ఆత్మను ప్రయత్నశీలురగు ముముక్షువులు వేరుపరచు కొనవలయును. ప్రయత్నహీనులకది సాధ్యము కాదు.

**నావార్థీ హి భవేత్తావత్ యావత్పారం న గచ్ఛతి ।**
**ఉత్తీర్ణే తు సరిత్పారే నావయా కిం ప్రయోజనమ్? ॥**

నదీతీరము చేరుటకు ఏలాగున ఓడ అవసరమో, ఆలాగున సంసార సాగరముయొక్క ఆవలియొడ్డు చేరువరకును మంచి అనుష్ఠాన మనెడు ఓడ ముముక్షువులకుండే తీరవలెను. చేరిన తర్వాత ఓడ అవసరము లేదు. ముందుగనే ఓడను అవలంబింపనివాడు ఏలాగున సముద్రమును దాటజాలడో, ఆలాగున అనుష్ఠానము లేని వాడు సంసారము దాటలేడు.

దాటినవానికి ఓడ అవసరములేదు గాని, దాటించెడు నావికుడు ఓడను సంరక్షించునట్లు కార్యగురువులు ముక్తిదశ బొందిన తర్వాత నియమములో శ్రద్ధనుంచరు. కారణగురువులు సదా ముముక్షువులను దాటించువారగుటచే తమకవసరము లేనప్పటికిని లోకము కొరకు నియమనిష్ఠలతో గూడియే యుందురు.

గ్రంథమభ్యస్య మేధావీ జ్ఞానవిజ్ఞానతత్పరః ।
పలాలమివ ధాన్యార్థీ త్యజేద్గ్రంథమశేషతః ॥

బుద్ధిమంతుడైనవాడు వేదాంతాదిశాస్త్రములను గురుముఖమున నభ్యసించి జ్ఞానసంపన్నుడును, విజ్ఞానసంపన్నుడును అయిన తర్వాత శాస్త్రబుద్ధిని గూడ విడువవలయును. అదెట్లన, ధాన్యమును గ్రహింప దలంచినవాడు పైరు పండించి ధాన్యమును తీసికొన్న తర్వాత గడ్డిని వదలు నట్లుండవలయును.

ఈ శ్లోకమున వ్యవసాయదారులు మొట్టమొదట అరటి చెట్లు, వరి, గోధుమ మొదలగు సస్యములను చక్కగా పోషించి ఫలమును తీసికొన్నతర్వాత చెట్లు, కసువు పారవేయుదురే గాని మొదటనే అవసరములేదని తలంచి విడిచిపెట్టిన ఫలము చేకూరదుగదా! ఆలాగున మొదటనే సద్గురుసేవయు, శాస్త్రపఠనమును, అవసరము లేదని విడిచిపెట్టువాడు ఆత్మజ్ఞానమును పొందజాలడు.

కనుకనే దీనియందు జ్ఞానమును విజ్ఞానమును గలుగవలయును అని యుపదేశించుటకు కారణము. జ్ఞానమనగా అనుష్ఠించవలసిన పద్ధతి, విజ్ఞానమనగా అపరోక్షసాక్షాత్కారజ్ఞానము. ఇదే సరియైన ఋషిపద్ధతి యని గ్రహించవలయును. శాస్త్రము గూడ వాసనాత్రయముతో గూడినదని కొందరు తలంతురు. అది వేదాంతశాస్త్రమునకు అన్యములైనవాటికి చెందును. వేదాంతశాస్త్రము నిర్వాసనను బోధించును.

ఉల్కాహస్తో యథా కశ్చిద్ద్రవ్యమాలోక్య తాం త్యజేత్ ।
జ్ఞానేన జ్ఞేయ మాలోక్య జ్ఞానం పశ్చాత్పరిత్యజేత్ ॥

కొఱవికట్టె (దీపము) చేతగలవాడు చీకటిలో నుండిన ద్రవ్యమును ఎత్తుకొనిన పిదప నెటుల దానిని వదలునో, ఆ విధమున జ్ఞానసాధనముచే జ్ఞేయమైన బ్రహ్మసాక్షాత్కారము గల్గిన పిదప సాధనమైన దృశ్యజ్ఞానమును గూడ వదలవచ్చును.

దీపము లేనిచో చీకటిలో నుండు వస్తువు ఎట్లు దొరకదో, ఆలాగున మంచి జ్ఞానానుష్ఠానము లేనిచో, జ్ఞేయమైన బ్రహ్మమును పొందజాలరు అని

శ్రీకృష్ణ భగవానులు ఉత్తరగీతయందు ఉపదేశించిరి. ఇదిన్ని ప్రయత్నమునే బోధించుచున్నది. నది దాటుటకును, ధాన్యమును సంపాదించుటకును, చీకటిలో నుండు వస్తువు గ్రహించుటకును ఏలాగున పురుషప్రయత్నము అవసరమో ఆత్మజ్ఞానమును అటువంటిదని గ్రహించవలెను.

**ప్రాప్తే జ్ఞానేన విజ్ఞానే జ్ఞేయే చ హృది సంస్థితే ।**
**లబ్ధశాన్తి పదే దేహీ న యోగో నైవ ధారణా ॥**

శాస్త్రము చేతనం, ఆచార్యోపదేశము చేతనం, తన యొక్క అనష్ఠానముచేతను, బ్రహ్మజ్ఞానము ప్రాప్తమగుచుండగా, జ్ఞేయమగు బ్రహ్మము హృదయంబున ప్రత్యక్షముగా భాసిల్లుచుండగా దేహోపాధిగల జీవుడు ఆవరణ రహితమై శాంతి పదమును బొందుచుండగా, తర్వాత యోగమును, ధారణయును అవసరము లేదు. అట్టిస్థితి గల్గువరకు ప్రయత్నముచే యోగధారణలను అభ్యసించుకొనవలెను అని ఉత్తరగీత.

ఇక ఈ విషయమై ముండకోపనిత్తునందు చెప్పినది చూడుడు.

**నాయమాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునా శ్రుతేన ।**
**యమేవైష వృణుతే తేన లభ్య స్తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వామ్॥**

అయం = ఈ ఆత్మస్వరూపము, ప్రవచనేన = వేదశాస్త్రాధ్యయనాధ్యాపనముల చేత, న లభ్యః = పొందశక్యమయినది కాదు, మేధయా = గ్రంథార్థధారణా శక్తిరూపమగు మేధచేత, న = (పొందశక్యమైనది) కాదు, బహునా= అనేకమైన, శ్రుతేన = శాస్త్రశ్రవణముచేతనైనను, న = (పొందశక్యమయినది) కాదు. ఏషః = ఈ విద్వాంసుడు, యం ఏవ = ఏ పరమాత్మను, వృణుతే = పొందుటకు ఇచ్ఛగొనుచున్నాడే, తేన = ఆ ఇచ్ఛచేతనే, లభ్యః = పొందదగినది, ఏషః = ఈ ఆత్మా = ఆత్మ, స్వాం = స్వకీయమైన, తనూం = స్వరూపమును (అవిద్యాచ్ఛాదితమగు తనస్వరూపమును) తస్య = వానికి, వివృణుతే = ప్రకాశింపచేయుచున్నది.

ఏ యాత్మతత్త్వముయొక్క ప్రాప్తియే, పరమపురుషార్థప్రాప్తి యని ఉపనిషత్తులందు చెప్పబడియున్నదో, అట్టి యాత్మతత్త్వము (దైవతత్త్వము)

ప్రవచనము (అనగా వేదశాస్త్రములను అత్యధికముగా చదువుటచేత) పొందుటకు శక్యము గాదు. అట్లే శాస్త్రములలోగల మేధాశక్తిచేత గూడ ఆత్మతత్త్వము పొందశక్యము గాదు. అత్యధికమైన శ్రుతము (శ్రుత మనగా వేదాంతశాస్త్ర శ్రవణము) చేత ఆత్మతత్త్వము పొందశక్యముగాదు. అట్లయిన యెడల ఆ యాత్మతత్త్వము దేనిచేత పొందుటకు సాధ్యమగునను ప్రశ్నమునకు సమాధానము చెప్పబడుచున్నది. ముముక్షువైన వాడు ఏ పరమాత్మను పొందవలెనని తీవ్రమగు కోరిక గలిగియుండునో, అట్టివరణవుచేతనే (అనగా నిరంతర బ్రహ్మానుసంధానముచేతనే) యీ పరమాత్మ లభ్యమగును. అట్టి వానికి ఈ ఆత్మయే, అనగా దైవస్వరూపవే, తనయొక్క నిజస్వరూపమును ప్రకాశింపచేయును. ఈ ఉపనిషత్తు మంత్రముచేతను, నిరంతర దైవప్రాప్తి పరమగు ధ్యానయోగవుచేతను ఈశ్వరప్రాప్తి గలుగునని చెప్పుటచే ఇదియును పురుషప్రయత్నమునే బోధించుచున్నది.

యతో నిర్విషయస్యాస్య మనసో ముక్తిరిష్యతే ।
తస్మాన్నిర్విషయం నిత్యం మనః కార్యం ముముక్షుణా ॥

ఏ కారణముచేత మనస్సుయొక్క నిర్విషయస్థితియే ముక్తియని చెప్పబడుచున్నదో, అట్టి కారణమువల్ల ముముక్షువైన వాడు నిరంతరము మనస్సున నిర్విషయస్థితి గలిగేలాగున ప్రయత్నము చేయుచుండవలెను. అట్టి నిర్విషయమైన మనస్సే బ్రహ్మసాక్షాత్కారజ్ఞానము గలుగజేసికొనుటలో సమర్థత గలది యగును.

తావదేవ నిరోద్ధవ్యం యావద్హృది గతం క్షయమ్ ।
ఏతద్జ్ఞానం చ మోక్షశ్చ శేషోఽన్యో గ్రంథవిస్తరః ॥

ఎంతవరకు అంతఃకరణములోగల దృశ్యవాసనలు నశింపలేదో, అంతవరకు ముముక్షువైనవాడు మనోనిరోధముకొరకు యోగముచేతను, జ్ఞానవుచేతను ప్రయత్నించవలయును. ఇదే గురువులచేతను, సచ్ఛాస్త్రములచేతను, తనయొక్క అనుష్ఠానముచేతను గ్రహింపవలసిన విషయము. నిర్విషయము బొందిన మనస్సు ధ్యాననిదిధ్యాసనాదులచే బ్రహ్మాకార వృత్తి

గలిగియుండుటయే మోక్షము. సమస్తశాస్త్రములయొక్క సారము ఇది యొక్కటియే. తక్కిన గ్రంథములన్నియు విస్తారముగా ఈ రహస్యమునే బోధించుచున్నవి. కనుక బ్రహ్మనిష్ఠులు గ్రహించవలసిన సారమిదియే అని అమృత బిందూపనిషత్తు.

మచ్చిత్తా మద్గతప్రాణా బోధయంతః పరస్పరమ్ ।
కథయంతశ్చ మాం నిత్యం తుష్యంతి చ రమంతి చ ॥

పరమభక్తులగు బ్రహ్మనిష్ఠులు, భగవదర్పిత చిత్తముగలవారై, భగవదర్పితప్రాణులై, భగవన్మహిమను ఎఱింగిన వారలై యొకరికొకరు చెప్పుకొనుచు, భగవద్ధ్యానామృతపానముచే సంతుష్టాంతఃకరణులై బ్రహ్మానందమనుభవించుచున్నారు.

ఈ శ్లోకముచే నిరంతరము బ్రహ్మనిష్ఠలో నుండునట్లే, భగవద్విషయములను ఇతరులకు బోధించుటయు, భక్తులు పరస్పరము భగవద్విషయమును గురించి చర్చించుటయు, భగద్విషయకార్యముల జేయుట అగును అని భగవద్వచనము.

తచ్చింతనం తత్కథన మన్యోన్యం తత్ప్రబోధనమ్ ।
ఏతదేకపరత్వం చ బ్రహ్మాభ్యాసం విదుర్బుధాః ॥

తచ్చింతనం = తత్ - ఆ ప్రత్యగ్బ్రహ్మ స్వరూపము యొక్క, చింతనం= చింతనమును, తత్కథనం = ఆ బ్రహ్మస్వరూప విషయసంభాషణమును, అన్యోన్యం = గురుశిష్యాది సంవాదద్వారా, తత్ప్రబోధనం = ఆ బ్రహ్మస్వరూప బోధనమును, ఏతదేక పర్వతం చ = ఏతత్ - ఈ ప్రత్యగాత్మయందు, ఏక = ముఖ్యమైన, పరత్వంచ = పరత్వబుద్ధియు, (అనగా చిత్తైకాగ్ర్యరూప నిదిధ్యాసనమగుట) బ్రహ్మాభ్యాసం = బ్రహ్మాభ్యాసమునుగా, బుధాః = బ్రహ్మవేత్తలు, విదుః = తెలిసికొనిరి.

ఆ ప్రత్యగ్బ్రహ్మస్వరూపమును చింతించుటయు, ఆ బ్రహ్మ స్వరూపమును గురించి భక్తులతో సంభాషించుటయు, ముముక్షువుల పరస్పర

సంవాదద్వారా, ఆ బ్రహ్మస్వరూపమును ప్రబోధము గలుగ చేసికొనుటయు (ఏతదేక పరత్వంబున) ఈ ప్రత్యగాత్మయందు చిత్తైకాగ్ర్యరూప నిదిధ్యాసంనంబును ఈ చెప్పబడిన విషయములను బ్రహ్మాభ్యాసమునుగా విద్వాంసులు తెలిసికొనిరి.

దీనిసార మేమన? మనస్సు విషయవృత్తిగా పరిణమింపక చేయుచుండు దైవ విషయ సంభాషణమును, దైవవిషయమును గుఱించి బోధించుటయు, దైవవిషయకార్యముల చేయుటయు బ్రహ్మనిష్ఠయే యగును.

ఇట్టి స్థితి గలుగనిచో బ్రహ్మనిష్ఠలో నుండినవారైనను, మనస్సు దృశ్యముపై ప్రసరించిన అది బ్రహ్మనిష్ఠ కాదు. ప్రకృతి నిష్ఠయే యగును. ఈ తత్త్వమును, బ్రహ్మనిష్ఠులు, జాగరూకులై సదా చూచుచుండవలయును అని శ్రీవిద్యారణ్య స్వాములవారు తృప్తిదీపమున నుపదేశించిరి. శ్రీభగద్గీతోపదేశమంతయు ఈ తత్త్వముపై ఆధారపడియే ప్రతిష్ఠితమై యున్నది. ఈ రహస్యము గ్రహింపకపోయినచో కేవలము మోసకారు లగుదురు.

ఇక యీ బ్రహ్మవిద్యయొక్క అధికారమును గఱించి చెప్పబడుచున్నది.

**బ్రాహ్మణైర్వా క్షత్రియైర్వా విడ్భిశ్శూద్రైశ్చ పంచమైః ।**
**వేద్య మద్వైత విజ్ఞానం చతురాశ్రమవాసిభిః ॥**

శమదమాదిగుణములు గలవారెవరైనను అనగా బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు, పంచములు వీరిలో నెవ్వరైనను బ్రహ్మచర్య గృహస్థ వానప్రస్థ సన్న్యాసాశ్రమములు గలవారిలో నెవ్వరైనను, స్త్రీలైనను సరియే, పై జెప్పిన గుణములు గలవారు బ్రహ్మజ్ఞానము నభ్యసించుట కర్హులగుదురు. ప్రతివారును సత్య ధర్మనిష్ఠులై యుండిన తెలిసికొనవచ్చు నని యభిప్రాయము.

అయితే పై జెప్పినవారిలో ఎవరెవరు బ్రహ్మజ్ఞానులైరో వారిని వినుడు.

**శుక జనక విదుర ధర్మవ్యాధాది సమస్తవర్ణ సంజనితైః ।**
**అభ్యస్తం జ్ఞానం తద్ద్వారా ప్రత్యక్షమోక్షవంతస్స్యుః ॥**

బ్రాహ్మణుడగు శుకయోగీంద్రుడును, క్షత్రియుడగు జనకుడును, వైశ్యుడగు తులాధారుడును, శూద్రుడగు విదురుడును, శూద్రులకు భిన్నుడగు ధర్మవ్యాధుడును, స్త్రీలలో గార్గి, మైత్రేయి, సులభ, చూడాల మొదలగువారును, బ్రహ్మజ్ఞానము నంది దానివలన అపరోక్షముక్తిని వడసిరి. దీనియందు ''అభ్యస్తం జ్ఞానం'' అని ప్రయోగించుటచే పై జెప్పినవారలకు జ్ఞానము స్వయముగా గల్గినది గాదనియు, బ్రహ్మజ్ఞానమును అభ్యాసముచేత గలుగ జేసికొనిరనియు గ్రాహ్యమగుచున్నది. ఇది మైత్రేయి, చూడాల, జనకాదులగు వారి చరిత్రముచేతనే గ్రాహ్యమగుచున్నది. ఏలన ? కొందరు ఈలాగున చెప్పుదురు. జనక, చూడాలాదులకు ఈ జన్మమయిలో అనుష్ఠానములేకనే జన్మాంతర సంస్కారబలముచేత గలిగినదని యందురు. అయితే యీ జన్మములో అనుష్ఠానము చేసినవారే యని గ్రహించుటకొఱకు ''అభ్యస్తం జ్ఞానం'' అని తెలుపడమైనది. జన్మాంతర సంస్కార కథనము వారికి మాత్రముగాదు. ముముక్షువులందరికిని యుండే తీరవలయును. అట్లు సంస్కారము లేనందుచేత శుభేచ్ఛ ఉదయము గాలేదని తలంచువారు ఇప్పుడే ఆత్మశుద్ధికరమగు కార్యములో ప్రయత్నశీలురై యుండవలెను. అట్లైన యీ సంస్కారబీజము మఱియొక జన్మమునకు వృక్షమై పరిణమించును అని మోక్షసాధము.

ప్రశ్న :- ఈశ్వర కరుణలేనిచో మనుష్యునికి బంధ విముక్తి పరమగు శుభేచ్ఛ ఉదయము గాదని శాస్త్రము చెప్పుచున్నది. అట్టి ఈశ్వరకృప యెట్లు గల్గును?

ఉత్తరము :- విజ్ఞానబుద్ధిగల సోదరా! మీరు చెప్పినది నిజము. అయితే యీ విషయమింతవరకు అనేకసార్లు చెప్పబడినదే. ఈశ్వర కృపకు తగిన ధర్మానుష్ఠానమే కారణమని ఆత్మజ్ఞులు తెల్పియున్నారు. శాస్త్రమును ఈలాగుననే తెల్పుచున్నది.

**త్యజ శోక మమంగల్యం మంగళాని విచింతయ ।**
**చిదానందఘనం స్వచ్ఛమాత్మానం చ విభావయ ॥**

నీవు అమంగళమగు హేయవృత్తిని విడిచిపెట్టి శోకమును హృదయములో రానియ్యక శుభవిషయములగు పుణ్యకర్మములం దాసక్తిగల చిత్తముగలవాడవై

చిదానంద ఘనంబును, శుద్ధంబును నగు ఆత్మను హృదయమందు దైవముగా భావనచేయుము.

దేవద్విజగురుశ్రద్ధా భరబంధుర చేతసామ్ ।
సదాగమప్రమాణానాం మహేశానుగ్రహో భవేత్ ॥

దైవమందును, బ్రహ్మనిష్ఠులయందును, గురువులయందును, అత్యాసక్తిగల చిత్తము గలవారును, ఎపుడును శాస్త్రమందు విశ్వాసము గలవారునునగు వారికి పరమేశ్వరానుగ్రహము గలుగుచున్నది అని జ్ఞానవాసిష్ఠము.

నరత్వం దేవత్వం నగవన మృగత్వం మశకతా
పశుత్వం కీటత్వం భవతు విహగత్వాది జననమ్ ।
సదా త్వత్పాదాబ్జ స్మరణ పరమానందలహరీ
విహారాసక్తం చే ద్ధృదయ మిహ కిం తేన వపుషా! ॥

మనుష్యుడుగాగాని, దేవుడుగాగాని, పర్వతముగాగాని, అడవిగాగాని, మృగముగాగాని, దోమగాగాని, పశువుగాగాని, పురుగుగాగాని, పక్షులు మొదలగునవిగా గాని పుట్టుట అగుగాక! మనస్సు ఎల్లప్పుడును నీయొక్క పాదపద్మములయొక్క స్మరణఅనెడు మహానందముయొక్క ప్రవాహమందు విహరించుటకు ఆసక్తికలిగినది అగునేని పై జెప్పిన శరీరములలో ఏది వచ్చినను ఏమి కొరతగానున్నది? అట్లు మీయొక్క చరణారవింద ధ్యానామృతము పానముచేయ నొల్లని జన్మము ఏది వచ్చినను వ్యర్థమే యగునుగదా! అనగా భగవత్స్మరణ గలవాడు ఎట్టి జన్మము గలవాడైనను వాడే శ్రేష్ఠుడు. అదిలేని శ్రేష్ఠజన్మమైనను నికృష్టజన్మమనియే తలంచవలయును.

వటుర్వా గేహీ వా యతిరపి జటీ వా తదితరో
నరో వా యః కశ్చిద్భవతు భవ కిం తేన భవతి ।
యదీయం హృత్పద్మం యది భవదధీనం పశుపతే
తదీయస్త్వం శంభో భవసి భవభారం చ వహసి ॥

మానవుడు బ్రహ్మచారియైనను, గృహస్థుడైనను, సన్న్యాసియైనను,

జటాధారియైనను, అనగా వానప్రస్థుడైనను మఱి యిక ఎట్టివాడైనను గానిమ్ము. అందుచేత ఓ ఈశ్వరా! యేమి యగును? అనగా నేమియు విశేషము లేదు. ఓ పశుపతే! ఎవనియొక్క హృదయకమలము నీయధీనమైనదిగా నుండునో అనగా, ఎవడు దైవార్పిత చిత్తముకలవాడై యుండునో, వానియొక్క సంబంధుడవు నీవగుదువు గదా! ఓ శంకరా! వానియొక్క సంసారభారమంతయు నీవే భరింతువు గదా! అనగా ఏ వర్ణములయందును, ఏ యాశ్రమములయందును, స్త్రీలైనను, పురుషులైనను, అంత్యజులైనను, ఎంతవాడైనను సరియే ఈశ్వర భక్తిలేనిదే లాభమిసుమంతయు లేదు. ఈశ్వరార్పితచిత్తుడై నిరంతరము ధ్యానము చేయువానిని సర్వేశ్వరుండు పరమబంధువై సదా కాపాడుచుండును. వానికేమియు కొరత లేదని తాత్పర్యము.

గుహాయాం గేహే వా బహిరపి వనే వాద్రి శిఖరే
జలే వా వహ్నౌ వా వసతు వసతేః కిం వద ఫలమ్ ।
సదా యస్యైవాంతః కరణమపి శంభో! తవ పదే
స్థితం చేద్యోగో ఽసౌ స చ పరమయోగీ స చ సుఖీ ॥

కొండ గుహయందో, స్వగృహమందో, బయట నెచ్చోటనో, అడవియందో, పర్వతశిఖరమందో, గంగాతీరమందో, పంచాగ్ని మధ్యమందో నివసించినను నివసించుగాక! హేశంభో! సుఖకరుడవగు నో యీశ్వరా! అట్లు నివసించిన మాత్రమున నేమి ఫలము? మనస్సు ఎల్లప్పుడును నీయొక్క పాదారవిందమందు నిలుచుటయే యోగము. అట్లు నిలిపిన వాడే పరమయోగి, వాడే జ్ఞాని, వాడే శాశ్వతసుఖమును బొందగలుగును. అనగా మఠములోగాని, వనములోగాని, గృహములోగాని, గుహలోగాని, కాశి, బదరికాశ్రమాది పుణ్యస్థలములలోగాని, సామాన్యమైన యితరస్థలములో గాని యుండినవాడైనను, ఎవనియొక్క మనస్సు సదా సర్వేశ్వరాయత్తమై ధ్యానములో మగ్నమైయుండునో, వాడే యోగియును పరమజ్ఞానియును అగుచున్నాడని శ్రీజగద్గురు శంకర భగవత్పాదులవారు శివానందలహరియం దాహరించిరి.

ప్రశ్న :- ఓ మహానుభావా! మీయొక్క అనుగ్రహముచే ఈశ్వరకృప

గలిగెడు మార్గము గోచరమయినది. అయితే మఱి యొక ప్రశ్న అడుగుటకు ఇచ్ఛగలవాడనై యున్నాను. అదేమన? జీవులకు శుభేచ్ఛ అనగా బంధనివృత్తి పరమగు మోక్షేచ్ఛ యేలాగున గల్గుచున్నది?

ఉత్తరము :- నాయనా! నీవు పుణ్యసంస్కారము పూర్తి గల్గియున్నావు. లేనిచో ఇట్టి పరమశ్రేయోదాయక మగు విషయము నడిగియుండవు. మనుజులయొక్క ప్రాక్తనకర్మ మదృష్టమగుటచే, అనగా జన్మాంతర కర్మ యిట్టిదని తెలిసికొనుటకు సామాన్య జనులకు సాధ్యముగానందుచే, శుభేచ్ఛ యేలాగున ఉదయించునో ఆ విషయము చెప్పుట దుస్తరము. అయితే నిష్కామపరమగు పుణ్యకర్మానుష్ఠాన పరిపక్వదశ గల్గునప్పుడు శుభేచ్ఛ గల్గునని కొందఱును, సర్వేశ్వరకరుణచే కల్గునని మఱికొందఱును, మహాపురుషుల కృపచే గాని, వారి సాంగత్యముచేతగాని గల్గునని మఱికొందఱును చెప్పుచున్నారు. అయితే యేదైన ఒక ప్రాక్తనకర్మ విశేషముచేతనే శుభేచ్ఛ యుదయించును. ప్రాక్తనకర్మ పవిత్రత లేనిచో పై జెప్పిన వెవ్వియు సిద్ధింపజాలవు. దీనికి కారణము లనేకములు పై నుండి ఉదాహరించుకొనియే వచ్చితిమి. ఈ విషయము శ్రీరామచంద్రుడు శ్రీవసిష్ఠమునిని అడిగియున్నాడు. అది వినుడు.

శ్రీవసిష్ఠ ఉవాచ --

> ప్రవృత్తశ్చ నివృత్తశ్చ భవతి ద్వివిధః పుమాన్ ।
> స్వర్గాపవర్గోన్ముఖయోః శృణు లక్షణ మేతయోః ॥

సకామమగు ధర్మము ననుష్ఠించుటచే స్వర్గమునకు నున్ముఖుండగు వాడు ప్రవృత్తుడనియు, నిష్కామధర్మము ననుష్ఠించుటచే మోక్షమున కున్ముఖుండగువాడు నివృత్తుండనియు నిట్లు పురుషులు రెండువిధముల నుందురు. వీరిరువురి లక్షణము జెప్పెద వినుము.

## ప్రవృత్తజన లక్షణము

> కియత్తన్నామ నిర్వాణం వరం సంసృతిరేవ మే ।
> ఇతి నిర్ణీయ కర్తా యః స ప్రవృత్త ఉదాహృతః ॥

మోక్షమన నెంత? సంసారమే శ్రేష్ఠమైనది, అని నిర్ణయించి కోరికతో కర్మము నాచరించువాడు ప్రవృత్తుండని చెప్పబడును. అనగా మోక్షమందును, మోక్షమార్గ ప్రవృత్తిలో నుండు బ్రహ్మనిష్ఠులయందును అగౌరవబుద్ధి గల్గి సంసార సుఖమందును, సంసారములో గొప్పపదవి గలవారియందును గౌరవబుద్ధిగల్గి విషయ భోగేచ్ఛా పరమగు కర్మము చేయువాడు ప్రవృత్తిమార్గస్థుడనంబడును.

## నివృత్తజన లక్షణము

చలార్ణవ యుగచ్ఛిద్ర కూర్మగ్రీవా ప్రవేశవత్ ।
అనేక జన్మనామంతే వివేకీ జాయతే పుమాన్ ॥

చలించుచున్న రెండుసముద్రముల నడుమనున్న తీరము నందు మెడతో ప్రవేశించిన తాబేలునకు ముందుకు బోయినను, వెనుకకు బోయినను అచట నున్నను సుఖము లేనట్లు, వెనుకజన్మమును విడిచి యింకొకజన్మము నొందబోవు జీవునకు వెనుకటి జన్మమున గాని, ముందు జన్మమునగాని, నడుమగాని సుఖము గలుగదు. అటుల ననేక జన్మములయందు దుఃఖమునొంది పురుషుడు కొసకు వివేకవంతుడగుచున్నాడు.

అసారా చిత్తసంసార వ్యవస్థాఽలం మమైతయా ।
కిం కర్మభిః పర్యుషితైర్దినం తైరేవ నీయతే ॥

క్రియాతిశయనిర్ముక్తం కిం స్యాద్విశ్రమణం పరమ్ ।
ఇతి నిశ్చయవాన్యోఽంతః స నివృత్త ఇతి స్మృతః ॥

ఈ సంసారవ్యవస్థ నిస్సారమైనది. నాకు దీనితో అంత్యములో నేమియు ప్రయోజనము లేదు. సారవిహీనములగు కామ్యకర్మములతో నేమి ఫలము? ఏమని యా ప్రాచికర్మములతోడనే దినమంతయు గడపవలయు? కర్మఫల తారతమ్య రహితంబును, నిరతిశయంబును నగు విశ్రాంతి స్థానమెద్ది యగునని లోన నిట్టి నిశ్చయము గలిగి మోక్షాపేక్షగలవాడై విషయవిరక్తి గలుగజేసికొని లోకసేవలోను, ఈశ్వరభక్తిలోను, బ్రహ్మచింతనలోను ఆసక్తిగల చిత్తము గలవాడు నివృత్తుడని చెప్పబడుచున్నాడు.

శ్రీరామ ఉవాచ --

**మూఢస్యాఽసత్కులోత్థస్య ప్రవృత్తస్యాఽధమస్య చ ।**
**అప్రాప్తయోగసంగస్య కథముత్తరణం భవేత్? ॥**

ఓ మునీంద్రా! మూఢుడును, అసత్కులంబున బుట్టినవాడును, కామ్య కర్మ నిష్ఠుండును, అధముండును, యోగాభ్యాసంబు లేనివాడును తరించు నుపాయం బెయ్యది?

శ్రీవసిష్ఠ ఉవాచ --

**మూఢస్యారూఢదోషస్య తావత్సంస్పృతి రాతతా ।**
**యావజ్జన్మాంతర శతైర్నోదితా ప్రథమాఽత్ర భూః ॥**

మూఢుడును, దోషియు నగు వాని కెన్ని జన్మాంతరములకైన మొదటి భూమిక యుదయించు నంతవరకును సంసారము వ్యాప్తమయ్యే యుండును.

**అథవా సాధుసంగత్యా కాకతాళీయ యోగతః ।**
**సంసారస్య పరామర్శా ద్వైరాగ్యం సముదేతి హి ॥**

అట్లు గాకునున్నను సజ్జన సాంగత్యముచే కాక తాళీయ న్యాయమున సంసారము యొక్క దోషదర్శనంబు గల్గి యందుచే వైరాగ్యముదయించు చున్నది.

**వైరాగ్యేఽభ్యుదితే జంతో రవశ్యం భూమికోదయః ।**
**తతో నశ్యతి సంసార ఇతి శాస్త్రార్థ సంగ్రహః ॥**

మనుజునకు వైరాగ్యము గలుగా, అవశ్యముగా శుభేచ్ఛ యను మొదటిదైన యోగభూమిక యుదయించుచున్నది. దానిచే సంసారదుఃఖము నశించుచున్నది అని శాస్త్రాభిప్రాయము. ఈ శ్లోకాంత్యమున ''ఇతిశాస్త్రార్థ సంగ్రహః'' అని శ్రీవసిష్ఠ భగవానులుపదేశించుటచే తాను స్వయముగా చెప్పక తాను చెప్పినది సమస్త శాస్త్రములయొక్క సారసంగ్రహమని తెలుపుచున్నారు. కాకతాళీయన్యాయమనగా తాటిచెట్టులో పండు బాగుగా మాగియుండెను. హఠాత్తుగా ఒక కాకివచ్చి దాని మీద కూర్చొనిన వెంటనే పండూడి క్రిందపడెను. అదేప్రకారముగా జన్మాంతర

శుభకర్మము పరిపక్వమై వచ్చు దశలో మహాత్ముల సంసర్గముగాని, ఈశ్వరనిష్ఠ గాని గలుగునప్పుడు శుభేచ్ఛ యుదయమగును. అయితే మహాపురుషులును, సర్వేశ్వరుడును, నిమిత్తమాత్రకారణములే గాని, తనయొక్క శుభకర్మ పరిపాకమే నిజమైన కారణమగుచున్నది. ఇది సాధారణ జనులు తెలిసికొనజాలరు. ఇంత వరకు చెప్పుచు వచ్చిన సంగతులవల్ల సందేహ నివృత్తి గాగలదు. ఇక మునిభావ బోధినిలో గల భావమును చెప్పెద వినుము.

దైవే పురుషకారే చ కర్మసిద్ధి ర్వ్యవస్థితా ।
తత్ర దైవ మభివ్యక్తం పౌరుషం పౌర్వదైహికమ్ ॥

కేచిద్దైవాత్స్వభాచ్చ కాలాత్పురుష కారతః ।
సంయోగే కేచి దిచ్ఛంతి ఫలం కుశలబుద్ధయః ॥

యథా హ్యేకేన చక్రేణ రథస్య న గతిర్భవేత్ ।
ఏవం పురుషకారేణ వినా దైవం న సిధ్యతి ॥ (దైవపౌరుషవిమర్శ)

దైవమందును, బురుషకారమందును కర్మ సిద్ధించు చున్నది. అందులో పూర్వజన్మదేహమందాచరింపబడిన పౌరుషము దైవమని స్ఫుటమైయున్నది. కొందరు దైవమువలనను, మఱికొందరు ప్రపంచస్వభావమువల్లను, మరికొందరు కాలమువలనను, ఇంకకొందరు పౌరుషమువల్లను, ప్రత్యేకము కర్మఫలము కలుగుచున్నదని చెప్పుచున్నారు.

కుశలబుద్ధులగు మన్వాదులు వీని యన్నిటి సమన్వయమువలన ఫలము నిచ్ఛగించుచున్నారు. రథగమనమునకు చక్రద్వయము లేకుండిన చక్కగా నడుపజాలనటుల పురుషకారము వినా దైవము వలన సిద్ధి కానేరదని యాజ్ఞవల్క్యులు.

పురుషకారము నంగీకరించని యెడల వైద్యశాస్త్రమునకు వైయర్థ్యమే గల్గును. పురుషకారము లేకుండిన దైవమే లేకుండును. ఎందుచే ననిన, దైవమనియు, దిష్టమనియు, భాగధేయమనియు, భాగ్యమనియు, నియతియనియు, విధి యనియు, పూర్వజన్మకర్మ జన్యమగు నదృష్టమునకు సమానార్థములని యమరుడు.

## శ్రీమద్రామాయణము

ప్రాక్కర్మ ఫలభోగార్హా బుద్ధి స్సంజాయతే నృణామ్ ।
పాపకర్మణి పుణ్యే వా కర్తుం శక్యో న చాऽన్యథా ॥

బుద్ధిరుత్పద్యతే తాదృక్యాదృక్కర్మ ఫలోదయః ।
సహాయాస్తాదృశా ఏవ యాదృశీ భవితవ్యతా ॥

ప్రాక్కర్మ వశతస్సర్వంభవత్యేవేతి నిశ్చితమ్ ।
తదోపదేశా వ్యర్థాః స్యుః కార్యాకార్యే ప్రబోధకాః ॥

ధీమంతో వంద్యచరితా మన్యంతే పౌరుషం మహత్ ।
అశక్తాః పౌరుషం కర్తుంక్లీబా దైవ ముపాసతే ॥
దైవే పురుషకారే చ ఖలు సర్వం ప్రతిష్ఠితమ్ ॥
పూర్వ జన్మకృతం కర్మేహార్జితం తద్ద్విధా కృతమ్ ॥

బలవత్ప్రతికారస్య దుర్బలస్య సదైవ హి ।
సబలాబలయోర్జ్ఞానం ఫలే ప్రాప్తేऽన్యథా నహి

ఫలోపలబ్ధిః ప్రత్యక్ష హేతునా నైవ దృశ్యతే ।
ప్రాక్కర్మ హైతుకీ సాతు నాన్యథై వేతి నిశ్చయః ॥

యద్జ్ఞాయతేऽల్పక్రియయా నృణాం వాపి మహత్ఫలమ్ ।
తదపి ప్రాక్తనాదేవ కేచి త్ప్రాగిహ కర్మజమ్ ॥

వదంతీహైవ క్రియయా జాయతే పౌరుషం నృణామ్ ।
స స్నేహవర్తి దీపస్య రక్షా వాతా త్ప్రయత్నతః ॥

రాజసేవాం వినా ద్రవ్యం విపులం నైవ జాయతే ।
రాజసేవాऽ తిగహనా బుద్ధిమద్భిర్వినా న సా ॥

కచ్చిత్పురుషకారం చ దైవం చ ప్రతిపద్యతే ।

ప్రాక్కర్మఫల మనుభవించుటకు తగిన బుద్ధి మనుష్యులకు

పుట్టుచున్నది. అంతకు వ్యతిరేకముగా పాపకర్మమునైనను, పుణ్యకర్మమునైనను చేయజాలడు. ప్రాగ్జన్మకర్మ ఫలోదయ మెటులుండు నటుల బుద్ధియును, సహాయమును గల్గును. ప్రాగ్జన్మకర్మము ననుసరించి సర్వము నగు ననుట నిశ్చయము. దైవము ప్రధానమన్నచో కార్యాకార్యమును బోధించు నుపదేశములు వ్యర్థమగును. శ్లాఘ్యమగు చరితముగల బుద్ధిమంతులు పౌరుషమునధిక మగునదిగా తలంచు చున్నారు. పౌరుషమొనర్చుట కశక్తులగువారలు దైవోపాసన మాత్రమే చేయుదురు. దైవమున పురుషకారమున సర్వము ప్రతిష్ఠితమై యున్నది. బలవంగునటుల వంఛించదగినవానికిని దుర్బలునకును, సర్వదా కర్మ పూర్వజన్మార్జితమనియు, వర్తమాన జన్మకృతమనియు ద్వివిధము. సబలునియొక్క, యబలుని యొక్క జ్ఞానము ఫలప్రాప్తి లేకుండ గలుగదు. ఫలము నొందుట ప్రత్యక్షకారణముచే జూడబడదు. అదియైతే ప్రాగ్జన్మకర్మ కారణము గాగలది. అన్యము కాదని నిశ్చయము. అల్పముగా చేయబడిన కార్యక్రియచేతను, మనుజులకు గొప్పఫలప్రాప్తి గల్గినచో అది ప్రాగ్జన్మకర్మవలన నైనదియే. కొందరు ప్రాక్కర్మవలన నిప్పుడు జేసిన కర్మవలనగూడ నగునందురు. ఈ జన్మమందైన కర్మచేతనే పౌరుషము మనుజులకు అగునని కొందరందురు. అది చమురునందున్న వత్తిగల దీపమునకు గాలివలన ప్రయత్నపూర్వమగు రక్షవంటిదనియు, రాజసేవలేకను విస్తారమగు ద్రవ్యము గలుగదు, ఆ సేవ బుద్ధిమంతులకు తప్ప నితరుల కతిగహనమైన దనియు భార్గవులు. పురుషకారము, దైవము నీచే పొందబడుచున్నది గదా! యని భరతులను గూర్చి శ్రీరామచంద్రులనిరి. అనగా ప్రాక్తనకర్మమునకు వశపడియుండుట సామాన్యజన లక్షణమనియు, పురుషకారముచే విశేషబుద్ధిగలజనులు ప్రాక్తనకర్మను అతిక్రమించగలుగుదురనియు భావము.

పురుషప్రయత్న పదమునకు సంగ్రహముగా చెప్పిన తనయొక్క ధర్మమును నిర్వహించుట యన్నునర్థమే యగుచున్నది. తాను చేయవలసినపని చక్కగ చేసినచో పొందవలసిన పదవి అనగా లభించవలసిన లాభము గల్గుచుండును. మనుష్యుడొకే జన్మములోనే పూర్ణమైన ఆత్మజ్ఞానఫలము

ననుభవించేలాగున ఈశ్వర సృష్టియందు గలదు. దీని కన్యవముగా దలచువారందఱును మిథ్యామోహ కల్పిత మాయలోపడి యుండువారని విజ్ఞులు దలంతురు. అట్లైన అనేక జన్మముల పుణ్యపరిపాకము గల్గునప్పుడే మోక్షేచ్ఛ గల్గునని చెప్పెడు శాస్త్రములు వ్యర్థములా? అని శంక గలుగవచ్చును. నిర్మలబుద్ధితో విచారించిన సందియమున కవకాశము లేదు. ఏలన? శాస్త్రము ఉత్తమ, మధ్యమ, కనిష్ఠ బద్ధాది జీవులను గుఱించి చెప్పుచుండును బహుజన్మ సుకృత విశేషము గల్గిన మాత్రమే ముక్తి గలుగునని చెప్పెడు శాస్త్రము పై జెప్పిన అజ్ఞులను గుఱించి, నియతకార్యమును నిర్వహింపని మందులను గురించి చెప్పియుండినదే యగును. ఏలన? మనుష్యజన్మములో బ్రహ్మచర్యాది నాలుగాశ్రమములు ఒకే జన్మములో నిర్వహించవలయునని శాస్త్రవిధి గలదు. ఇది మనుష్యసముదాయమునకు మొత్తముగా చెప్పబడిన శాస్త్రమగుటచే ఇచ్చో పుణ్యపాపజీవులను గుఱించి విమర్శజేయుట కవకాశమే లేదు. కనుకనే ముందుగా నియతకర్మను చేయని వానికే అట్టి ఉత్తమాధికారులను గుఱించి అనేక జన్మములను నిర్ణయించుటకు కారణమైనది. అది హిందూశాస్త్రమునకు విరుద్ధమైన కార్యము. ఏలననగా? విధిప్రకారము బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్న్యాసాశ్రమముల వఱకు వచ్చినవానికి ముక్తి లేదని చెప్పినచో యత్యాశ్రమధర్మమునకు పతనము గల్గును. దీనిని ధర్మశాస్త్ర మంగీకరింపజాలదు. ఇచట అందఱును బ్రహ్మచర్యమునుండి వరుసగా నాలుగాశ్రమములలోను ప్రవేశించి వెళ్ళవలయునని వేదాంతశాస్త్రము విధించుటలేదు. బ్రహ్మచర్యాశ్రమములోనే విషయ విరక్తియు, బ్రహ్మజిజ్ఞాసయు గల్గిన అచ్చోట నుండియే తురీయాశ్రమము స్వీకరింపవచ్చును. శ్రీశంకర, మధ్వాచార్యులే దీనికి సాక్ష్యములు. అరటిమ్రాను, వరి, గోధుమ, సజ్జ, జొన్న మొదలైన ఓషధులన్నిటికి వానియొక్క ఫలములు పండువరకును చెట్లు నిలుచున్నవి. ఫలము పండిన తర్వాత చెట్టు పడిపోవును. ఆలాగున మనుష్యశరీరములో బ్రహ్మజ్ఞాన మను మోక్షఫలము ఫలించువఱకు శరీరమేల నిలువక పోవలయును?

ఫలము లభింపకపోవుటకు నియతకార్యము చేయకపోవుటయే

కారణము. ఏలన? అరటిచెట్టు, వరి, సజ్జ, జొన్న మొదలైనవి చక్కని క్షేత్రములో లెస్సగ పెంచబడిన మాత్రమే ఫలము పండువఱకును వాని శరీరమును చెట్టు నిలుచును. అట్లు గానిచో లేతకాలములోగాని, వెన్ను వేయుకాలములోగాని యెండిపోవచ్చును. అదేప్రకారము బ్రహ్మచర్యములోనుండి అధ్యయనము, బ్రహ్మోపాసన మొదలైన కార్యములు చేయకయు, బ్రహ్మచర్యమును సంరక్షింపకయు, ఈశ్వర సాక్షాత్కార కార్యమై సరిగా ప్రయత్నముచేయని కారణము చేతనే మనుష్యులు పూర్ణసుఖమగు జ్ఞానఫలమును పొందుటకు ముందుగా మృత్యువువాత పడిపోవుదురు. అట్లు గానిచో అమృతపదవియగు ఫలము గల్గువరకు శరీరము నిలిచియుండును. మఱియు గజము, అశ్వము, అజము, గోవు మొదలైన జంతువులన్నియు, శుక, పిక, మయూరాదులగు పక్షులన్నియు మామూలుగా వాని జీవితముల పరిమితి అంత్యమువరకు ఇప్పుడుగూడ జీవించుచున్నవి. ఏదో యొకానొకటిమాత్రమే రోగబాధాదులచే హతమగుచుండును. ఆలాగున మానవునికి ఏర్పడిన జీవితము పూర్తివఱకు ఏల జీవింపకూడదు? దీనికిని కారణము గలదు. ఏలన? పశుపక్ష్యాది మృగము లన్నియు వాటియొక్క నియతి ననుసరించియే జీవించుచున్నవి. అనగా వాటియొక్క విషయప్రవర్తనము, ఆహారము ఇవన్నియు నియతికి విరుద్ధముగా లేవు. కనుకనే అవియును వానికీశ్వరుడిచ్చిన ఆయుస్సు యొక్క పూర్తివరకు సుఖముగా జీవింపగల్గుచున్నవి. పశువులలో కొన్ని దుర్మరణమునకు లోపడుచుండిన, అది మనుష్యులయొక్క అక్రమకృత్యముచేతనే గలుగును. అనగా మితి మీరిన పనిచేయించుట చేతను, ఆహార నివాసములు సరిగా లేకపోవుటచేతను గల్గునేగాని మరియే కారణమును లేదు. హీనవృత్తి గల్గి మానవుడు బ్రహ్మ చర్య సంరక్షణము, ఆహార నియమమును, దైవకార్యమును, వ్రతానుష్ఠానములును నిర్వహింపజాలక పోవుటచే ఇట్టి దుర్మరణములకు లోనై దైవమయమై ఆనందముతో విడువవలసిన శరీరముగల వాడై యుండియు దుఃఖములో మునిగి దయ్యపుకృత్యములో దేహము విడువవలసివచ్చినది. అయితే యీ విషయమై కర్మ శాస్త్రములను లెస్సగ చదువుకొని బహిః కర్మనిరతులై కొంచెమైనను సత్య

ధ

అదేమన? కలియుగము కనుక నాయనలార! మీకుపై కనుపరచిన దుర్గతి గల్గినదని చెప్పుదురు. అట్టివారితో ఇప్పుడు పుట్టియుండువారు కొందరును, ఇంక పుట్టబోవువారిలో అధిక సంఖ్యాకులును ఈలాగున నిస్సంశయముగా అడుగుదురు. ''అయ్యా! ఏమండి శాస్త్రులుగారూ! ఈ కలియుగము మనుష్యులకు మాత్రమా గల్గినది?''

కాలచక్రము యొక్క గమనశక్తి, పరమాణువు నుండి పరమేశ్వరుని స్థానము వరకు వ్యాపించుట లేదా? అట్లు గానిచో దానిని కాలచక్రమని యెట్లు చెప్పగల్గుదుము? ఇది యెవరైన అంగీకరించే తీరవలయును. దీని నంగీకరించిన పక్షమున, కలియొక్క కాలకఠోర సంకలిత కల్మషము, పై జెప్పిన ఓషధులకును, పక్షులకును, పశువులకును ఏల గలుగలేదని అడిగినచో నిశ్శబ్దముగా కొంతసేపు ఊపిరాడకుండ గూర్చొని యోచించి ''నాయనలారా! మీరు చెప్పనది నిజము. ఆచరణ లేకపోవుటచేతనే మనకు ఇట్టి అరిష్టము లన్నియు గల్గిన'' వని విచారపూర్వకముగా అతడు మనకు చెప్పును. ఇక యీ విషయమై చెప్పవలసిన భావము లనేకములు గలవు. మనము ప్రారంభించిన విషయమునకు ఇంతే చాలును.

ఈ విషయమై శాస్త్రము చెప్పినది చూడుడు.

**కలౌ కృతయుగం తస్య కలిస్తస్య కృతే యుగే ।**
**యస్య చేతసి గోవిందో హృదయే యస్య నాచ్యుతః ॥**

ఎవని హృదయములో భగవద్ధ్యానముండదో, అట్టివాడు కృతయుగమందుండు వాడైనను కలియుగమందుండువాడే. మరియు ఎవనియొక్క హృదయములో దైవస్మరణ సదా గల్గియుండునో, అతడు కలియుగమందున్నను కృతయుగ మందుండువాడే. వివేకచూడామణియందు శ్రీశంకరులు పురుషప్రయత్నము మనుష్యులయొక్క విధి యని తెల్పియున్నారు.

**లబ్ధ్వా కథంచిన్నరజన్మ దుర్లభం**
**తత్రాపి పుంస్త్వం శ్రుతిపారదర్శనమ్ ।**
**యః స్వాత్మముక్త్యై న యతేత మూఢధీః**
**స హ్యాత్మహా స్వం వినిహన్త్యసద్గ్రహాత్ ॥**

లభించుటకు మిక్కిలి ప్రయాసమైన మానవ జన్మము లభించియు, అందులో పురుషుడై, దానిలో వేదపారగత్వమును పొందందగిన యవస్థ గల్గియు, ఎవండు తనయొక్క ఆత్మబంధ నివృత్తి పరమగు ముక్తికొరకు ప్రయత్నము చేయడో, అట్టి మూఢాత్ముడు, ఆత్మహత్యను చేసికొనిన వాడగుచున్నాడు.

ఏలన? తుచ్ఛమగు దృశ్యవిషయములను గ్రహించినందుచేత తన్ను తాను చంపుకొనిన పాతకునివంటి వాడగుచున్నాడు.

**ఇతః కోన్వస్తి మూఢాత్మా యస్తు స్వార్థే ప్రమాద్యతి ।**
**దుర్లభం మానుషం దేహం ప్రాప్య తత్రాపి పౌరుషమ్ ॥**

బహుజన్మసుకృతముచే లభించందగిన మానవశరీరము గల్గియు, దానిలో పురుషుడై జన్మించియు, అజ్ఞాన నివృత్తికొఱకు ప్రయత్నింపక, ఆత్మ సౌఖ్యముకొఱకు యత్నముచేయక ప్రమాదములో పడి విషయసుఖమును నమ్మియుండు వానికన్న మూఢాత్ముడెవ్వడు?

**ఉద్ధరే దాత్మనాఽఽత్మానం మగ్నం సంసారవారిధౌ ।**
**యోగారూఢత్వ మాసాద్య సమ్యగ్దర్శననిష్ఠయా ॥**

అజ్ఞానముచే, సంసారసాగరములో నిమగ్నుడైయుండు తనయొక్క మలినాత్మను, పరిశుద్ధ బ్రహ్మవిచారణ మగు నిర్మల జ్ఞానముచేత, తనకు తానే ఉద్ధరించుకొనవలయును. దీనికి యోగారూఢస్థితిని పొందవలయును. అనగా, స్వప్రయత్నపరుడై యుండవలయును. లేనిచో ఉద్ధరించుకొనజాలడు.

**వైరాగ్యం చ ముముక్షుత్వం తీవ్రం యస్య తు విద్యతే ।**
**తస్మిన్నేవార్థవన్తః స్యుః ఫలవన్త శ్శమాదయః ॥**

ఎవనికైతే తీవ్రమైన వైరాగ్యమును, తీవ్రమైన ముముక్షుత్వమును గల్గియుండునో, వానియందు మాత్రమే శమదమాది గుణములు సార్థకములై, మోక్షమను ఫలము నిచ్చునవిగా నుండును. ఇట్టి తీవ్రగుణము లేనివానికి శ్రవణ మననాదులయొక్క ఫలముల యొక్క జ్ఞానము గలుగనేరదని భావము.

ఏతయో ర్మన్దతా యత్ర విరక్తత్వ ముముక్షయోః ।
మరౌ సలిలవత్తత్ర శమాదేర్భావ మాత్రతా ॥

ఏ జిజ్ఞాసువునందు ఈ విరక్తత్వమును, ముముక్షుత్వమును మందగించియుండునో వానియందు మరుభూమిలో కనుపించెడు జలము వలె, శమాదిషట్కము మొదలగు గుణములును, శ్రవణ మననాదులును, బ్రహ్మనిష్ఠాది కార్యములన్నియు, నామమాత్రములై యుండునేగాని ఫలము నివ్వజాలవు. మరుభూమిలో కనుపించిన జలముచే దాహశాంతి యెట్లు గలుగదో అట్లు నిజమైన అనుష్ఠానముతో గూడిన పురుషప్రయత్నములేని వాని పనులన్నియు, ఎండమావులలో గనుపించెడు నీళ్ళవలె నుండునేగాని, ఫలము గలుగజేయవు. మఱియు

ప్రాప్య చాప్యుత్తమం జన్మ లబ్ధ్వా చేంద్రియ సౌష్ఠవమ్ ।
న వేత్త్యాత్మహితం యస్తు స భవేదాత్మఘాతకః ॥

ఉత్తమమైన మానవజన్మము లభించియు, కరచరణాదీంద్రియములు యావత్తున్ను పుష్టిగా గల్గియుండు ఈ తరుణమున ఎవండు ఆత్మయొక్క, ముక్తిపరమగు దైవసుఖముకొఱకు ప్రయత్నించుట లేదో, అట్టివాడాత్మ ఘాతకుడగుచున్నాడు. మఱియు

సమం పశ్యన్ హి సర్వత్ర సమవస్థితమీశ్వరమ్ ।
న హి నస్త్యాత్మనాఽఽత్మానం తతో యాతి పరాం గతిమ్ ॥

అజ్ఞానముచేత తనలోను, సమస్త ప్రాణులలోను వెల్గుచుండు ఆత్మను అనగా దైవమును తెలిసికొనజాలనివాడై ఎవడు దృశ్యాది ప్రపంచవిషయ భోగముచే స్వరూపజ్ఞానరహితుడై యుండునో, అట్టివాడు తన ఆత్మను తాను చంపుకొన్నవాడే యగుచున్నాడు. అట్లు చేయక ధర్మమార్గముతో గూడినవాడై, ఆత్మజ్ఞానమును తెలిసికొనువాడెవడో వాడే తన ఆత్మను హత్యచేయనివాడు. ఇట్టి యే యథార్థమైన దైవజ్ఞానము గలదో అది ఒక్కదానిచే మాత్రమే సర్వోత్కృష్టమైన మోక్షము నొందగల్గును. వీడే ఆత్మరక్షకుడు. కాని వారలు

ఆత్మశిక్షకులే యగుచున్నారని శ్రీభగవానులు పదేశించుచున్నారు. ఇదిన్ని పురుషప్రయత్నము గదా!

**సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరమ్ ।**
**వినశ్యత్స్వవినశ్యంతం యః పశ్యతి స పశ్యతి॥**

ఎవడు సమస్త ప్రాణులయందును, తనయందును సమముగా నున్నటువంటి పరమేశ్వరుని, ఆ ప్రాణుల దేహములును, తన దేహమును నశించిపోయినను, నశించకయున్న ఆత్మను ఈశ్వరమయముగా జూచుచున్నాడో, వాడే చూచినవాడు, తక్కినవారు చూచినవారు కారు. అనగా దేహేంద్రియములు నశించుచున్నవనియు, ఆత్మ నశింపదనియు, అట్టి యాత్మను, జీవేశ్వరైక్య జ్ఞానముచే దైవముగా తెలిసికొని నశింపని వానిగా గ్రహించినవాడే తెలిసిన వాడనియు, కన్నుగలవాడనియు, అట్టి జ్ఞానము లేనివారు ఇతర జ్ఞానములన్నియు గల్గిన వారైనను కండ్లచే, అన్ని పదార్థములను చూచిన వారైనను, జ్ఞానము లేనివారనియు, కండ్లుండియు కన్నులు లేనివారితో సమానులనియు జ్ఞానులు తలంతురని భావము.

**ఉద్ధరే దాత్మనాత్మానం నాత్మాన మవసాదయేత్ ।**
**ఆత్మైవ హ్యాత్మనో బంధు రాత్మైవ రిపురాత్మనః ॥**

విషయాసక్తిలేని నిర్విషయముగల మనస్సుచేత, విషయములో మగ్నుడై యుండు తన ఆత్మను, తానే ఉద్ధరించుకొనవలయును. తన ఆత్మను పురుషప్రయత్న రహితుడై అధోగతిని పొందింపకూడదు. తనకు ఇంద్రియములనుండి వశీకృతమైన మనస్సే గొప్ప బంధువువలె నుపకారము చేయును. తనకు ఇంద్రియార్థములనుండి వశీకృతము గాని మనస్సే పరమశత్రువువలె నపకార మొనర్చుచుండును. కావున ప్రయత్నపరుడై ఆత్మోద్ధారకము చేసికొనుము.

లోకోద్ధారకు లగు మతాచార్యుల అభిప్రాయము జూడుడు-

1. శ్రీయేసుక్రీస్తు-వెదకువానికి దొరకును. అడుగువానికి ఇవ్వబడును.

తట్టువానికి తెరవబడును. 2. శ్రీమహమ్మదునబి- దుఃఖము లేని పదవి సంపాదించుట మనుష్య ధర్మమైయున్నది. దానికి దైవమును నమ్ముటయు, ఖురాను దైవ ధర్మమని తెలిసికొనుటయు, శ్రీమహమ్మదు దైవప్రవక్త యని అంగీకరించుటయు మనుష్యధర్మము. 3. శ్రీబుద్ధదేవుడు- వేదముగాని, వేదాంతముగాని విమర్శించి సత్యాసత్యముల నరయుటకు ప్రతిమానవుడును హక్కు గల్గి యున్నాడు. 4. శ్రీ వ్యాసులు- బ్రహ్మసూత్రములలో "అథాతో బ్రహ్మ జిజ్ఞాసా" అని మొట్టమొదటనే లిఖించిరి. అనగా శమదమాది గుణములు గలుగచేసికొని, బ్రహ్మజిజ్ఞాస చేయందగిన దని బోధించిరి. 5. శ్రీ పతంజలి మహర్షి "అభ్యాస వైరాగ్యాభ్యాం తన్నిరోధః" అని తన యోగసూత్రములలో వ్రాసిరి. అనగా బ్రహ్మాభ్యాసము చేతను, విషయవిరక్తిచేతను, మనోనిగ్రహము చేసికొని, దైవసుఖమగు జ్ఞానము పొంద తగినదని భావము. ఈలాగున వేలకొలది ఋషుల అభిప్రాయములు గలవు. కఠోపనిషత్తున నచికేతను డను ఋషికుమారుడు స్వప్రయత్నముచేత యమధర్మరాజునం బొంది బ్రహ్మసాక్షాత్కార స్థితిని దెలిసికొన్నాడు. వారి ఆశయము జూడుడు.

**యస్త్వవిజ్ఞానవాన్ భవత్యయుక్తేన మనసా సదా ॥**
**తస్యేంద్రియాణ్యవశ్యాని దుష్టాశ్వా ఇవ సారథే ॥**

ఎవండు విజ్ఞానము లేనివాడై, ఇంద్రియనిగ్రహము లేనివాడై మనోనిర్మలము చేసికొననివాడై యుండునో, వానియొక్క యింద్రియములు పనికిమాలిన సారథికి గల దుష్టములగు గుఱ్ఱములవలె వశ్యములు గావు.

**యస్తు విజ్ఞానవాన్భవతి యుక్తేన మనసా సదా ।**
**తస్యేంద్రియాణి వశ్యాని సదశ్వా ఇవ సారథేః ॥**

ఎవండు విజ్ఞానము గలవాడై, యింద్రియములను స్వాధీనపరచుకొనినవాడై, నిర్మలమైన మనస్సు గలవాడై యుండునో, వానియొక్క యింద్రియములు మంచి నేర్పరియైన సారథికి స్వాధీనములైన మంచి గుఱ్ఱములవలె సదా వశపడియుండును.

**యస్త్వవిజ్ఞానవాన్భవత్యమనస్కః సదాఽశుచిః ।**
**న స తత్పద మాప్నోతి సంసారం చాధిగచ్ఛతి ॥**

ఎవడు దైవసాక్షాత్కార జ్ఞానము లేనివాడై, పరిశుద్ధాత్ముడు కానివాడై, అమనస్కస్థితి పొందనివాడై, ఎల్లప్పుడుండునో అట్టివాడు ముక్తిపదమును బొందజాలక సంసారమునే పొందుచుండును.

**యస్తు విజ్ఞానవాన్భవతి సమనస్కః సదా శుచిః ।**
**స తు తత్పద మాప్నోతి యస్మాద్భూయో న జాయతే ॥**

ఎవండు దైవసాక్షాత్కారజ్ఞానము గలవాడై సదా పరిశుద్ధాచరణ గలవాడై, అమనస్కసాక్షాత్కారము పొందియుండునో అట్టివాడు నిత్యసుఖమగు ముక్తిపదవిని బొంది మరల యీ సంసారదుఃఖములో పుట్టజాలడు.

బృహదారణ్యకోపనిషత్తులో యాజ్ఞవల్క్య మహర్షికిగల భార్య లిద్దరిలో మైత్రేయి సమస్తదృశ్యసుఖములను వైరాగ్యముచే విడచి బ్రహ్మనిష్ఠయందు అత్యధిక ప్రయత్నశీలురాలై యుండినందు చేతగదా, అట్టి మహత్తైన దైవపదమును బొందుటకై శక్తిమంతు రాలైనది! స్వప్రయత్నరహితురాలై విషయసుఖములలో కోరిక గల్గియుండినందుచేత గదా కాత్యాయని అను భార్య సదా సంసారకూపములో గూలియుండుటకు కారణమైనది! ఆలాగుననే జ్ఞానవాసిష్ఠములో శిఖిధ్వజ మహారాజ ధర్మపత్నియగు చూడాలకు విషయభోగములను తుచ్ఛములని తలంచి బ్రహ్మనిష్ఠ ప్రయత్న పూర్వకముగా చేసినందుచే గదా దైవజ్ఞానము గల్గుటకున్ను, అణిమాది అష్టైశ్వర్యసిద్ధి గల్గి తపోవనములో తాపసవృత్తిలోనుండు తన భర్తకు జ్ఞానోపదేశము చేయుటకున్ను శక్తి గలిగినది? ఆలాగున భారతములో సులభయను ఒక యోగినికి బ్రహ్మచర్య వ్రతమనుష్ఠించి వనమునకేగి తాపసవృత్తి నవలంబించి బ్రహ్మవేత్తలలో నగ్రగణ్యులగు జనకులనుగూడ ఆత్మజ్ఞానవిషయములో విస్మయమును జెందజేసిన శక్తి గల్గినది స్వప్రయత్నము చేతగదా! ఇట్టి నారీమణుల కథలుగూడ పెక్కు గలవు. ఉదాహరణముగా ఇచ్చట కొద్దిమందినిమాత్రము పేర్కొనడమైనది.

ఇక భగీరథునియొక్క ప్రయత్నమును గుఱించి శ్రీవసిష్ఠభగవానులు రామచంద్రులకొఱకు జ్ఞానవాసిష్ఠము నిర్వాణప్రకరణమున నుపదేశించిన విషయమును జూచిన పురుషప్రయత్నముచే మానవుడు పొంద సాధ్యములేని పదవి యొకటుండదని గోచరమగును. భగీరథుడు తనయొక్క పురుష ప్రయత్నముచేతగదా, ఆకాశగంగను తెచ్చి తన పితరులను స్వర్గలోకమున కంపినారు. ఈ కథ బహుళముగా వ్రాసిన గ్రంథము పెరుగునని దలంచి సూత్రరూపముగా వ్రాయుడమైనది. మఱియు, మార్కండేయముని బ్రహ్మలిఖితమైన తన యొక్క పదునారేండ్ల జీవితమును తప్పించుకొని చిరాయుస్సు గలవాడైనదియు పురుషప్రయత్నమునకు తార్కాణముగదా! ఛాందోగ్యోపనిషత్తులో జానశ్రుతి యను శూద్రజాతిలోనుండిన ప్రభువు రైక్వుడను ముని నాశ్రయించి ముని యడిగినసమస్తముల నిచ్చి బ్రహ్మ విద్యను నేర్చుకొనినదియు పురుషప్రయత్నముయొక్క చిహ్నముగదా! ఈ జానశ్రుతి శూద్రరాజు గాదనియు, క్షత్రియరాజనియు పండితులు భిన్నాభిప్రాయులై యున్నారు. అయితే యిచ్చట జానశ్రుతునియొక్క ప్రయత్నమే మనకు కావలసియుండునుగాని శూద్రుడుగాని, క్షత్రియుడుగాని, ఆ విషయము మనకక్కరలేదు. రైక్వముని అడిగినంత ధనమును, గోవులను, ఆఖరు తన పుత్రికను గూడ నిచ్చి ప్రయత్నపూర్వకముగా బ్రహ్మత్వమును సంపాదించెను. ఇదిన్ని పురుషప్రయత్నము యొక్క పరత్వమును జూపుచున్నది.

మఱియు, అత్యద్భుతముగాను, అమోఘముగాను గల పురుషప్రయత్నము యొక్క ఫలము క్రింద వ్రాయబడుచున్నది. ఈ విషయము ఛాందోగ్యోపనిషత్తులో గలదు. సత్యకాముడను పేరుగల ఒక దాసీపుత్రుడు (అనగా వేశ్యకుమారుడు) చిన్నతనమున బ్రహ్మచర్యవ్రతమనుష్ఠించి వేదాధ్యయనముచేసి బ్రహ్మసాక్షాత్కారజ్ఞానమును గలుగజేసికొన నిచ్ఛగలవాడై గౌతమ మునియొద్దకేగి, నాకు బ్రహ్మ విద్య నుపదేశింపుడని సవినయముగా ప్రార్థించినట్లును, అత్తరి ఆ గౌతమ మునీంద్రుడు "నీవెవ్వడవు" అని యడుగగా, అనగా "ఎవని పుత్రుడవు" అని ప్రశ్నింపగా తనకు తెలియదనియు, తల్లిని వెళ్ళి

అడిగి వచ్చెదననియు చెప్పి తల్లిదగ్గరకు వచ్చి తాను ఎవ్వరి కుమారుడననియు, ఏ జాతికిచెందినవాడననియు నడుగగా సత్యవంతురాలగు వాని తల్లియైన జాబాల నాయనా! నేను చిన్నకాలమునుండి అనుకుల సేవచేయవలసి వచ్చినందుచేతను, దాసీవంశములో జేరినందుచేతను, నీవెవ్వరి కుమారుడవో తెలియజాలనని ప్రత్యుత్తరమిచ్చెను. సత్యకాముడు తల్లి చెప్పిన వచనములో ఒక్క అక్షరమైనను మరుగుపరచక గౌతమ మునివద్దకు వెళ్ళి తన తల్లి దాసీవంశమునకు చెందిన వారనియు అనేకపురుషుల పరిచర్య చేయవలసి వచ్చిన నందుచే తానే బీజమునకు పుట్టినవాడని తెలియదనియు చెప్పినప్పుడు దయాస్వరూపులగు శ్రీగౌతములు పిల్లవానియెుక్క భక్తిశ్రద్ధలకును, తీవ్ర ముముక్షుత్వమునకును, సత్యభాషణమునకును అచ్చెరువొంది నాయనా! నీవు సత్యమును జెప్పినందుచే బ్రాహ్మణుడవే. సందియము లేదని తెలిపి ఉపనయనాది సంస్కారముల సలిపి వేదాధ్యయనము నొనరింపజేసి బ్రహ్మవిద్య నుపదేశించెను. ఇది యెంత మహత్తరమైన పురుషప్రయత్నమో యోచించుకొనవచ్చును. ఆలాగున శ్రీవిశ్వామిత్రుడును తపస్సు చేసి బ్రహ్మవిద్యను సంపాదించి బ్రాహ్మణుడైన విషయము అందఱికిని తెలిసియే యున్నది. ఇప్పుడు విశ్వామిత్ర గోత్రస్థులగు బ్రాహ్మణు లనేకులున్నారు. అదేరీతిగా శ్రీవ్యాసభగవంతునకు బ్రాహ్మణులలో అనేక శిష్యులుండినను అబ్రాహ్మణ కులములో పుట్టిన సూతమునీంద్రుడు నైమిశారణ్యమున ఋషిమండలియందు అష్టాదశపురాణములను బ్రహ్మాసనారూఢుడై, బోధింపగల్గిన శక్తియు, పురుషప్రయత్నము చేతనేగదా!! కలిగెను. వ్యాసులకు శిష్యకోట్లగు ఋషులలో సూతమహర్షివంటి భక్తియు, గురుశుశ్రూషయు, శాంతశమదమాది గుణములు మఱియొక్కరికి లేనందుచే శ్రీవ్యాసుల వారి కృపకు పాత్రుడైన యతని కట్టి లోకపూజ్య పదవి గల్గినది.

**పురుషప్రయత్నము సంపూర్ణము.**

**ఓమ్ సర్వస్తరతు దుర్గాణి సర్వో భద్రాణి పశ్యతు ।**
**సర్వః సద్బుద్ధిమాప్నోతు సర్వః సర్వత్ర నందతు ॥**

ఓమ్ తత్ సత్.



# పురుషప్రయత్నావశ్యకము

పాఠకులారా! శుభేచ్ఛగల జిజ్ఞాసాపరులారా! ఇంతవరకు పురుషప్రయత్నమును గురించి చెప్పిన విషయములు మీరు చక్కగా తెలిసికొనిన వారలైతిరని తలంచెద. ఇంతవరకు తెలిపిన వానిలో ఉపనిషత్తుల యొక్కయు, యోగశాస్త్రముల యొక్కయు, ధర్మశాస్త్రముల యొక్కయు సారమేగాక అనేక మహాపురుషుల జీవిత దివ్యాశయమును గూడ మీయెదుట తెలుపడమైనది. ఆస్తికమత నిష్ఠగలవారందరును శ్రీరామకృష్ణాద్యవతారపురుషులను దైవభావముతో తలంచియున్నారు. దశావతారములలో శ్రీరామ, శ్రీకృష్ణ, శ్రీబుద్ధదేవులు ముగ్గురును ముఖ్యులు. శ్రీకృష్ణభగవానులు బోధించిన తత్త్వములలో, శ్రీభగవద్గీత ముఖ్యమైనది. దీనియందు స్వధర్మానుష్ఠానపరుడై, కర్తవ్యనిరతుడై, విధిచోదిత వివిధ కర్మానుష్ఠానరతుడై, ఫలాసక్తిని, కర్తృత్వబుద్ధిని విడిచి యీశ్వరార్పణ బుద్ధితో, వారివారి నియతకర్మ చేయవలయుననియే బోధింపబడియున్నది. శ్రీబుద్ధదేవుడు తనయొక్క మనః పరిశ్రమచే వేదవేదాంతములను గూడ దాటిపోయి, స్వప్రయత్నపరుడై, దుఃఖరహిత పదవియగు నిర్వాణమును ప్రతివారును పొందవలయు ననియే బోధించి యున్నాడు. వేదవేదాంతాది సమస్తశాస్త్రములను తాను పరిశీలించి, తనయొక్క మనః ప్రశాంత ప్రసన్న పూర్ణ సుఖమునకు ఇవి చాలవని తలంచి గదా! వాటిని బుద్ధ దేవుడు తిరస్కరించుటకు కారణమైనది. ఈ యొక్క కారణము చేతనే, ఆయన యొక్క పురుష ప్రయత్న మహిమ అందరికిని గోచరము గాగలదు. మరియు, ఆత్మయొక్క శాంతిపదము లభించుటకొరకు రాజసౌఖ్యముల నన్నిటిని తృణీకరించి, అక్కాలమున నుండెడి అనేక యోగులను, తపస్వులను, కర్మానుష్ఠాన పరులను, యజ్ఞాదిక్రతువుల నాచరించుచుండు వైదికులను, తత్త్వనిష్ఠాపరులగు సాంఖ్యులు మొదలగు వారి ననేకులను ప్రశ్నించి వారిచ్చిన ప్రత్యుత్తరములచేత తృప్తినొందక వారి భావముల నన్నింటిని పూర్వపక్షముగా చేసి, స్వప్రయత్నమందు నిశ్చితనిష్ఠగలవాడై నిర్వాణము కొరకు, బహుకాలము బహువిధములగు తీవ్రతర తపశ్చర్యా ధ్యానయోగాదుల

నాచరించియు, ప్రసన్న మోక్షసౌఖ్యము గలుగక విసిగి విసిగి వేసారి ఆఖరున తాను చేసిన ప్రతిజ్ఞ యొక్క మహాబలము ఈ క్రింది శ్లోకముచే మీకు గోచరము గాగలదు. ఇది బుద్ధగయయందు బోధి వృక్షము క్రింద నిర్వాణ ప్రాప్తి కొరకు ఆత్మ సంకల్పము చెప్పి కూర్చుండినప్పటి శ్లోకము.

ఇహాసనే శుష్యతు మే శరీరం త్వగస్థి మాంసం ప్రళయం చ యాతు ।
అప్రాప్య బోధిం బహుకల్పదుర్లభాం నైవాసనాత్కాయ మతశ్చలిష్యతే॥

ఈ ఆసనమందు నాశరీరము యెండిపడి భస్మమై పోవుగాక! నాయొక్క అస్థి, నరము, మాంసము మొదలైన వన్నియు ఈ ఆసనములో జీర్ణమై పోవుగాక! నిర్వాణమును పొందక, యీ శరీరము నిచ్చట నుండి చలింపచేయను. ఇక యీ సాంసారికమైన దుఃఖమును నేనోర్వజాలను. అనేక జన్మపరంపరలుగా వచ్చుచుండు తాపత్రయమును నేను సహింపజాలను అని ప్రతిజ్ఞ చేసి సమాధి నిష్ఠలో గూర్చుండెను. అట్లుండిగదా! నిర్వాణమనియు, ముక్తి యనియు, కైవల్యమనియు, మోక్షమనియు, బోధిసత్వమనియు చెప్పెడు దైవపదవిని గలుగ చేయ శక్తి గల్గినది.

ఇదే రీతిగా శ్రీ మహమ్మదునిబియు అరబ్బీ దేశ పర్వతపంక్తిలోని కొండగుహలో పదునైదు సంవత్సరములు తీవ్ర బ్రహ్మనిష్ఠాపరుడై, దేవదూతల చేత దైవ ఆజ్ఞను బడసిన తర్వాత ప్రపంచము లోనికి వచ్చి జనులకు దైవ మహిమను, అనగా ఈశ్వరాదేశమును బోధించినట్లు, కురాన్ షరీఫులో కనపడుచున్నది. శ్రీ యేసుక్రీస్తు గూడ నిర్జనారణ్యప్రదేశములో పదునేడు సంవత్సరములు సత్యాన్వేషణపరుడై, తీవ్రతర తపస్సు చేసినట్లును, ''యోహాను'' అనుప్రబోధకునిచే జ్ఞానస్నానమును పొందినప్పుడు దైవశక్తి ఆకాశమునుండి పావురము రూపముగా దిగివచ్చి తనలో ప్రవేశించినట్లును బైబిల్‌లో కనపడుచున్నది. శ్రీ యేసుక్రీస్తున్ను, శ్రీ మహమ్మదునిబియు, దానికి ముందుండిన శాస్త్రములనన్నిటిని పరిశీలించి, వారి తీక్ష్ణతమమగు ఆత్మజిజ్ఞాసాపరమైన పిపాసను శమింపజేయుటకు అట్టి సత్తైన ఆత్మ రసామృతము కనపడనందుచే,

వాటిని బహిష్కరించి స్వప్రయత్నము పై ఆధారపడి దైవమందర్పించిన హృదయముగల వారై యుండినందుచే గదా! అట్టి ప్రబోధకులైరి. లోకములోగల కోట్లకొలది జనుల అంతఃకరణములో గల శోకాగ్నిని వారియొక్క జ్ఞానామృ తవృష్టిచే చల్లార్చి, ఆత్మశాంతిని గలుగజేసి నిత్యానంద సుఖస్వరూపులుగా చేయ శక్తిగలవారలైరి. శ్రీగురునానక్ గూడ అదేప్రకారము, అప్పుడు గల గ్రంథముల ననేకముల పరిశీలించినను ఆత్మశాంతి గలుగకయు, తాపము శమింపకయు, తపించెడు కాలమున అన్నిటిని విడచి, కౌపీనధారియై, యేకాంత ప్రదేశములో స్వప్రయత్నముపై ఆధారపడి యీశ్వరునియందు సమర్పించిన చిత్తముగలవాడై, అగాధ ధ్యాననిష్ఠలో మగ్నుడై, దైవామృతము తృప్తిగా గ్రోలువరకు బ్రహ్మనిష్ఠలో కాలము గడిపి తర్వాత తాననుభవించిన అమృతమును సర్వజనులకు, వాడు, వీడు అను భేదములేక పంచి జనులను కృతార్థులుగా చేసెను. అట్టి ప్రయత్నముయొక్క మహిమచేగదా! సిక్కుమతమును స్థాపించుటకును, ఉదాసీన సాధుసంతతులను వృద్ధిపరచుటకును కారణమైనది. ఇంకను ఈవిషయమై చెప్పవలసిన విషయము చాలా గలదు. శ్రీకృష్ణపరమాత్ముని ఆశయమగు గీతాశ్లోకముల రెంటిని ఇచట నిరూపణముచేసి శ్రీరామచంద్రుల ముఖ్యాశయముపైకి మనస్సును ప్రవేశపెట్టెదము. అర్జునుండు స్వప్రయత్నపరుడై యుండవలసినదా? లేక మానవలసినదా? యను సందేహముచేత బాధింపబడినవాడై దిక్కు తెలియక, యేమియు తోచక పురుషప్రయత్నము మానుటయే ధర్మమని తలంచి శోకమోహములలో పడిపోయినప్పుడు పరమకారుణ్యనిధి యగు శ్రీకృష్ణభగవానులు ధర్మము నిలబెట్టుటకొరకు సర్వజనులు స్వప్రయత్నపరులై యుండవలయునని యీ శ్లోకముల నుపదేశించిరి.

**కుతస్త్వా కశ్మల మిదం విషమే సముపస్థితమ్ ।**
**అనార్య జుష్ట మస్వర్గ్య మకీర్తికర మర్జున! ॥**

హే అర్జున! = ఓ అర్జునుడా! , అనార్య జుష్టమ్ = అజ్ఞానులచే నవలంబింప బడదగినది, అనగా ఆర్యులుగాని వారలు అనార్యులు. ఆర్యులనగా సంస్కృ తాత్ములు. అనార్యు లనగా అసంస్కృతాత్ములు. లేక ఆర్యులనగా విహిత

కృత్యముల చేయువారు. అనార్యులనగా విహితకృత్యము తెలియనివారే గాక అహితకృత్యములను గూడ చేయువారు, అస్వర్గ్యమ్ = పరలోకసుఖము నడ్డుపఱచు నట్టిదియును, అకీర్తికరమ్ =(ఈ లోకము నందైనను, సుఖముగలదేమో అనిన అట్టులేక) అపకీర్తిని గలుగజేయునట్టిదియు నగు, ఇదం కశ్మలమ్ = ఈ మనోవ్యాకులము (దుఃఖము) లేక కల్మష హృదయులచే ఆచరింపదగినది= కుతః = ఏ కారణముచేత, విషమే = అకాలమందు ( ఒడుదుడుకు సమయమున) లేక సందిగ్ధసమయమున, లేక చేయవలసిన కార్యము ఆసన్నమై యుండగా, త్వా= నిన్ను, సముపస్థితమ్ = పొందినది.

ఓ యర్జునా! అనాగరికులచేత అవలంబింప బడదగినదియు, ఇహపరలోకసుఖముల నపేక్షించువారిచేత విడువబడదగినదియు, అవమానకరమైనదియు నగు కల్మషహృదయులచే అవలంబింపదగినట్టి, యీ స్థితి నీకెట్లు గలిగెను? ఓహో! ఇది చాల ఆశ్చర్యకరమైనది. అనగా స్వప్రయత్నము మానుట పై జెప్పిన నీచగుణముగల జనుల స్వభావమేగాని, శ్రేష్ఠ పురుషుల స్వభావము గాదని, పరిహాసముగా అర్జునుని గురించి ఉద్బోధము చేయుచున్నాడు.

**క్లైబ్యం మాస్మగమః పార్థ! నైతత్త్వయ్యుపపద్యతే ।**
**క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరన్తప! ॥**

హేపార్థ = ఓ అర్జునా! క్లైబ్యం = క్లీబత్వమును, అనగా నపుంసకత్వమును మాస్మగమః = పొందకుము. త్వయి = నీ యందు, ఏతత్ = ఈ నపుంసకత్వము (శోకమోహములు), నోపపద్యతే = తగవు. హే పరన్తప! = శత్రువులను దహింపచేయువాడా! క్షుద్రం = నీచమైన, హృదయదౌర్బర్యం = మనోదుర్బలతను, (పిఱికితనమును) త్యక్త్వా = విడచి, ఉత్తిష్ఠ = లెమ్ము (స్వధర్మనిరతుడవుగమ్ము) పురుష ప్రయత్నపరుడవు గమ్ము).

శత్రువుల పరితపింపచేయు సామర్థ్యముగల యర్జునా! భయపడకుము. నీకీ పిఱికితనము తగదు. అనగా దీనభావమును విడచి పెట్టుము. నీచమైన పిరికితనమును వదలి స్వధర్మనిర్వహణమందు ప్రయత్నపరుడవు గమ్ము. ఈ

శ్లోకమున పురుషప్రయత్నము చేయని వానిని ఆడదానికంటెను, మగవానికంటెను హీనవముగా తెలుపుట కొరకు నపుంసకుడని భగవానుడు చెప్పడమైనది. స్వధర్మపరుడై వర్తించిన అర్జునునికి భగవంతు డేలాగున తోడ్పడి సంరక్షించెనో ఆలాగున స్వధర్మపరమగు పురుషప్రయత్నమందుండు వానిని, సర్వేశ్వరుండు తప్పక కరుణించి రక్షించును అని అర్జునునియొక్క చరిత్రము చేత జనులకు గోచరించుటకొరకు ఇది వ్రాయడమైనది.

**నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః ।**
**శరీరయాత్రా ఽపి చ తే న ప్రసిద్ధ్యే దకర్మణః ॥**

నియతం = (వారి వారి అనుష్ఠానమునకు వేదమందు చేయందగినదిగా) నియమింపబడియుండెడి, కర్మ = ప్రయత్నమును, త్వం = నీవు, కురు = చేయుము. అకర్మణః = నియతకృత్యవము చేయకపోవుట కంటె, కర్మ = నియత పురుషప్రయత్నుడై యుండుట, జ్యాయో హి = శ్రేష్ఠమైనదిగదా! అకర్మణః = స్వకృత్యము చేయకుండునట్టి, తే = నీకు, శరీరయాత్రా ఽపి = దేహసంరక్షణస్థితి గూడ, న చ ప్రసిద్ధ్యేత్ = బొత్తిగా సిద్ధింపదు.

ఓ యర్జునా! వారువారు, ఏయే అనుష్ఠానములలో నుందురో, దానికి సంబంధించిన అనుష్ఠానమును చక్కగ చేయుము. అనుష్ఠాన నిష్ఠలను ఆచరింపనివానికన్న ఆచరించువాడే శ్రేష్ఠుడు. నీవు సరియైన పురుషప్రయత్నము చేయనిచో దేహసంరక్షణ మాత్రమైనను జరుగదుగదా! ఈ శ్లోకమువలన, పురుషప్రయత్న రహితులైనవారికి శరీరసంరక్షణమునకు తగిన అన్నపానాదులుగూడ లభింపవని చెప్పుటలో, పురుషప్రయత్న రహితులకు పరమార్థ నిష్ఠ గల పరమపురుషులచే పొందదగిన మోక్షము లభించునా? యని మరల చెప్పవలయునా? అని భావము. కనుక పురుషప్రయత్నపరులై, పరమార్థ నిష్ఠ గల్గి మీరు కృతకృత్యులగుదురుగాక!

ఇక శ్రీరామచంద్రుల జీవితోద్దేశ్యమునుగురించి కొంచెము చెప్పెదను. శ్రీరామచంద్రులు స్వప్రయత్నపరులై యుండినవిషయము, ఆయనయొక్క

అరణ్యనివాసముచేతను, శత్రువుల నణచుటచేతను, దుష్కృత్యముల చేయు రావణాది రాక్షసులను నిగ్రహించుట చేతను, జంతువులలో చేరిన వానరుల పురికొల్పి వారికి ప్రబోధము గలుగజేసి యుద్ధము చేయించుటచేతను, తేటతెల్లముగ అందరికిని గోచరము గాగలదు. అయితే ప్రవృత్తి మార్గస్థ జీవులకు పురుషప్రయత్నము తగును గాని, నివృత్తిమార్గస్థులై, బ్రహ్మనిష్ఠాపరులై, భగవద్భక్తి నిరతులగు జనులకు అవసరము లేదని తలంచెదరేమో, ఆ సందేహనివారణకొరకు ఈ యుపనిషత్తు ఇచ్చట వ్రాయ ప్రారంభించడమైనది. ఇది ప్రపత్తి మార్గాగ్రగణ్యులును, తపోనిధులును, బ్రహ్మధ్యానపరులును, శ్రీరామ సేవాతత్పరులును, అమనస్క సాక్షాత్కారము గలుగజేసికొనిన వారునగు శ్రీఆంజనేయులవారికి శ్రీరామచంద్రు లుపదేశించిన దివ్యసందేశ మని గ్రహింపుడు. ఇది 108 ఉపనిషత్తులలోని ముక్తికోపనిషత్తు. ముముక్షువులందరిచే ఈ యుపనిషత్తు పఠించదగినది.

హరిః ఓమ్

అయోధ్యానగరే రమ్యే రత్నమంటపమధ్యమే ।
సీతా భరత సౌమిత్రి శత్రుఘ్నాద్యై స్సమన్వితమ్ ॥

సనకాద్యై ర్మునిగణై ర్వసిష్ఠాద్యై శ్శుకాదిభిః ।
అన్యై ర్భాగవతై శ్చాపి స్తూయమాన మహర్నిశమ్ ॥

ధీవిక్రియా సహస్రాణాం సాక్షిణం నిర్వికారిణమ్ ।
భక్త్యా శుశ్రూషయా రామం స్తువన్ పప్రచ్ఛ మారుతిః ॥

మనోహరమగు అయోధ్యానగరియందు, నవరత్న ఖచితమంటపము నందు సీతాదేవితోడను, లక్ష్మణ భరత శత్రుఘ్నాదులతోడను, సనకాది మునులతోడను, వసిష్ఠాది మహర్షులతోడను, శుకాది పరమహంసలతోడను, ఇతరులగు భాగవతోత్తములచేతను, ఎల్లప్పుడు కొనియాడబడుచున్నవాడును, బుద్ధివికార భూతములగు కామక్రోధాదికమునకు సాక్షిభూతుడయి, స్వయముగా వికారశూన్యుడును, స్వస్వరూపానుసంధానము గలవాడును, భక్తుల పాపమును

పోగొట్టువాడును అగు శ్రీరామచంద్రుని సమాధి చాలించిన పిదప, ఆంజనేయుడు భక్తి శుశ్రూషాపూర్వకముగా కొనియాడుచు ఇట్లని ప్రశ్నించెను.

రామ త్వం పరమాత్మాఽసి సచ్చిదానంద విగ్రహః ।
ఇదానీం త్వాం రఘుశ్రేష్ఠ ప్రణమామి ముహుర్ముహుః ॥
త్వద్రూపం జ్ఞాతు మిచ్ఛామి తత్త్వతో రామ ముక్తయే ।

శ్రీరామచంద్రా! నీవు మనుష్యమాత్రునివలె సాధారణముగ గనబడుచున్నను, సచ్చిదానంద స్వరూపుడగు పరమాత్మవే అగుచున్నాడవు. నేను నీకు నమస్కరించుచున్నాడను. మోక్షము నభిలషించినవాడనై నీయథార్థ స్వరూపమును తెలిసికొన గోరుచున్నాడను.

అనాయాసేన యేనాహం ముచ్యేయం భవబంధనాత్ ।
కృపయా వద మే రామ యేన ముక్తో భవామ్యహమ్ ॥

శ్రీరామచంద్రా! ఆయాసకరముగాని, యే యుపాయముచేత నేను సంసారబంధ విహీనుడనయి ముక్తుడ నగుదునో అట్టి యుపాయమును నాకు జెప్పుము.

శ్రీరామచంద్రుడు చెప్పుచున్నాడు.

సాధు పృష్టం మహాబాహో! వదామి శృణు తత్త్వతః ।
వేదాంతే సుప్రతిష్ఠోఽహం వేదాంతం సముపాశ్రయ ॥

ఓ యాంజనేయా! నీవు మంచిప్రశ్నము నొనర్చితివి. సంసార బంధవిమోచనము నన్ను చక్కగా నెరింగినగాని గలుగజాలదు. నేను ఉపనిషద్వేద్యుడను అనగా వేదాంతశాస్త్రముచేత తెలిసికొనందగినవాడను. కావున ఉపనిషత్తులను చక్కగా తెలిసి కొనుము. అనగా బ్రహ్మనిష్ఠావ్రతము పూని, సద్గురువులదగ్గర వేదాంతశ్రవణము చేయుము. అప్పుడు నా యొక్క యథార్థస్వరూపము గోచరమగును.

ఇచ్చటనుండి మనకు కావలసిన ముఖ్యభాగము మాత్రమే యీ

యుపనిషత్తు నుండి గ్రహింపబడును. విస్తారముగ జూడగోరిక గలవారు ముక్తికోపనిషత్తును చూడవచ్చును.

**కర్తృత్వాది దుఃఖనివృత్తిద్వారా నిత్యానందావాప్తిః ప్రయోజనం భవతి, తత్పురుషప్రయత్నసాధ్యో భవతి॥**

నేను కర్తను, నేను భోక్తను, నేను సుఖిని, నేను దుఃఖిని అనెడి దుఃఖమున్నియు నశించి దుఃఖనివృత్తిద్వారా స్వస్వరూపభూత నిత్యానందమును, పొందుటయే ప్రయోజనము. అయ్యది పురుష ప్రయత్నసాధ్యము.

**యథా పుత్రకామేష్టినా పుత్రం, వాణిజ్యాదినా విత్తం, జ్యోతిష్టోమేన స్వర్గం, తథా పురుషప్రయత్న సాధ్య వేదాంతశ్రవణాది జనిత సమాధినా జీవన్ముక్త్యాదిలాభో భవతి.**

లోకమునందు జనులు పుత్రకామేష్టి యను పురుషప్రయత్నము నాచరించి పుత్రుని బొందుచున్నారు. కృషివాణిజ్య ఉద్యోగాదిరూప పురుషప్రయత్నము నాచరించి ద్రవ్యమును బొందుచున్నారు. జ్యోతిష్టోమాది యజ్ఞములను పురుషప్రయత్నముచే చేసి స్వర్గమును బొందుచున్నారు. అదేవిధముగా పురుషప్రయత్నము చేత ఆచార్య సమీపమునందు, ఉపనిషచ్ఛ్రవణ మొనర్చి తదర్థ మనననిదిధ్యాసనాదికముచేత కలిగిన ఐక్య సాక్షాత్కారరూప సమాధిచే జీవన్ముక్తి విదేహముక్తులు లభించును.

భక్తులారా! ముముక్షువులారా! పురుషప్రయత్నము విషయమై దీనికన్న ఎక్కువ ప్రమాణ మింకేమి కావలయును? మన అందరి కులదైవమగు శ్రీరామచంద్రులు, బ్రహ్మనిష్ఠావిద్వరిష్ఠులగు శ్రీ అంజనేయస్వామికి ఉపదేశించిన ఉపనిషత్సారము మీరు విన్నారు గదా!

**సర్వవాసనాక్షయాత్తల్లాభః ॥**

సమస్తదృశ్యవాసనాత్రయ నాశమువలన ఆ జీవన్ముక్తి విదేహముక్తులు లభించును.

**ఉచ్ఛాస్త్రం శాస్త్రితం చేతి పౌరుషం ద్వివిధం స్మృతమ్ ।**
**తత్రోచ్ఛాస్త్ర మనర్థాయ పరమార్థాయ శాస్త్రితమ్ ॥**

పురుషప్రయత్నము ఉచ్ఛాస్త్రమనియు, శాస్త్రితమనియు ద్వివిధము. ఉచ్ఛాస్త్ర మనగా? శాస్త్రము నతిక్రమించినది. శాస్త్రిత మనగా శాస్త్రము ననుసరించినది. ఉచ్ఛాస్త్రమగు పౌరుష ప్రయత్నమువలన నరకము సంభవించును. శాస్త్రిత మగు పౌరుష ప్రయత్నమువలన ముక్తి లభించును.

**ద్వివిధో వాసనా వ్యూహ శ్శుభశ్చైవాశుభశ్చ తే ।**
**వాసనౌఘేన శుద్ధేన తత్ర చే దనునీయసే ॥**

**తత్క్రమేణైవ తేనాశు మామకం పదమాప్ను హి ।**
**అథ చేదశుభో భావ స్త్వాం యోజయతి సంకటే ॥**

వాసనలు అనగా పుర్వజన్మ సంస్కారములు శుభములనియు, అశుభము లనియు ద్వివిధములు. ఆ రెంటిలో పరిశుద్ధమైన శుద్ధ వాసనాసమూహముచేతనే నీ వనుగ్రహింపబడిన యెడల దానిచేత క్రమముగ నాస్థానమును బొందుదువు. అనగా ముక్తిని పొందెదవని భావము. లేక అశుభవాసనలే బలముగానుండి అవియే నీకు మిక్కుటముగ నుండునెడల అవి నిన్ను సంకటమగు నరకకూపమున బడద్రోయును.

**ప్రాక్తనస్తదసౌ యత్నా జ్జేతవ్యో భవతా కపే ।**
**శుభాశుభాభ్యాం మార్గాభ్యాం మహంతీ వాసనా సరిత్ ॥**

ఓ యాంజనేయా! పూర్వజన్మకృత పుణ్యాపాపసంస్కార రూప వాసనలను ధృఢమైన పురుష ప్రయత్నముచేత జయించి కృతార్థడవు గమ్ము. పూర్వజన్మ కృత కర్మవాసనాత్మకమగు నది శుభాశుభములను మార్గములచేత ప్రవహించుచున్నది. అనగా శుభాశుభము లనియెడి పుణ్యాపాపములచేత మిశ్రితమై యుండును.

**పౌరుషేణ ప్రయత్నేన యోజనీయా శుభే పథి ।**
**అశుభేషు సమావిష్టం శుభేష్వేవావతారయేత్ ॥**

పురుషప్రయత్న బలమువలన మనస్సును శ్రేయఃప్రదమగు మార్గమునందే చేర్పవలయును. అశుభవాసనలయందు సంలగ్నమైన మనస్సును శుభములగు శమాదిగుణములయందే చేర్పవలయును. మనస్సు శుద్ధసత్త్వమై, బ్రహ్మమున కాధారభూతముగ నుండుట శుభవాసన, మనస్సు విషయవాసనయందు దగిలి యుండుట అశుభవాసన.

జన్మాంతరశతాభ్యస్తా మిథ్యా సంసార వాసనా ।
సా చిరాభ్యాసయోగేన వినా న క్షీయతే క్వచిత్ ॥

ఓ యాంజనేయా! ఈ సంసార సంబంధమగు విషయవాసన వందల కొలది జన్మములనుండి సంస్కారరూపముగా వచ్చుచున్నది. ఇది చిరకాలాభ్యాస బ్రహ్మచింతనచేతనే నశించును. వేరు మార్గము లేదు.

తస్మాత్సౌమ్య! ప్రయత్నేన పౌరుషేణ వివేకినా ।
భోగేచ్ఛాం దూరతస్త్యక్త్వా త్రయమేవ సమాశ్రయ ॥

ఓ యాంజనేయా! వివేకవంతుడవగు నీవు, జ్ఞానయోగముచేత దృశ్యాది విషయ భోగవాంఛను దూరముగా వదలి, తత్త్వజ్ఞాన వాసనా క్షయమనో నాశములను మూడింటినే ఆశ్రయింపుము.

ద్వే బీజే చిత్తవృక్షస్య ప్రాణస్పందన వాసనే ।
ఏకస్మిం శ్చ తయోః క్షీణే క్షిప్రం ద్వే అపి నశ్యతః ॥

మనస్సను వృక్షమునకు ప్రాణస్పందము, మలినవాసన అనెడు బీజద్వయము గలదు. ఆ బీజద్వయమునందు, ఒక్కటి నశించిన, రెండవది తనంతట తానే నశించును. దృఢాపరోక్షజ్ఞానము వలన వాసనాక్షయము గల్గును. వాసనాక్షయము వలన ప్రాణస్పందనము మానును. ఈ రెండును పై విధముగా నశింపగా చిత్తవృక్షము సమూలముగా నశించును.

వాసనా సంపరిత్యాగా చ్చిత్తం గచ్ఛత్యచిత్తతామ్ ।
అవాసనత్వా త్సతతం యదా న మనుతే మనః ।
అమనస్తా తదోదేతి పరమోపశమప్రదా ॥

మలినవాసనలను సమూలముగ వదలినయెడల చిత్తము అచిత్తత్వమును బొందుచున్నది. శ్రవణాదులచేతను, శమదమాదికములచేతను, అమానిత్వాదిగుణములచేతను, చిత్తము స్వవికారముతోడ నశించి, శుద్ధమయి వెలయును. వాసనలు శూన్యము లగుటచేత నిరంతరము బ్రహ్మస్వరూపము సాక్షాత్కరించును. కావున అత్యంతము శాంతిరూపమైన అమనస్కయోగము లభించును. అమనస్కయోగ మనగా, పరమోపశమము నొసంగునట్టి స్వస్వరూపావస్థానమే యని భావము.

**అవ్యుత్పనమనా యావద్భవా నజ్ఞాతతత్పదః ।**
**గురుశాస్త్రప్రమాణైస్తు నిర్ణీతం తావదాచర ॥**

ఓ యాంజనేయా! నీ మనస్సునందు బ్రహ్మాకారముగు బుద్ధి యేర్పడక, ఆ బ్రహ్మ మిట్టిదనియెడి దృఢజ్ఞానము యెంతదనుక నీకు గలుగదో, అంతవరకు ఆచర్యోపదిష్టము లైనట్టియు, శాస్త్రప్రమాణసిద్ధము లైనట్టియు, శ్రవణమనననిది ధ్యాసనములను బ్రహ్మబోధసాక్షాత్కార పర్యంతము ఆచరింపుము.

ఇక పురుషప్రయత్నము విషయమై జీవుల ప్రబోధముకొరకు తైత్తిరీయోపనిషత్తు చెప్పిన కొన్ని ధర్మవాక్యములను ఇచ్చట పొందుపరచెదను. ఇవి గురుకుల వాసముచేసి విద్య పూర్తియైన తర్వాత, స్వగృహమునకు బోవునపుడు ఆచార్యుండుపదేశించి పంపెడు ధర్మవాక్యములు. వీటినుండి యిచ్చట ముఖ్యముగా మనకు కావలసినది మాత్రము వ్రాయబడుచున్నది.

ఉప:- సత్యం వద, ధర్మం చర, స్వాధ్యాయాన్మాప్రమదః, సత్యాన్న ప్రమదితవ్యం, ధర్మాన్న ప్రమదితవ్యం, కుశలాన్న ప్రమదితవ్యం, భూత్యై న ప్రమదితవ్యం, స్వాధ్యాయ ప్రవచనాభ్యాం న ప్రమదితవ్యం, దేవపితృ కార్యాభ్యాం న ప్రమదితవ్యం, మాతృదేవో భవ, పితృదేవో భవ, ఆచార్యదేవో భవ, అతిథి దేవో భవ, యాన్యనవద్యాని కర్మాణి తాని సేవితవ్యాని, నో ఇతరాణి,యాన్యస్మాకం సుచరితాని, తాని త్వయోపాస్యాని, నో ఇతరాణి, యేకేచాస్మచ్ఛ్రేయాంసో బ్రాహ్మణాః, తేషాం త్వయాసనేన ప్రశ్వసితవ్యం, శ్రద్ధయా దేయం,

అశ్రద్ధయా ఽదేయం, శ్రియా దేయం? హ్రియా దేయం, భియా దేయం, సంవిదా దేయం, అథ యది తే కర్మవిచికిత్సా వా వృత్త విచికిత్సా వా స్యాత్, యే తత్ర బ్రాహ్మణాస్సమ్మర్శినః, యుక్తా, ఆయుక్తాః, అలూక్షా ధర్మకామాస్స్యుః, యథా తే తేషు వర్తేరన్ తథా తేషు వర్తేథాః, అథాభ్యాఖ్యాతేషు, యే తత్ర బ్రాహ్మణాస్సంమర్శినః, యుక్తా ఆయుక్తాః, అలూక్షా, ధర్మకామాస్స్యుః, యథా తే తేషు వర్తేరన్ తథా తేషు వర్తేథాః, ఏష ఆదేశః, ఏష ఉపదేశః, ఏషా వేదోపనిషత్, ఏత దనుశాసనం, ఏవ ముపాసితవ్యం, ఏవ ముచైతదుపాస్యమ్ ఇత్యేకాదశో ఽనువాకః.

ఓ శిష్యుడా! నీవు సత్యమును పలుకుము. ధర్మమును చేయుము. అధ్యయనమువలన ప్రమాదమును బొందకుము. సత్యమువలనను, ధర్మమువలనను, ఆత్మరక్షణకొరకైన కర్మవలనను, ఐశ్వర్యముకొరకైన మంగళయుక్తమగు కర్మవలనను, దేవపితృకార్యములవలనను ప్రమాదమును బొందవద్దు. తల్లితండ్రులను, ఆచార్యులను, అతిథిని వీరలను దైవముగా తలంచుము. అనిందితములగు కార్యములను చేయుచు, నిందిత కార్యములను విడువుము. మనకు మిక్కిలి శుభములగు ఆచారములను చేయుచు, అశుభములగు వాటిని విడువుము. ఆచార్యత్వాదిధర్మములచేత మాకంటె ప్రశస్తులగు బాహ్మణు లెవరు గలరో, వారికి ఉచితాసనాది దానములచేత శ్రమను పోగొట్టుచు వారు చెప్పెడి ధర్మములను మాత్రమే గ్రహించుచు, వారు ఏవైనను కొన్ని ధర్మవిషయములను గూర్చి మాట్లాడుచుండగా, అతివినయము గలవాడవై ఆ ధర్మసారములను మాత్రము గ్రహించుము. వారికి విరోధముగా నిట్టూర్పునైనను విడువకూడదు. అట్టివారల కేమైనను ఇచ్చుటకు సంప్రాప్తమైనప్పుడు దానిని వారికి మిగుల శ్రద్ధతోను, సంపదతోను, లజ్జతోను, భయముతోను, మిక్కిలి మైత్ర్యాది జ్ఞానముతోను ఇయ్యవలయును. అశ్రద్ధతో ఎంతమాత్రమును ఇయ్యకూడదు. నీకు కర్మయందుగాని, ఆచారమునందుగాని, ఏదైనను సందేహము గలిగెనేని, ఆకాలమునందాదేశమునందు ధర్మాధర్మవిచారణ సమర్థులును, ఆచార్యులును, స్వతంత్రులును, క్రూరతలేనివారును, కామహతులు

కానివారు నగు బ్రాహ్మణ శ్రేష్ఠులు ఆ కర్మాచారముల యందెట్లు ప్రవర్తించు చుందురో నీవును అట్లు ప్రవర్తించుము. అట్టి బ్రాహ్మణ శ్రేష్ఠులకును, సందిగ్ధములగు కర్మాచారములయందు, ధర్మాధర్మవిచారణ సమర్థులును, ఆచార్యులును, స్వతంత్రులును, అక్రూరులును, అకామహతులునై, ఆయాకాలమునందాయా దేశమునందుండెడి బ్రాహ్మణశ్రేష్ఠులు ఆ కర్మాచారముల యందెట్లు ప్రవర్తించుదురో, నీవును అట్లే ప్రవర్తించుము. ఇదియే యుపదేశము. ఇదియే వేదరహస్యము. ఈ ప్రకారముగానే యుపాసన చేయతగినది.

ఈ ఉపనిషద్వచనములచే వారివారి కేర్పడిన ధర్మముల నిర్వహించి పురుషప్రయత్నము విడనాడక యుండవలయు ననియే అర్థమగుచుండును



# సనాతన ధర్మము

అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయమక్లేద్యోఽశోష్య ఏవ చ ।
నిత్య స్సర్వగతః స్థాణురచలోఽయం సనాతనః ॥

ఈ యాత్మ శస్త్రములచేత ఛేదింపనలవి గానిది, అగ్నిచే దహింపనలవి గానిది, జలముచే తడుప నలవిగానిది, వాయువుచే ఎండింపను నలవి గానిది, నాశము లేనిది అనగా నిత్యమైనది. అంతటను వ్యాపించియుండునది. స్థిరరూపమగునది. చలనము లేనిది. సనాతనమైనది. అనగా ఎల్లప్పుడును ఒకే విధముగా నుండునది. కావున అనాదియైనది అని శ్రీకృష్ణ భగవానులు సనాతనాత్మను గుఱించి గీత ద్వితీయాధ్యాయములో ఉపదేశించియున్నారు. ఇట్టి పరమతత్త్వమగు ధర్మ రహస్యమును తెలిసికొనక జనులు ఒక్కొక్క కాలమున ఒక్కొక్కరిచే, ఆయా కాలమున కనుసారముగా ఏర్పాటు చేయబడు వర్ణాశ్రమధర్మమును సనాతనమని తలంచి ఆత్మజ్ఞులై యుండవలసినవారు అనాత్మధర్మములను సనాతనములని చెప్పుటలో ఆశ్చర్యము కల్గుచున్నది. ఏలన?

సనాతన శబ్దముయొక్క అర్థమేమియో అని కొంచమైన యోచింపక కాలానుగుణముగా ఏర్పాటు చేయబడిన కార్యమును సనాతన మని విశ్వసించుట విచారశూన్యత యొక్కయు, సదాచారరహితత్వము యొక్కయు, బాహ్యాచార శూరత్వము యొక్కయు ఫలమనియే విజ్ఞులు తలంతురు. త్రికాలాబాధ్యమైనది సనాతన మని చెప్పబడును. అనగా సృష్టి స్థితి, లయములకును, భూత, భవిష్యత్, వర్తమానకాలములకును అంటనిదియును పై జెప్పిన వానిచే వికారము కలుగనిదియునగు ఈశ్వర త్రిపుటి లేనిదియు, జాగ్రత్స్వప్నసుషుప్తులకును స్థూల సూక్ష్మ కారణములకును తగులని జీవత్రిపుటులకు విలక్షణమై యుండు ఆత్మవస్తు వొక్కదానినే సనాతనమని చెప్పుట కలవి యగును. తక్కిన వర్ణాశ్రమ ధర్మములన్నియు బాల్య, యౌవన, వార్ధక్యాదులగు మార్పు లేలాగున దేహమునకు కల్గుచుండునో, ఆలాగున అవశ్యముగా మార్పు జెందుచుండును. ఇది యీశ్వర నియతిగా నున్నది. ఈ తత్త్వము తెలియకపోవుటచేతనే సనాతనము నశించుచున్నదని ఆత్మజ్ఞానరహితులు తలంచుచున్నారు.

ఇట్టి ఆత్మజ్ఞాన దృష్టికి భిన్నమైన అనాత్మబుద్ధి మన హిందూధర్మమునకు తగదు. భారతీయ దీర్ఘదర్శులగు ఋషులు దైవవస్తుమగు ఆత్మ ఒక్కదానికి మాత్రమే సనాతనధర్మత్వము నంగీకరించి యున్నారు. తక్కిన ధర్మములన్నియు కాలానుగుణముగా మార్చవలసినవి యనియే ఆ ఋషిసత్తముల అభిప్రాయమై యున్నది. ఒకవేళ మనుజులు మార్పు చేయనీయక చూచినను స్వయముగ అది మారుచునే యుండును. ఒక్క ఋతువును మార్పుచేయక యెల్లప్పుడును అదేరీతిగా ఏమనుష్యుడు నిలబెట్టచూచిన అది సాధ్యమగునా? ఈశ్వర నియమమగు కాలచక్రము నడ్డగించుటకు యత్నించుట బండి చక్రమున కడ్డుగా ఈగపోయి నిలచినట్లే యుండును. ఆత్మజ్ఞులగు ఋషివర్యులు ఈ తత్త్వము నెఱింగియే కాలమున కనుగుణముగా కళలను, అనగా శాస్త్రముల నేర్పాటు చేసిరి. దీనికి సంబంధించెడు ప్రమాణములు వెనుక వ్రాయబడును. దేహమును సనాతనమని చెప్పినచో అది యెన్నటికిని మార్పు చెందరాదు. అట్లు కనుపించుట లేదు. దేహ మీలాగున స్వభావవికారముతో గూడి యున్నది. అనగా పుట్టుట,

ఉండుట, వృద్ధినొందుట, పరిణమించుట, క్షయించుట, నశించుట అని ఆరు విధములగు వికారములు గలిగియుండు ఈ దేహమును, దాని ధర్మమును సనాతనమని చెప్పుటకంటె తాను వంధ్యాపుత్రుడని గాని, తన తండ్రి బాలబ్రహ్మచారి యనిగాని చెప్పుటయే మేలుగా నుండును. ఒక్కొక్క ధర్మమును గురించి యోచించిన యీ తత్త్వము సులభముగా గోచరమగును. ఎట్లన? ఈ దినము హిందువైనవాడు రేపు మహమ్మదీయు డగుచున్నాడు. మహమ్మదీయుడే హిందువుగా మారుచున్నాడు. హిందువే బౌద్ధుడగు చున్నాడు. బౌద్ధుడే హిందువగుచున్నాడు. లేక హిందువు క్రైస్తవు డగుచున్నాడు. క్రైస్తవుడు జైనుడగుచున్నాడు. జైనుడు పారసీకుడై పోవుచున్నాడు. శైవుడు వైష్ణవుడగుచున్నాడు. వైష్ణవుడు శివభక్తుడగుచున్నాడు. ఆలాగున సనాతనుడని చెప్పువాడు ఆర్యమతస్థుడగు చున్నాడు. ఆర్యమతావలంబి సనాతనులలోనికి జేరుచున్నాడు. ఆలాగుననే వైదికుడు బ్రహ్మమతస్థ డగుచున్నాడు; బ్రహ్మమతస్థుడు వైదికుడగుచున్నాడు. ఈ పై జెప్పిన వారందరును వారి వారి ధర్మము సనాతనమనియే ఉద్ఘోషించుచున్నారు. అది నిజమైనచో సనాతనమైన దానికి మార్పు గలుగకూడదు గదా? దైవసృష్టిలో నుండుదానికి మార్పు గలుగదు. మృగములను చూడుడు. అజ, గజ, అశ్వ, గో, మహిష, భల్లూకాదులకును, పక్షివర్గములో శుక, బక, పిక, మయూరాదులకును, వృక్షవర్గములలో పొన్న, పున్నాగ, ఆమ్ర, తింత్రిణీ, అశ్వత్థాది వృక్షములకును, ఏలాగున మార్పు చేయతరము గాదో, అట్లుండిన ఈలాటి మార్పులేల గల్గుచుండును? మఱియు, బ్రహ్మచారి గృహస్థుడై పోవుచున్నాడు. గృహస్థుడు వానప్రస్థములోనికి మారుచున్నాడు. వానప్రస్థుడు సన్న్యాసి యగుచున్నాడు. సన్న్యాసి అవధూత యగుచున్నాడు. మఱియు, బాలుడు యౌవనస్థ డగుచున్నాడు. యువకుడు వృద్ధు డగుచున్నాడు. ఈలాటి పరిణామము గల దేహధర్మమును సనాతనమని యెట్లు చెప్పవచ్చును?

అయితే సనాతనమైన ఆత్మకు మాత్రము మార్పు గలుగుట లేదు. ఎట్లన? హిందువై యుండునప్పుడు గల ఆత్మయే క్రైస్తవుడై యుండునప్పుడును,

క్రైస్తవుడై యుండునప్పుడు గల ఆత్మయే హిందువై యుండునప్పుడును, శైశవావస్థలో నుండు ఆత్మయే వార్ధక్యదశయందున్నప్పుడును, బ్రహ్మచర్యావస్థలో గల ఆత్మయే సన్న్యాసావస్థలోను ఉండును. ఆలాగున ఇతరమతముల మార్పులు గలుగు నప్పుడు గూడ ఆత్మకు మార్పు లేదు. కావుననే శ్రీకృష్ణభగవానులు సనాతన శబ్దమును ఆత్మకు అన్వయించుటకు కారణమైనది. మనము ఆత్మ దృష్టినుండి, బహిర్దృష్టిలోనికి చాల దిగివచ్చినందుచే, ఈ బాహ్యాచారములన్నియు, సనాతనములని తలంచుచున్నాము. ఆభరణ లనేకములు. ఇవి మనుష్య సృష్టిగా నున్నవి. సువర్ణ మేకరీతిగా నుండును. ఇది ఈశ్వర సృష్టిగా నున్నది. ఈశ్వర సృష్టి సనాతనము. మనుష్య సృష్టి యశాశ్వతము, చంచలము. ఏలన ఒక్కయాభరణమును, మఱియొక ఆభరణముగ జేయవచ్చును. కాని సువర్ణమును మాత్రము మార్పుచేయ సాధ్యము కాదు. ఆలాగున ఇప్పుడు కానుపించెడు కులధర్మములు, ఈశ్వర సృష్టియైనచో మార్పు నొందజాలవు. ఇవి మనుష్య సృష్టియగుటచేతనే ఒక్క మతస్థుడు మఱియొక మతములోనికి మారుచుండును. ఆలాగున లోహమీశ్వర నిర్మితము, విగ్రహములు మనుష్యనిర్మితములు, కనుకనే శ్రీ కృష్ణవిగ్రహము కరిగించి శ్రీరామవిగ్రహముగా మార్చుటకును, లక్ష్మీవిగ్రహమును నారాయణ విగ్రహముగా చేయుటకును, క్రైస్తవక్రాసును అనగా శిలువను, మహమ్మదీయ చంద్రునిగా మార్చుటకును, హిందూ విగ్రహమును కరుగజేసి బౌద్ధవిగ్రహముగా నిర్మించుటకును వీలగుచుండును. అయితే నామరూపములు రెండును మార్పు చెందునేగాని, లోహము మాత్రము మారుటలేదు. కావున ఇప్పుడు కానుపించెడు వర్ణములుగాని, ఆశ్రమములుగాని, మనుష్య నిర్మాణములు. ఈశ్వర నిర్మాణములు గావు. ఈశ్వర నిర్మాణము లైనచో, వానికి మార్పు గలుగకూడదు. కనుకనే శ్రీ శంకరులు ఈలాగున నుపదేశించుటకు కారణమైనది.

**అస్తి భాతి ప్రియం రూపం నామ చేత్యంశపంచకమ్ ।**
**ఆద్యత్రయం బ్రహ్మరూపం జగద్రూపం తతో ద్వయమ్ ॥**

ప్రపంచములో సత్తు, చిత్తు, ఆనందము, నామము, రూపము అను

అయిదు పదార్థములు గలవు. మొదటిదగు సత్తు, చిత్తు, ఆనందము బ్రహ్మలక్షణములు. ఇది సనాతనము. అనగా శాశ్వతము. నామరూపములు రెండును జగద్రూపము. అశాశ్వతము. కావున మేధాసంపత్తి గలవారు బ్రహ్మలక్షణము లగు సత్పదార్థముల మూడింటిని గ్రహించి, మాయా రూపములగు నామ రూపములను విడువవలయును. ఇచ్చట వర్ణాశ్రమముల విడిచిపెట్ట వలెనని నా అభిప్రాయముగాదు. అయితే, అది శాశ్వతమైన ఉనికి గలది గాదని మాత్రము తలంచి జనుల ఆత్మాభివృద్ధికి తగిన ఉన్నత పదవిలో ప్రవేశించుట కేలాటి యాటంకము లేదని మాత్రము చెప్ప వలసియున్నది. మఱియు ఆత్మబోధములో ఈలాగున చూడందగును --

**నానోపాధివశాదేవ జాతినామాశ్రమాదయః ।**
**ఆత్మన్యారోపితాస్తోయే రసవర్ణాదిభేదవత్ ॥**

స్వభావముచేతనే మధురమైన జలమునందు చేదు, పుల్లన, తీయన, ఎఱుపు, పచ్చన మొదలైన గుణములు గల పదార్థముల యొక్క సంబంధములచేత ఆయా పదార్థములయొక్క రుచియును, రూపమును, ఏలాగు ఆరోపింపబడుచున్నదో ఆలాగే నానా విధములైన శరీరములవలన పరిశుద్ధమైన ఆత్మయందు బ్రాహ్మణత్వాదిజాతులును, దేవ దత్త యజ్ఞదత్తాది పేర్లును, బ్రహ్మచర్య సన్న్యాసాద్యాశ్రమములును, మఱియు విలోమాదిజాతులును, ఇవి యన్నియు నవివేకముచే కల్పింపబడినవి గాని వాస్తవములు కావు. దీనికన్న ప్రబలమైన ప్రమాణ మింకేమి కావలయును? పై జెప్పిన లాగున ఘటపటాదులను గూడ చూడవలయును. ఘటము లనేక విధములుగా నుండినను, మృత్తికమాత్ర మేక రూపముగానే యుండును. ఆలాగున, వస్త్రములు బహువిధములుగా నుండినను, పలురంగులతో గూడి యుండినను, వానికి కారణమగు ప్రత్తిమాత్రమొకే విధముగానే యుండును. ఈలాటి విషయములలో దీర్ఘముగా విచారించిన మనయొక్క దృష్టిసత్యమునుండి ఎంత దూరముగా పోయి యున్నదో గోచరించును. ఆత్మజ్ఞులై యుండవలసిన మన హిందువులు, అనాత్మజ్ఞులై యుండుట పూర్వీక ఋషులకు కళంకమును తెచ్చి పెట్టుటయే. స్థూలములైన

యెరుపు, నలుపు, పసుపు మొదలుగాగల రంగులను చూచి తెల్లగానుండు నూలును మరచి పోయినాము. ఓహో! దీనికన్న అజ్ఞానమేమి గలదు? మాయ ప్రవేశించి, యెంతవరకాక్రమించుకొనెను? కేవలము అసత్తులోనికి మార్చి వేసెను గదా! ఏమి యాశ్చర్యము! స్వధర్మమును గుఱించి ఆత్మ బోధములో ఈలాగున కనుపించుచున్నది.

ప్రకాశోఽర్కస్య తోయస్య శైత్యమగ్నేర్యథోష్ణతా ।
స్వభావ స్సచ్చిదానంద నిత్యనిర్మలతాఽఽత్మనః ॥

సూర్యునికి ప్రకాశమును, నీళ్ళకు చల్లదనమును, అగ్నికి ఉష్ణత్వమును స్వతస్సిద్ధమైన స్వభావమైనట్లు, ఆత్మకును సచ్చిదానంద నిత్య నిర్మలతాదులే స్వభావమని, అనగా స్వరూపమని ముముక్షువు తెలిసికోవలసినదనుట. ఇదే నిజమైన అందరి యొక్క స్వధర్మమై యున్నది. ఇది సనాతనము. దీనికి మార్పు గలుగదు.

ఇట్టి యథార్థతత్వము నరయక కొందఱు దేహమునకు సంబంధించినది స్వధర్మమనియు, మఱికొందరు వేషమునకు సంబంధించినది స్వధర్మమనియు, ఇక కొందరు తాముచేయు పనికి సంబంధించినది స్వధర్మమనియు, వేరు కొందరు మనస్సుయొక్క గుణమే స్వధర్మమనియు, కొందరు బుద్ధియొక్క కుశలతను స్వధర్మమనియు, కొందరు తాను జన్మించిన కులమునకు సంబంధించినది స్వధర్మమనియు, కొందరు తాముండు పదవికి సంబంధించినది స్వధర్మమనియు తలంచి యున్నారు. నిజముగా విచారించిన ఇవి యేవియు స్వధర్మములు కావు. ఆత్మదృష్టితో జూచిన ఇవియన్నియు అధర్మములే యగును. ఇది స్వభావగుణము గాదు. దుస్స్వభావమే యగును. ఆహా! సత్తైయుండు ఆత్మను అసత్తు ఏలాగున నపహరించుకొనినదో మహా ఆశ్చర్యముగా నున్నది. ఈ రహస్యమును తెలియకనే కొందరు ఇది నా స్వభావము, అది వాని స్వభావము అని చెప్పుచు కలహము చేయుచుందురు. నిజముగా విచారించిన ఈ చెప్పినవన్నియు నీ స్వభావము గాదు. వాని స్వభావమును గాదు. మఱి యేమన? అస్వభావమే యగును.

ఏలన? ఇవి యన్నియు దేహేంద్రియ వేష భాషా స్థల స్థానములయొక్క స్వభావములే యగును. కనుకనే నా స్వభావమని చెప్పు రహస్యము. అప్పుడు వాడు వేరుగాను, వాని స్వభావము వేరుగాను ఉండును గదా! అట్లయిన గుణములు వేరుగాను, వాని అన్నిటికిని సాక్షిగా నుండు ఆత్మ వేరుగాను ఉండును. కనుక ఘటద్రష్టృన్యాయము ననుసరించిన యీ గుణములన్నిటికిని ఆత్మ వేరుగా నుండును. అదే నిజమైన స్వభావము. దానియందు నిలకడగల్గి అట్టి సత్స్వభావముతో నుండువాడే యథార్థమైన స్వధర్మానుష్ఠానము గలవాడు. వాడే నిజమైన సనాతనుడు. అట్టి అవస్థ గలుగని వారెవరును సనాతన ధర్మావలంబులు గారు.

ఈ రహస్యము కనుగొనుటకు ఒక యుపాయము గలదు. అదేమన? ఒక గొప్పసత్రములో నానాదేశీయులును, నానావర్ణస్థులును, ఆశ్రమస్థులును, స్త్రీలును, పురుషులును దిగియుండిరి. రాత్రులలో అందరును తలుపులు వేసికొని పండుకొనుట ప్రారంభమైనది. అత్తరి ఆ నగరములో పారా దిరుగుచుండు పోలీసువాడు వచ్చి ఒక్కొక్క తలుపుదగ్గరకు వెళ్ళి దీనియందెవడు అని తలుపుతట్టి యడిగెను. అప్పుడు లోపలనుండువాడు, "నేను" అని జవాబు చెప్పెను. మఱియొక గది తలుపుదగ్గరకు పోయి అడిగినప్పుడు కూడ దానియందుండువాడు, "నేను" అని పలికెను. అదేప్రకారము అన్ని గదులలోనికి పోలీసువాడు వెళ్ళి అడిగినప్పుడు "నేను నేను" అని అందరును ఒక్కే విధముగగానే జవాబిచ్చిరి. రెండవసారి ఆ పోలీసువాడు ఒక్కొక్క కొట్టుదగ్గరకువెళ్లి "నీవు ఎవరు" అని అడిగినప్పుడు ఒక్కడు తాను బ్రాహ్మణుడననియు, ఇంకొకడు క్షత్రియుడననియు, మరియొకడు వైశ్యుడననియు, వేరొకడు శూద్రుడననియు, ఒక్క గదిలో స్త్రీని అనియు, ఒకదానిలో క్రైస్తవుడననియు, వేరొక్కదానిలో మహమ్మదీయుడననియు, ఇంకొకదానిలో బౌద్ధుడననియు, వేరొకదానిలో హిందువుననియు బదులు చెప్పిరి. దీనివల్ల తృప్తినొందక పోలీసువాడు వారివారి పేరు అడిగినప్పుడు వారివారి నామధేయములు గూడ వేరువేరుగా చెప్పిరి. మరల ఊరును వేరువేరుగానే

యుండెను. తరువాత జెప్పగా దేశదేశములును, వేరువేరుగానే యుండెను. ఇదే సృష్టియొక్క రహస్యము. మొట్టమొదట అందురును అహం శబ్దార్థవాచ్యుడైన ప్రత్యగాత్మను గురించి చెప్పునప్పుడు అందరును ఏకరూపమై యుండిరి. అచ్చట అనేకత్వముండలేదు. క్రిందకి రాగా రాగా నామమును, వర్ణమును, ఆశ్రమమును, మతమును, దేశమును, స్త్రీ పురుష భేదములును, ఏర్పడి పోయెనుగదా? ఇదే మాయావిజృంభణముయొక్క మహిమచే గలిగెడు ప్రవృత్తియొక్క గుణమని తెలిసికొనవలయును. కావున స్వధర్మాచరణపరులును, సనాతనులును, మొట్టమొదట సత్రములో నుండు వారందరు, 'నేను నేను'' అని యేలాగున పలికిరో, ఆతత్త్వమెద్దియో దానిని కనుగొనినచాలును. అచ్చట ప్రకృతి రహితమైన అద్వైతామృతజ్ఞానము గల్గును. అదే సహోదరస్థలము. అదే అనేకత్వములో ఏకత్వమును కనుగొనెడి రహస్యము. ఇచ్చట సత్యమును తెలిసికొనుటకు ఆత్మానాత్మవిచారణము చేయుట కర్తవ్యము.

నిషిధ్య నిఖిలోపాధీ౯ నేతినేతీతివాక్యతః ।
విద్యాదైక్యం మహావాక్యై ర్జీవాత్మపరామాత్మనోః ॥

లోకమునం దనేకములగు బండరాళ్లలో నొక మంచి రత్నమున్నప్పుడు, పరీక్షకుని మాటచేత బండరాళ్లు రత్నములు కావని తెలిసికొను తీరుననే నామరూపాత్మకమైన సమస్తోపాధులును, ఆత్మ కావని వేదమందు నిషేధించిన ప్రకారము తెలిసికొని నదీసముద్రములు భూరూపోపాధివల్ల గొప్పది, చిన్నదని వ్యవహారమందు చెప్పినప్పటికిని, భూవిశేషరూపోపాధిని త్రోసి విచారించిన యెడల వాస్తవార్థమందు నీళ్లంతయు నొక్కటిగా తోచినట్లు జీవాత్మ పరమాత్మలకు కించిజ్జ్ఞత్వ భేదము వ్యవహారమందేగాని సుషుప్త్యవస్థ యందుండు అఖండానంద స్వరూపమైనపరమార్థమందు లేదని మహావాక్యరూపమైనవేదముచేత తెలిసికోవలసిన దనుట. అనగా, అనేక రకములగు పాత్రలలోగల జలములకుండు ఉపాధిని తొలగించిన ఒకే జలమగునట్లు, ఆత్మయొక్క దేహేంద్రియాది ఉపాధులను నివృత్తించిన సత్తామాత్రమగు దైవమయమగును. అదే సనాతనము.

సర్వభూతేషు యేనైకం భావమవ్యయ మీక్షతే ।
అవిభక్తం విభక్తేషు తద్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్ ॥

ప్రత్యేకరూపములైన బ్రహ్మాది పిపీలికాంత జంతువుల యందును, స్థావరములయందును, అఖండమైనట్టియు, నాశరహితమైనట్టియు నొకటైన బ్రహ్మభావమును జ్ఞానముచేత నెవడు చూచుచున్నాడో వానిజ్ఞానము సాత్త్వికజ్ఞానమని యెఱుగుము. అనగా పిలికాది బ్రహ్మపర్యంతముగల పంచభూత శరీరములకు విలక్షణమై, సాక్షియై, చిన్మయమై, శివమైయుండు ఆత్మలో, అనగా దైవములో నిలకడగల్గియుండువాడే సనాతనధర్మమందు నిలకడ గలవాడగును. ఇంతవరకు చెప్పిన యుక్తితోను, శాస్త్రములతోను, సమన్వయపరచి చూచిన యిప్పుడు జనులకు గల జ్ఞానము ఏ తరగతిలో చేరియుండునదియు విజ్ఞులు తెలిసికొన గల్గుదురు. కనుకనే నిజమైన సాధుసంఘములో కల్పితములైన జాతులను గురించి పట్టించుకొనరు. వారు ప్రజ్ఞాన వాచకాత్మలో నిష్ఠ గలవారగుటచే అందరిని సోదరీభావముతోను, సోదరభావముతోను జూచుచుందురు. కనుకనే అట్టివారు కర్మపరులగు గృహస్థులతో సంబంధము లేక ప్రత్యేకముగా నుండుటకు కారణమైనది. గృహస్థులు కర్మకాండ రహితులై యుండనందుచే, వీరికి కల్పితములగు వర్ణము, ఆశ్రమమును ముఖ్యములు. జ్ఞానులు అంతర్యామి యగు దైవములో సదా నిలకడ గల్గియుండుటచే వీరు ప్రకృతికి పరులైరి. కనుకనే వారికి సన్న్యాసులని పేరు వచ్చినది. సన్న్యాసులనగా లెస్సగ అనాత్మభావములను విడిచినవారై స్వస్వరూపమగు దైవభావములో నుండువారని యర్థము. గృహస్థాశ్రమములో నుండువారిని సంసారులని పిలుచుటకు కారణమేమన నిస్సారమైన ప్రాపంచిక విషయమును సారమని నమ్మినవారగుటచే అట్టి నామధేయము గల్గినది.

ఇచ్చట గుణములనే ముఖ్యముగా గ్రహించవలసి యుండుటచే పై జెప్పిన గుణము గలవారు గృహస్థులలోను, సన్న్యాసులలోను ఉండవచ్చును. అట్లైన దానికి తగిన ఫలమే గల్గును. అయితే గృహస్థాశ్రమములో నుండువారిలో ఆత్మజ్ఞానులు లేరని చెప్పరాదు. సన్న్యాసాశ్రమమును స్వీకరించినవారల నందరిని

జ్ఞానులని చెప్పుట కవకాశము లేదు. గృహస్థాశ్రమములో ఎందరో మహనీయులు గలరు. అట్టివారు వర్ణము, ఆశ్రమము గొప్పదని తలంపరు. అయితే దాని కనుగుణముగా వారు వర్తించ వలసియుండుటచే వారిని బద్ధులనిగాని, అజ్ఞులనిగాని తలంపరాదు. అట్టి లోకకార్యము గొప్పదని వారు తలంపరు. అదే దానికి గురుతు. ఒక వేళ సంఘములోగల కర్మఠులకు వెరచి కులాచారమును పాటింపవలసి వచ్చిన అది చాలా మనోవేదనతోనే చేయుచుందురు. అత్తరి వారిప్పా దయమో ఈ పాడు గృహస్థధర్మములో నుండినందుచే గదా సత్యమునకు, ప్రేమకును, సనాతనమునకును దూరముగా నుండవలసి వచ్చినది? యని కష్టముగ నిట్టూర్పు విడుచుచుండును. కనుకనే బృహదారణ్యకములో యాజ్ఞవల్క్య మునీంద్రులు గృహస్థాశ్రమములోనుండి ఆత్మజ్ఞానము గల్గినను స్వాతంత్ర్య ముండదనియు, విశాలస్వభావము గలుగదని చెప్పి సన్న్యసించుటకు కారణమైన దని తెలిపియున్నారు. సనాతనధర్మము ఆత్మకు చెందియుండునే గాని దేహసముదాయమునకు కాదని గీతలో భగవాను లుపదేశించి యున్నారు.

''మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః''

జీవకోట్లలోగల ఆత్మచైతన్యము నాయొక్క స్వరూపము. ఈ జీవాంశము సనాతనము, అనగా ఎల్లప్పుడు ఏకరీతిగానుండునది. ఇదే సనాతనధర్మము యొక్క సత్యార్థము. అట్లు గానిచో సనాతన ధర్మము వర్ణమునకును, ఆశ్రమమునకును గలిగినదైనచో నిమ్నజాతులు ఉన్నతజాతులగుటకును, ఉన్నతజాతులు నిమ్నజాతులుగా మార్పు చెందుటకును కారణ ముండదు. నిమ్నజాతులో గల వారనేకులు బ్రహ్మసమాజములోను, ఆర్యసమాజములోను జేరుచున్నారు గదా!

మతస్వీకరణానంతరము వారు బ్రాహ్మమతస్థులైన బ్రహ్మమతస్థుల మనియు అనగా, ఈశ్వరాజ్ఞ ననుసరించి నడచువార మనియు, ఆర్య మతస్థులైనచో తాము ఆర్యులమనియు, అనగా సత్యధర్మ నిష్ఠగల వారమనియు, దోషరహితులమనియు, ఆర్యమతస్థుల మనియు దృఢముగ చెప్పుచుందురు.

ఉన్నతజాతులలో గల కొందరు కారణాంతరముచే భ్రష్టులైన అట్టివారిని కులములో నుండి వెలివేయుచున్నారు. అప్పుడు వారిని ఉన్నతజాతిలో కలుపుట లేదు. దీనివల్ల గుణకర్మములకే ఆధిక్యముగాని మరియొక్క దానికి లేదని స్పష్టమగుచున్నది. అంతేగాక జాతియును, వర్ణమును సనాతనమ్మైనచో అదెట్లు మార్పు చెందును? ఋషులలో ఇట్టి సంకుచితభావ ముండనేరదు. ఆపస్తంబము చూడుడు. ధర్మచర్యచే క్రిందిజాతి ఉన్నతజాతిని పొందుచుండుననియు, ఉన్నత జాతి అధర్మవృత్తిచే నిమ్నత్వమును జెందుచుండుననియు చెప్పబడి యున్నది. ఆపస్తంబుడేగాక గొప్ప జ్ఞానులగు వారందరును అట్లే చెప్పియున్నారు. ఇదిగదా నిజమ్మైన బుద్ధిశక్తియొక్క స్వభావము !

ఇట్టి ధర్మములు అలవాటులో నుండిన జనసంఘ మెంతో అభివృద్ధికి వచ్చియుండెడిది. అట్లైన నిమ్నస్థితిలో నుండువారికి ఉన్నత స్థితికి వెళ్లవలయునని ఉత్సాహము సదాగల్గియుండును. దానికి తగిన ఆచరణములుగూడ వారనుష్ఠింతురు. ఉన్నతస్థితిలో నుండువారు తమ ధర్మమునకు లోపము గలిగిన నిమ్నజాతిలోనికి త్రోయబడుదు మను భయము గలిగి యే మాత్రమ్మైనను స్వధర్మమును విడనాడక అనుష్ఠించి యుందురుగదా! జనుల కెల్లప్పుడును ఉన్నతపదవిని బొందవలెనను తలంపు ఉండునేగాని నిమ్న పదవిని బొందవలయునను తలంపు ఉండదు అప్పుడు ప్రతిసంవత్సరము నిమ్నస్థితినుండి ఉన్నతస్థానములోనికి ఎందరో జనులువచ్చి యుంధురుగదా! ఇట్లైన కొలది కాలమునకు జనసంఘ మంతయు మంచిధర్మముతోగూడి ఆత్మసంస్కారము గలదై నాగరికావస్థ గల్గియుండునుగదా? ఇట్టి సంస్కారపద్ధతి లేనందుచేతనే హిందూమత మడుగంటి పోయినది. దీనికొక దృష్టాంతము జూడుడు. ఇంగ్లీషువిద్య ఇంత అభివృద్ధికి వచ్చుటకును, సంస్కృత విద్య క్షయించుటకును కారణవేమి? ఇంగ్లీషువిద్య గలవారికి ఉన్నతోన్నతములగు ఉద్యోగము లిచ్చుటచేతను, సంస్కృతివిద్యలో నుత్తీర్ణులైన వారికి తగిన గౌరవము లేకపోవుటయు గదా కారణము! జాతియొక్క స్థితియును ఈలాగే యుండును. కనుక ప్రస్తుత పరిస్థితిని బట్టి తప్పక సంఘసంస్కార ముండవలెను. లేనిచో

భారతఖండము తరించుమార్గము లేకపోవుటయేగాక భారతజాతిగూడ అడుగంటి పోవలసియుండును. ఇట్టిదురవస్థ పరమపాపనులగు ఋషుల సంతానములైన భారతీయులకు గలుగకుండ చూచువారే యథార్థమతవిశ్వాసము గలవారును, ఋషి ధర్మమును పరిపాలించువారును, నిజమైన సనాతన ధర్మావలంబులును అగుదురు. ఇట్టివారిని విశాలస్వభావమును, విశుద్ధభావమును లేని కొందరు సంకుచితహృదయులు దూషింపవచ్చును. ఇది సనాతన ధర్మవిరుద్ధమని చెప్పవచ్చును. అట్టిదానికి మనమేమి చేయగలము? పై జెప్పిన సంస్కరణ బుద్ధికి ఇష్టము లేనివారు కుక్షింభరులనియు, స్వార్థపరులనియు చెప్పుటలో ఏలాటి కొరతమును లేదు.

లోకక్షేమమును ఉద్దేశించి ఆయాకాలమునకు తగినరీతిని అప్పుడప్పుడు లోకజ్ఞులును, ఆత్మజ్ఞులును అగు ధర్మాత్ములు ధర్మశాసనమును ఏర్పాటు చేసికొనవలయుననియే స్మృతికర్తలగు మునులయొక్క ధర్మశాసనమై యున్నది. అది అట్లు చేయకపోయినచో లోక విప్లవము గలుగును. మైనరు కాలమువరకు మాత్రమే అస్వాతంత్ర్య ముండును. ఆకాలము దాటిన స్వాతంత్ర్యమివ్వక పోయినచో కలహము సిద్ధముగదా? అట్టి కాలకూటవిష సమానకలహమునకు కారణము కలుగనీయకవెంటనే కనిపెట్టి శాంతి చేయకపోయినచో అట్టి కలహము తీవ్రముగ పరిణమించి ప్రాణనాశమువరకువెళ్లవలసియుండును. అప్పుడు అది ద్రోహకరముగా పరణమించును. అది సర్వజనుల కపాయకరము. పెద్దపెద్ద గోపురములుగాని, కోటలుగాని, ప్రహరీ ప్రతిబంధములుగాని యుండినను చిన్నచిన్న చెట్లు వానిపై అంకురించిన అట్టి ప్రతిబంధములను బ్రద్దలుగా చేయుట చూచుటలేదా? జనుల యొక్క గమనవేగమును అలాగే యుండును. ఎన్నియో రాష్ట్రములలో నిరంకుశముగా జనుల బరిపాలించియుండిన చక్రవర్తులగతి యేమైపోయినది? రష్యా, జర్మనీ, మొదలైన రాజ్యచరిత్రముల జదువుడు. దీనికన్నిటికిని జనుల అభివృద్ధికి తగిన మార్గమివ్వక అడ్డుపరచుటయే కారణము. అట్టి దురవస్థ పరమపావనులగు ఋషుల దివ్యపాదధూళిచే పునీతమైన భరతఖండమునకు రానీయక చూడవలెను. ఇది జ్ఞానము గలవారి ధర్మమై

యుండవలయును. శైశవకాలములో పెట్టెడి ఆహారమునే యౌవనకాలములో పెట్టిన చాలదు. అప్పటికి దగిన ఆహారమిడవలయును. అట్టి ధర్మబుద్ధితో పెట్టకపోయిన పెట్టించెడు మార్గమును వారు వెదకుదురు గదా! లేకపెట్టెడివారిని చేరుదురు గదా! కాబట్టి హిందూజనసంఘమునుండి స్వాతంత్ర్యములేని జనులు స్వాతంత్ర్యము గల యితరమతములలోనికి వెళ్ళిపోవుటకు కారణమగు చున్నది. ఇట్లు మతపరివర్తనము గలుగుట ఆ మతము పుణ్యమని తలంచిగాని, మోక్షమని తలంచిగాని గాదు. మానవునికి సర్వేశ్వరుండిచ్చియుండు మనుష్య స్వాతంత్ర్యము లేక పోవుటచే గాని మరియేమియును గాదు. ఈలాగున ఇతర మతములలో చేరువారు బలపడునప్పుడు ఇంతవరకు స్వాతంత్ర్య మివ్వక వారిని అణచిపెట్టిన వార్పై తప్పక పగతీర్చుకొందురు. ఇది దైవ నియతియై యున్నది. అట్టి దురవస్థ రాకుండుటకు ఇప్పుడే జాగరూకులై వర్తించుట మంచిది.

దీనికి చిన్న కథ యొకటి కలదు. ఒక రైతుకు నాల్గు గొప్ప యెద్దు లుండెను. ఆ గ్రామమునకు చేరిన ఒక గొప్ప అడవి గలదు. ఆ యడవిలో ఒక పెద్దపులి యుండెను. ఈనాల్గు ఎద్దులును సమబుద్ధి గల్గి అడవిలో సుఖముగా మేయుచుండగా ఈవృషభేంద్రముల వధించుటకు గనిపెట్టి ఆ పెద్దపులి తిరుగుచుండెను. వ్యాఘ్రము దగ్గరకు వచ్చునప్పుడు ఈ నాలుగెద్దులును నాల్గుప్రక్కలలో నిలుచుకొని పెద్దపులిని తరుముచుండెను. కాలక్రమముగా ఈ వృషభములకు మనః స్పర్థ గలిగి ఒక్కొక్కటి వేరువేరుగా మేయుటకు ప్రారంభించెను. పెద్దపులి యీ తరుణమును గనిపెట్టి ఒక్కొక్క యెద్దును భక్షించుటకు ప్రారంభించి క్రమక్రమముగ నాల్గింటిని తినివేసెను. ఆలాగున హిందూజన సంఘముగూడ వేర్వేరుగా చీలిపోయిన అది త్వరలో క్షయమునొందును. ఇతర మతస్థులు వారి మతమును బలపరుచుకొనుటకు చూచుచున్నారు. ఇప్పటికే ఎన్నియో కోట్లు హిందూజనులు ఇతర మతముల లోనికి పరివర్తనము నొందిరి. ప్రతిదినమున ఈలాగున పరివర్తనము గలుగుచునేయున్నది. ఈతత్త్వమును కనుగొనియే విశాలహృదయులును, వివేకజ్ఞానులును, విశుద్ధాంతఃకరణము గల వారును హిందూజనసంఘ

సంస్కరణమునకు పాటుపడుచున్నారు. రంధ్రముగల ఘటములోనుండి జలము ఒకటి రెండు బిందువులు పోవునప్పుడు తగ్గుదల కనపడదు కాని, కొన్ని ఘంటలకాలము ఆలాగున జలము కారిపోవుచుండిన త్వరలోనే పాత్రము కాళీయైపోవును. జనాంగముయొక్క గతియును ఇదేరీతిగానే యుండును. ఈ రహస్యము నెరింగియే ఆర్యసమాజస్థులును, బ్రహ్మసమాజస్థులును జనసంఘమును అభివృద్ధి పరుపదలంచి ఈ కాలమున కనుగుణముగా వేద శాస్త్రములకు విరోధము గలుగక మతపరివర్తనము గలుగ జేసికొనసముద్యుక్తులైరి.

ఇది హిందూమతమునకు ఎంతో బలమును సమకూర్చినది. ఏ కాలములోనో యెవరో వ్రాసియుండు శ్లోకములయొక్క అనగా పుస్తకముల యొక్క పూర్వోత్తరగుణములను కనుగొని ప్రవర్తింపక యుండుట వివేక ధర్మము గలవారి స్వభావము కాదు. ఎవరో యెప్పుడో వ్రాసినది ప్రళయాంతము వరకు శరణ్యమని ఋషులు నమ్మియుండలేదు. కనుకనే ఒక్కొక్క ఋషులును వారివారి యాత్మకు సత్యముగా తోచినదానిని వారువారు గ్రంథములుగా వ్రాసిరి. వాటికే స్మృతులని పేర్లు. అట్లుగానిచో వర్ణాశ్రమములపై యిన్ని స్మృతులును, ధర్మశాస్త్రములును ఏల యుండవలయును? ఒక్కొక్క దానిలోను వేరువేరు అభిప్రాయములు గల్గియున్నవి. ఇదంతయు కాలానుగుణముగా మార్పు చేయుచు వచ్చినవి యని దృఢముగా నమ్మవచ్చును. ఇప్పుడును అట్టి మహాపురుషులుండిన, తప్పక యీ కాలమునకు తగిన శాస్త్రముల తయారుచేసి యుందురు. వైద్యశాస్త్రములలో ఒక్కొక్క ఋతువులలోను ఆహారములును, వస్త్రధారణలును, స్నానపానములును వేరువేరుగానే విధింపబడి యున్నవి. అదే ప్రకారము కాలము ననుసరించి మతములోను మార్పు గలిగించవలయును. లేనిచో శీతకాలములో ఉపయోగపరచెడు కంబళి వేసవి కాలమున వాడునట్లుండును. దైవధర్మమును, దానికి సంబంధించిన యనుష్ఠానములు మాత్రము సనాతనములు. ఏలన? దైవము మార్పులేనిది సనాతన ధర్మస్వరూపము. దానిలోను మైత్రి, కరుణ, ముదిత, ఉపేక్షాదులకును, భక్తివైరాగ్యాదులకును, శమదమాదులకును మార్పు లేదుగాని సంఘభేదములను బట్టియు, శరీరారోగ్యమును బట్టియు,

ఆహారపానీయములలో ఋషులు మార్పు చేసికొని యున్నారు. ఏలన? దేహమనోబలదార్ఢ్యములకు యుగభేదములచే మార్పు గల్గుచుండును. తపో, యోగ, యజ్ఞాదికార్యములు, కృత, త్రేతా, ద్వాపర యుగములకు సంబంధించిన వనియు అనన్య భక్తియు, దానబుద్ధియు, కలియుగమునకు సంబంధించినవనియు తెలిపిరి. శమాదిగుణములకును, శ్రవణాదిత్రయమునకును, అనుగుణములగు యోగతపోవ్రతాదులను ఏర్పాటు చేసుకొనిరి. అనగా నిరంతర భగవద్ధ్యాన నిష్ఠ నిలుచుటకు తగినంత సాధనలు చాలునని తెలిపియున్నారు. పరాశరస్మృతి జూడుడు.

అన్యే కృతయుగే ధర్మా స్త్రేతాయాం ద్వాపరే యుగే ।
అన్యే కలౌ యుగే నౄణాం యుగరూపానుసారతః ॥

ధర్మముల ననుష్ఠించు మనుష్యుల శక్తి తారతమ్యము ననుసరించి కృత త్రేతా ద్వాపర కలియుగము లందు ధర్మములు భిన్న భిన్నములై యుండును.

తపః పరం కృతయుగే త్రేతాయాం జ్ఞానముచ్యతే ।
ద్వాపరే యజ్ఞ మిత్యాహు ర్దానమేవ కలౌ యుగే ॥

కృతయుగంబున తపస్సును, త్రేతాయుగమందున జ్ఞానమును, ద్వాపరయుగంబున యజ్ఞమును, కలియుగమున దానమును ముముక్షువులకు మోక్షమునకు ముఖ్యములని చెప్పుదురు. అనగా కృతయుగములో జ్ఞానయోగము, త్రేతాయుగములో ధ్యానయోగము, ద్వాపరయుగములో భక్తియోగమును, కలియుగములో నిష్కామకర్మయోగమును అనుష్ఠించుటకే జీవులకు శక్తి గల్గియుండునని మహర్షుల మతము. జ్ఞానయోగమునకు ఆత్మయొక్క ఇంద్రియాతీతజ్ఞానమును, ధ్యానయోగమునకు మానసేంద్రియాదుల నిగ్రహమును, శుద్ధియు, భక్తియోగమునకు చిత్తైకాగ్రతయు గలుగవలయును. ఇంద్రియ నిగ్రహము కలియుగములో గల్గుట ప్రయాసమని తలంచి యింద్రియములకు విషయవృత్తి గలుగనీయక, అసద్వృత్తినుండి యింద్రియముల మరలించి సద్వృత్తిలో ప్రవేశపెట్టి, ఫలాపేక్షలేక యీశ్వరార్పణబుద్ధితో చేయుటకు

నిష్కామకర్మ యోగము ఏర్పడినది. కనుకనే, యేపుణ్యకార్యములైనను చేయునప్పుడు, పరమేశ్వరార్పణమని చెప్పుటకు కారణమగుచున్నది. దానికి కారణము ఈక్రింది శ్లోకము తెలుపుచున్నది.

కృతే త్వస్థిగతాః ప్రాణాః త్రేతాయాం మాంసమాశ్రితాః ।
ద్వాపరే రుధిరం చైవ కలౌ త్వన్నాదిషు స్థితాః ॥

కృతయుగంబున ప్రాణవులు శల్యగతవులై యుండును. త్రేతాయుగమునందు ప్రాణములు మాంసము నాశ్రయించి యుండును. ద్వాపరయుగవునందు రక్తవు నాశ్రయించి అవి నిలిచియుండును. కలియుగమునందు అన్నాదికము నాశ్రయించి ప్రాణములు దేహమునందు నిలిచియుండును. కావున దీనినిబట్టి యుగభేదములచే ధర్మవులును మారుచుండును.

కృతే తు మానవాధర్మాస్త్రేతాయాం గౌతమాః స్మృతాః ।
ద్వాపరే శంఖలిఖితాః కలౌ పారాశరాః స్మృతాః ॥

కృతయుగంబున మనుస్మృత్యుక్తధర్మములును, త్రేతాయుగంబున గౌతమస్మృతి ప్రతిపాదిత ధర్మంబులును, ద్వాపరయుగంబున శంఖలిఖితస్మృతి విహిత ధర్మంబులును, కలియుగంబున పరాశరోక్త ధర్మములును ప్రచురముగ జేయదగియుండును. ఈ ప్రవూణవును బట్టియే ఆయాకాలవున కాయాధర్మవులు అప్పుడు లోకవులోగల జ్ఞానులు ఏర్పాటు చేసికొనవలసియుండుననియు, ఈలాటి దేహమునకు సంబంధించిన ధర్మములు సనాతనవులు గావనియు, ఆత్మధర్మమెుక్కటియే సనాతనవునియు గోచరమగుచుండును.

యుగే యుగే చ యే ధర్మా స్తత్ర తత్ర చ యే ద్విజాః ।
తేషాం నిందా న కర్తవ్యా యుగరూపా హి తే ద్విజాః ॥

ఆ యా యుగంబులందు ఏ యే ధర్మములు నిర్ణీతములయి యున్నవో ఆయా ధర్మముల నాచరించుచు ఏయే ద్విజు లుందురో, అట్టి ద్విజుల

నిందింపరాదు. వారు ఆ యుగధర్మము ననుసరించి ఆ విధముగా నున్నవారలు. ధర్మశాస్త్రతత్త్వమును తెలిసికొనకపోవుట గదా యిప్పుడు ధర్మజ్ఞులై ప్రస్తుత యుగమున కనుకూలముగా ధర్మమును నిర్ణయము చేయువారిని కొందరు నిందించుటకు కారణమగుచున్నది. ఇవి పరాశర వచనములు. సనాతన తత్త్వమును కైవల్యోపనిషత్తు ఈలాగున తెలుపుచున్నది. మంత్రపుష్పమును ఇదే రీతిగానే తెలుపుచున్నది.

స బ్రహ్మా స శివః సేంద్రః సోఽక్షరః పరమః స్వరాట్ ।
స ఏవ విష్ణుః స ప్రాణః స కాలోఽగ్నిః స చంద్రమాః ॥

స ఏవ సర్వం యద్భూతం యచ్చ భవ్యం సనాతనమ్ ।
జ్ఞాత్వా తం మృత్యుమత్యేతి నాన్యః పంథా విముక్తయే ॥

సనాతనమగు వస్తువే బ్రహ్మము. అదే శివుడు, ఇంద్రుడు, అదే అక్షరస్వరూపము, అదే పరమపదము, అదియే స్వరాట్, అదియే విష్ణువు, దానినుండియే ప్రాణము, కాలము, అగ్ని, చంద్రుడు మొదలైనవి కలుగుచున్నవి. సర్వమును దానివల్ల పుట్టిన దగుటచే అదే స్వరూపమై యున్నది. భూతమును, భవిష్యత్తును, వర్తమానమును ఆ సనాతన ఆత్మస్వరూపమే. అట్టిదానిని తెలిసికొనుటచేతనే మృత్యువు నతిక్రమించిన అమృతపదవిని పొందగలరు. దైవసాక్షాత్కారమునకు వేరు మార్గము లేదు. అట్టి ఆత్మను పొందవలయుననియే ఆత్మబోధముగూడ ఉపదేశించుచున్నది.

జీవన్ముక్తి స్తు తద్విద్వా త్పూర్వోపాధి గుణాం స్త్యజేత్ ।
స సచ్చిదాది ధర్మత్వాద్భజే భ్రమరకీటవత్ ॥

లోకమందు పురుగును తుమ్మెద తీసికొనివచ్చి, చేయవలసిన ప్రకారముగా చేసిన మాత్రముచేతనే యీ పురుగు తన్ను చంపుచున్నదను భయముగలదై తన తలంపును చలించకుండ దానియందు ఉంచినందుచే తనయందు పూర్వమున్న పురుగుధర్మమును వదలి అది భ్రమరస్వరూపమును బొందినట్లు నిరంతర ధ్యానము చేయువాడు జీవధర్మమును వదలి సచ్చిదానంద రూపమైన

బ్రహ్మస్వరూపమును బొంది, వృత్తిరహితుడై, శివమయమై యుండడమే జీవన్ముక్తి యని ముముక్షువు తెలిసికొనవలయును. ఇదే నిరంతరము ధ్యానముచేయు వానికి ధ్యాత ధ్యేయాకారమై మారుచుండు విధిగా నుండును. ఇట్టిధ్యానమే నిజమైన ధ్యానముగా నుండును. మరియొక్క విధముగాను ధ్యానవిధిని శాస్త్రము చెప్పుచున్నది.

> శ్రవణాదిభిరుద్దీప్త జ్ఞానాగ్ని పరితాపితః ।
> జీవస్సర్వమలాన్ముక్త స్స్వర్ణవద్ద్యోతతే స్వయమ్ ॥

బంగారు, ఇత్తడి, రాగి మొదలైన లోహములు మాలిన్యముచేత కల్మషమైయుండినను వాటికి చేయువలసిన పుటాదిసంస్కారములచేత వాటియందుండు మాలిన్యము నివర్తింపబడి తమకు తామే ప్రకాశించుచున్నట్లు జీవుడును శ్రవణధ్యానాద్యభ్యాసములకు వాడుకపడి సంసారహేతు భూతమైన మూలాజ్ఞానమునుండి నివర్తింపబడినవాడై, తనకు తానే కేవల దైవమయమై ప్రకాశించుచున్నాడు.

> సర్వగం సచ్చిదాత్మానం జ్ఞానచక్షు ర్నిరీక్షతే ।
> అజ్ఞానచక్షుర్నేక్షేత భాస్వంతం భానుమంధవత్ ॥

లోకమందు సర్వత్ర ప్రకాశించుచుండు సూర్యుని అందరును చూచినప్పటికిని గ్రుడ్డివాడు చూడనేరనట్లు సచ్చిదానందాత్మ సర్వత్ర వ్యాపించియున్నప్పటికిని శ్రవణ ధ్యానాదులవల్ల విచారించి తెలిసికొన్న ఆత్మజ్ఞానియే ఆ యాత్మను తన్నుగా జూచుచున్నాడుగాని, దేహేంద్రియాదులను ఆత్మగా భ్రమించిన అజ్ఞాని చూడనేరనందున అందరికిని ఆ యాత్మ అగపడదనుట.

ఇప్పుడు మనయొక్క సనాతనమగు ఆత్మవస్తువు దేహేంద్రియ ధర్మములు గావనియు, వాటికి విలక్షణమైన చిన్మయమగు ఆత్మయనియు గోచరమైనదిగదా! ఇక యుగములు రాగారాగా జనులందరికిని ఆత్మవికాసము గలుగుచుండెననియు, బంధవిముక్తి కొరకు వారు ప్రయత్నించెదరనియు,

బుద్ధివికాసము ననుసరించి ఉన్నతోన్నత పదవిలోనికి ప్రజలు ప్రవేశింతురనియు తెలిపెడు ఈ పద్మపురాణాంతర్గత మాఘమాహాత్మ్య ద్వాదశాధ్యాయమును జూడుడు.

పురా కృతయుగే రామ బ్రాహ్మణా వై తపస్వినః ।
అబ్రాహ్మణస్తతో రాజ న్న తపస్వీ కథంచన ॥

త్రేతాయుగేఽ వ్యవర్తంత బ్రాహ్మణాః క్షత్రియాశ్చ యే ।
తపోఽ తప్యంత తే సర్వే శుశ్రూషామపరే జనాః ॥

తతో ద్వాపర సంజ్ఞాతే తపో వైశ్యాన్ సమావిశేత్ ।
యుగేషు త్రిషు రాజేంద్ర ధర్మం చక్రుర్ద్విజాతయః ॥
భవితా శూద్రయోన్యాం హి తపశ్చర్యా కలౌయుగే ॥

ఓ రామచంద్రా! పూర్వము కృతయుగమునందు బ్రాహ్మణులు మాత్రము తపస్సు చేయుచుండిరి. ఓరాజా! బ్రాహ్మణులు కానివారలు కృత యుగమునందు ఒకానొకప్పుడు గూడ తపస్సు చేయునది లేదు. త్రేతాయుగ మందు బ్రాహ్మణులు క్షత్రియులు గూడ తపము జేయుచుండిరి. మిగిలినవారందరును ఆ తపము చేయువారికి శుశ్రూషచేయుచుండిరి. తరువాత ద్వాపరయుగము నందువైశ్యులు గూడ తపము చేయుచు వచ్చిరి. ఓ రాజశ్రేష్ఠుడా! ఈ విధముగా మూడుయుగములందును ద్విజులగు బ్రహ్మక్షత్రియ వైశ్యులు ధర్మము జరుపుచుండిరి. కలియుగమునందు శూద్రయోనులయందు పుట్టిన వారు గూడ తపము చేయుదురు. మఱియు, సనాతన ధర్మగ్రంథమున ఈలాగున కనుపించుచున్నది.

ఉన్నతిం నిఖిలా జీవా ధర్మేణైవ క్రమాదిహ ।
నిదధానాః సావధానా లభంతేఽన్తే పరం పదమ్ ॥

సకల జీవరాసులును క్రమముగ వాటివాటి ధర్మముల ననుసరించి ఉన్నతోన్నతపదవిని పొందుచుండుననియు, ఇది వారివారి అనుష్ఠానమునుబట్టి

సావధానముగా గాని, త్వరితముగా గాని గలుగుచుండుననియు, అంత్యమున అన్ని జీవరాసులును ప్రబోధజ్ఞానము గలవారై పరమపదమగు ముక్తిని పొందుదురనియు గ్రహించదగినది. అయితే ఆచరణ లేనిచో తాను అభ్యసించిన శాస్త్రములన్నియు వ్యర్థములని గ్రహించవలయును.

**ఆచారహీనం న పునంతి వేదాః యద్యప్యధీతాః సహ షడ్భిరంగైః ।**
**ఛందాంస్యేనం మృత్యుకాలే త్యజంతి నీడం శకుంతా ఇవ జాతపక్షాః ॥**

వేదవేదాంగములు చదివినవాడైనను ఆచారము (సీలము) లేనిచో పక్షులు రెక్కలు రాగానే గూటిని విడిచినట్లు వేదములు మృత్యుకాలమందట్టివానిని విడిచిపెట్టును.

**వేదాస్త్యాగశ్చ యజ్ఞాశ్చ నియమాశ్చ తపాంసి చ ।**
**న విప్ర! దుష్టభావస్య సిద్ధిం గచ్ఛంతి కర్హిచిత్ ॥**

అనుష్ఠానములేనివారి స్థితిని గురించి యీలాగున శాస్త్రము చెప్పుచున్నది. వేదాధ్యయనము, త్యాగము (సన్న్యాసము), యజ్ఞాదిక్రతువులు, నియమముల ననుసరించిన యాచారములు, కృచ్ఛ్రచాంద్రాయణాది తపో వ్రతములు ఇవన్నియు ఆచరణలేని చెడు మనస్సు గలవానికి ఎట్టి నిర్మలస్థితిని, అనగా జ్ఞానమును ఎచ్చటను అనగా ఇహమందుగాని, పరమందుగాని మరల ఏస్థలములోగాని కలుగజేయజాలవు అని మనుస్మృతి. కనుకనే వివేకచూడామణియందు --

**ఏతయో ర్మందతా యత్ర విరక్తత్వ ముముక్షయోః ।**
**మరౌ సలిలవత్తత్ర శమాదే ర్భానమాత్రతా ॥**

అనగా తీవ్రమైన వైరాగ్యమును, తీవ్రముముక్షుత్వమును గలిగి, తీవ్రనిష్ఠలేని వాని యనుష్ఠానములన్నియు ఊషరభూమిలో గానుపించిన ఎండమావులవలె నుండునేగాని, ఫలమిసుమంతయు గలుగచేయవు. అనగా ఎండమావులను జూచునప్పుడు గొప్ప జలాశయమువలె గనుపించునేగాని ఆ యెడారిప్రదేశములో నీళ్ళు ఎట్లుండవో, ఎట్లు దాహ శాంతి గాజాలదో, ఆలాగున

సత్యధర్మానుష్ఠానము లేని వారి పద్ధతులన్నియు నుండునని భావము.

ఆచినోతి చ శాస్త్రార్థం ఆచారే స్థాపయత్యపి ।
స్వయమాచరతే యస్మా దాచార్యస్తేన కథ్యతే ॥

ఈ శ్లోకముచే నిజమైన ఆచార్యుడు అనగా, గురువు యొక్క లక్షణము చెప్పబడుచున్నది. ఎవండు బ్రహ్మనిష్ఠుడగు గురువుదగ్గర చక్కగ శాస్త్రార్థమును తెలిసికొని శాస్త్రము రీతిగా స్వయముగా ఆచరించువాడై, తాను అనుష్ఠించునట్లు కపటములేక లోకములో బోధించువాడు, అనగా ధర్మమును స్థాపించువాడో వాడే ఆచార్యుడనంబడును.

వేదాభ్యాస స్తపో జ్ఞాన మింద్రియాణాం చ సంయమః ।
అహింసా గురుసేవా చ నిశ్శ్రేయసకరం పరమ్ ॥

ఉపనిషదాదులను వల్లించుట, వాని యర్థము నెఱుగుట, తపస్సు చేయుట, బ్రహ్మజ్ఞానమును సంపాదించుట, ఇంద్రియముల నిగ్రహించుట, అహింసావ్రతుడై యుండుట, బ్రహ్మనిష్ఠుడగు గురువును సేవించుట ఇవియెల్లను అందరికిని ముఖ్యమగు మోక్షసాధనములు.

సర్వేషా మపి చై తేషా మాత్మజ్ఞానం పరం స్మృతమ్ ।
తద్ధ్యగ్ర్యం సర్వవిద్యానాం ప్రాప్యతే హ్యమృతం తతః ॥

ఈ వేదాభ్యాసాదులలో నన్నింటను ఉపనిషత్ప్రతిపాద్యమగు బ్రహ్మమును గూర్చిన జ్ఞానమే శ్రేష్ఠము. ఆ జ్ఞానమువలననే మోక్షము గల్గును. కావున అది అన్ని విద్యలలో ప్రధానమును, సంపాదింప తగినదిగాను ఉన్నది.

యాదృశేన తు భావేన యద్యత్కర్మ నిషేవతే ।
తాదృశేన శరీరేణ తత్తత్ఫల ముపాశ్నుతే ॥

జనులు ఏయేవిధమగు సాత్త్వికమో, రాజసమో, తామసమో యైన మనస్సుతో నేయే కర్మము నాచరింతురో ఆయా గుణములుగల (సాత్త్విక, రాజస, తామసగుణములు గల) శరీరముతో నాయాకర్మఫలములను అనుభవించెదరు.

కావున జనులారా! ఏకార్యమునైన జేయునప్పు డే భావముతో జేయుదురో, దాని కనుగుణమైన ఫలము తప్పక గలుగును. కనుక సదా నిర్మలభావముతో జీవింపుడు.

సర్వభూతేషు చాత్మానం సర్వభూతాని చాత్మని ।
సమం పశ్యన్నాత్మయాజీ స్వారాజ్య మధిగచ్ఛతి ॥

సర్వభూతకోట్లలో తనయాత్మను, సర్వభూతకోట్లను తన యాత్మయందును, అనగా అన్నిటిలోను తనలోగల దైవమును, సమముగా చూచువాడెవడో వాడే ఆత్మరాజ్యమును అనగా బ్రహ్మపదమగు మోక్షమును పొందగలుగును.

యథోక్తాన్యపి కర్మాణి పరిహాయ ద్విజోత్తమః ।
ఆత్మజ్ఞానే శమే చ స్యాద్వేదాభ్యాసే చ యత్నవాన్ ॥

బ్రాహ్మణుడు శాస్త్రవిహితములగు నగ్నిహోత్రాది కర్మల పరిత్యజించియైనను పరమాత్మ చింతనము, ఇంద్రియజయము, ప్రణవజపము, ఉపనిషదాదిపారాయణము వీనియందైనను ప్రయత్నపరుడై యుండవలయును. ఇవియే ముక్తిని జేయునవిగా నున్నవి.

ఏతద్ధి జన్మసాఫల్యం బ్రాహ్మణస్య విశేషతః ।
ప్రాప్యైతత్కృతకృత్యో హి ద్విజో భవతి నాన్యథా ॥

ఈ యాత్మజ్ఞాన ఉపనిషదభ్యాసాదులే ముఖ్యముగ బ్రాహ్మణునకు జన్మసాఫల్య హేతువులు ఏలయన, ద్విజు డీ బ్రహ్మజ్ఞానవేదాదుల నభ్యసించి జన్మసాఫల్యము నొందునుగాని ప్రకారాంతరమున కృతార్థుడు కానేరడు. ఈ మానవశాస్త్ర అంత్యమగు ద్వాదశాధ్యాయాంతమున శ్రీమనుమహర్షి బ్రహ్మజ్ఞానముచేతను, ఉపనిషత్పఠనముచేతను మాత్రమే ముక్తి గల్గుననియు, గత్యంతరము లేదనియు స్పష్టముగా చెప్పుటచే ముముక్షువులు ఈ రెండు కార్యములను అవశ్యముగ ఆచరింపదగినది.

తపో విద్యా చ విప్రస్య నిఃశ్రేయసకరం పరమ్ ।
తపసా కిల్బిషం హన్తి విద్యయాఽమృత మశ్నుతే ॥

తపస్సును, బ్రహ్మజ్ఞానమును బ్రహ్మనిష్ఠునికి మిక్కిలి మేలొసగును. తపస్సుచే సమస్త కల్మషములు నశించును. బ్రహ్మ జ్ఞానముచే మోక్షమునొందును. ఇట శ్రుత్యర్థమే వివరింపబడెను.

**సర్వస్తరతు దుర్గాణి సర్వో భద్రాణి పశ్యతు ।**
**సర్వః సద్బుద్ధిమాప్నోతు సర్వః సర్వత్ర నందతు ॥**

ఆత్మజ్ఞులగు సోదరీ సోదరులారా! శ్రీ సనాతన ధర్మము యొక్క తత్త్వమును ఈ చిన్నవ్యాసముచే మనము గ్రహించితిమి. ఈ తత్త్వమునే విశదీకరించి వ్రాయబూనిన అదే ఒక్క గొప్ప గ్రంథముగా గల్గును. ఇంతవరకు చెప్పినదానిలో వర్ణాశ్రమమునకు ఆశాశ్వతత్వము చెప్పబడియుండినను అట్టి వర్ణాశ్రమము నతిక్రమించి, మీరు వర్తించవలెనని నా యభిప్రాయము గాదు. అయితే, వర్ణాశ్రమమున కతీతమై, వెలుగుచుండు ఆత్మను మాత్రము మీరు పొందవలయునను ఆశయమే గాని, మరియేమియు గాదు. దేహమునకు సంబంధించిన వర్ణాశ్రమములు లోకవ్యవహారముకొరకు ఏర్పాటు చేయబడినవి. అట్టి లోకవ్యవహారములు కావలసినవారు వాని నవశ్యముగ ఆచరించవచ్చును. అయితే దీనివల్ల తనకును, ఇతరులకును ఆత్మప్రాప్తికి ప్రతిబంధము గలుగకుండునట్లు భద్రముగ చూచుచుండవలెను. అట్టివారికి లోకవ్యవహారార్థము వర్ణాశ్రమములు పాటించినను, అది ఆత్మజ్ఞానమున కడ్డుగలుగజేయజాలదు. ఇంతే మనము గ్రహించవలసిన ముఖ్యవిషయము.

**భగవాన్ వాసుదేవో హి సర్వభూతే ష్వవస్థితః ।**
**ఏతత్ జ్ఞానం హి సర్వస్య మూలం ధర్మస్య శాశ్వతమ్ ॥**

వాసుదేవుడగు భగవంతుడు ఈ సర్వభూతములలోను సమముగా వెలుగుచుండువాడు. ఇట్టి జ్ఞానము సమస్త ధర్మముల యొక్క మూలము. ఇదే శాశ్వతమగు సనాతనధర్మము.

**శ్రూయతాం ధర్మసర్వస్వం శ్రుత్వా చాప్యవధార్యతామ్ ।**
**ఆత్మనః ప్రతికూలాని పరేషాం న సమాచరేత్ ॥**

న తత్పరస్య సందధ్యాత్ ప్రతికూలం యదాత్మనః ।
ఏష సామాసికో ధర్మః కామాదన్యత్ ప్రవర్తతే ॥

మొదట శాస్త్రములచేతను, మహాత్ములవల్లను, సమస్త ధర్మములు వినవలయును. విన్నదానిని మరల చక్కగా అనుష్ఠానము చేయవలెను. ఇతరులు ఏది చేసిన తనకు ప్రతికూలముగా నుండునో అట్టిదానిని యితరులకు చేయరాదు. ఇతరులు ఏది చేసిన తనకనుకూలముగా నుండునో అదే యితరులకు చేయవలెను. ఇదే సనాతన ధర్మము. ఒకవేళ ఇతరులు ప్రతికూలముగా చేసినను, అలాగున ఇతరులకు ప్రతికూలముగా చేయుట సాధుధర్మముగాదు. ఇదే పవిత్రమైన సాధుధర్మము.



# సమరస జ్ఞానము

యం శైవా స్సముపాసతే శివ ఇతి బ్రహ్మేతి వేదాన్తినో
బౌద్ధా బుద్ధ ఇతి ప్రమాణపటవః కర్మేతి మీమాంసకాః ।
అర్హన్నిత్యథ జైనశాస్త్ర నిరతాః కర్తేతి నై యాయికాః
సోఽయం వో విదధాతు వాఞ్ఛితఫలం త్రైలోక్యనాథో హరిః ॥

శివుండని శైవులును, విష్ణువని వైష్ణవులును, పరబ్రహ్మమని వేదాంతులును, బుద్ధుడని బౌద్ధులును, కర్మ యని మీమాంసకులును, జినదేవుండని జైనులును, కర్త యని నైయాయికులును, ఈ లాగున శక్తి యని శాక్తేయులును, ఈశ్వరు డని ఆర్యులు మొదలగు సర్వమతస్థులును ఏ పరతత్త్వమును సేవించుచున్నారో అట్టి త్రైలోక్యనాథుడును, సమస్తదుఃఖములను హరింపజేయువాడునగు సర్వేశ్వరుండు మీరు మేము అను బేధములు లేక మన అందరికిని సమస్త వాంఛితఫలము నొసంగు గాత!

ఓ పరిశుద్ధాత్ములైన, దైవాత్మస్వరూపు లగు ప్రియమైన సోదరీ సోదరులారా! కరుణామూర్తి యగు సర్వేశ్వరుని పూర్ణ కృపచే లోకములో

కరుణయు, శాంతియు, విరక్తియు, సద్భక్తియు, విజ్ఞాన బోధమును వర్ధిల్లును గాక! వర్తమాన కాలమున మనము అన్ని మతములయొక్కయు, సమస్త సమాజములయొక్కయు ఐక్యమును కనుగొనవలయును. అనగా ఏకత్వమును దర్శించవలయును. ఇది యెట్లు సాధ్యమగునని అనేకులకు సంశయము గలుగవచ్చును. ఏలన! అనేక మార్గములుగాను, భిన్న భిన్న భావములతోను, వేరువేరు అనుష్ఠానములతోను, వివిధములగు ఆచారములతోను గూడియుండు ఈ మతములను ఎట్లు ఏకము చేయుటకు సాధ్యమగునని సందేహించనక్కర లేదు. అన్ని మతములలోను దేశ, కాల పరిస్థితిని బట్టి కొన్ని ఆచారములును, ఆహారపు మార్పులును గలిగి యుండవచ్చును. అవి ముఖ్యము లని తలంపరాదు. ప్రస్తుత పరిస్థితిని బట్టి అవి యన్నియు, లోకహితానుసారముగాను, ఆచరణ యోగ్యముగాను మార్చుకొనవచ్చును. మతాచార్యులందరును, అనగా వక్తలెల్లరును దుఃఖము లేని పదవిని బొందినవారలే. అనగా శాశ్వత మోక్షమును గలుగ జేసికొనిన వారే. వారి జీవితదశలో వారు నిస్సంశయముగా అట్టి స్థితి గలిగియుండినవారైయుండిరి. వారును కృతార్థులైరి. "శోక శాంతియు, సంపూర్ణా నంద ప్రాప్తియు మాకు లభించినది. ఇదియే గమ్యస్థాన" మని, ఘంటాపథముగా రాజవీథిలో చాటుచుండిరి. అట్లు గానిచో, వారి మతములలో ఎవరును చేరి యుండజాలరు. అయితే ఒక్కొక్క మతస్థాపకు లగు మహాపురుషుల వెనుక వచ్చుచుండిన మతాచార్యులు ముందు ముందుండిన మతములలో కొన్ని లోపములను చూపి, అట్టి దోషములను సంస్కరించి తమ మతములే పరిశుద్ధముగా ఉన్నవని తెలుపుటకు కారణమేమని సంశయము గలుగవచ్చును. దానికి కారణము గలదు.

1. ముఖ్యముగా ఈ మతాచార్యులందరును ఏకకాలములో నుండిన వారు కారు. ఒక్కరున్నప్పుడు మరియొక్క రుండలేదు. ఏక కాలమున నుండిన వారైనచో, ఏ మతము నిర్దుష్టముగా నుండినదో మనకు తీర్మానము చేయుటకు అవకాశ ముండెడిది.

2. మతములను స్థాపించిన మహనీయుల దైవిక గుణములు, ఆసంఘములో వెనుక వచ్చియుండువారికి క్రమక్రమముగా తగ్గిపోవుటచేతను,

బ్రహ్మనిష్ఠలో కాలము పూర్తిగా గడుపక పోవుట చేతను, సత్య, ధర్మ, దయాది గుణములు లోపించిపోవుట చేతను, మత నియామకులగు మహాత్ములకు లేని ప్రాకృతగుణములు వీరికి గల్గుట చేతను, ప్రకృతి కార్యములలో ఎక్కువగా కొందఱు ప్రవేశించుటచేతను, లోకాభిమాన, గౌరవ, పూజ్యతలు ఎక్కువ కావలెనని కోరిక గలుగుటచేతను ఒక్కొక్క మతములో గల పవిత్రభావము తగ్గిపోవుట చేతను క్రొత్త క్రొత్త మతము లవశ్యముగా రావలసివచ్చినవి.

అయితే నూతన నూతనముగా వచ్చిన ప్రబోధకులందరును సత్య, ధర్మ, దయా, విరక్తి, భక్తి, జ్ఞానములు మొదలుగా గల దైవిక గుణములను సవరణ చేయలేదు. అంతేగాక శోక శాంతియు, ఆనంద ప్రాప్తియునగు దైవ సాక్షాత్కార స్థితిని గూడ మార్చలేదు. మతము లన్నిటికిని మూలమైన మనస్సు కంటె ఆవలనుండు స్థితిని మార్చలేదు గాని మనస్సున కీవల నుండు ప్రాకృతగుణములను మాత్రము మార్పు చేసికొనిరి. ఇది చేయవలసినదే. ఇదివరకు ఎందరో మహనీయులవతరించి మార్పు చేసికొని యేలాగున వచ్చిరో, అట్లు ఇంకను అట్టిమార్పు చేసెడు మహాపురుషు లవతరించి మార్పు చేయుచునే యుందురు. రాజ్యాంగములో మార్పులు ఏలాగున దేశకాలములనుబట్టి కలుగుచుండునో మతములోను అట్లే జరుగుచుండును. ఎందరో ప్రభువులు పాలించిరి. ఇక నెందరు ప్రభువులు పాలించుదురో యెవరు చెప్పగలరు? అయితే యింతవరకుండిన ప్రజలు దుఃఖజీవులై సుఖమును పొందక సంకటముతో కాలము గడపిరని యెవరును చెప్పజాలరు. ఆయా కాలానుసారముగా ఏర్పడిన పరిస్థితులకు తగిన సౌఖ్యము ననుభవించుకొని అట్టి కాలములో ఉండినవారు సుఖముగా కాలము గడిపిరి. అదేరీతిగా మతనిర్మాతలైన మహనీయుల అనుయాయులు గూడ ఆయా మతానుసారముగా అనుష్ఠించినవారే. నిత్యశాంతి యగు దైవసుఖము ననుభవించిన వారలే.

ఇప్పుడు మనకు కావలసినది సర్వమత సామర్థ్యము, అనగా సమత్వము. ఇట్లు మనము చేయకపోయినచో, లోక కళ్యాణమును, కైవల్యప్రాప్తియును గలుగుటకు తగిన సులభమార్గము మరియొకటి కనబడుట లేదు. దీనివల్ల

మీరు ఆహార పానీయాది భోజనకార్యములలోను, వివాహాది సంఘకార్యముల లోను ఐక్యత గలిగియుండవలె నను భావము గాదు. అది వారివారి యిష్టానుసా రముగా ప్రపంచమధ్యమార్గముగా ప్రయాణము చేయునుగాక! ఇదిన్ని ఏకవిధ ముగానే యుండవలయు నని తలంచువారు అట్లనే చేయుదురు గాక! వారికిని నిరోధము గలుగజేయగూడదు. వారికిని, వీరికిని గమ్యస్థాన మొకటి యుండును. అచ్చట వారితోను వీరితోను మనము కలిసికొనవచ్చును. ఇచ్చట ఐక్యత అనగా, అసూయయు, విరోధమును గలుగనీయక చూచుకొనుట యని అర్థము. ఇంతవరకు పరంపరగా సముద్రమునుండి వచ్చెడు తరంగములవలె నుండిన మత ములను ఒక్కొక్కదానిని పూర్వపక్షముగా చేసికొని వచ్చినవారు, తమ మత ము నిర్దోషమనియు, ముక్తికి సులభ మార్గమనియు నుద్ఘోషించిరి. వారి వెనుక వచ్చినవారు వీరు ఏలాగున ఇతర మతములలో దోషములను కనపరచుచువచ్చిరో అదే రీతిగా వీరి మతములో గూడ కొన్ని దోషములను చూపకపోలేదు. ఇదేప్రకా రముగానే యింతవరకు వచ్చి చేరితిమి. ఇదివరకు సముద్రమునుండి వచ్చిన అలలతో తరంగములు పూర్తి యైనవా? ఇంకను అలలు నూతనముగా పుట్టుట లేదా? ఆలాగున అనంత సచ్చిదానంద జ్ఞాన సాగరుడగు పరమాత్మనుండి ఇంకను ఎన్నియో మతములు పుట్టకమానవు. అప్పుడు ఇంతవరకుండిన అన్ని మతములలోను కొన్ని లోపములు కనబరచెదరు. ఇప్పుడు నిర్దుష్టములని తలంచు మతములపై కొన్ని దోషములను కనుపరచి తమయొక్క మతమును నిర్దోషముగాను, వేదసారముగాను, దైవసమ్మతముగాను, ముక్తికి సులభముగాను ఉండునని యుద్ఘోషించి భేరిని మ్రోగించెదరు. ఇది సృష్టియొక్క అంత్యమువరకు జరుగు చుండునదే గాక మరల సృష్ట్యారంభములో నుండియు, ఈలాగున జరుగుచునే యుండును. ఏలన? దైవశక్తియనంతము, అగ్రాహ్యము, అనిర్వచనీయము, అపారము, అత్యద్భుతము. ఓహో! ఇదిగదా దైవమహిమయొక్క గొప్పతనము. కావుననే మహనీయులగు భక్తులు ఈ మహిమను చూచి దైవముయొక్క లీలా విచిత్రమని తలంచుకొని ఆనందించుచుందురు. ఆత్మజ్ఞానులు, ఈ బ్రహ్మాండముల యొక్క చిత్రవిచిత్రములను జూచి అద్భుతపడి ఇది గొప్ప

ఐంద్రజాలకునియొక్క అత్యద్భుతమగు ఇంద్రజాలమని తలంచి, ఆనంద భరితులై యుందురు. ఇట్టి ప్రకృతియొక్క పరమరహస్యము తెలిసికొనక పోయినచో, జ్ఞానులుగాని, యోగులుగాని, భక్తులుగాని అయినను ఇతరమత ములతో విరోధము కల్పించి వాద, ప్రతివాద, కుతర్క, కుయుక్తులకు గడంగినచో అట్టివారికిని, రాగ, ద్వేష, కామ, క్రోధ అసూయాదులతో కల్మష భూయిష్ఠ హృదయముగల పరమపామర మనుష్యులకును ఏలాటి భేదమును గలిగియుండదు. ఇట్టి దోషద్వేషసంకలిత సంకుచిత హృదయములోనికి పోనీయక భక్తులందరును, ముముక్షువు లందరును సదా హృదయ నిర్మలత కొరకును, దైవనిష్ఠకొరకును, ప్రయత్నపరులై యుండవలెను. నదీనదములయొక్క గమనమార్గ భేదములన్నియు ఋజుత్వవక్రతలన్నియు, చిన్న పెద్ద ప్రవాహములన్నియు సముద్రములోనికి చేరు వరకు మాత్రమే యుండును. భూఖండమునకు చుట్టును సముద్రముండుటచే ఏ మార్గములతో ఏ పేర్లతో నదీనదములు ప్రవహించినను అంత్యమువరకు వెళ్ళిన ప్రవాహముల న్నిటికిని గమ్యస్థాన మొకే సాగరమని గోచరమగును.

యథా తోయ ప్రవాహానాం సముద్రః పరమావధిః ।
తథైవ సర్వమార్గాణాం సాక్షాన్నిష్ఠా పరాత్పరః ॥

దీని యర్థము పై వ్రాసినదే. కనుకనే శ్రీ శివమహిమ్నఃస్తోత్రమందు గంధర్వోత్తముడగు పుష్పదంతు డీలాగున వర్ణనచేయుటకు కారణమైనది.

త్రయీ సాంఖ్యం యోగః పశుపతిమతం వైష్ణవమితి
ప్రభిన్నే ప్రస్థానే పరమిదమదః పథ్యమితి చ ।
రుచీనాం వైచిత్ర్యాదృజుకుటిల నానాపథజుషాం
నృణామేకో గమ్యస్త్వమసి పయసా మర్ణవ ఇవ ॥

ప్రపంచములోగల సాంఖ్యమతస్థులు, యోగమతస్థులు, శివమతస్థులు, వైష్ణవమతస్థులు మొదలైన వారెల్లరు భిన్న భిన్న మార్గగాములై వారివారి రుచిని బట్టి ప్రవర్తించినను అందరును ఒకే దైవమగు సర్వేశ్వరునే బొందుచున్నారు. ఏలన, ఋజువక్రములై అష్టదిక్కులలో ప్రవహించెడి అనేకపేర్లతో గూడిన నదు

లన్నియు ఒకే సముద్రమును గదా చేరుచున్నవి. చూడుడు! శ్రీకపిలమునీంద్రుడు మహాత్తైన తపోబలముచేత దుఃఖములయొక్క అంత్యమగు, ప్రపంచాతీతమగు ఆత్మనే పొందెను. జైనాచార్యుడగు శ్రీజినదేవుడు కనుగొనిన అర్హత్ అను ముక్తి పదమును ఈ ప్రకృతి రహితమైన దైవస్థానమే. శ్రీబుద్ధదేవుడును తపోధ్యానయోగాదులతో ప్రయత్నించి కనుగొన్న నిర్వాణము ఈ ఆత్మసాక్షాత్కారమే. ఆలాగున ఆత్మానాత్మ విచారణ చేసి చేసి, శ్రీశంకరులు గ్రహించిన అద్వైతబ్రహ్మప్రాప్తియు ఈ శైవస్థలమే. అదేరీతిగా శ్రీశివభక్తాగ్రేసరులగు శైవులు చేరిన శివపదవియు ఈ దైవ సాక్షాత్కారమే. అట్లే శ్రీవిష్ణుభక్తాగ్రగణ్యు లగు వైష్ణవులును నిరంతరము భగవత్స్మరణయు, భాగవతసేవయు చేసి పోయి చేరిన పరమపదమగు విష్ణులోక ప్రాప్తియు ఈ దైవసాక్షాత్కారమే. అదేరీతిగా శ్రీరామానుజాచార్యులును, శ్రీమధ్వాచార్యులును, శ్రీకృష్ణచైతన్యులును చిదచిత్తులగు జడచైతన్యములను విమర్శించి విమర్శించి మరలమరల విచారించి కనిపెట్టిన చిదచిత్‌విలక్షణు డగు పరమేశ్వరు డగు శ్రీమన్నారాయణమూర్తియు ఈ దైవమే. అట్టి స్థానమును పొందుటయే వారు పరమపదప్రాప్తి యని యుపదేశించిరి. ఇదే నశింపని విష్ణుపదవి యని తెలిపిరి.

పంచీకరణపరులైన అచల సాంప్రదాయకులును ప్రకృతిచే చలింపని అచల పదవియు, పరిపూర్ణ బ్రహ్మమును ఈ దైవసాక్షాత్కారమనియే నిర్ధారణ చేసిరి. పరమయోగీంద్రులయొక్క యోగ, ధ్యాన, ధారణా, సమాధులచే గలిగెడు నిర్వికల్పసమాధిలో గల యోగామృతప్రాప్తియు, ఈశ్వర సాక్షాత్కారమును, బంధ ముక్తియు ఈ దైవత్వము పొందుట యని పలికిరి. ఆలాగున ఆర్యమతస్థుల యొక్క జీవన్ముక్తియు, బ్రహ్మసామాజికుల యొక్క దైవ ప్రాప్తియు, శాక్తేయుల యొక్క దివ్యలోక ప్రాప్తియు ఈ దైవ పదవియే యని యుద్ఘోషించిరి. ఆస్తిక మతస్థులందరియొక్క దైవ సాక్షాత్కారమును ఈ దైవప్రాప్తియే యగును. క్రైస్తవుల స్వర్గములో నుండు ఈశ్వరుడును, స్వర్గప్రాప్తియును, మహమ్మదీయుల ఆకాశములో గల స్వర్గమును, నశింపని పుణ్యమును ఇదే యని వారు వచించిరి. ఆస్తికులే గాక, నాస్తికులై యుండువారు గూడ జీవ కోట్లకు దుఃఖరహితమైన పదవి యొక్కటి యుండునని తెలిపిరి. వారును ఇట్టి స్థానమునే ముక్తియని,

అంత్యమున వెల్లడి చేసిరి. ఏలన? స్వభావముగా మానవులందరికే గాక పశుపక్ష్యాదులకు గూడ, దుఃఖములేని సుఖములో సదా యుండవలయునను కోరిక కనబడుచున్నది. ఇచ్చటనుండు సోదరీ సోదరులగు మీలో ఎవ్వరైనా దుఃఖము గోరుచున్నారా? లేదుగదా! సదా సుఖముగా నుండేలాగున గదా కోరిక గలిగి యున్నారు? కనుకనే, వేదాంత శాస్త్రముయొక్క అనుబంధ చతుష్టయాంతమగు ప్రయోజనము నిశ్శేషశోకశాంతియు, సంపూర్ణానంద ప్రాప్తియు అని నిశ్చయించుటకు కారణమైనది.

**యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః ।**
**యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాఽపి విచాల్యతే ॥**

ఏ యాత్మలాభమును బొందినవాడు ఆ ఆత్మలాభమున కన్న మరి మూడులోకములలోను ఏ లాభమును (సుఖమును) లేక పదవిని కోరడో, అనగా ఈ సుఖమునకు సదృశమైన సౌఖ్యము మరి యొక్కటి లేదని తలంచునో, అట్టి దైవిక సుఖములో నుండునప్పుడు దృశ్యాది విషయమగు ఎంత దుఃఖము వచ్చినను చలనము గలుగదో, అదే నిజమైన దైవసుఖమని గ్రహించవలయును. ఇదే ప్రకారముగానే ఆత్మబోధము గూడ చెప్పుచున్నది.

**యల్లాభా న్నాపరో లాభో యత్సుఖాన్నా పరం సుఖమ్ ।**
**యద్జ్ఞానా న్నాపరం జ్ఞానం తద్బ్రహ్మేత్యవధారయేత్ ॥**

ఏ యాత్మలాభముకంటె అనగా బ్రహ్మప్రాప్తికంటె వేరు లాభము లేదో ఏ జ్ఞానసుఖమునకంటె వేరు సుఖము లేదో, ఏ యొక్క జ్ఞానమును తెలిసికొనుట కంటె వేరే తెలియదగినది లేదో; అదియే బ్రహ్మమని నిశ్చయముగా తెలిసికొనవలయును.

**యద్దృష్ట్వా నాపరం దృశ్యం యద్భూత్వా న పునర్భవః ।**
**యత్ జ్ఞాత్వా నాపరం జ్ఞేయం తద్బ్రహ్మేత్యవధారయేత్ ॥**

ఏ యాత్మను అనగా బ్రహ్మమును చూచినవెనుక మరియొకటి చూడదగినది లేదో, ఏ జ్ఞానావిర్భావము గల్గిన తర్వాత మరల పుట్టుక లేదో, ఏ యాత్మ

జ్ఞానమును తెలిసికొన్నపిదప వేరు తెలిసికోదగిన వస్తువు లేదో, అదే బ్రహ్మమని నిశ్చయించి తెలిసికొనుము.

ఓ నిర్మలాత్ములారా! ఇప్పుడు మనము ముఖ్యమతము లన్నిటి యొక్క సారమును, సంప్రదాయమును గ్రహించితిమి. ఇక ఆయా మతములలో చెప్పే లాగున నడచుచున్నామా? అట్టి అనుభవము గల్గినదా? అని ప్రతివారును ప్రతి నిమిషమును తమలో తాము పరిశీలించు కొనవలయును గదా! సాంఖ్యవిచారము చేయువారికి ప్రకృతి యొక్క వికృతి లేని సాక్షిత్వములో నిలకడగలిగినదా? అద్వైత నిష్ఠగల వారికి ద్వైతభ్రాంతి నశించినదా? అచలమార్గముగలవారికి చాపల్యా ముడిగి నదా! యోగనిష్ఠ గలవారికి ఆత్మనుండి వియోగము లేని స్థితి సిద్ధించినదా? భక్తులగువారికి భగవన్మయముగా అంతయు కానుపించినదా? జ్ఞానులైనవారికి అజ్ఞానము విలయమొందినదా? నిష్కామ కర్మయోగులకు కర్తృత్వమును, కర్మ ఫలాసక్తియును గలుగని, కర్మయోగసిద్ధి లభించినదా? అని తమలో తాము నిరంతరము పరిశోధన సలుపవలయును. అట్లుగాని కారణముచేతనే, పరమ పవిత్రమై, వేదసారమై, మోక్షప్రదమై, పుణ్యపుంజమై, రాజాధిరాజులచే సేవింప బడినదై; పండితోత్తములచే బూజింపబడినదై; ఋషులచే ధ్యేయమై యోగీంద్రులచు ధ్యానింప దగినదియై, బ్రహ్మాది దేవతలచే స్తుతింప దగినదై యుండు దైవజ్ఞానమునందును, దైవజ్ఞానానుష్ఠానులగు భక్తుల యందును, సాధువులయందును, సామాన్య జనులకును, చదువుకొన్న పండితులకును గౌరవనీయులగు కుటుంబస్థులకును విశ్వాసము లేక పోవుచున్నది. ఈ మహా పాప కళంకముచే సామాన్య గృహస్థులు తరణోపాయమును గ్రహింపజాలక పోయిరి. తరణాసక్తి గల జిజ్ఞాసువులకు సహాయులుగా వీరుండక పోయిరి. దీనివల్ల వారు తరింపకపోవుటయే గాక బ్రహ్మనిష్ఠులలో కొందరిపై అసహ్యాబుద్ధి గూడ గల్గియున్నది. ఇట్టి మహాపాపమును ప్రతి ముముక్షువులును పారదోల కంకణ బద్ధులై యుండవలయును. దీనికి వైరాగ్య మొక్కటియే సాధనము. జిహ్వోపస్థలను బంధించ వలయును. అట్లు చేయనివారికి ముక్తి లేదని సచ్ఛాస్త్ర ముద్ఘోషించుచున్నది. తీవ్రముగా బ్రహ్మనిష్ఠచేయవలయును. శాంతమును విడువ

రాదు. కరుణగలిగి యుండవలయును. సద్భక్తియును, మంచిశ్రద్ధయును గల్గి వర్తించవలయును. జ్ఞాన విజ్ఞానములు రెండింటిలోను అసమానమైన ప్రజ్ఞను సంపాదించవలెను, అట్లైన మీరు చదివినవారైనను సరే, చదవనివారైనను సరియే విరోధము లేదు. బ్రహ్మవిద్య అనుష్ఠానపరుల హక్కై యున్నది, అట్లు గానిచో పగటివేషధారుల రాజవేషమును, ఋషివేషమును, సన్న్యాసివేషమును ఎంత శ్లాఘనీయములో అంతే వీరికిని గలుగును.

ఇప్పుడు సత్యమతము ఉదయమగుచున్నది. నిజమైన వేదాంతము ఆవిర్భవించినది. మోసపువేషములను, బూటకపు వృత్తియు ఇక జరుగజాలవు. అట్టి కాలము వెళ్ళిపోయినది. ఇక మీద నిజమైన బ్రహ్మనిష్ఠయు నిజమైన సన్న్యాసమును సత్య తపోధ్యాన జ్ఞానయోగములును లేనివారికి చిన్నచిన్న పిల్లలును, అబలలని తలంచియుండిన స్త్రీలును బాగుగ నచ్చేలాగున బుద్ధి చెప్పుదురు. ఇది ముమ్మాటికి సత్యము. ఇక మీద మీ శాపమునకును, కోపమునకును భయపడు వారుండరు. ఇప్పుడు పుట్టియుండు వారును, ఇక పుట్టబోవు వారును శాస్త్రభాండాగారము యొక్క తలుపును బలాత్కారముగా తెరచెదరు. ప్రతి గ్రంథముయొక్క ప్రతి పేజీ పంక్తియు పరిశీలింతురు. సత్యాసత్యముల నరయుదురు. ధర్మాధర్మముల గనుగొనెదరు. పుణ్యపాపముల యొక్క లక్షణము అందరికిని తెలిసిపోయినది. బంధముక్తుల యొక్క స్వభావము అందరును కనుగొనియున్నారు. కనుక ప్రత్యేకముగా బ్రహ్మనిష్ఠులందరును ఇప్పుడు జాగరూకులై యుండవలెను. అలసతను తొలగించవలెను. శ్రద్ధా భక్తులుగల్గి మంచి అనుష్ఠానపరులై యుండవలయును. శాస్త్రము యొక్క సత్యాసత్య విమర్శన చేయవలయును. ఏ కాలమునకు ఏలాగున నడవలయునో ఆలాగున నడచుకొనవలయునని శాస్త్రము చెప్పుచున్నది. శాస్త్రము కాలానుగుణముగా మార్పుచెందవలయునని శాస్త్రకర్తలు నిర్ణయించియున్నారు. చెరువు నిండునప్పుడు కలుజు తీసి వేయవలెను. లేనిచో జలవేగము కట్టను త్రెంచి వేయును. ఆలాగున జనుల ఆత్మోన్నతి కనుగుణముగా మార్గము తెరచిపెట్టవలయును. లేనిచో ప్రతిబంధములను ప్రధ్వంసమొనర్చుట యీశ్వరునియొక్క

నియతియై యున్నది. అట్టి మార్పులన్నియు ప్రకృతిగతములకే సిద్ధించును. అప్రాకృతమైన దైవమెల్లప్పుడును ఒకే రీతిగానే యుండును. అట్టి దైవమును పొందువారికి అనాది నిర్మితములైన సత్యధర్మ తపోధ్యానయోగ కరుణ విరక్త్యాదులు నిత్యానుష్ఠేయములు. అట్టి భక్తి వైరాగ్యాదులకు మాత్రము మార్పు చేయరాదు. అది ఋషులు తెలిపిన లాగుననే ఆచరించవలయును. ఇది దైవమార్గమునకు మాత్రము సంబంధించినది. సత్యాత్ముడగు దైవమును పొందువారు సత్యాత్ములై యుండవలయును. కరుణాత్ముడగు దైవమును పొందగోరువారు కరుణాళువులై జీవించవలయును. జ్ఞానాత్ముడగు సర్వేశ్వరుని చెందగోరు వారు అజ్ఞానాత్ములై యుండరాదు. శాంతాత్ముడగు ఈశ్వరుని పొందగోరువారు శాంతులై యుండే లాగున చేసికొనవలయును. ప్రకృతి రహితమగు పరబ్రహ్మమును పొందదలంచు వారికి ప్రాకృతగుణములు నశించవలయును. తైలమునకు జలమునకును ఏలాగున ఐక్యము గలుగదో, నిప్పుకును నీటికిని ఏలాగున ఐక్యముండదో, అంధకారము నకును ప్రకాశమునకును ఏరీతిగా ఐక్యమేర్పడజాలదో, గోవ్యాఘ్రములకు ఏలాగున ఏకత్వము గ లుగదో, ఏలాగున గజసింహములకును, దేవాసురులకును ఐక్య ముండదో, విషామృతములకు ఏరీతిగా ఐక్యము గలుగదో, ఆలాగున దైవగుణ హీనునకు ఈశ్వరునితో ఐక్యము గలుగదు. జీవేశ్వరులకు ఐక్యము గలుగవలసి యుండిన జీవునికి దేవగుణము గల్గియుండవలయునని శ్రీకృష్ణభగవానులు గీతలో ఉపదేశించియున్నారు. ఏలన? రాత్రికి, పగటికి ఏలాగున సంబంధముండదో, ఆలాగున నిర్విషయునిచే పొందదగిన పదవి సవిషయునిచే పొంద తరము గాదు.

అభయం సత్త్వసంశుద్ధి ర్జ్ఞానయోగ వ్యవస్థితిః ।
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయస్తప ఆర్జవమ్ ॥

అహింసా సత్యమక్రోధ స్త్యాగశ్శాన్తి రపైశునమ్ ।
దయా భూతేష్వలోలత్వం మార్దవం హ్రీరచాపలమ్ ॥

తేజః క్షమా ధృతిశ్శౌచ మద్రోహో నాతిమానితా ।
భవంతి సంపదం దైవీ మభిజాతస్య భారత! ॥

శ్రీభగవాను లుపదేశించుచున్నారు. ఈ క్రింద చెప్పబడు దైవగుణములు గలవారు మాత్రమే దైవమును పొందగలుగుదురు. అనగా దైవసాక్షాత్కారజ్ఞానము గలుగవలసియుండిన యిట్టి గుణములు గలిగియుండవలయును. ఏ ఉద్యోగము గావలసియుండిన దానికి తగిన పరీక్షలో ఉత్తీర్ణుడు కావలసియుండును గదా! 1. అభయం = భయరాహిత్యము, 2. సత్త్వసంశుద్ధిః = చిత్తశుద్ధియు లేక ఆత్మ శుద్ధియు, 3. జ్ఞానయోగవ్యవస్థితిః = జ్ఞానమందును, యోగమందును మంచి నిష్ఠయు, 4. దానం = శక్తికొలది దానము చేయుటయు, 5. దమశ్చ= బాహ్యేంద్రియ నిగ్రహమును, 6. యజ్ఞశ్చ = బ్రహ్మయజ్ఞాది ఆత్మయజ్ఞములును, 7. స్వాధ్యాయః = అధ్యయనము, ఉపనిషద్గీతాది పఠనము, ప్రణవాదిమంత్ర జపము మొదలైనవి స్వాధ్యాయములో చేరినవి. 8. తపః = కాయిక మానసిక వాచికతపస్సును, 9. ఆర్జవమ్ = కుటిలత లేక యుండుట , 10. అహింసా = మనోవాక్కాయకర్మలచే ప్రాణులకు హింసచేయకుండుటయు, ఆత్మను అజ్ఞానములో ప్రవేశపెట్టి దుఃఖమును కలుగుచేయకుండుటయు ఆత్మవస్తువు హింసింపదగినది కాదను జ్ఞానము గలిగియుండుటయు, అహింసాశబ్దమున కర్థ ములగును, 11. సత్యం = సత్యభాషణమును, 12. అక్రోధః = క్రోధము లేకుండు టయును, 13. త్యాగః = సన్న్యాసము, ధర్మకార్యములకొరకు ధనము నిచ్చుటయు, అనాత్మవృత్తిని త్యజించుటయు, త్యాగ మనంబడును. కర్మఫల త్యాగమును త్యాగములో చేరినదే, 14. శాంతిః = అంతఃకరణోపశమనమును, శాంతమును గల్గియుండుట, 15. అపైశునమ్ = పరదోషములను ప్రకటనచేయ కుండుటయు, 16. భూతేషు దయా = ప్రాణికొట్లలో దయగలిగి యుండుటయు, 17. అలోలత్వం = విషయ సన్నిధానమందు గూడ నింద్రియ చలనము లేకుండుటయును, 18. మార్దవం = మృదుస్వభావమును, 19. హ్రీః= చేయరాని పనిలో సిగ్గుగలిగియుండుటయు, 20. అచాపలం = చంచలస్వభావ ము లేకుండుటయు 21. తేజః = బ్రహ్మ తేజస్సు గల్గియుండుటయు, ప్రసన్న స్వభావము గల్గియుండుటయు, తేజ స్సనంబడును, 22. క్షమా = ఓర్పును, 23. ధృతిః= ధైర్యమును, 24. శౌచం = బాహ్యాభ్యంతరశుద్ధి గల్గియుండు

టయును, 25. అద్రోహః = పరుల కపకారము చేయవలెనను తలంపులేక యుండుటయు, 26. .నాతిమానితా = అభిమానరాహిత్యమును, ఈ ఇరువదియారు గుణములును, దైవీం = దేవయోగ్యమగు, సంపదం = విభూతిని, అభిజాతస్య = అనుభవించుటకు దగినట్లు జన్మించినవానికి, భవంతి= కలుగు చున్నవి.

ఆత్మస్వరూపులారా! బ్రహ్మమునకు సంబంధించిన గుణము గలవారు బ్రహ్మమును, ఈశ్వరగుణము గలవారు ఈశ్వరుని, దేవగుణముగలవారు దేవతలను, మనుష్యగుణముగలవారు మానవత్వమును, రాక్షసగుణముగలవారు రాక్షసులను, అసురగుణము గలవారు అసురులను, పైశాచికగుణము గలవారు పిశాచులను, మృగగుణము గలవారు మృగములను పొందుదురు. అనగా మరణా నంతరము అట్టి స్థితి గల్గును. ఆత్మమిత్రులారా! రాబోవు జన్మము ఇప్పుడే సృష్టి యగుచున్నది. పై జెప్పిన గుణములలో మీ హృదయము ఏ గుణములతో గూడియుండునో అట్టి జన్మము సత్యముగా గల్గును. ప్రకృతి గుణము లేమి యు లేనప్పుడు ముక్తిగల్గును. ఈ భూమిలో మీరు ఏ బీజము పెట్టియుందురో అట్టి ఫలము ఫలించుట యీశ్వర నియతిగదా! కావున ఈజన్మములో దైవత్వము పొందదగిన గుణము లేనిచో ఇంకొక జన్మములోనైన అట్టి స్థితి గలుగుటకు తగిన దైవగుణములను బీజములను ఇప్పుడే మీ హృదయములో పెట్టిపెంచుటకు ప్రయత్నించుడు. సత్యాత్మ బుద్ధిగల వారందరును ఇట్టి మార్గమునే చెప్పగలరు. కనుకనే శ్రీకృష్ణభగవాను లిట్లుపదేశించిడమైనది ''దైవీ సంప ద్విమోక్షాయ నిబ ంధాయాసురీ మతా'' దేవతలకుండదగినదియు, సత్త్వగుణ ప్రధానమును అగు సంపదగలవాడు సంసార బంధమునుండి తొలగి మోక్షమును జెందుచున్నాడు. రాజసతామసమగు ఆసురగుణముగలవాడు సంసారబంధమునుండి విడివడ జాలక దుఃఖము ననుభవించుచుండును. ఇదే ప్రకారము జ్ఞానముగల వారికే జ్ఞేయము అనగా దైవసాక్షాత్కార జ్ఞానము గలుగునని శ్రీభగవానులు 13 వ అధ్యాయములో ఉపదేశించి యున్నారు.

అమానిత్వ మదంభిత్వ మహింసా క్షాంతి రార్జవమ్ ।
ఆచార్యోపాసనం శౌచం స్థైర్యమాత్మవినిగ్రహః ॥

ఇంద్రియార్థేషు వైరాగ్య మనహంకార ఏవ చ ।
జన్మమృత్యు జరావ్యాధి దుఃఖదోషానుదర్శనమ్ ॥

అసక్తిరనభిష్వంగః పుత్రదారగృహాదిషు ।
నిత్యం చ సమచిత్తత్వ మిష్టానిష్టోపపత్తిషు ॥

మయి చానన్య యోగేన భక్తిరవ్యభిచారిణీ ।
వివిక్తదేశసేవిత్వ మరతి ర్జనసంసది ॥

అధ్యాత్మజ్ఞాన నిత్యత్వం తత్త్వజ్ఞానార్థ దర్శనమ్ ।
ఏతత్ జ్ఞాన మితి ప్రోక్త మజ్ఞానం యదతోఽ న్యథా ॥

1. తన్ను తాను కొనియాడకొనకుండుట, 2. లాభము కొరకును, గౌరవముకొరకును, కీర్తికొరకును తాను చేసిన ధర్మమును వెల్లడి చేయకుండుటయు, 3. మనోవాక్కాయములచేత ప్రాణులను పీడింపకయుండుటయు, 4. ఓర్పు, 5. సన్మార్గమందుండుటయును, 6. గురుశుశ్రూషయు, 7. మృజ్జలములచే బాహ్యశుద్ధియు, విషయవిరక్తి బ్రహ్మచింతనలచే ఆంతరశుద్ధి గల్గియుండుటయు, 8. ఎన్ని విఘ్నములు వచ్చినను తన ధర్మకార్యములలో స్థిరతగల్గియుండుటయు, 9. సర్వేంద్రియముల నిగ్రహము గల్గియుండుటయు, 10. ఇంద్రియార్థవిషయములలో విరక్తిగల్గియుండుటయు, 11. అహంకారము లేకుండుటయు, 12.జన్మముచేతను, మరణముచేతను, ముదిమిచేతను, రోగముచేతను గలిగెడు దుఃఖమును, పై చెప్పిన అన్నిటిచేత గలిగెడు దోషములను సదా జ్ఞాపకము చేసికొని అట్టి దుఃఖము గలుగని మోక్షము కొరకు ప్రయత్నము గల్గియుండుటయు, 13. పుత్రులయందును, భార్యయందును, గృహారామపశ్వాది ధనధాన్యములన్నిటిలోను ఆసక్తి లేకుండుటయు, 14. పుత్రాది బంధుమిత్ర జనులకు గలిగెడు సుఖదుఃఖములచే మనస్సులో క్షోభము గలుగనీయక చూచుకొనుటయును, 15. ఎల్లప్పుడు ఇష్టానిష్టముల, స్తుతినిందల, లాభనష్ట

ములయందు మనస్సులో విక్షేపము గలుగనీయక, ఇవన్నియు కర్మానుసారముగా గలుగుచుండునని తలంచి మనస్సులో శోకమోహములకు తావియ్యక చూచుటయు, 16. అచంచలమైన భక్తి గలిగి అనన్యబుద్ధితో నిరంతరము భగవద్ధ్యానమందు నిమగ్నత గల్గియుండుటయు, 17. పవిత్రమైన ఏకాంతస్థలములో నిరంతరముండి బ్రహ్మనిష్ఠచేయు స్వభావము గల్గియుండుటయు, 18. పామర జనుల యందును, వ్యర్థముగా కాలము పుచ్చువారియందును, లోకవార్తలు ఎల్లప్పుడు చెప్పువారియందును, కలహస్వబావము గలవారియందును ఉండుటకు ప్రీతి లేకపోవుటయు, 19. అధ్యాత్మజ్ఞానమందు ఎల్లప్పుడు నిష్ఠగలిగి అట్టిదైవ జ్ఞానమొక్కటియే నిత్యమను బుద్ధిగలిగి వర్తించుటయు, 20. ఆత్మ తత్వజ్ఞానము అనగా దైవసాక్షాత్కారము గలుగు వరకు ఎడతెగక ప్రయత్నించి ఈశ్వర సాక్షాత్కార జ్ఞానము గలుగజేసి కొనుటయు అను ఈ యిరువదిగుణములను గల్గియుండుటయే జ్ఞాన మనంబడును. ఇట్టి జ్ఞానము గలవారికే జ్ఞేయమగు భగవత్సాక్షాత్కారము గల్గును. ఈపైజెప్పిన యిరువది గుణముల కంటె ఇతరములైన అభిమానాది ప్రపంచగుణము లన్నియు అజ్ఞాన మని గ్రహించవలయును.

దివ్యాత్మస్వరూపులారా! ఇప్పుడు జ్ఞానికి ఉండవలసిన గుణములును, దైవత్వము గలుగుటకు తగిన గుణములును శ్రీకృష్ణభగవానులవల్ల మనము గ్రహించితిమి. ఒక పరీక్షలో ఉత్తీర్ణుడు గావలసియుండిన ఎన్నిపాఠములు ఆ విద్యార్థి చదువవలసియుండునో, అన్నిటిలోను పరీక్ష యివ్వక కొన్నిటిలో పరీక్ష నిచ్చిన యేలాగున మరుసంవత్సరములో ఏ విషయములు తప్పిపోయియుండునో, అవి మరల చదివి పరీక్షలో ఉత్తీర్ణుడు గావలసియుండునో, ఆలాగున బ్రహ్మ విద్యయు పై జెప్పిన విద్యవంటిదనియు, ముముక్షువులు పై జెప్పిన విద్యార్థివలె బ్రహ్మ జిజ్ఞాసాపరులై యుండవలెననియు, శ్రీకృష్ణభగవాను లుపదేశించిన గుణములలో ఏ గుణమైన కొరత గల్గియుండిన ఈ విశ్వవిద్యాలయ మను ప్రపంచములో మరియొక్క జన్మమెత్తి అట్టి దైవికగుణములను మనము పూర్తిగా అనుష్ఠానము చేయవలసి యుండుననియు గ్రహింపవలెను. అప్పుడు మాత్రమే ముక్తి యను జ్ఞేయపదవి గల్గును. ఈ బ్రహ్మవిద్యలోను యోగమార్గమురీతి

అష్టాంగములుగాను, జ్ఞానమార్గమురీతి సప్తభూమికలుగాను మహర్షులు విధించి యున్నారు. ఇవన్నియు మనము చదువవలసిన పాఠములే. పరీక్ష సమీపించు నప్పుడు ఏలాగున పాఠములన్నియు వచ్చినవా యని రేయింబవళ్ళు విచారణచేసి, విద్యార్థులు చదువుచుందురో, ఆలాగున బ్రహ్మవిద్యాభ్యాసులు పై జెప్పిన దైవిక గుణములన్నియు గల్గియున్నవా? యని నిరంతరము తాము తమలో చింతన చేయుచుండవలయును. దయ్యపుగుణము గలవారు దయ్యమునే పొందుదురు. దైవగుణముగలవారు దైవమును చెందుదురు. ఇట్టి గుణముల యొక్క భావమును కనుగొనక శివజీవైక్య సంధానము చేయువారి ప్రయత్నము ఉత్తరధ్రువముతో దక్షిణధ్రువమును ఐక్య పరచచూచినట్లు వ్యర్థమగును. వీరి మనన నిదిధ్యాసన ములును ఆత్మానుసంధానమును దీపము దగ్గరకు చీకటిని పట్టి లాగుకొని పోవునట్లుండును.

ఇప్పుడు మనము దైవిక గుణములను గురించిన విషయము చాలవరకు గ్రహించితిమి. ప్రపంచములో ఈ కనపడెడు భేదము లన్నియు, వాదములన్ని యు, ద్వేషములన్నియు ప్రకృతి గుణములతో గూడియుండువరకు మాత్రమే గల్గియుండును. ఇట్టిపాడు గుణములన్నియు దాటిపోయిన జ్ఞాని నిత్యసుఖమను సమరసజ్ఞానమును పొందగల్గును. రక్త కృష్ణ పీత వర్ణములతో గూడిన వస్త్రములకు మాత్రమే భేదము గల్గుచుండును. దూదిలో ఈలాటి దోషమేమియు లేదు. ఆలాగున గోవులు అనేక వర్ణములతో గూడియుండినను పాలలో అట్టి భేదమేమియు కనపడదు. కాబట్టి మనము వస్త్రములయొక్క రంగులను విడిచి పెట్టియు, ఆవుల యొక్క వర్ణమును త్యజించియు, దూదియం దేకత్వమును, క్షీరమందు ఐక్యమును గనుగొన్నట్లు మనోమయ ప్రపంచమును దాటిపోయి పరి శీలన సలిపిన ఏకమగు ఆత్మను గనుగొనవచ్చును. అచ్చట నిత్యసుఖము గలదు. కనుకనే అమృత బిందూపనిషత్తు ఈలాగున చెప్పుచున్నది.

గవామనేకవర్ణానాం క్షీరస్యాప్యేకవర్ణతా ।
క్షీరవత్పశ్యతే జ్ఞానం లింగినస్తు గవాం యథా ॥

దీని యర్థము పై జెప్పినదే.

క్షీరమును చూచిన దృష్టి జ్ఞానదృష్టియనియు, గోవుల నామరూపముల చూచుట అజ్ఞాన దృష్టి యనియు చెప్పబడును. ఆలాగున,

**గుణానేతా నతీత్య త్రీన్దేహీ దేహసముద్భవాన్ ।**
**జన్మమృత్యు జరాదుఃఖైర్విముక్తోఽమృతమశ్నుతే ॥**

జీవుడు దేహోత్పత్తికి కారణములగు ఈ మూడు సత్త్వరజస్తమోగుణములను బ్రహ్మనిష్ఠచేత రహితమొనర్చినవాడై జననము, మరణము, వార్ధక్యము, దుఃఖములు అనువానిచేత విడువబడినవాడై నిత్యసుఖమగు మోక్షమును పొందుచున్నాడు. అయితే ఇట్టి అవస్థ మనకు గలుగవలయును.

**యదా తే మోహకలిలం బుద్ధిర్వ్యతితరిష్యతి ।**
**తదా గంతాఽసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ ॥**

ఓ యర్జునా! ఎప్పుడు నీయొక్క బుద్ధి అజ్ఞానకల్మషమును దాటగలదో, అనగా ఎప్పుడు ప్రకృతికి పరమగు ఆత్మలో నిలుకడ గల్గునో, అప్పుడు ఇంత వరకు గురువులచేతగాని, శాస్త్రములచేత గాని, నీస్వబుద్ధితో గాని చింతించిన దానియొక్క అర్థము గోచరమగును. తరువాత నిక వినదగినది మరియొకటి లేదను బోధము గూడ గల్గును. అనగా వినందగినవన్నిటిని విన్న వాడే యగును. అప్పుడు వేదముయొక్క అంతమగు ఉపనిషత్ప్రతిపాదితబ్రహ్మమును బొందగల్గును. ఎంతవరకు అవిద్య కేవలనుండునో అంతవరకు దైవవిషయము గోచరము కాదు. అవిద్యను దాటునప్పుడే యథార్థ తత్త్వమగు దైవము గోచరమగునని భావము.

ఆత్మమిత్రులారా! ఇప్పుడు జీవేశ్వరుల ఐక్యస్థితియు, సమరసజ్ఞానమును గ్రహించితిమి. అందరియొక్క గమ్యస్థాన మొక్కటేయని తెలిసికొనవలసి యుండును. అది యేదనగా? ఏ స్థానములో నుండి మీకు శోకశాంతియు, ఆనందప్రాప్తియు నొందవలెనని కోరిక గల్గుచుండునో అచ్చటికి మనమందరమును నిదానముగానో, వేగముగానో, యీ జన్మములోనో, మరియొక జన్మములోనో పోయి చేరవలసి యుండును. కనుకనే ''ప్రారంభమే పర్యవసానము''ని

మహాపురుషులు తెలిపెడు రహస్యమైయున్నది. అట్టి స్థలమే హృదయమనియు, సుషుమ్నాగ్రమనియు, బ్రహ్మరంధ్రమనియు, హృదయగుహాయనియు, బ్రహ్మ బిలమనియు, భ్రూమధ్యమనియు, నాసికాగ్రమనియు, సహస్రారమనియు, మూర్ధ స్థానమనియు, జీవునిస్థానమనియు, దృక్కుయొక్క ఉనికియనియు, దైవమందిర మనియు, దేహమధ్యమనియు, అనాహత చక్రమనియు పర్యాయనామములతో పిలువబడును. జీవునియందు ఈశ్వరభావము గల్గినప్పుడే ఆ స్థలము పరమాత్మని నివాసస్థానమనియు గ్రహించవలయును. మంచిబ్రహ్మనిష్ఠచే అట్టి స్థలములోనికి వచ్చిచేరక అనగా మనన నిదిధ్యాసనలు లెస్సగా చేయక, ధారణ, ధ్యాన బలముచే సమాధినిలయమును పొందక, భక్తితో భగవంతునియందు ఐక్యము గలుగచేయక, జీవునిస్థాన మెచ్చట? ఈశ్వరుని స్థలమెచ్చట? విష్ణువునకు ఈ దేహములో నివాసస్థలమెచ్చట? బ్రహ్మకు ఈ శరీరములో నిలుకడ యెచ్చోట? అని యీలాటి ప్రశ్నలు వ్యర్థజీవులు చేయుదురు. బ్రహ్మము ఒక ఖండపదార్థమైన ఒక చోట నుండి మరియొక చోటికి మార్చవచ్చును. అఖండమై, అనంతమై, వ్యాపకమైన బ్రహ్మమునకు అనగా ఈశ్వరునికి స్థలమెచ్చట యని అడుగుట ఆకాశమునకు చోటు ఎక్కడ యని అడిగిన పిచ్చిమాటవంటిదే యగును.

అయితే యిది పూర్ణజ్ఞానముయొక్క స్థితిగా నుండును. సాధకుల కొరకు కొన్ని ఆధారములను, కొన్ని చక్రములను, కొంత మంది కల్పిత దేవతలను సృష్టించియున్నారు. నానాదేశములలో నుండి సముద్రముపై ఓడలో ప్రయాణ ముచేయువారు ఒకేకేంద్రస్థానమునకు వచ్చి చేరవలసి యుండినచో అష్టదిక్కులలో నుండి నిర్ణీతస్థానమునకు వచ్చి చేరునట్లు, దృశ్య ప్రపంచములో ద్వంద్వములతో గూడిన యీ సంసారదుఃఖసాగరములో మోక్షమనెడు తీరమునకు మత మతాంతరము లనెడు నావలపై ప్రయాణముచేయు ముముక్షువులందరును తమ యొక్క ఆత్మలలో దైవభావముగల్గి వచ్చి చేరవలసియుందురు. జనులకు తెలిసి గాని, తెలియక గాని శోకనివృత్తి చేసికొనవలెననియు, ఆనంద ప్రాప్తి గలుగవలయు ననియు ఒక విచారము మాత్రము అంతరాత్మలో గల్గుచుండును. దీనికొరకే సర్వజనులును సమస్తకార్యములు చేయుచుందురు. ఒక కృషీవలుని దగ్గరకు

వెళ్లి విచారించిన తాను చేయుపని భోజనాది సౌఖ్యములతో, దుఃఖము లేని స్థితిలో నుండుటకొరకని అతడు సమాధానమిచ్చును. పాఠశాలలోనికి వెళ్లి చదువుచుండు విద్యార్థిని అడిగిన అతడును విద్యను ఆర్జించి ధనమును సంపాదించి సుఖముగా జీవితము గడుపుట కొరకని ప్రత్యుత్తరమిచ్చును. అచ్చోట నుండి కార్మికులుండు స్థలమునకేగి అడిగినచో వారును దుఃఖము గలుగని సుఖజీవితముకొరకే ఈ పని చేయుచున్నామని తెలుపుదురు. ఒక్క యంత్రనిర్మాతతో మీ ప్రయత్నమెందుకొరకని ప్రశ్నించినచో అతడును ప్రయాసము లేక ప్రజలకు ప్రయాణాది సౌకర్యము గలిగించుటకును, సులభముగా సర్వకార్యములను చేసికొనుట కొరకని సావధానముగా సమాధానమిచ్చును. ఆలాగున ఒక వైద్య శాస్త్రజ్ఞునితో మీరేమి చేయుచున్నారని యడిగినచో అతడు రోగముచే జనులు సంకటము నొందక సౌఖ్యముగ నుండుటకొరకు ఔషధము తయారు చేయుచున్నానని సమాధాన మిచ్చును. ఈలాగున ప్రపంచములో ఎవరెవరు ఏయే పనిచేయుచుందురో, వారందరును దుఃఖము గలుగక సుఖముగా జీవన యాత్రగడుపుట కొర్కై ఆ పని చేయుచుందురని ప్రత్యక్షముగా కనుగొనవచ్చును. ఇంతటితో ప్రవృత్తి మార్గస్థులతో మనప్రశ్నలు పూర్తియైనవి.

ఇప్పుడు కామ్యకర్మపరులను ప్రశ్నించెదము. ఒకడు యజ్ఞాదిక్రతువులు చేయుచుండిన అతని నడిగినచో స్వర్గప్రాప్తికో లేక పుత్రలాభమునకో, లేక పాపశాంతికో, లేక యిష్టవస్తువుల జయమగు ప్రాప్తికొరకో అని అతడు మనలను సత్కరించి జవాబిచ్చును. ఈలాగున దాన, ధర్మ, పూజా, తీర్థయాత్ర వ్రతాదులు సలుపువారు గూడ పై జెప్పినట్లే జవాబొసంగెదరు. కామ్యకర్మలను విడిచి నిష్కామముతో పై జెప్పిన కార్యములు చేయు నివృత్తి మార్గస్థులను విచారించిన మాకే కోరికయు లేదు గాని, యీశ్వర ప్రీత్యర్థముగా చేయుచున్నాము. దీనివల్ల ఈశ్వర కరుణ గల్గి అజ్ఞానదోషము నశించి అంతఃకరణ శుద్ధి గలిగి తద్ద్వారా వైరాగ్యముద్భవించి జ్ఞానము సిద్ధించి యీశ్వరప్రాప్తి యగు ముక్తికలుగును. అప్పుడు ఈ సంసార దుఃఖము తొలగి ఆనందప్రాప్తి గలుగునని చెప్పుదురు. పరమ భక్తితో నొకడు దైవభజనము చేయుచుండిన అతడు దైవప్రాప్తిగల్గి

ముక్తిసుఖము గల్గుటకొరకు, దైవభజన చేయుచున్నానని పలుకును. ఒకడు యోగాభ్యాసము చేయుచుండిన, అట్టివానిని విచారించినను అంతఃకరణములో గల మలవిక్షేపాది దోషములు నశించి హృదయనిర్మలత గలిగి మనోమారుతములు వశపడి నిర్వికల్పసమాధి పరమగు దైవసుఖముకొరకే తన యోగమని అతడు మనకు ప్రేమతో జవాబు నొసంగును.

ఏకాంతమందు తపోనిష్ఠుడైన ఒక మునిసత్తముని నమ్రభావముతో సమీపించి వినయభక్తులతో అడిగిన, ఆ తాపసోత్తముడును ముక్తికొరకని సంతోషముగా జవాబిచ్చి పంపివేయును. బ్రహ్మచింతనచేయుచుండు ఒక యతీంద్రుని భక్తితో సమీపించి వినమ్రులై నమస్కరించి విచారించినను, ఆ మహాత్ముడును, మిథ్యాప్రపంచముయొక్క వాసన అంతఃకరణమునుండి తొలగి సత్యమైన బ్రహ్మభావన అవిచ్ఛిన్న తైలధారవలె నిరంతరముండుట కొరకనియో, నిరావరణ సూర్యునివలె సదా దైవభావము గల్గి యుండుటకనియో, దానివల్ల నిత్యముక్తి యనెడు మోక్షము గల్గుననియో ప్రశాంతముతోను, ప్రసన్న భావముతోను చెప్పి మనలను పంపివేయును. ఇప్పుడు మనము ప్రపంచములోగల ప్రవృత్తి నివృత్తి మార్గస్థులగు అందరియొక్క ఆశయము కనుగొంటిమి.

ఈ నిత్యసుఖ బుద్ధియు, దుఃఖనివృత్తియు, పశువులకును, పక్షులకును, క్రిములకు సహా గలదు. ఒక జీవియు దుఃఖమును పొందవలయునని తలంపుగల్గి యుండుట లేదు. ఈ జీవకోట్లన్నియు ఏ ప్రకారమైన సుఖము గలుగునో అట్టి మార్గములనే అవలంబించుచున్నవి. అయితే అట్టి జంతువులకు వివేక జ్ఞానము పూర్తిగా లేదు. అందుచే గాలములోగల యెఱ్ఱనుగాని, మాంసమునుగాని చూచి అపాయమని తెలిసికొనజాలక చేప మ్రింగుటచే దుఃఖమును పొందుచున్నది. ఆలాగున బోనులో పెట్టియుండు పండ్లు, ఫలాహారములను చూచి మోహించి యెలుకలు అందు ప్రవేశించి మరణించుచున్నవి. ఈలాగున మానవులలో గూడ కొందఱు మాయామోహితులై, దృశ్యవిషయములలోను, మత్తుపదార్థములలోను, దుష్టవిషయములలోను సుఖము గలదని తలంచి, పడిపోయి దుఃఖితులగు చుందురు. కనుకనే వివేకజ్ఞానములేని మానవుడు ఆకృతిలో మనుష్యుడై

యుండినను మృగప్రాయుడని శాస్త్రము చెప్పెడు రహస్యము.

మనుష్యులలో గూడ మూడు తరగతులు గలవారున్నారు. పుణ్యాపుణ్యములు, బంధమోక్షములు, కార్యాకార్యములు స్వయముగా తెలిసికొని, జ్ఞానవంతుడై వర్తించువాడు మానవదేవుడని పిలువబడును. ఇతడు సత్త్వగుణాధిక్యము గల్గియుండును. రెండవవాడు స్వయముగా తనకు పాపపుణ్యములు బంధమోక్షములు తెలియక పోయినను శాస్త్రములలో కనుగొనిగాని, మహాత్ములు చెప్పినది వినిగాని వెంటనే అట్టి దోషకార్యములను విడిచిపెట్టును. వాడు మానవులలో ఉత్తమ మనుజు డనబడును. ఇతనికి రజోగుణము కొంచెముగను, సత్త్వగుణముయొక్క ఆవిర్భావమును గల్గియుండును. మూడవవాడు మానవుడై యుండినను మృగమనుజు డనియే తలంచవలయును. ఇతనికి స్వయముగా పుణ్యపాపములు తెలియవు. శాస్త్రము చదినినను పవిత్రవచనముల గమనింపడు. పుణ్యపురుషులు చెప్పినను వినడు. ఇట్టివానికి తమోగుణ మధికముగను, రజోగుణము కొంచముగాను ఉండును. మొదటివానికి ఈ జన్మములోనే ముక్తికి తగిన యోగ్యత గల్గును. రెండవవానికి మరియొకజన్మములో మోక్షమునకు తగిన దైవికగుణములు గల్గును. మూడవవానికి కాలనిర్ణయమే లేదు. సుకృతవిశేషము గల్గిన కొన్నిజన్మములలో దైవకరుణగల్గి మంచిగుణము గలుగవచ్చును. ఒకరికి సత్త్వగుణము గలుగనప్పుడు సాత్త్వికాహారములోను, సత్త్వగుణవర్తనములోను, సాత్త్వికగుణముగల పుణ్యజనులతోడి సంసర్గములోను, సాత్త్వికగుణము గలుగుచేయు గ్రంథపఠనములోను, సాత్త్వికజనుల నిరాడంబర నిర్మలవస్త్రధారణలోను, సాత్త్వికమును బోధించెడు పత్రికలను చదువుట లోను, గృహములలోగల పరికరములన్నియు సత్త్వగుణమునకు సంబంధించినవై యుండుటలోను ప్రీతి గల్గియుండును. దీనికి ముందు పై జెప్పిన కార్యములన్నియు రజోగుణతమోగుణములు గలిగి యుండినచో వానిని విడిచిపెట్టును. ప్రాణమిత్రుడైయుండినను తనసత్త్వగుణమునకు తగనిచో విడుచును. పై జెప్పిన అన్నిటిలోను గల లాభనష్టములనుగూడ పాటింపడు. ఆలాగున రజోగుణము గల్గియుండునప్పుడు రాజసగుణముగల మిత్రులును, రజోగుణాహారములును,

ఆడంబరముతో గూడిన రజోగుణవస్త్రధారణయు, రజోగుణ గ్రంథపఠనము, పత్రిక తెప్పించడము రాజసగుణము గలిగిన గృహపరికరములను గల్గియుండును. అదేప్రకారము తమోగుణముగల వారి స్థితులన్నియు తామసగుణముతో గూడియుండును. చేయుపనియు, శ్రద్ధాభక్తులతో చేయక కుక్షిపూరణమునకై యుండును. రజోగుణముగలవారు డాంబికముతో గౌరవముకొరకును, పేరుకొరకును పనులు చేయుదురు. సత్త్వగుణముగల్గినప్పుడు శ్రద్ధాభక్తులతోను, నమ్రభావముతోను, దైవప్రీతికొరకును,నిరాడంబరముగాను దైవకార్యముల చేయుచుందురు. కనుక ఒకరి ఆహారముగాని, వర్తనముగాని, సహవాసముగాని చూచిన వాడు ఏ గుణముతోగూడిన వాడుగా నుండునదియు కనుగొనవచ్చును. ఆ గుణవిషయమై గీత చతుర్దశాధ్యాయమున విస్తారముగ కనందగును. మేధాసంపత్తియు, విచారణ జ్ఞానశక్తియు గలవారికి గీతలో ఈ గుణత్రయావిభాగయోగాధ్యాయము, ధ్యానయోగమందు ప్రీతిగలవారికి ఆత్మసంయమ పరమగు ఆరవ అధ్యాయమును పై జెప్పిన రెండింటికిని శక్తిలేనివారికిగాని, లేక భక్తియందు ఆసక్తిగలవారికిగాని, భక్తియోగమగు ద్వాదశాధ్యాయమును ముఖ్యములు. సత్త్వగుణము జ్ఞానమునకు కారణమగును. రజోగుణము కామ్యకర్మలకు హేతువగును. తమోగుణము అజ్ఞానమునకు మూలమగును. ఈ మూడు గుణములకు విలక్షణమైన విశుద్ధగుణము గల్గినప్పుడే మోక్షము గల్గును. ఇట్టివానిని కనుగొనుట ప్రయాసము. ఏలన? ఈ మహాపురుషునకు పై జెప్పిన మూడు గుణములును ఉండవు. సత్త్వగుణసంబంధవిషయములు మాత్రము కొన్ని యుండవచ్చును. ఈ పుణ్యాత్ముడు దేహవృత్తితో సామాన్యమానవునివలె గనుపించినను సదా బ్రహ్మాకారవృత్తిగల్గి యుండును. ఇంద్రియసుఖములయందు రమింపడు. సదా ఆత్మారాముడై యుండును. వైరాగ్యబోధోపరతులు గల్గి అవి మూర్తిమంతములై యుండును. దయగలిగి సదా ప్రసన్న భావముతో అమృతమయుడై యుండును. ఆ మహనీయుడు పండిన మామిడిపండు వలె మధురముగాను, మృదువుగాను, ప్రసన్నముగాను ఉండును.

ఇప్పుడు మనము గుణములయొక్కయు, ప్రకృతి గుణ రహితుడైన సుఖము యొక్క మార్గములోనికి వెళ్లెదము. పిపీలికాది బ్రహ్మపర్యంతముగల ప్రాణికోట్లన్నిటికిని నిత్యసుఖమును పొందవలయునను వృత్తి గానుపించు చున్నది. ఒకరికి ఒక వృత్తి గల్గు చుండిన దానికి కారణ మొకటి యుండే తీరవలయును. కారణము లేక కార్య ముండదనియే శాస్త్రజ్ఞుల సిద్ధాంతము. కావున ఆత్మ జ్ఞాన స్వరూపులగు సోదరీ సోదరులారా! మీ యొక్క ఆత్మ ఆనందస్వరూప బ్రహ్మమైయున్నది. కనుకనే మీకు అట్టి ఆత్మభావములో నిరంతరము నిలకడ గల్గి యుండేలాన ఇష్టము గలుగుటకు కారణమగుచున్నది. కనుక అట్టి స్థితిలో వచ్చి చేరేలాగున మీరు ప్రయత్నించవలెను. అంతవరకు జనన మరణముల నెడు సంసారచక్రములో తిరుగవలసియుండును. ఇట్టి స్థితి పొందుటలో ఏమేమి ప్రతిబంధములు గలవో అవి యన్నియు, మీరు ఎప్పుడో చేసిన కర్మముల యొక్క కార్యమైయున్నవి. ఇవి బ్రహ్మ చింతనచేతను, ధ్యాన యోగముచేతను, దైవోపాసనచేతను, పుణ్యకర్మానుష్ఠానము చేతను తొలగించి దాటవలసి యుండును.

ఇవి యన్నింటిలోను బ్రహ్మనిష్ఠ శ్రేష్ఠమైనది. అయితే అంతఃకరణములో దృశ్యవృత్తులుండు వరకు సదా బ్రహ్మనిష్ఠలో నుండుటకు సాధ్యపడదు. కావున ఎంతవరకు మనస్సు బ్రహ్మభావమగు ధ్యానములో నిలుచునో అంతవరకు నుండి బహిర్వృత్తి గల్గినప్పుడు శాస్త్రపఠనములోను, పుణ్యకార్యములు చేయుటలోను, అత్యవసరములగు పనులు నిర్వహించుటలోను, పర ప్రాణుల కుపకారము చేయుటలోను కాలము గడిపిన మనస్సు కొంచెమైన ప్రపంచములో పోయి సంచరించుటకు అవకాశము గల్గదు. అట్లు చేయక నిరంతరము బ్రహ్మనిష్ఠలో మనస్సులగ్నము కానివారు ఊరకుండిన మనస్సు ప్రపంచములో పోయి పనిచేయుచుండును. ఇది ఒక విధమగు వంచక జీవితమగునని శ్రీకృష్ణభగవానులు గీత తృతీయాధ్యాయమున నుడివియున్నారు. మీరూరకుండినను మీ జీవిత సమయము మాత్రము ఊరకుండుట లేదు. అది వెళ్ళిపోవుచునే యుండును. అట్టిసమయమో అమూల్యమైనది. దానిని వ్యర్థము చేయక ఏదైన ఒక కార్యములో

వినియోగపరచవలయును. ఒక్కవేళ మీ ఆత్మకార్యమునకు అవసరము లేక పోయినను పరులకొరకైన వినియోగపరచవలయును. రాట్నముపై దారము వడికి ఖద్దరువస్త్రము నిర్మించి తన కుపయోగపరచుకొనవచ్చును. లేక సాధువులకును, బీదలకును ఇవ్వవచ్చును. స్త్రీలు విస్తరాకులు దొరికే స్థలములో విస్తళ్లు కుట్టవచ్చును. అవి పుణ్యాశ్రమములకును పుణ్యకార్యములకు వినియోగపరచవచ్చును. ఇతరములైన కుట్టుపని మొత్తులు దెలిసిన వారు అదిన్ని చేయవచ్చును. ఏ పనియు చేతగాక పోయిన వీథులలోగల రాళ్లు, ముండ్లు తీసివేసి పరిశుభ్రము చేయవచ్చును. ఇదిన్ని గొప్ప లోకసేవయే యగును. ఇది మీకు సిగ్గుగా తోచినచో మందిరము లోనికిని, సత్రములోనికిని వెళ్ళి ఊడ్చి శుద్ధపరచుడు. ఊరక తిని పడి యుండుట సోమరితనము యొక్క స్వభావమేగాని, సోహంపరుల యొక్క స్వభావము కాదు. పోయిన సమయము మరల దొరకదు. గోస్తనమునుండి బయట తీసిన క్షీరము మరల దానియొక్క స్తనములోనికెక్కింప సాధ్యమా? సమయమును అటువంటిదే. ఇది ఆవుపాలవంటిది గాదు. అమృత మయమని తలంచవలెను. దీనిని వ్యర్థపరచక సార్థకపరచుటయే నిజమైన వైరాగ్య మనంబడును. ఆత్మ సంరక్షణ యని గూడ చెప్పవచ్చును. మనస్సు స్వభావముగా కోతివలె చలనము గలది. అట్టి కోతిని తేలుగూడ కుట్టిన యెట్లుండును? దయ్యము గూడ పట్టిన ఏ రీతిగా నుండును? మనస్సును అటువంటిదని గ్రహించవలెను. ఎప్పుడు దానికి ఒక పని యిచ్చి యుండవలెను. అది కుక్కతోక వంటిది. రెండు కొసలను పట్టి యుండిన మాత్రమే చక్కగా నుండును. చెయ్యివిడిచిన యెడల మరల వంకరపోవునట్లు మనస్సునకు ఒక పని యివ్వకపోయిన అది దృశ్యముపై దుముకుచుండును. ముందు చెప్పిన ఆనందమే ఆత్మయొక్క స్వభావమని తైత్తిరీయోపనిషత్తు చెప్పుచున్నది.

**ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్,**
**ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయంతే,**
**ఆనందేన జాతాని జీవన్తి,**
**ఆనందం ప్రయంత్యభిసంవిశంతి.**

ఈ సమస్తభూతములును, ఆనందమగు బ్రహ్మము నుండియే పుట్టు చున్నవి. పుట్టిన భూతకోట్లన్నియు అట్టి ఆనందమగు దైవములో జీవించుచున్నవి. మరల ఈ జీవకోట్లన్నియు అట్టి ఆనందములోనే విలయమొందుచున్నవి. కనుక అట్టి ఆనందమే బ్రహ్మమని తెలుసుకొనుము అని శ్రుతి చెప్పుచున్నది.

కావున సోదరీ సోదరులారా! మీరందరును అట్టి ఆనందస్వరూపులే. ఒక్కొక్కమత ప్రవక్తయు యీశ్వరుని పొందినవారే. ఏప్రకారమైనను జీవుని యొక్క అజ్ఞానము తొలగిపోయిన చాలను. అనగా త్రిగుణములనుండి విముక్తి గల్గిన చాలును. నాగసర్పము యొక్క విషము ఎక్కినవారికి విషవిమోచనము కొరకు ఒకే విధమగు మూలిక అనగా ఔషధము గాదు. విషసంజీవిని మూలికలు అనేక విధములు గలవు. ఆలాగున విషనివారణ మంత్రములును బహువిధములు. ఒకే మంత్రము మాత్రము గాదు. గారుడ మంత్రము, కశ్యపమంత్రము మొదలగు మంత్రములును బహువిధములు గలవు. ఏ మంత్రమైనను విషనివారణమే మనకు కావలసినది. ఆలాగున విరేచనమునకు కొందరు కొన్నిరకముల చూర్ణములును, మరికొందరు కొన్ని రకములగు భస్మములును, ఇంక కొందరు కొన్ని లేహ్యములును, వేరు కొందరు కొన్ని కషాయములును, మరికొందరు కొన్ని పసరులును ఇచ్చెదరు. ఎట్లైనను మలశుద్ధి గల్గిన చాలును.

ఆలాగున కొందరు భక్తులు శ్రీకృష్ణభక్తిచేత తన్మయులైరి. మరికొందరు శ్రీరామభక్తిచేతనే మాయావిముక్తులైరి. ఇక కొందరు శ్రీశివభక్తివల్లనే అవిద్యాదూరులైరి. కొందరు శ్రీ నారాయణ భక్తి చేతనే జీవన్ముక్తులైరి. కొందరు దేవీ భక్తివల్ల దివ్యులైరి. కొందరు శ్రీ దత్తాత్రేయోపాసనచేతను త్రిగుణరహితులైరి. కొందరు యోగముచేతను మాయనుండి వియోగము గలవారైరి. కొందరు జ్ఞానముచేతను అజ్ఞానరహితులైరి. కొందరు నిష్కామ కర్మచేతను నైష్కర్మ్య సిద్ధిని పొంది ముక్తులైరి. కొందరాత్మచింతన చేతను అనాత్మనుండి వేరుపడిరి. కొందరు బ్రహ్మచింతనచేతనే బ్రహ్మత్వమును బొందిరి. ఈ విషయములన్నియు

శాస్త్రములచే మనకు గోచరమగుచున్నవి. ఎట్టి విధమైనను జీవులకు అజ్ఞానము నశించిన చాలును. అప్పుడు పై జెప్పిన వారందరును ఒకే జ్ఞానము గలవారగుదురు. మార్గము లన్నిటిలో సులభమార్గము ఏది యని మీరెవరైన అగిగినచో ఈలాగున సులభముగా జవాబు చెప్పవచ్చును. ఏ సంప్రదాయములో విరక్తియు, సద్భక్తియు, కరుణయు, సత్యనిష్ఠయు, అత్యధిక బ్రహ్మనిష్ఠయు గల్గియుండునో ఆ మార్గమే సులభమార్గము. అది ఏ మార్గమైనను దైవమార్గము. అట్టిది గానిది దైవమార్గమని చెప్పినను దయ్యపు మార్గమగును. ఇదే నా మతము.

పై జెప్పిన వారందరును దైవజ్ఞానము గలవారై యుండినను కొందరు వారివారిమార్గమే నిజమనియు, మరికొందరు ఏమార్గమైనను పవిత్రాచరణ గలవారై యుండిన చాలుననియు సెలవిచ్చిరి. మరికొందరు, తమ మార్గము తప్ప మోక్షమునకు త్రోవలేదని గూడ చెప్పియున్నారు. ఇకకొందరు తన మార్గమునకు రానివారికి మోక్షములేదని చెప్పుటయేగాక నిందించికూడ యుండిరి. కొందరు ఇతరుల మార్గమునకు అడ్డు పోవుటయేగాక, క్రూరకృత్యములనుగూడ ఒనర్చియుండిరి. ఓహో! ఇదియేమి యాశ్చర్యము. పరమపావనులై, కరుణాళువులై యుండవలసిన యిట్టి పుణ్యాత్ములు గూడ పరమపాపుల వలెను కఠినాత్ములవలెను ప్రవర్తించుట మాయయొక్క శక్తియేగాక మరియేమని చెప్పవచ్చును? ఒక్కొక్కరును పై జెప్పిన దానికి అనుకూలములైన శ్రుతి, స్మృతి, పురాణేతిహాసములను కొల్లలు కొల్లలు సాక్ష్యములుగా నిరూపించిరి. శాస్త్రముల కేమి కొరత? సముద్రతీరమున ఇసుకరేణువులకైన నొకవేళ కొరత యుండును గాని, శాస్త్రసాగరములో శ్లోకములకును, వచనములకును, మూలబుక్కులకును ఏమికొరతయుండును? ఎవరైన వ్రాయుటకుగాని, వ్రాసినదానిని ముద్రించుటకుగాని యుండినచో, నిష్కామకర్మయోగముచేతనే ముక్తిగల్గును వేరుమార్గము లేదని వేలకొలది శ్రుతిస్మృతి పురాణములను చూపించెదను. ఆలాగున భక్తియోగముచేతనే ముక్తి గలదు గాని వేరుగతి లేదని వేలకొలది శాస్త్రముల నిరూపించెదను. ఆ భక్తి శివభక్తిగాని, విష్ణుభక్తి గాని కృష్ణ భక్తిగాని, రామభక్తిగాని అయినను కావచ్చును. అదేరీతిగా యోగమార్గముచే

తప్ప మోక్షము గలుగదని వేలకొలది శాస్త్రములు నిరూపణ చేయవచ్చును. అట్లే జ్ఞానమార్గమును అవలంబించనిచో కోట్లకొలది జన్మములెత్తినను మోక్షము దొరకదని నిర్ధారణచేయుటకు వేలకొలది శాస్త్రములు గలవు. అయితే జ్ఞానము కలుగనిచో కర్మచేగాని, ఉపాసనచేగాని, యోగముచేగాని, ముక్తిలేదని చెప్పునది నిజము. దీనియందుగల రహస్యమేమన? ఏ మార్గమవలంబించినను అజ్ఞానము నశింపవలయునని చెప్పడు వాక్యము యథార్థమే గాని మరియేమియు లేదు. అదిమాత్రము నిజము. భక్తుడైనచో యీ జగత్తంతయు భగవన్మయముగా కనుపించవలయును. యోగియైనచో శైవభావమునుండి వియోగమునొందని యవస్థను బొందవలయును. జ్ఞానియైనచో ఇదంతయు బ్రహ్మమయమై గోచరించవలెను. నిష్కామకర్మయోగి యైనచో కర్తృత్వమును, కర్మఫలాసక్తియు నశించవలయును. అప్పుడతనికి మిగిలియుండునది ఆ భగవన్మయమే. ఆకాశమందు సుఖముగా సంచరించుటకు పక్షికేలాగున రెండురెక్కలవసరమో ఆలాగున నిరాటంకముగా బ్రహ్మములో విహరించుటకు నిరంతర బ్రహ్మచింతనము, లేక అనవతరము అనన్యభక్తితో దైవవిచారమను ఒక రెక్కయు, ఇంద్రియసంయమపరమగు వైరాగ్యమను రెండవ రెక్కయు లేక ఆత్మసంయమయోగమను రెండవ రెక్కయు అందరికిని అవసరము. ఇదే సర్వమహర్షులయొక్క ముఖ్యమైన ఏకాభిప్రాయమై యున్నది. కనుకనే

**యోగహీనం కథం జ్ఞానం మోక్షదం భవతి ధ్రువమ్? ।**
**తస్మాద్యోగం చ జ్ఞానంచ ముముక్షు ర్దృఢమభ్యసేత్ ॥**

అని శాస్త్రము చెప్పెడు రహస్యము. శ్రీశివభక్తుడేలాగున తన్మయుడై ఆనందభరితుడై యుండునో, శ్రీకృష్ణభక్తుడు ఏలాగున భగవన్మయుడై ఆనందవారధిలో మునిగి యుండునో, శ్రీరామ భక్తుడును దైవమయుడై ఎట్లు ఆనందవారాశిలో మునిగి దొర్లుచుండునో, ఆత్మజ్ఞాని యేలాగున బ్రహ్మాకార వృత్తి గల్గి సచ్చిదానందసాగరములో లీనమైయుండునో, ఏప్రకారము యోగియును ఆత్మనుండి వియోగము గలుగని ఈశ్వరమయుడై యున్నాడో, ఆలాగున ఇతర

మతస్థులును, ఇతర సంప్రదాయులును యథార్థముగా అనుష్ఠించి పరమానంద భరితులై యున్నారు. అన్నిటికిని అవిద్య నశించిన చాలును. వస్త్రములో గల మలినము పోగొట్టుటకు చవుడుమట్టి ఒకటే గాదు. సబ్బు, షోడా మొదలగు అనేకపదార్థములు గలవు. అవిద్యానాశమే జ్ఞానప్రాప్తి యని శాస్త్రము చెప్పినది నిజమైనచో ఇప్పుడు చెప్పినవన్నియు సత్యములు.

ఆత్మా క్షేత్రజ్ఞ సంజ్ఞోఽయం సంయుక్తః ప్రాకృతైర్గుణైః ।
తైరేవ విగత శ్శుద్ధః పరమాత్మా నిగద్యతే ॥

అత్మయనియు, క్షేత్రజ్ఞుడనియు, జీవుడనియు చెప్పబడు ఈ ప్రత్యగాత్మ ప్రాకృతగుణవములతో గూడియున్నప్పుడీలాటి సంజ్ఞగల వాడగుచున్నాడు. అట్టి ప్రకృతి గుణము లన్నియు వీడిపోవునప్పుడు పరిశుద్ధాత్ముడై పరమాత్మయను అవస్థను పొందుచుండును.

మలినో హి యథాఽఽదర్శో రూపాలోకస్య న క్షమః ।
తథాఽవిపక్వరణ ఆత్మజ్ఞానస్య న క్షమః ॥

ఎవరిచేతిలో నుండిన అద్దమైనను దానిలోగల మలినము పోవునప్పుడు వారివారి ఆకార మేలాగున స్పష్టముగా గోచరపడునో, ఆలాగున ఏ మానవునియొక్క అంతకరణములోగల విషయమాలిన్యము నశించునో వాడు తనలో దైవభావము గల్గియుండు ఆత్మను దర్శించుటకు యోగ్యత గలవాడగును. ఆత్మను అచ్ఛాదించియుండు ఆవరణము దొలగునప్పుడు గ్రహణకాలమున రాహువుచే విడువబడిన పూర్ణిమ చంద్రు డేలాగున స్వయముగా ప్రకాశమానుడై యుండునో, ఆలాగున వీరియొక్క దృశ్యమోహములు తొలగి శుద్ధాత్మజ్ఞాన స్వరూపులగుదురు. సూర్యుడుదయించునప్పుడు తమస్సు ఏలాగున లోకములో కానుపించదో ఆలాగున హృదయాకాశమున జ్ఞానభాస్కరు డుదయించునప్పు డజ్ఞానముయొక్క నిశ్శేషవినాశము గల్గును. నిర్మలమైన ఆత్మబోధమును అవిర్భవించును.

ఇప్పుడు భక్తులారా! ధ్యానవములోనికి ప్రవేశించెదము. ఈ

ధ్యానముచేయువారు మొట్టమొదట శరీరమును వంకరలేకుండ చేసికొనవలయును. అట్లుగానిచో, మీయొక్క చింతనా ప్రణాళికలు చక్కగా పనిచేయజాలవు. మీకు మనోనిశ్చలత్వమును, ధ్యేయాకారబోధమును గలుగవు. ఊగుచుండు నాళిక గల ఒక గడియారము చక్కగ పెట్టనిచో ఏలాగున పనిచేయజాలదో, కొంచెము ముందుకు గాని వెనుకకుగాని, ప్రక్కకుగాని వాలుగాగాని యుండిన చక్రములు చక్కగ పనిచేయక పోవుటయేగాక గడియారము చెడిగూడపోవచ్చునో, అదేరీతిగా ఏ యంత్రమైనను, సమావస్థలో నిలబెట్టకపోయినచో ఏలాగున సక్రమముగా పనిచేయదో, ఆలాగున శరీరమును ఒక యంత్రము వంటిదని మరువగూడదు. కనుకనే గీత ఆరవ అధ్యాయమున-

సమం కాయశిరోగ్రీవం ధారయన్నచలం స్థిరః ।
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చానవలోకయన్ ॥ అని చెప్పబడెను.

అనగా ధ్యానకాలములో శరీరము, కంఠము, శిరస్సు, సమముగా నిలిపి దృష్టిని చలింపచేయక యేకాగ్రపరచి యింద్రియములను ఇంద్రియార్థములనుండి వశీకరించి మనస్సుతోగూడ చేర్చి అచంచల బుద్ధితో స్వస్వరూపమును ధ్యానము చేయవలెనని శ్రీభగవానులుపదేశించిరి. ఇంద్రియము లన్నిటిని వశీకరించి దైవభావములో ఐక్యము చేసికొనవలయును. ఏ తలంపును గలుగనీయక బ్రహ్మభావనమాత్రము గల్గియుండవలయును. ఈ ధర్మము యోగికిని, జ్ఞానికిని భక్తునికిని, నిష్కామకర్మయోగికిని సమానమైనది. మరల మూడు సార్లు ఓంకారమును దీర్ఘోచ్చారణ దైవభావముతో చేయవలెను. ఇచ్చట వారివారి యిష్టదైవముల మంత్రము లుచ్చరించవచ్చును. మొదటసారి యుచ్చరించునప్పుడు దృశ్యమంతయు మరచిపోవలయును. అనగా ఈ దృశ్యమేమియు జ్ఞాపకమునకు రాగూడదు. రెండవసారి యుచ్చరించునప్పుడు దేహేంద్రియము లన్నిటిని మరపు చేసికొనవలయును. అనగా మీ చుట్టును గనుపించెడు ప్రపంచము జ్ఞప్తికి రాకూడదు. ఆలాగున, మీరు స్త్రీలు పురుషులు అను వృత్తిగూడ నుండరాదు. అట్లు దేహస్మృతిగాని, దృశ్యవృత్తిగాని యుండిన

మీ మనస్సు ఇంకను ధ్యానబలముచే ధ్యేయాకారము లోనికి ప్రవేశించుట లేదని గ్రహించవలయును. సముద్రములో లంగరు పడవేసి యోడను నడిపిన ఏలాగున, పోజాలదో, ఆలాగున దృశ్యమగు సంసారసాగరములో మనస్సనెడు లంగరు, పడవేసిన వారికి ఎంతధ్యాన జపములు చేసినను ధ్యేయాకారము గల్గుట దుస్తరము. మూడవసారి ఓంకార ముచ్చరించునప్పుడు కేవలము దైవభావములో లెస్సగా నిలుపవలయును. సూది రంధ్రములో దారము నెక్కించునప్పుడేలాగున నిశ్చలముగా కరములుండవలయునో ఆలాగున నుండువారికే బ్రహ్మరంధ్రములో అనగా ప్రకృతిరహిత ప్రబోధములో నిలకడ గల్గును. ధనుస్సులో శరము ననుసంధించువాడు ఏలాగున నిశ్చేష్టుడై యుండునో, ఆలాగున ఆత్మధ్యానమందు, నిలకడగల్గి యుండువారికే మనస్సనెడు ప్రకృతిని దాటి పరమాత్మని పొందవీలగును. అనగా అట్టివారికే అమనస్కము గల్గును. ప్రబోధజ్ఞానమును అట్టివారికే గల్గుటకు యోగ్యత గల్గియుండును. ఉపనిషత్తు ఈలాగున చెప్పుటకు కారణమిదియే.

ప్రణవో ధనుశ్శరో హ్యాత్మా బ్రహ్మ తల్లక్ష్య ముచ్యతే ।
అప్రమత్తేన వేద్ధవ్యం శరవత్తన్మయో భవేత్ ॥

దీని యర్థము పై జెప్పినదే.

కనుకనే ధ్యాననిమగ్నావస్థను గురించి యీలాగున భర్తృహరి చెప్పెను.

**గంగాతీరే హిమగిరిశిలాబద్ధపద్మాసనస్య**
**బ్రహ్మధ్యానాభ్యసనవిధినా యోగనిద్రాం గతస్య ।**
**కింతైర్భావ్యం మమ సుదివసై ర్యత్ర తే నిర్విశంకాః**
**కండూయంతే జరఠహరిణాః సాంగమంగే మదీయే ॥**

గంగాతీరమునందు హిమాలయ పరిసర ప్రదేశ శిలయందు పద్మాసనాసీనుడనై బ్రహ్మధ్యానాభ్యాసబలముచే యోగనిద్రను పొంది యుండగా గంగాజలమును పానముచేసి వెళ్లి పోవుచుండు ముసలి జింకలు తమయొక్క

దురదను నిశ్శంకవముగా నాశరీరమున రుద్దుకొనునప్పటికిన్ని తెలియని నిర్వికల్పసమాధియను దైవత్వపదవి యగు ఆపుణ్యదినము నా కెప్పుడు లభించును? అనగా అభ్యాసబలముచే నిర్వికల్పసమాధి గలుగుటలో తన మనస్తీవ్రతను ఈలాగున చెప్పుచున్నాడు.

ధన్యానాం గిరికందరేషు వసతాం జ్యోతిః పరం ధ్యాయతా
మానందాశ్రుజలం పిబంతి శకునా నిశ్శంక మంకేశయాః ।
అస్మాకం తు మనోరథైః పరిచిత ప్రాసాద వాపీతట
క్రీడాకానన కేళికౌతుకజుషామాయుః పరిక్షీయతే ॥

ధన్యాత్ములగు మహనీయులు పర్వతపంక్తి ప్రదేశములో పరంజ్యోతిః స్వరూపమగు పరమాత్మ ధ్యానములో మగ్నులై యుండగా పక్షులు నిశ్శంకముగా వారి శరీరాంకములో గూర్చుండి ఆనందాశ్రుజలమును పానముచేసి తృప్తి నొందియున్నవి. అటువంటి కాలము నా కెప్పుడు గలుగును? నాయొక్క మనోవీథియో, చిరకాలపరిచితములగు సౌధములచేతను, వాపీకూపాదుచేతను. క్రీడావనవముచేతను, స్త్రీలయొక్క నర్తనల నాట్యవములచేతను, లోకవ్యవహారములచేతను చెడినదై ఆయుస్సు ప్రతిరోజును క్షయించిపోవుచున్నది గదా! అనగా భర్తృహరి ధ్యాననిష్ఠలో నున్నప్పుడు గూడ గృహస్థాశ్రమములో నుండినప్పుడు గల రాజసౌఖ్యము లన్నియు, వృత్తులన్నియు, జ్ఞాపకమునకు వచ్చుచున్నవని! ఇవన్నియు ఎప్పుడు నశించి పై జెప్పిన యోగీశ్వరులవలె ధ్యానారూఢుడనై ఆనందామృత పానముచేసి కృతార్థుడ నగుదునో యను విచారముతో చెప్పుచున్నాడు.

ఇప్పుడు మనయొక్క ఉపన్యాసమును ఉపసంహారము చేయవలసి యుండును. మానవుని జ్ఞానేంద్రియములు సత్త్వగుణముచేతను, కర్మేంద్రియములు రజోగుణముచేతను, స్థూలదేహము తమోగుణాంశము చేతను ఏర్పడియున్నవి. నిద్రాహార మైథున క్రియలలో ఆసక్తిగలిగియున్నప్పుడు, దేహమునకు సంబంధించిన దగుటచే అట్టి అవస్థ తమోగుణాధికమైయుండును.

వాక్పాణి పాదపాయూపస్థలు కర్మేంద్రియములు. వీని క్రియలలో ఆసక్తి గల్గియున్నప్పుడు రజోగుణ మధికముగా నుండును. తక్కిన తమోగుణ సత్త్వగుణములు తగ్గియుండును. కర్ణ, చర్మ, నేత్ర, జిహ్వా ఘ్రాణేంద్రియములకు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు విషయములు. వీనిలో క్రియ అధికముగా గల్గినప్పుడు సత్త్వగుణ మధికరించియుండును. ఇవి సత్త్వగుణాంశముచే ఏర్పడినవి. అప్పుడు రజస్తమస్సులు తగ్గియుండును. ఇదే దానికి గురుతు. ఈ జ్ఞానేంద్రియములు నిశ్చేష్టములై యుండునప్పుడు అప్రయత్నముచేతనే విజ్ఞానమును గ్రహింప శక్తి గల్గియుండును. ఈ మూడు గుణములును ఉడుగునప్పుడు విశుద్ధతత్త్వమావిర్భవించును. అప్పుడు మాత్రమే నిర్గుణమైన దైవత్వము గోచరించును. అనగా దైవజ్ఞానము గల్గును. ఇట్టి శక్తి గలుగనివారికే సగుణారాధన ఏర్పడినది. మొట్టమొదట అందరును ఈ మార్గములోనే వెళ్ళవలసి యుందురు. ఇక ఒకే ఈశ్వరునికే అనేకమతస్థులు చెప్పుచుండు వాచకము ఈశ్వరవాచకమని గ్రహించుటకొరకు వాసిష్ఠమున శ్రీవసిష్ఠభగవానులు శ్రీరామచంద్రుల కొరకీలాగున నుపదేశించియున్నారు.

కైశ్చిత్సా శివ ఇత్యుక్తా కైశ్చిద్బ్రహ్మే త్యుదాహృతా ।
కైశ్చిద్విష్ణు రితి ప్రోక్తా కైశ్చిచ్ఛూన్యమితి స్మృతా ॥
అర్థ ఇత్యుదితా కైశ్చిత్కైశ్చిత్కాల ఇతి స్మృతా ।
కైశ్చిత్ప్రకృతి పుంభావ విభాగ ఇతి భావితా ॥
అన్యైరప్యన్యథా నానాభేదై రాత్మవికల్పితైః ।
నిత్యమవ్యపదేశ్యాऽపి కథంచిద్వ్యపదిశ్య తే ॥

ఆ కైవల్య స్వరూపము నిరుపాధికము గావున చెప్పుటకు శక్యముగానిదైనను, ఆ యా మతస్థులచే కల్పింపబడిన యుపాధిగలదియై కొందఱిచేత శివుడనియు, కొందఱిచేత బ్రహ్మమనియు, కొందరిచేత విష్ణువనియు, మరికొందరిచేత వస్తువనియు, కొందరిచేత కాలమనియు, వేరుకొందరిచేత ప్రకృతి పురుష విభాగంబనియు, నింక నితరులచేతను ఆత్మయందు కల్పింబులగు నానావిధ భేదంబులచే ననేకవిధములుగా నిర్దేశింపబడుచున్నది.

ఆత్మస్వరూపులారా! ఇప్పుడు మనము సమరసజ్ఞాన విషయమై శాస్త్రములచేతను, యుక్తులచేతను, అనుభవముచేతను, మహర్షుల ఆశయముచేతను గ్రహించవలసిన విషయము చాలమట్టుకు గ్రహించడమైనదని తలంచెదను.

మృత్తికానాం సహస్రైర్వా జలకుంభ శతైరపి ।
న శుధ్యన్తి దురాత్మానో యేషాం భావో న నిర్మలః ॥

సహస్రావర్తి మృత్తికలచేతను, వందలకొలది జలకుంభములచేతను, కోట్లకొలది తీర్థములలో స్నానమాచరించినను, ఆత్మశుద్ధిపరమగు ప్రయత్నము చేయని దుర్బుద్ధిగలవాడెప్పటికిని శుద్ధుడు కాజాలడు. పవిత్రాచరణమును, పావన బ్రహ్మచింతనమును మానవుని నిర్మలునిగా నొనర్చును.

ఆచినోతి చ శాస్త్రార్థం ఆచారే స్థాపయత్యపి ।
స్వయమాచరతే యస్మాదాచార్యస్తేన కథ్యతే ॥

ఎవండు శాస్త్రార్థమును చక్కని గురువు దగ్గర గ్రహించినవాడై, గ్రహించిన లాగున ఆచరణలో నుంచువాడై, ఆచరించే లాగున లోకమునకు బోధించువాడై యుండునో అతడే ఆచార్యుడనంబడును. అనగా అతడే యథార్థమైన గురువు అను పదమున కర్హుడగును.



# దయ

జ్ఞానానందమయం దేవం నిర్మలస్ఫటికాకృతిమ్ ।
ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవముపాస్మహే ॥

దయయే భగవంతుడు, దయగల హృదయమే భగవన్నిలయము.

ఓ నిర్మలజ్ఞానమే స్వరూపముగా గల ప్రియమైన సోదరులారా! సోదరీమణులారా! ''దయాసమం నాస్తి పుణ్యం పాపం హింసాసమం న హి''

అని పరమపావను లగు మహర్షుల హృదయాంతరాళమునుండి వెలువడిన దివ్యగానము సర్వదా మనము వినుచున్నారము గదా! హింస, అహింస అను పదములను గురించి రెండు విధములుగా విచారశీలురు విమర్శించుచున్నారు. కొందరు శరీరహింస హింస కాదనియు, ఆత్మహింసయే హింసయనియు, మరికొందరు దేహ, ఆత్మల హింస రెండును కూడదనియు, ఇక కొందరు విచక్షణులు శరీర, మనో, జీవపరములైన మూడు హింసలు చేయరాదనియు పలికిరి. దీనిని స్థూల, సూక్ష్మ కారణములని త్రివిధములుగా విభజించిరి. అనగా స్థూలములగు ఆయుధ దండాదులచే దేహేంద్రియాదులకు పీడకలుగ చేయరాదనియు, క్రూర, దూషణ వచనాదులచే మనస్సును నొప్పినొందనీయ రాదనియు, మూడవదగు ప్రాణనాశనము నొనర్పగూడదనియు బోధించిరి.

కర్మణా మనసా వాచా సర్వావస్థాసు సర్వదా ।
పరపీడాం న కుర్వంతి న తే యాంతి యమాలయమ్ ॥

న వేదైర్న చ దానైశ్చ న తపోభిర్న చాధ్వరైః ।
కదా చిత్సద్గతిం యాంతి పురుషాః ప్రాణిహింసకాః ॥

మనస్సు చేతను, వాక్కు చేతను, కర్మముచేతను అన్ని అవస్థలలోను ఎల్లప్పుడును ఎవరు పరపీడచేయరో అట్టివారు ఎప్పుడును దుఃఖము నొందరు, అనగా యమాలయమును దర్శించరు. ప్రాణిహింసకులైన నరులు వేదాధ్యయనాదుల చేతగాని, దానములచేతగాని, తపస్సు చేతగాని, యజ్ఞాది క్రతువులచేత గాని, ఎప్పటికైనను సద్గతి నొందజాలరు అని యమధర్మ వచనము.

విచారించగా పై చెప్పిన త్రివిధ హింసలలో ఒక దానికొకటి అధికముగానే గనుపించును. దేహమును మట్టుకు విచారించినవారు మృగీయబుద్ధి కలవారనియు, దేహమనంబులవరకు చింతించినవారు కొంత వరకు మానవస్వభావమునకు వచ్చినవారనియు, దేహ, మనో, జీవులపర్యంతము యోచించినవారు దైవిక స్వభావముతో గూడిన వారలనియు మనము ఇప్పుడు నిర్ధారణ చేయవచ్చును. ప్రారంభమున ఉదాహరించిన రెండు పదములను గురించి యూహింతము. ఈ

వాదము గదా అగ్నిదేవునికి వాయుదేవుడు సహాయపడునట్లు పాపకార్యములు చేయువారికి తోడ్పడుచున్నది. ఆత్మ అనగా, జీవుడు హింసంపబడడని వారు తలంచినది గొప్ప పొరబాటు. జీవుడు నిత్యుడనియు, అవధ్యుడనియు, సర్వవేదశాస్త్రముల సమ్మతము. అప్పుడు ఆత్మను హింసింపకుండిన జాలునని దేని నుద్దేశించిచెప్పిరో అని వారే తెలుపవలయును. వారి యుద్దేశమేమన? ఆత్మను అజ్ఞానములో నుండనిచ్చుటయే హింస యనియు. అజ్ఞానమునుండి విముక్తి చేయుటయే అహింస యని భావము. ఇది ఒక విధముగా మాకును అంగీకారమే. ఆత్మజ్ఞానము గలుగక యితరములగు అహింసాది వ్రతానుష్ఠానము లెన్ని యనుష్ఠించినను మోక్షమునొందరు. శోకశాంతియు, ఆనంద ప్రాప్తియు గలుగదు. ఇచ్చట పుణ్యాత్ములగువారి అభిప్రాయమిదియే. ఆత్మజ్ఞానము గలుగుటకు త్రివిధములగు అహింసాది గుణములు గలిగి సాధన చతుష్టయసంపత్తి చేకూర్చుకొనవలెను. దీనిని గొందరు స్థూలార్థమనియు, సూక్ష్మార్థము కాదనియు వచించి విద్యయు, విచారశక్తియు లేని సాధుజనులను మోసపుచ్చుచున్నారు. వారు పదేశించు రీతిగా సూక్ష్మాంశము మనకు కావలసియుండినను, బుద్ధిమంతుడు స్థూలము లేనిచో సూక్ష్మ ముండజాలదని దృఢముగా వాదించును. చెరకు లేక చక్కెరయు, పాలులేనిచో వెన్నయు, వృక్షము లేకపోయిన ఫలములును, నీలిచెట్టు లేనిచో నీలిమందును గలుగని రీతిగా సాధన లేనివారికి సాధ్యపదవి దొరకదని నమ్మవలయును. మిత్రులారా! జిహ్వాచాపల్యము నిలుపజాలక కామకింకరులై వర్తించువారిట్లు వచింతురు. ఇది వివేకవంతుడు చెప్పుమాటకాదు, ఆత్మ నశింపనిదని యెరిగినవారైన తనయొక్క సుఖమునకు అనేక ప్రాణికోట్లను వధించి జీవించునా? తన బంధువులకు కష్టము గలగునప్పుడు కల్పితక్షుద్రదేవతలకు బలి యిచ్చునా? జీవునకును, ఆత్మకును సంబంధము లేదని చెప్పుమాట సత్యమైచో వారి దేహమును ఛేదన తాపనాదులు కలుగజేసిన ఓర్చుదురా? ఏల యీ మోసపుకృత్యముచే జీవింపవలయును? మనోవాక్కాయ కృత్యములనేక రీతిగా నడుపుటయే మీ విచార ఫలమని మరువకుడు. త్రికరణ శుద్ధి లేని వారి ప్రయత్నములన్నియు వ్యర్థములే కదా! ఒక ప్రక్కన ప్రమిద, మరియొక్క ప్రదేశమున వత్తియు, ఇంకొక

స్థలమున తైలము పెట్టి దీపము వెలిగించిన వెలుగునా? ప్రమిదలో చమురును, చమురులో వత్తియు చక్కగా అమర్చిన మాత్రమే దీపముండును గదా? దీనికే దేహేంద్రియ మనస్సంయమ మని నామధేయము. ఈ అభ్యాసమునకే యోగమనియు, తపస్సనియు శ్రవణాదిత్రయ మనియు పేరు. అహింసా ప్రచారకులని కొందరు గలరు. వీరును పైన పేర్కొన్న పదత్రయము యొక్కయర్థమును సంపూర్ణముగా గ్రహింపజాలక ప్రాణిహింస, మాంసవర్జనమాత్రముచే పరమపావనులమైతిమని తలంచుచున్నారు. వీరికి వాక్ శుద్ధియు, చిత్తశుద్ధియు కలిగినదా? యని విచారింపకపోవుట పొరబాటు.

ఆత్మసాక్షాత్కారము లేనివారికి ఇతర సద్గుణము లెన్నియుండినను ప్రాణము లేని సర్వాంగ సుందరశవము వంటిదే యగునని మరువకుడు. ఆత్మజ్ఞానము అనగా అనన్య దైవభక్తి మాత్రము గలిగి అహింసాదిగుణములు లేనివారు ప్రాణ ముండియు, చక్షుఃశ్రవణాది ఇంద్రియములు లేనివారితో సమానులే. లోకసామెత ననుసరించి అంగహీనుడు పాపియని వాడుక గలదుగదా? ఇచ్చుట జ్ఞానము, లేక అతీతభక్తి, జీవుడుగాను, ధర్మము లన్నిటిలో అహింస శ్రేష్ఠధర్మమగుటచే అది నేత్రమనియు, జిహ్వ దానమనియు, కర్ణము సద్బోధయనియు లేక సత్యమనియు, శ్రవణమనియు, ఘ్రాణము పుణ్యకర్మమనియు, కరములు లోకోపకార సేవ యనియు, యోగము హృదయమనియు, పక్షపాత రాహిత్యము కుక్షియనియు, వైరాగ్యము గుహ్యామనియు, శాంతము పాయ్వింద్రియ మనియు, సాధుసేవలే గురుశుశ్రూషయే పాదములనియు, క్షమ స్పర్శేంద్రియ మనియు, ఆత్మసంయమము లేక సత్యభాషణము లేక మౌనము వాగింద్రియ మనియు మనమిప్పుడు గ్రహించవలయును. మననము మనస్సనియు, ధారణ బుద్ధి యనియు, ఆత్మ చింతన చిత్తమనియు, సోఽహం అహంకారమనియు మనము గ్రహించవలసిన ముఖ్యవిషయములు. పంచప్రాణములన్నియు నేతి, నేతి పంచకోశ త్యాజ్యపరమగు ఆత్మ బుద్ధి యని మరువకుడు. ఈ గుణములలో ఏ గుణమెవ్వరికి లేదో వారు

ఆయా అంగహీనులని గ్రహించువారు ధన్యులగుదురు. అట్టి సుగుణాన్విత సుందరుడై బ్రహ్మనిష్ఠగలవాడే నిజమైన పుత్రుడనియు, ప్రయోజనజన్మము గలవాడనియు, తల్లి దండ్రులను, కుల రాజ్యములను గూడ ఉద్ధరించిన వాడనియు గ్రహించవలెను. ఇట్టి జ్ఞానము లేని కుమారులు తల్లి గర్భమలముతో వచ్చెడి ఏలికపాములతో సమానులని శ్రీవసిష్ఠ భగవంతుడు శ్రీరామచంద్రుల కుపదేశించెను. ఏలన ఏలిక పాములకు జీవము గలదు గదా!

ఏతావత్యపి యే భీతాః పాపభోగరసే స్థితాః ।
స్వమాతృ విష్టాః క్రిమయః కీర్తనీయా న తేఽధమాః ॥

దీనియర్థము పై నుదాహరించినదే.

అపి మానుష్యకం ప్రాప్య భవంతి జ్ఞానినో న యే ।
పశుతైవ వరా తేషాం ప్రత్యవాయ ప్రవర్తనాత్ ॥

దుర్లభమైన మానవజన్మము దొరికియు, భూతదయ, దైవభక్తి, జ్ఞానము, లేని వారైయుండు వారికన్న పశువులై పుట్టుట మేలు. ఏలన? పశువులకు ప్రత్యవాయదోషము లేదు కదా? ప్రత్యవాయదోషమనగా, చేయవలసినపని చేయకపోవుట. అనగా మృగము లైనచో జీవకారుణ్యము, ఈశ్వరభక్తి, ఆత్మజ్ఞానము లేవే యని ఎవరును అడుగరు గదా!

అంధే తమసి మజ్జంతి పశుభిర్యే యజంతి తే ।
హింసా నామ భవేద్ధర్మో న భూతో న భవిష్యతి ॥

ఎవరైనను జంతువులను వధించి బలి పూజాది కర్మములు చేయుదురేని వారు అంధ తమస్సను నరక కూపములో పడుదురు. ప్రాణి హింస భూత భవిష్య ద్వర్తమానకాలములలో గూడ గొప్ప అధర్మమగునే గాని ధర్మము గానేరదు. ఇట్టి దైవగుణములన్నియు చిన్నతనమున నేర్పుట చాల ఫలప్రద మగును. మృదువైన భూమిలో వృక్షము చక్కగ ప్రబలమగునట్లు ధర్మబోధ లన్నిటికి బాల్యకాలమే మంచి తరుణము.

కౌమార ఆచరేత్ ప్రాజ్ఞో ధర్మాన్ భాగవతానిహా ।
దుర్లభం మానుషం జన్మ తదప్యధ్రువమర్థదమ్ ॥

కుమారావస్థలోనే ప్రాజ్ఞుడైనవాడు భాగవత ధర్మము లన్నిటిని ఆచరించవలయును. మనుష్యజన్మము దుర్లభము గదా! దేహము, ధనము మొదలైనవి శాశ్వతము కాదు గదా! అని భాగవతము.

ఆత్మస్వరూపులారా! మద్యపానము గూడ బహుపాపకరము. ఇట్టి పరమనీచకృత్యములకు కొందరు పెద్దలు లోబడుట యెంత విషాదకరము! ఈ దురాచారముచే ఎన్నియో సంసారములు పాడుపడినవి. ఎంతో మానహాని గలుగుచున్నది. స్వప్రజ్ఞారహితులై యెన్నియో పైశాచికకృత్యములు జేయుచున్నారు.

మద్యం హృదయమావిశ్య స్వగుణై రోజసో గుణాన్ ।
దశభిర్దశ సంక్షోభ్య చేతో నయతి విక్రియామ్ ॥

మద్యము హృదయమున ప్రవేశించి మానవుల ఓజస్సు మొదలగు గుణము లన్నిటిని నాశమొనర్చి మనుష్యులకు విధించి యుండు ధర్మగుణముల పదింటిని అణచివేసి, వీటికి బదులుగా పది దుర్గుణములను గలుగజేయుచున్నది అని చరకసంహిత. ఆ పది సుగుణములను క్రింద వివరించెద.

ధృతిః క్షమా దమోఽస్తేయం శౌచమింద్రియ నిగ్రహః ।
ధీర్విద్యా సత్యమక్రోధో దశకం ధర్మలక్షణమ్ ॥

1. ధారణాశక్తి, 2. ఓర్మి, 3. అంతరింద్రియ నిగ్రహము, 4.దొంగిలింపకుండుట, 5. బాహ్యాభ్యంతర శుద్ధి, 6. ఇంద్రియ నిగ్రహము, 7.మంచిబుద్ధి, 8. విద్య, 9. సత్యము, 10. శాంతము అనునవి ధర్మలక్షణములు పది.

దయా దానం దమో దేవపూజా భక్తిర్గురౌ క్షమా ।
సత్యం శౌచం తపోఽస్తేయం ధర్మోఽయం గృహమేధినామ్ ॥

1. దయ, 2. దానము, 3. దమము, 4. దైవపూజ, 5. గురుభక్తి, 6.క్షమ, 7. సత్యము, 8. శౌచము, 9. తపస్సు, 10. అస్తేయమను నీ పది

ధర్మములు గృహస్థులకు ఉండవలసినవి. ఈ గుణములన్నిటిని మద్యపానము అడుగంటచేయును. ఈ సురాపానమెటువంటిదో దీనియొక్క మిత్రమగు గంజాయియు అటువంటిదే. ఈ పత్రిచే ఎందరో ధర్మనిష్ఠనుండి పతితులై యాచకులగుచున్నారు. వీరికి ఒకప్పుడుండు బుద్ధి యింకొకప్పుడుండదు. చేయవలసిన కృత్యము సకాలమున చేయు బుద్ధి యుండదు. మనుష్యుల పతనమునకు ముఖ్యకారణము, నియమితకృత్యముల సకాలమునకు చేయకపోవుటయే. సకాలమున పెట్టని కృషి యేలాగున ఫలవంతము గాజాలదో, ఆలాగున వీరి స్థితియని మరువకుడు. సురాపానమును భంగిపత్రిని సేవించువారిని ఎప్పటికిని చేరకుడు. క్రమముగా మిమ్ముఁలను వారు ఈ దుర్గుణమను దయ్యముచే వశపరచుకొందురు. మరల మీరు దాని నుండి తప్పించుకొనజాలరు. కనుక ముందుగా జాగ్రత్తపడుడు. ఇదే రీతిగా విషయలోలత్వము మహాభయంకరావస్థ యందు ప్రవేశపెట్టును. మీ యిహపరసౌఖ్యమునకు ఆధారమగు బ్రహ్మచర్యమును సంరక్షింపుడు. ఈ శక్తి లేనివారికిని, కలవారికిని, చేవలేని వృక్షమునకును, చేవగల వృక్షమునకును గల తారతమ్యముండును. చేవగల ద్రుమము గాలిచే పతనమొందనట్లు, వీరు ప్రపంచ విషయాదివాసనలచే చలింపరు. ఈ శక్తి లేనివారు ఇంద్రియ నియమనశక్తి ఆగిపోయిన వారగుటచే, గొప్పగాలిచే పెద్ద చేవలేని ద్రుమములు నేల గూలునట్లు, బుద్ధి మనో బలరహితులై విషయారణ్యములో గ్రుంకుదురు.

**న తపస్తప ఇత్యాహు ర్బ్రహ్మచర్యం తపోత్తమమ్ ।**
**ఊర్ధ్వరేతా భవేద్యస్తు స దేవో న తు మానుషః ॥**

అని జ్ఞానసంకలన తంత్రమున ఈశ్వరవచనము మహర్షులు కేవలతపస్సును తపస్సని చెప్పరు. మరి ఏమన? ఉత్తమమగు బ్రహ్మచర్యమునే తపస్సని వర్ణించిరి. ఎవడు ఊర్ధ్వ రేతస్సు గలవాడగునో అట్టి వాడు మనుష్యుడు గాడు. దేవుడే యగును. అనగా మానవదేవుడని తలంచ వలయును. ఆలాగున బ్రహ్మచారిణి యైన స్త్రీని దేవతాస్వరూపమని భావించవలయును. బ్రహ్మనిష్ఠాదుల ననుష్ఠించువారికి బ్రహ్మచర్యము లేనిచో, శరీరదార్ఢ్యము చాలదు. కనుక

బ్రహ్మజ్ఞానము గలిగినవారు దైవస్వరూపులే గదా! శతబిందువుల రక్తాంశమునుండి ఏకబిందువు వీర్య మేర్పడునని ప్రాచ్యపాశ్చాత్య వైద్యకోవిదులు చెప్పుచున్నారు. ఇది స్థూల బ్రహ్మచర్యమే యగును. సూక్ష్మ బ్రహ్మచర్యము నరయకపోయిన గొప్ప ఆత్మలాభమే యుండదు. అది బ్రహ్మమునందు చరించుటయే అనగా బ్రహ్మచింతనలో అమరుటయే. స్థూలము లేని యెడల సూక్ష్మముండదని మఱవరాదు. దీప ప్రకాశము మాత్రమే చీకటిని అణచునని యొకరు వాదించుదురు. దీపమునకు తైలమే ఆధారమని యింకొకడు దృఢముగా చెప్పును. ఇప్పుడనుష్ఠానము లన్నియు స్థూలములేగాని సూక్ష్మము గాదని వాదించు వేదాంతులు మెండుగా గలరు. ప్రాచీన ఋషులయందు ఇట్టి ఆత్మవంచనపరమగు వచనమొకటి వెదకినను దొరకదు. కనుకనే వారు అతీంద్రియ జ్ఞానులై దివ్యజ్యోతిని దర్శించి నిత్యసుఖులైరి. గిల్టునగలు స్వల్పపువెలకు దొరకవచ్చును. దాని ప్రయోజన మెంతవరకు నుండునది మీరు గ్రహించుదురుగాక! కనుక అనుష్ఠానములలో ప్రమాదము నొందకుడు. కరుణలేని వారి నిష్ఠానియమము లన్నియు వర్షము లేని కృషివంటి వగును. కనుకనే అందరు మతాచార్యులును భగవంతుని కరుణామూర్తిగా ధ్యానించుట నుపదేశించిరి. అట్టి భావన చేయువారు కరుణామూర్తులగుదురు. నిర్దయుని ఎవరును మహాత్ముడని వచింపజాలరు. బండపై ఎట్లు సస్యములు ఫలప్రదములు కావో, అట్లు కఠినహృదయము గలవారియందు భక్తిజ్ఞానాది సుగుణము లేవియు వృద్ధి గాజాలవు. కనుకనే వామనపురాణము ఏకాంత భక్తులు చేయు దైవారాధన పుష్పములను ఇట్లు వర్ణించినది.

> అహింసా ప్రథమం పుష్పం పుష్ప మింద్రియ నిగ్రహః ।
> సర్వభూతదయా పుష్పం క్షమా పుష్పం విశేషతః ॥
>
> శాంతిపుష్పం తపః పుష్పం ధ్యానపుష్పం తథైవ చ ।
> సత్యమష్టవిధం పుష్పం విష్ణోః ప్రీతికరం భవేత్ ॥

తపోనిధులగు మహర్షులు సర్వేశ్వరుని తమ హృదయకమలములలో నెలకొలిపి ఆరాధించుటకు ఉపయోగించిన పుష్పములు ఇటువంటివే.

1. అహింస, 2. ఇంద్రియ నిగ్రహము, 3.సర్వభూతములయందు కరుణ, 4.క్షమ, 5. శాంతము, 6.తపస్సు, 7.ధ్యానము, 8. సత్యము, ఇటువంటి చిత్తవృత్తిగలిగి యీశ్వరపూజ చేయువారే భగవంతుని కరుణకు పాత్రులు. ఈ పుష్పములచే పూజించిననే యీశ్వరుడు సంతోషించును. ఈ దైవగుణములు లేనివారు ఎన్ని పూజలు చేసినను బూడిదయందు హోమము చేసిన హవిస్సువలె వ్యర్థమగును.

సత్యం తపో జ్ఞాన మహింసతా చ విద్వత్ప్రణామశ్చ సుశీలతా చ ।
ఏతాని యో ధారయితే స విద్వాన్న కేవలం యః పఠతే స విద్వాన్ ॥

సత్యము, తపస్సు, జ్ఞానము, అహింస, విధేయత, సుశీలము మొదలుగాగలిగిన గుణములు గలవారు విద్యలేని వారైనను, వారే విద్వాంసులు. ఇట్టి నిర్మలగుణములు లేనివారు శాస్త్రములెన్ని చదినను అవిద్వాంసులే యగుదురు. పై నుదాహరించిన గుణములు లేనివారై శాస్త్రము మాత్రము చదివి చెప్ప నేర్చినవారిని గురువుగా భావించువారి గతి క్రింద వివరింపబడుచున్నది.

జ్ఞానహీనం గురుంప్రాప్య కుతో మోక్ష మవాప్నుయాత్ ।
భిన్ననావం శ్రయన్నబ్ధౌ యథా పారం న గచ్ఛతి ॥

జ్ఞానములేని గురువును ఆశ్రయించిన ఎట్లు మోక్షము గలుగును? రంధ్రముగల నావలో ప్రయాణము చేసిన ఒడ్డు చేరక సముద్రములో మునుగుదురు గదా!

పరిశుద్ధాత్ములగు మిత్రులారా! జన్మము లన్నిటిలో మానవ జన్మము అత్యుత్కృష్టమని సర్వజనులు ఒప్పుకొనుచున్నారు. ఇట్లుండగా ఏ విషయములో మనుష్యులు శ్రేష్ఠులనుట విచారణీయముగదా! దేహేంద్రియాది సౌఖ్యములో కాదు. ఏమన ఇవి వారివారి మనోభావనన నుసరించియే యుండును. అమేధ్యమును భుజించి బురదలో పొరలుచుండు పందికిని, మేధ్యమును ఆహారముచేసి హంసతూలికపాన్పుపై విశ్రాంతినొందు మానవునికిని యథార్థముగా విచారించిన మనస్సుఖము ఒకేవిధముగనుండును. ఇక మీకరుణ, పరోపకారము, దైవభక్తి

మొదలైనవాని ననుసరించియే శ్రేష్ఠత్వ ముండవలయును. చిన్నతృణము మొదలు దేనిని పరిశోధించినను కరుణలేని మనుజుడు తప్ప తదితరము లన్నియు పరోపకారమే చేయుచున్నవి. తృణాదులు గోవు, అశ్వ, గజ, అజాదులకు ఆహారముకొరకై స్వశరీరార్పణ చేయుచున్నవి. గోధుమ, వరి మొదలైనవి లేనిచో మనుష్యులు బ్రతుక గలుగుదురా? మామిడి, చింత, పనస మొదలగు వృక్షములన్నియు సదా సర్వవిధములుగ మానవాది జీవులకు సేవయే చేయుచున్నవి. ఇవి లేనిచో మానవులు సుఖముగ జీవింపజాలరు. శుక, పిక, మయూరాదిపక్షులు దివ్యగానముచే జనుల నానందభరితులుగా నొనరించుచున్నవి. కోడిమొదలగునవి గృహశుద్ధి, కాలనిర్ణయ కార్యముల నెరవేర్చుచున్నవి. మీనములు జలము నెంతో శుద్ధీకరింప తోడ్పడుచుండుట చూడలేదా? మేకలు, గోవులు, అశ్వములు మొదలగు జంతువులు యావజ్జీవితము మానవుల సేవకొరకే తమను అర్పించుచున్నవి. త్రాగుటకు పాలు, కట్టుటకు బట్ట, తినుటకు తిండి ఇవి అన్నియు వాటివల్లనే మనుష్యులకు లభించును. వీని మలమూత్రములు గూడ మనుష్యులకు ఉపయోగకరమైనవి. అహా! ఇవి, నీచజీవులని యనుటకు, వీటి నన్నిటిని మృత్యువు పాలుచేయు మర్త్యుడు ఉత్తమ జన్మముగల వాడనుటకు సిగ్గు లేదా! ప్రేమగల బిడ్డలవలె సాకి, నమ్మకమైన వర్తనతో నుండి కోమల గాత్రముతో నుండు ఇట్టి జీవులనా మనుష్యుడు వధించుట! మనుష్యుల కాహారమైన అసంఖ్యాక ధాన్యాది ఫలమూలాదులను దేవుడు ఎవరికై సృష్టించెనని విచారింపకూడదా? శరీరమునకు, నరములకు, బుద్ధికి శక్తినిచ్చునవియు, రక్తశుద్ధి చేయునవియు ప్రశాంత కోమలహృదయమును గలుగజేయునవియగు పదార్థములు అన్నాది ఓషధులలో మెండుగా గలవని పాశ్చాత్యులుగూడ ప్రత్యక్షముగ చూపుకాలమున ఈ రాక్షసకృత్య మొనర్పవలెనా? విటమినులు, ఖనిజలవణములు, నైట్రిజన్ మొదలగు శరీరేంద్రియ పోషణ పదార్థము లెన్నియో ధాన్యపుగింజలలోను, శాకాదులయందును గలవుగదా! వస్తుపరిశోధన గ్రంథముల నొక్కసారి చూడుడు. అప్పుడే మిమ్ములను ఈ భ్రమ యనెడి దయ్యము వదలును.

ఓహో! హింస భయంకరకృత్యము! హత్యచేయక మాంసము ఎట్లు దొరుకును? సాధారణజనులు హింస జరుగు స్థలము చూడక పోవుటచే దీని

తత్త్వము తెలియకయున్నారు. వీరు ఒకతూరి హింసాకృత్యమును చూచిరేని, జన్మముండువరుకు హింసాపరమగు ఆహారమునకు బూనరు. అయ్యో! శ్రీరామా! హింసించునపుడు ఆ ప్రాణికోట్ల సంకటమేమనవచ్చును! ప్రాణవేదనపరమగు దుఃఖరోదనము, కరచరణములతో తన్నుకలాడుటయు, రక్తము ప్రవహించుటయు, చూచిన రాతివలెనుండు మనస్సైన నీరుగా కరుగకయుండునా? ఇట్టి ఘోరకృత్యమునొనర్చు మనుష్యజన్మమును శ్రేష్ఠమని చెప్పుటెట్లు? శాస్త్రములలో మానవాకారము గలవారినందరిని మనుష్యునిగా చెప్పుటలేదు. మనుష్యులను, మృగ, రాక్షస, మనుష్య,దేవతలని భాగించి యున్నారు. యథార్థభారతి అనుగ్రంథమును చూడుడు. సర్వభూతములయందు దయగలిగి దైవభక్తి పరులై సత్యధర్మ వ్రతులైన వారిని మనుష్యులనుట శాస్త్రసమ్మతము. తదితరులు మృగములకన్న ఎక్కువని శాస్త్రము అంగీకరింపదు. సర్వేశ్వరార్పిత జన్మము గలవాడై బ్రహ్మనిష్ఠాపరుడైన వానిని మానవదేవుడని మహర్షులు తలంతురు. ఈ కానుపించు ఇంద్రియాది దృశ్యసుఖముల ననుభవించి సుఖించుట మానవజన్మముయొక్క ప్రయోజనమని తలంపకుడు. ఇంద్రియాతీతమై, నిత్యమై, శాశ్వతమైన దైవసుఖము ననుభవించు వాడే యథార్థమైన మర్త్యుడని గ్రహించు భాగ్యము భూలోకమునకు గలుగును గాత! లోకము పరమశాంతిని నొందునుగాక !

ఓ పరమపవిత్రులగు మహాఋషుల సంతానములారా! దైవాత్మ స్వరూపులారా! ఈరెండు వచనములను మీరు మరువక యుండిరేని అదే మీకు తరణోపాయమగును. దేహాదికార్యములో మీరు మహర్షుల వంశస్థులనియు, ఆత్మకార్యములో దైవస్వరూపులనియు మరవని సాధన శీలించిన చాలును. ఎవరి హృదయములో ఇట్టి పవిత్రభావన యెడతెగక యుండునో, వారిని మాయగాని, మాయాతత్కార్యములుగాని, దీపము దగ్గరికి చీకటిచేరనట్లు ఏ దోషములును సమీపింప జాలవు. ఇట్టిభావనయే యథార్థమైన నిష్ఠను అలవాటుపరుచును. దీనితో సమానమైన మరియొక సాధన సులభమైనది లేదు. ఇట్టి ఉత్కృష్టభావన అలవాటు చేసికొనుటకు హృదయమున శుద్ధ సత్త్వగుణము కావలయును. అట్టిదానికి ఆహారసహాయము అత్యావసరము.

అన్నం పుంసాఽశితం త్రేధా జాయతే జఠరాగ్నినా ।
మలం స్థవిష్ఠో భాగస్స్యాన్మధ్యమో మాంసతాం వ్రజేత్ ।
మనః కనిష్ఠో భాగస్స్యాత్తస్మాదన్నమయం మనః ॥

మనుజులు భుజించెడు అన్నపానాదులు జఠరాగ్నిచే త్రివిధములై మారుచుండును. స్థూలభాగము మలమూత్రములుగాను, మధ్యభాగము రసమై, రక్తమై, మాంసాది సప్తధాతువులు గాను పరిణమించును. కనిష్ఠభాగము మనస్సై మారును. కావున ఎట్టి ఆహారము భుజింతునో, మనస్సు అదేరూపముగా పరిణమించును. అనగా సత్త్వగుణమునకు సాత్త్విక ఆహారమును, రజో గుణమునకు రాజసాహారమును, తమోగుణమునకు తామసాహారమును కారణమని మరువకూడదు. పంచీకరణము రీతిగా ఆహారములోగల ఆకాశసూక్ష్మాంశము అంతఃకరణముగాను, వాయ్వంశము మనస్సుగాను, అగ్న్యంశము బుద్ధిగాను, జలాంశము చిత్తముగాను, పృథ్వ్యంశము అహంకారముగాను మారుచుండును. కావుననే ''తస్మాదన్నమయం మనః'' అని ఋషులు తెలిపిన రహస్యము.

ధనం చ భూమౌ పశవశ్చ గోష్ఠే కాంతా గృహద్వారి జనః శ్మశానే ।
దేహశ్చితాయాం పరలోకమార్గే కర్మానుగో గచ్ఛతి జీవ ఏకః ॥

జనులారా! మీరు కష్టించి సంపాదించిన వస్తువులన్నియు, మీకెంతవరకు ఉపయోగము లగుచుండునో, వాటిని గురించి యోచింపుడు. ధనము భూమి యందును, పశువులు దొడ్డిలోను, ప్రాణప్రియమైన భార్య గృహద్వారములోను, బంధుమిత్ర పరివారములు శ్మశానములోను నిలిచిపోదురు. పాపపుణ్యములు తెలియక సంరక్షించబడిన ఈ శరీరము మండుచుండు చితాగ్ని యందు దహించబడును. తర్వాత మీరు చేసియుండు పుణ్యపాపములువెంబడించి యీ జీవుడొక్కడే పరలోకమునకు ప్రయాణముచేసెడి కాలము ఒకటి వచ్చును. ఈ సంగతిని దినమున కొకప్పుడైన స్మరింపుడు. ఆత్మస్వరూపులారా! వ్రతానుష్ఠాన గురుశుశ్రుషాదులచే స్థూలదేహశుద్ధియు, విరక్తి, కరుణ, అనన్యభక్త్యాదులచే సూక్ష్మ దేహశుద్ధియు, ధారణ, ధ్యాన, సమాధులచే కారణ దేహశుద్ధియు, తత్త్వమస్యాది మహావాక్యముల నిశ్చలవిచారణచే మహాకారణశుద్ధియు, కలుగునప్పుడు మాత్రమే మేఘము వదలిన సూర్యునివలె మీ ఆత్మజ్ఞానభానుడు

ప్రకాశించును. జ్ఞానాత్ములారా! కర్మ, భక్తి, యోగ, జ్ఞానము లనెడు నాల్గు మార్గములు అనాదిగా వచ్చుచుండు ఋషి పరంపరలై యున్నవి. ఇవి ఒక్కొక్కటియు మరియొక దాని అపేక్ష లేకనే మోక్షము కలుగచేయును. ఈ అనుష్ఠాన చతుష్టయము గలవారు బ్రహ్మవేత్తలలో ఉత్తమోత్తము లనంబడుదురు. వీటిలో యేదైన నొక్కటి ముఖ్యముగాను, తక్కినవి మూడును గౌణములుగా గలవారలు, ఉత్తము లనంబరగుదురు. పై జెప్పినవాటిలో ఒకటియుండి తక్కినవి లోపించియుండువారు మధ్యములు. ఏదైన ఒక్కటి మాత్రము గలిగి తక్కినవి బొత్తిగా లేనివారిని కనిష్ఠులని మహర్షులు తలంతరు. నాల్గింటిలో ఒక్కటి మాత్రము గలిగి, తక్కినవాటిని నిందించువారిని బ్రహ్మవేత్తలలో నికృష్టులనియే తలంచవలెను. సాధారణ జ్ఞానులకు ఒకటి ముఖ్యముగాను, ఇతరములగు మూడు గౌణములుగా నుండును. నాల్గును సమానములుగానుండి సమముగా బోధించువారు దైవావతారకారణ గురువు లగుదురు. ఇవి నాల్గను ఒక్కపర్వతోపరిభాగమునకు నాల్గు దిక్కులలో సమానములగు నాల్గు మార్గములని గ్రహించువారు ధన్యాత్ములగుదురు.

ఎచ్చట భక్తియు, విరక్తియు, శాంతియు, కరుణయు గలిగి యుండునో అచ్చటికి ముక్తియును స్వయముగా వచ్చి చేరును.

సర్వస్తరతు దుర్గాణి సర్వో భద్రాణి పశ్యతు ।
సర్వః సద్బుద్ధిమాప్నోతు సర్వః సర్వత్ర నందతు ॥



# అహింసా పరమో ధర్మః

ఓ పరమ పవిత్రులగు ప్రియసోదరీ సోదరులారా! ''అహింసాపరమో ధర్మః'' అని గదా! నిర్మలమగు వేదము పరమ దయతో మన కుపదేశించుచున్నది! అహింసయను పావన పదమునకు దయాళుత్వమనియు, కారుణ్యార్ద్ర హృదయమనియు సంగ్రహముగా అర్థము చెప్పవచ్చును. ఈ కరుణామృత ప్రవాహమెప్పుడు ఒక్కని హృదయములో నుండి లోకములో ప్రవహించునో, అప్పుడు

వాడు నిజముగా మనుష్యజన్మమున కర్హుడగును. ఈ దయామృతవృష్టికి ఏ దేశమున లోపము గలుగునో, అప్పుడాస్థలము నిశ్చయముగా ఘోరదుఃఖములకు లోనగును. ఈశ్వర సృష్టిలోగల జీవరాసులన్నియు, వాటి యొక్క కర్మావసానమున తమకు తామే లయ మొందును. వాటికర్మ పరిపక్వకాలమునకు ముందుగా, నాశము జేసినచో నిశ్చయముగా ఈశ్వరాజ్ఞ నతిక్రమించిన క్రూరుడగును. ఈశ్వరరాజ్యములో సమస్త జీవరాసులు సమానావకాశము గలిగియుండును. అట్లుండగా నిరపరాధులగు నోరులేని సాధుజంతువుల హింసించి, నశ్వరమగు ఈ శరీరమును పోషించి జీవించుటకంటె, ఘోరవ్యాధి పీడితుడై పలుమార్లు మరణించుట మంచిది. ఏలన? ఈశ్వరాజ్ఞను పరిపాలించిన ధన్యుడగును గదా! హింస సకలమత తత్త్వములకు విరుద్ధ ధర్మము. ఇది ఘోరకృత్యమగు పాపమని మహాపురుషు లందఱు ఒకేవిధముగా దృఢముగా నమ్మియున్నారు. మానవులకు తినుటకై మాంసమునకంటె సారవంతమైనదియు, పుష్టికరమైనదియు, రోగరహితమైనదియు, స్వల్పమైన వెలకు దొరకునదియు, జ్ఞానమును గలుగజేయునదియు, ఏలాటి పాపమును లేనిదియు నగు ధాన్యములును, ఫల మూలాదులును ఈశ్వరుడు విస్తారముగా సృజించియుండగా పాపకరమైనదియు, రోగమున కాలయమైనదియు, క్రూరస్వభావము గలుగ జేయునదియు, ఎక్కువ వెలగలదియు నగు ప్రాణిభక్షణముచేయుట యెంత బుద్ధిహీనత? ప్రకృతి మానవులకు తినుటకై సృజించియుండిన వస్తువులు స్వయముగా తినుటకు రుచి గలిగి యుండును. మత్స్యమాంసముల కట్లు విధి లేనందుననే ఇతరములగు వాసనాద్రవ్యములు, మసాలాదులచే దుర్గంధమును పోగొట్టి తినుచున్నారు. పులి మొదలగు జంతువులకు మాంసభక్షణము ప్రకృతి నియమ మగుటచే ఆ జంతువులు స్వయముగా పచ్చిగానే తినుచున్నవి. వాటకి దానికి తగువగు కోరదంతములుగూడ గలవు. మనుజులట్లు పచ్చివిగా తినుటకు సహింపని కారణముచే ఈశ్వర నియమము లేదని అంధులు గూడ తెలిసికోవచ్చును. మాంసము శుక్లశోణితములచే ఉత్పత్తియగు కారణముచే మిక్కిలి అశుచియైయుండును. అది తినెడువారికి దానిసారము రసమై రసమునుండి రక్తోత్పత్తియు, రక్తమువలన శరీరమును ఏర్పడును. మనస్సును బుద్ధియును

దానివలన గలుగుటచే జంతువుల స్వభావమే మాంసభక్షకులకు గలుగును. ''అన్నమయంహి సౌమ్య మనః'' (బృహదారణ్యకోపనిషత్) అనగా జనులు ఏయే వస్తువులను భుజింతురో మనస్సు ఆ స్వభావము గలదిగా మారును. సస్యములు పృథ్వీ, జల, వాయు, సూర్యాదుల అంశముచే వృద్ధియగుటవలన పరిశుద్ధమైన వియు, ధర్మబుద్ధిని గలుగజేయునవియు, ప్రబోధజ్ఞానమును జనింప జేయునవియు, జితేంద్రియత్వమును నొనర్చునవిగా నుండును. మఱియు ప్రాణులను వధించునప్పుడు వాటియొక్క ప్రాణసంకటకరవగు దుఃఖరోదనమును, పరితాపసంకటమును, రక్తప్రవాహమును జూచినచో రాతివలెనుండు కఠినమనస్సైనను నీరుగా కరిగిపోవక యుండునా ? అట్లుండు వస్తువును తిని కల్పాంతము వఱకును జీవించుట కంటె ఇప్పుడే ప్రాణమును విడుచుటమేలు. ఇట్లుఘోరసంకటకరమై యుండగా కొందరు సాధువులుగూడ ఈ పాపకృత్యమునకు భయపడక యండట ఎంత ఆశ్చర్యకరము ! అనేక విధములుగా సారముగల ఫలవర్గాదులను ఈశ్వరుడు విస్తారముగా సృజించి యుండునప్పుడు జానెడు పొట్టనింపుటకు, ఒక్కరి సుఖముకొరకు ఎన్ని యోజీవులను హింసించి దుఃఖమును గలుగజేయుచున్నారు. ఒక ప్రాణినైనను, దుఃఖపెట్టి మనము సుఖము నొందినచో, ఇంకొకరిచేతగాని, రోగము చేతగాని, భూత, ప్రేత, పిశాచములచేగాని, ఆఖరు మరణభయముచేతగాని మనముగూడ నిశ్చయముగా దుఖఃము నొందుదుము. అధర్మప్రయత్నముచే సమస్త భోగముల ననుభవించుకొని కల్పాంతమున కావలవరకు జీవించియుండుటకంటె ధర్మమార్గములోనుండి ఈ నిమిషములో ప్రాణము విడుచుట బహుపుణ్యకరము. మనచే ఒక ప్రాణికైనను దుఃఖము గలుగకుండినచో మనకున్ను ఏలోక మందును దేనివలనను దుఃఖము గలుగదు. ఇది ప్రకతియొక్క తప్పని నియమము.

కావున జనులారా! జీవహింసాపరమగు ఆహారమును వీడుడు! అహింసావ్రతమును బూనుడు! శాకభక్షకులై నిర్మలహృదయులై ఇహ, పరసుఖమును పొందుడు ! ప్రాణిహింసాది భక్షణ వర్జనమాత్రముచే అహింసావ్రత ధర్మఫలము చేకూరదు. ఇప్పుడు మాంసాహారము లేనివారలలో కొందరు నిర్దయులై మానవులను హింసించక హింసించుచున్నారు. వీరు నరహత్య

చేయువారికంటె పరమక్రూరులు. ఏలన? హత్యచే స్వల్పసమయము మాత్రమే దు:ఖము గలుగును. ద్రోహముచేయువారు చంపక చంపువారు. వీరు పరమహింసకులు. వీరికంటె జంతుహింసకులు మేలు. ఏలన మనుష్య హృదయములో ఈశ్వరునియొక్క కళసంపూర్ణముగా వెలుగుచుండును. ఈ హింస ఎట్లు ఘోరపాతకమో సురాపానముగూడ అట్లే భయంకర కృత్యము. మద్యపానముచే ఎందరో హత్యలను గావించుచున్నారు. ఎన్నియో గొప్పకుటుంబములు నశించిపోయినవి. గంజాయి త్రాగువారును వారికంటె చిన్నమెట్టులో నున్నారని తలపవలదు. బంగిపత్రి త్రాగుటచే ఎందరో ధర్మనిష్ఠులు బిచ్చగాండ్రకు బంధువులై వీథిలో తిరుగుచున్నారు. వీరిజన్మము వ్యర్థము మాత్రముగాక రోగపీడితులై, వైద్యుల అనుగ్రహముకొరకు తపోనిష్ఠులైరి. వీరు స్వాత్మహత్యకు పాత్రులైరి. మద్యపానులు స్వాత్మనాశనులేగాక వంశవినాశమునకు గూడ మూలపురుషు లను మాట చెప్పనక్కర లేదు.

మఱియు, తాను హింసింపక ఇతరులు హింసించినది తినుటలో దోషము లేదని గొప్పవారి హృదయములో గూడ గాఢముగా నాటియుండు ఒక గొప్పతలంపు కొండవలె గలదు. మాంసభక్షకులే హింసకు కారణపురుషులని తెలిసికొనుటకై వారి హృదయములో ఇంకను మనుష్యత్వమగు దివ్యప్రకాశము కలుగలేదని తెలియందగినది. మరియు మాంసాహారముచే రక్తములో చెడ్డ అణువులు చేరి దుష్టసంకల్పములు కలుగజేయుచుండునని ఆంగ్లేయపండితులు గూడ చెప్పుచున్నారు. మాంసాహారులను తమోగుణము విడిచిపోవుటకు అవకాశము లేదు. ప్రాణిహింస ఘోరపాపమేగాక అట్టిఆహారముచే సదా పాపకరమగు దుష్టసంకల్పములే గలుగుచుండును. ఈ విషయము సూక్ష్మబుద్ధి గలవాడొకడు మాంసాహారియైయుండి దానిని విడిచినచో సులభముగా కనుగొనవచ్చును. దీనికి దృష్టాంతము గోవులను, పులులను చూచిన తెలియును.

**విక్రీణన్మద్యమాంసాని హ్యభక్ష్యస్య చ భక్షణమ్ ।**
**కుర్వన్నగమ్యాగమనం శూద్ర: పతతి తత్క్షణాత్ ॥**

మద్యమాంసాదులను విక్రయించుటయు, ఆలాగుననే మధుమాంసభక్షణమును, గురుపత్నీ గమనమును చేసినచో, శూద్రుడైననుగూడ

తత్క్షణమే అధఃపతితుడగును. శూద్రావస్థయందుండు వాడే పతితుడగునప్పుడు ఇతరుల కథ చెప్పవలయునా? యనిభావము. పరాశరస్మృతిలోని ఈ శ్లోకముచే శూద్రులకు మద్యమాంసములు నిషిద్ధము గాదని చెప్పెడి దుర్యుక్తి తొలగిపోవును.

**అహింసా పరమో ధర్మః అహింసా పరమం తపః ।**

**అహింసా పరమం దానం ఇత్యూచుర్మునయస్తథా ॥**

అహింసకు సమమైన ధర్మమును లేదు. అహింసకు సరియైన తపస్సును లేదు. అహింసకు సమమగు దానమును లేదని తపోనిధులగు మునిశ్రేష్ఠులు ఘోషించుచున్నారు.

**కర్మణా మనసా వాచా సర్వభూతేషు సర్వదా ।**

**అక్లేశజననం ప్రోక్తా త్వహింసా పరమర్షిభిః ॥**

మనసుచేతను, కర్మముచేతను, వాక్కుచేతను, సర్వకాలసర్వావస్థల యందు ఒక ప్రాణికైనను, క్లేశము చేయకయుండుట అహింసావ్రతమని మహాత్ములైన మహర్షులచే చెప్పంబడినది.

**శ్లోకార్ధేన ప్రవక్ష్యామి యదుక్తం గ్రంథకోటిభిః ।**

**దయాసమం నాస్తి పుణ్యం పాపం హింసాసమం న హి ॥**

నేను అర్ధశ్లోకముచే కోట్లకొలదిగల వేదశాస్త్రముల సారాంశమును చెప్పుచున్నాను. అదేమన, దయాళుత్వమునకు సమమైన పుణ్యమును లేదు. ప్రాణిపీడనముకంటె గొప్ప పాతకమును లేదని శ్రీనారదవచనము

**ప్రవిశంతి యథా నద్యః సముద్రం ఋజువక్రగాః ।**

**సర్వే ధర్మా అహింసాయాం ప్రవిశంతి తథా దృఢమ్ ॥**

ఏలాగున గంగ, యమున, సరస్వతి మొదలుగాగల సమస్త నదీనదములును, ఋజువక్రములై, మహాసముద్రములో ఐక్యమగుచున్నవో, ఆలాగున యజ్ఞ, దాన, ధ్యాన, యోగ, తపస్సులు మొదలగు ధర్మములన్నియును, అహింసయను దయాసముద్రములో ఐక్యమొందుచున్నవి. ఇది నిశ్చయము. అనగా అహింసాధర్మవ్రతము సముద్రము వంటిదనియు, తక్కిన ధర్మము లన్నియు నదులవంటి వనియు భావము.



# జీవకారుణ్యము

''కారుణ్యం పరమం తపః'' అనగా సమస్త జీవరాసులయందు కారుణ్యముండుటయే పరమ తపస్సనబడును. అనగా, ఆత్మస్వరూపదర్శన మదియే యని మహాత్ములుద్ఘోషించుచున్నారు. మనము కొంచెము సూక్ష్మ దృష్టిని నిమీలనముజేసి చూచినచో, మానవజన్మమునకన్న నెంతో క్రింది జన్మములో నుండెడి గోవు, ఏనుగు, గుఱ్ఱము, జింక మొదలైన పశువులుగూడ పావనమగు తృణధాన్యాదులనే దినుచుండును. కనుకనే యవి మృగములైనను మానవులచే దేవతలవలె పూజార్హములైనవి. మఱియు నా జంతువులయొక్క శాంతము పావనత్వము నేమని చెప్పవచ్చును! దుష్టమృగములని పేరు జెందియుడు పులి, తోడేలు మొదలగు జంతువులు క్రూరస్వభావము గలవగుటచే మానవులకు దూరస్థములైనవి. ఇట్లుండగా నుత్కృష్టులైన మనుష్యులలో ఆర్యులని ప్రఖ్యాతి గాంచిన మర్త్యులు దయాశూన్యులై పులుల బోలె ప్రాణిహింసజేసి జీవించు టెంతాశ్చర్యకరము! మఱియు మనుజులలో పావనమైన వేదాంతవిచారులై, పుణ్యస్వరూపులైన సాధువుల రూపము ధరించుయుండు పెద్దలలో గొందరు జీవహింసాతత్పరులైయుండు టెంతవిచారకరము? అకటా! లోకములోగల యధర్మమును దొలగించి ధర్మమును బోధించుటకొరకుండెడి రాజయోగులలో గొందరి మనసు ఈశ్వరా! ఇంత కఠినమగుటకు ఉక్కుతో జేయంబడినదా? శివ! శివా! కించిత్తైనను కనికరములేని యీ నిర్దయ హృదయులకు జ్ఞానము గలదనుమాట నమ్ముటకంటె నమావాస్య అర్ధరాత్రిని పౌర్ణమి, మధ్యాహ్నమని చెప్పినను నమ్మవచ్చును. పై జెప్పిన దానిని నమ్మరాదు. ఒక్కరి యుదరములోపల మాంసము బ్రవేశించు నప్పుడు వారియందేదైన దయా, శాంత, శమ, దమాది సుగుణము లుండిన నప్పుడే దూరముగా బారిపోవును. ఎట్లన? ఆవులదొడ్డిలో పులి ప్రవేశించిన అచ్చట గోవులు నిలుచునా? ఇదియునుగాక చవిటి భూమిలో జల్లిన విత్తనము లెట్లు వ్యర్థములో అట్లే దయాశూన్యుల తపోధ్యాన జప పూజాదులన్నియు నిష్ప్రయోజనవములు. అదేరీతిగా శ్రవణ మనన నిదిధ్యాసనాదులు గూడ నిరుపయోగవములు. మఱియు జంతువులను

వధించునప్పుడు వాటి ప్రాణసంకటకరమైన పరితాపావస్థను జూచిన ఎవరి హృదయము నీరుగా గరుగకుండును!

సర్వేశ్వరా! ఇట్లుండియు శుష్కవేదాంతులు ప్రాణివధలలో రాక్షసులవలె నిర్దయులై యుండుటహో! యెంతకష్టము! దీనికి కారణము గలదు. ఒక్కడు జన్మనా అంధుడుగాను, బధిరుడుగా నుండినచో, దుఃఖముతో బరితపించు వాడొక్కడు పోయి నానాప్రకారముల దనకుండు పరమసంకటము జెప్పుకొని యేడ్చినను, బహుఖేదముతో బరితపించి, కరచరణాదులతో తన్నుకలాడినను ఈ దుఃఖ చిహ్నముల వినిగాని చూచిగాని యా బధిరాంధునికి కొంచెమైనను దయ గలుగునా? లేదు గదా! కారణమేమన, గ్రుడ్డివాడొటచే జూచుట లేదు. చెవిటివాడైనందున వినుట లేదు. అదే విధముగా నెవరికి ప్రాణులయొక్క సంకటము గోచరపడలేదో, వారికింకను నిజమగు మానవత్వము గలుగ లేదని బాగుగ దెలిసికొనుడు. ఇట్లుండగా వీరికి దైవాంశులచే బొందందగు రాజయోగత్వ మెట్లు సిద్ధించును? ''మనుష్యరూపేణ మృగాశ్చరంతి'' అనగా వారిని గోచర్మధారియగు వ్యాఘ్రమని తెలిసికొనుడు. అనగా వీరు పరమపావనులైన సాధువుల వేషమును, నిర్దయులైన రాక్షసుల కృత్యమగు ఆహారమును గలిగియుందురు. మఱియు నిర్మలదర్పణమందు పురోభాగవస్తువులు స్పష్టముగా బ్రతిఫలించునేగాని మలినదర్పణమున ప్రతిబింబించునా! ఆలాగున పరిశుద్ధ హృదయము లేనివారికి ఇతరప్రాణుల సంకటము హృదయములో స్ఫురింపదు. హృదయము పావన మగునప్పుడొక్క ప్రాణికైనను బీడగలిగిన జూచి సహింపదరము గాదు. మఱియు నితర ప్రాణులనుగాని, మనుజులనుగాని, సంకటపెట్టి తనయొక్క సుఖము బూరించునప్పుడు నిశ్చయముగా నతడు మృగమనుష్యుడే! తన యొక్క సుఖమును విడువకయు, అన్యప్రాణులయొక్క సౌఖ్యమునకు హానిగలుగ జేయకయు, ధర్మమార్గమున జీవించునప్పుడు నిజమైన మానవజన్మములో బ్రవేశించిన వాడగును. మఱల నింద్రియాది సమస్త సుఖములను రోసి సకల జీవుల సుఖమే తనయొక్క సుఖమను బుద్ధిగలిగి బ్రహ్మధ్యానానందామృతములో నోలలాడి తేజరిల్లునప్పుడు మానవదేవుడగుచున్నాడు. ఈస్థితియే నిజమైన సాధువులయొక్క యవస్థయని తెలిసికొనుడు.

ఈస్థితిలో వారు ముక్తులగుచున్నారు. ఈ పదవితో నుపమించు నప్పుడు మన శుష్కవేదాంతు లే స్థితియందున్నవారో పాఠకులే గ్రహించగలరు.

ఓహో! లోకము పాపాగ్నిచే దహింపబడుచుండగా నాయగ్నికి వాయుదేవుడు సహాయపడినట్లు మనరాజయోగులలో గొందఱు పాపకరమైన ప్రాణిహింస, సురాపానాదులు దోషకరము గావనియు మనుజులకొఱకే యవి సర్వేశ్వరునిచే సృష్టింపంబడెననియు జెప్పునదెంత వివేకశూన్యమైన మూర్ఖత్వము! హా! వీరికి ఈశ్వరకరుణ యెట్లు గలుగును? ఈశ్వర కారుణ్యామృతవృష్టి లేనిచో తాపత్రయాగ్ని యెట్లు శమించును? ముష్టివిత్తనమును నాటిన కమలాఫలములు బండునా? పూర్వీకులగు సాధువులు దమయొక్క యావజ్జీవతమును లోకసేవలో వినియోగపరచి ధన్యులైరి. ఇప్పుడున్నవారలు శిష్యులయొక్క ధనమును దోచుకొని జిహ్వేంద్రియ చాపల్యము నిలుపజాలక ఇంద్రియసౌఖ్యములే పరమపురుషార్థమని నమ్మి బద్ధులగుచున్నారు. ఈ యధర్మమునకు బూనినప్పటి నుండియే లోకము దుఃఖమునకు బాలైనది. వీరికమీద దమయొక్క యాత్మగౌరవము నిలుపుకొనుటకును, శిష్యులకు గల భక్తి విశ్వాసములు చెడకుండుటకును, పెద్దమనుష్యులకు వీరియందుగల నమ్మకమును నెలకొల్పుటకును, అధ్యాత్మజ్ఞానమునకు గళంకము గలుగకుండుటకును విచారముండినచో, ఇప్పుడైనను సదాచార సన్మార్గములలో నడుగుపెట్టుట మంచిది. లేనిచో నికమీద సంసారమం దుండెడి స్త్రీ బాలురకుగూడ వీరు జవాబు చెప్పజాలరని నేను దృఢముగా నమ్ముచున్నాను. ఏలన! ధర్మబోధమను సూర్యోదయమైనది. దానియొక్క చిహ్నమే శిరశ్ఛేదమున కధికారము బొందియుండు నధికారుల సమీపించి బాలురును, స్త్రీలును, స్వరాజ్యము కొఱకు ధర్మధ్వజములను జేతులచే బైకెత్తుకొని యుచ్చస్వరముతో నిర్భయముగా ధర్మమును జాటించుచున్నారు. కనుక నొకవేళ చిరకాలము నుండి యలవాటుపడిన దురభ్యాసములను ఇప్పుడు నిలుపుటకు తగువైరాగ్యము లేనిచో, మేము చాలాకాలమునుండి భుజించుచు వచ్చినందున ఇప్పుడు విడుచుటకు సాధ్యము గాదని చెప్పుట మేలు. లేనిచో నికమీద వారి యవస్థ సంకటకరమని వ్యసనపూర్వకముగా జెప్పుచున్నాను. వీరి బెదిరింపులకు భయపడువారు లేరని

లోకపరిస్థితిని జూచి గ్రహించుట చాలమంచిది.

జనన మరణ దుఃఖసాగరములో లోకమును ఓడను నడిపేవారు సాధువులైయుండుటచే నింతదూరము చెప్పవలసి వచ్చినందుకై చింతిల్లుచున్నాను. ఏలన, చుక్కానివారు ప్రమాదము నొందిన ఓడ సమయమునకు గమ్యస్థానము జేరక జనులు సంకటపడునట్లు సంసార సాగర తారక మార్గదర్శులైన పెద్దల యుపదేశము సరిగా లేనిచో ప్రపంచము చెడిపోవును. వృక్షముయొక్క మొదలు చెడిన, ఏలాగున సమూలముగా నశించునో, ఆలాగున లోకోపదేష్టలగు గురువుల నడతలో లోపము వచ్చిన, ప్రపంచమంతయు భ్రష్టత్వమునొందును. కావున నిట్లు జెప్పవలసి వచ్చినదేగాని మఱియొక విచారముతో జెప్పంబడినదని తలంచకుండుటకై ప్రార్థన.

యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరో జనః ।
స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే ॥

అను భగవద్వచనమును స్మృతికి దెచ్చుకొనెదరు గాక! మఱియు నొక్కడింద్రియాదిసుఖములకు నెంత లోనగునో యంత లోకములో బద్ధుడగుటయేగాక, దైవదూరస్థు (ఆత్మదూరస్థు) డగుచున్నాడు. ఒక్కడు దేహేంద్రియాది సుఖములలో నెంత విరక్తుడగుచున్నాడో. యంత లోకములో విముక్తుడగుటయేగాక, దైవ సన్నిహితుడగుచున్నాడు. మఱియు, గంజాయి త్రాగువారు తమ్ము ప్రకృతికి నొప్పగించుచున్నారు. వధించుటకు నిరీక్షించు చుండెడు శత్రుసన్నిధిలో కరచరణములు తనకు తానే గట్టుకొని యెదుట బడిపోయినవాని వంటిది పత్రి త్రాగువారి గతియని తెలిసికొనుడు. ఈ పత్రిచే నెందరో జనులు గౌరవమును త్యజించి బిచ్చగాండ్రయి జన్మమును వ్యర్థపరచు చున్నారు. పాపము! వీరి కొక్కరోజు సమయమునకు గంజాయి దొరకనియెడల బడెడు కష్టమీశ్వరునకును, వారికిని ఎఱుక. ఇదే రీతిగా సురాపానముచేయువారి గతిగూడ పరమసంకటకరము. సురాపానము చేనెన్నియో గొప్ప కుటుంబములు నశించినవి. ఈలాటి కష్టములు గలుగుట జూచి సాధువులలో గొందరీ నీచ వృత్తి నవలంబించుట గడు శోచనీయము. ఇప్పుడు పాశ్చాత్య దేశ ములలో

గూడ ననేకులు మాంసము రోగకారణ మనియు, పాప బుద్ధిని గలుగజేయున దనియు గ్రహించి శాకభక్షకులై నిర్మలముగా జీవితమును గడపునప్పుడు బ్రహ్మనిష్ఠులై వేదాంతసారామృతమును పానముచేయు చుండవలసిన మన సాధువులలో కొందరి గతిని జూచినచో, నెవరి హృదయము బరితపింప కుండును?

పావనులైన ప్రియసోదరీ సోదరులారా! బహు జన్మకర్మవాసనచే మనస్సు విషయవాసనల ద్వారా ప్రపంచము వైపు బోవుచుండును. కనుక నా విషయమార్గముగా దిరిగిన దుఃఖసాగరములో బడిపోవును. ప్రవాహవేగములో విడిచిపెట్టిన పడవ సముద్రమున బ్రవేశించును గదా! తెడ్లచేతను, చుక్కానిచేతను బడవను జల ప్రవాహమునకు వ్యతిరేకముగా నడిపెడువాడు గమ్యస్థానము జేరునట్లు విచారశక్తిచే మనసును సన్మార్గమున నడపువాడు మాత్రమే మోక్షము నొందగలుగును. వీటిలో మొదటిది ప్రవృత్తిమార్గము, రెండవది నివృత్తిమార్గమని గ్రహింపుడు. ''అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః'' అని భగవద్వచనము. కొందరు ప్రకృతిగతములైన వృత్తులను శరణాగతి బొందు చున్నారు. వీరు పై నుదాహరించిన ప్రవాహపు పడవ వంటివారు. తాను వృత్తి రహితుడనియు, శుద్ధుడనియు, నిర్మలుడనియు, జ్ఞానమే స్వరూపముగా గలవాడనియు, దెలిసిదెచ్చుకొని ఆత్మను శరణు జొచ్చువారు మాత్రమే ముక్తులగుదురు. కనుకనే ''శ్రీమన్నారాయణచరణౌ శరణం ప్రపద్యే'' అని చరమావధి ప్రపత్తి వాక్యము బోధించుచున్నది. కావున పరిశుద్ధ బోధస్వరూపులైన సోదరీ సోదరులారా! సమస్త జీవరాసులయందు దయగలవారలై, శాంతులై, ధర్మనిష్ఠులై, దైవభక్తులై భవసాగరమును తరించుదురు గాక! మనకు గ్రిందిజీవులపై గరుణగలిగిన మనపై నుండు సిద్ధపురుషులు మనలను కరుణించుదురు. మిత్రులారా! జిహ్వాచాపల్యము నిలుపుట చాలా దుస్తరము. భగవద్భక్తి యను అమృతపానమును జేయనివారి కది సాధ్యము గాదు. జిహ్వేంద్రియమును జయించకుండినచో, దక్కిన యనుష్ఠానము లన్నియు వ్యర్థములు. ఒక్క రసనేంద్రియమున జయించినట్లయిన తక్కిన ఇంద్రియము లన్నియు తమకు తామే లోబడును. ఎట్లనన? జిహ్వాద్వారా ఉదరములో ప్రవేశించునట్టి

యాహారసార మింద్రియములను ప్రేరేపించుచుండును. సమస్తమైన ప్రాణులకు జిహ్వేంద్రియ, గుహ్యేంద్రియములు రెండును నరక ద్వారములు. ఈ రెంటిని లోబరచుకొన్నవాడు మాయను జయించినవాడే.

> పృథివ్యాం యాంతి భూతాని జిహ్వోపస్థ నిమిత్తకమ్ ।
> జిహ్వోపస్థ పరిత్యాగే కో న ముచ్యేత బంధనాత్ ॥

> తావజ్జితేంద్రియో న స్యాద్విజితాన్యేంద్రియః పుమాన్ ।
> న జయేద్రసనం యావజ్జితం సర్వం జితే రసే ॥

దీని యర్థము పై నుదాహరించినదే.

> సర్వశాస్త్ర పురాణేషు వ్యాసస్య వచన ద్వయమ్ ।
> పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్ ॥

సర్వశాస్త్ర పురాణములలోగల వచనములు రెండేయని శ్రీవ్యాసభగవాను లుపదేశించిరి. అదేమన? పరోపకారమే పుణ్యమనియు, పరపీడనమే పాపమనియు దెలిసికొనుడు.

> నాకృత్వా ప్రాణినాం హింసాం మాంసముత్పద్యతే క్వచిత్ ।
> న చ ప్రాణివధః స్వర్గ్యః తస్మాన్మాంసం వివర్జయేత్ ॥

ప్రాణివధ చేయక మాంసము ఎచ్చటను దొరకదు. ప్రాణివధ చేయువానికి ఉత్తమగతి లేదు. వాడు పుణ్యలోకప్రాప్తి నొందజాలడు. కావున మాంసము వర్జించిన మాత్రమే ప్రాణిహింస నిలుచును. కావున మాంసభక్షకులే ప్రాణిహింసకు పాత్రులగు చున్నారు.

> అహింసా సత్యమస్తేయం శౌచమింద్రియనిగ్రహః ।
> ఏతత్సామాసికం ధర్మం చాతుర్వర్ణ్యేఽబ్రవీన్మనుః ॥

అహింస, సత్యము, దొంగిలింపకుండుట, బాహ్యాభ్యంతర శుద్ధి, యింద్రియనిగ్రహము అను ఈ అయిదు ధర్మములు మనుష్యమాత్రులందరికి ఉండందగినవి, నాలుగు వర్ణస్థులకును అనుష్ఠేయములు.

**అనుమంతా విశసితా నిహంతా క్రయవిక్రయీ ।**
**సంస్కర్తా చోపహర్తా చ ఖాదక శ్చేతి ఘాతకాః ॥**

హింసను ఆమోదించువాడు, ఛేదించువాడు, వధించువాడు, అమ్మువాడు, కొనువాడు, వండువాడు, తెచ్చువాడు, తినువాడు అను ఎనమండ్రగురును ఘాతకులలో చేరిన పాపాత్ములు.

**అహింసా సత్యమస్తేయం బ్రహ్మచర్యం తపోవ్రతమ్ ।**
**క్షమా దయా చ సంతోషో వ్రతాన్యస్యవిశేషతః ॥**

అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, తపస్సు, ధర్మసంరక్షణ వ్రతము, ఓర్మి, భూతదయ, యెల్లప్పుడు సంతోషముగ నుండుట అను నీ యెనిమిది గుణములును మనుష్యులకు నిర్మలములైన వ్రతములు అని మనుస్మృతి.

**పఠంతు శాస్త్రాణి యజంతు దేవా౯**
**కుర్వంతు కర్మాణి భజంతు దేవతాః ।**
**ఆత్మైక్యబోధేన వినా విముక్తి**
**ర్న సిద్ధ్యతి బ్రహ్మశతాంతరేఽపి ॥**

సమస్త శాస్త్రములను సాంగముగా పఠించుదురు గాక! యజ్ఞాది క్రతువులచే సమస్తదేవతల నుద్దేశించి యాగాదులు చేయుదురుగాక! నిత్యనైమిత్తికాదికర్మలను విధిప్రకార మనుష్ఠింతురు గాక! శ్రీరామ, శివ, విష్ణ్వాది దేవతలను భజించెదరుగాక! ఆత్మవత్ సర్వభూతాని అనుబోధము గలుగువరకు శతజన్మపర్యంతము ప్రయత్నించినను మోక్షము గలుగదని శ్రీజగద్గురు శంకర భగవత్పాదాచార్యులు వివేకచూడామణిలో ఆనతిచ్చిరి.



# న బోధాత్పరమం సుఖమ్

1. ఒక్కొక్కరున్ను వారివారి జీవనమునకు సాధ్యమైనంతవరకు పాపము లేని పనిని కాలసమయము తప్పక శ్రద్ధతో చేయుట ధర్మము. ఈ విషయములో విజయము నొందినచో లోకములోని వారందరును విజయులే.

2. వారివారి జీవనయాత్రచే ఒక్క ప్రాణికైనను,క్లేశము కలుగకుండునట్లాచరించుట పరమధర్మము. క్లేశము కలిగినచో, మరి యొకవిధమున నతడును నిశ్చయముగా దుఃఖితు డగును.

3. అశాశ్వతమగు దేహపోషణకొరకు సమయము నేర్పరచినట్లు ఒకప్పుడైనను దైవప్రార్థన ధ్యానజపాదులకు అనుకూల మేర్పరచుకొనుటయే మానవజన్మమెత్తిన వారందరియొక్క ముఖ్యకర్తవ్యాంశము.

4. అధర్మమార్గముచే పంచభక్ష్య పరమాన్నాదివస్తువులను భుజించి, జీవించుటకన్న ధర్మమార్గములోనుండి అంబలికూటినీరుతో జీవించుట శ్రేష్ఠతరము. అధర్మమార్గ క్షీరాన్నాదులు విషము కలిసినవని దృఢముగా నమ్ముడు.

5. సాక్షాదపరోక్షజ్ఞానము కలిగినను, యుక్తాహారము, వివిక్తవాసము, బ్రహ్మచింతనము అను నీ రత్నత్రయములను శరీరపతనపర్యంతము విడువరాదు. విడిచినవాడు గురుద్రోహి యగు ననుట మరువకుడు.

6. ఉత్తమ కులమని తలంచెడి ఒక్క కులములో జన్మించిన వారిలో నొక్కరైనను దానికి సరియయిన సమస్త గుణములు పూర్తిగా లేక తాను శ్రేష్ఠుడని తలంచినచో ఆ కులమును, ఆ దేశమును అధఃపతనమునకు కారణమగును. ఆలాగుననే తక్కువ కులమని తలంచి ఉత్కృష్టస్థితిని పొందుటకు అర్హత లేదని తలంచినచో ఆ వంశమును, ఆ రాజ్యమును దుఃఖములో మునుగును.

7. ఒక్కడు దేహేంద్రియాది సుఖములలో ఎంత యాసక్తుడగుచున్నాడో, అట్టివాడు లోకములో అంత బద్ధుడగుటయే గాక దైవదూరస్థుడును అగుచున్నాడు. ఒక్కడు దేహేంద్రియాది సుఖములలో ఎంత విరక్తుడగుచున్నాడో, అంత లోకములో విముక్తు డగుటయే గాక, దైవసన్నిహితు డగుచున్నాడు.

8.సత్యము, ధర్మము, ఆత్మపారిశుద్ధ్యము అను వీటిననుష్ఠించుటకును, ఈ మహాదంను లోకములో నిరాటంకముగా ఉపదేశించుటకును సన్న్యాసమేర్పడినదని యెవ్వరును మరువకూడదు.

9.నీళ్ళచే నిప్పును చల్లార్చునట్లు శాంతముచే కోపమును, సత్యముచే అసత్యమును, ధర్మముచే అధర్మమును, శ్రద్ధచే ఆలస్యమును జయింపవలెను.

10. ప్రకాశముచే తమస్సును జయించునట్లు కరుణచే కాఠిన్యమును, త్యాగముచే లోభమును, విరాగముచే రాగమును, దయచే భేదబుద్ధియు జయింపదగినవి.

11. నావచే సముద్రమును దాటునట్లు విచారణజ్ఞానముచే సంసారమును, ధ్యానముచే మాయను, యోగముచే మనస్సును, ధైర్యముచే లోకమును దాటవచ్చును.

12. వర్షముచే దావాగ్ని శమించునట్లు, భక్తిచే తాపత్రయాగ్నియు, ప్రేమచె ద్వేషబుద్ధియు, అమృతత్వముచే మృత్యువును, పారిశుద్ధ్యముచే మాలిన్యమును శమించును.

**ఉత్తిష్ఠత! జాగ్రత! ప్రాప్యవరాన్ నిబోధత!**

❋❋❋❋❋

# బ్రహ్మనిష్ఠాశ్రమ ప్రవేశన పత్రిక

1. దయాస్వరూపుడు, సత్యస్వరూపుడునగు సర్వేశ్వరుని (బ్రహ్మమును) లేక నిత్యసుఖమగు శాశ్వతపదవిని (నిర్వాణమును) వెదకుటలోను, సాక్షాత్కరించుటలోను, ఇతరులకు బోధించుటలోను, దీనికి సులభమార్గములు కనిపెట్టుటలోను శ్రద్ధ గలిగి యుండవలెను.

2. తానుండు మతములో సత్యమునకు, ధర్మమునకును, మానవుల ఇహాభివృద్ధికిని, ఆత్మసౌఖ్యమునకును (మోక్షమునకును) ప్రతిబంధములు కలుగజేయు శాస్త్రము లేవైన యుండిన పరిత్యజించుటయు, పై జెప్పినదానికి అనుకూలమైన విషయములు ఏ శాస్త్రములో గాని, ఏ మతములోగాని యుండిన

అవశ్యముగ గ్రహించుటయు కర్తవ్యము.

3. ఈ ఆశ్రమములో చేరువారు పురుషులుగాని, స్త్రీలుగాని తాము కృతయుగములో నుండువారమనియు, పురుషుడైనచో ఋషికుమారుడననియు, స్త్రీయైనచో ఋషి కుమార్తెననియు నిస్సంశయముగ బోధము కలుగునంత మనఃపరిపక్వత కలిగియుండవలయును.

4. అమూల్యమగు మనుష్యజన్మములో ఒక్క నిముషమైనను వ్యర్థము చేయక ఆత్మనిష్ఠలోను, శాస్త్రవిచారణలోను, పుణ్యకర్మానుష్ఠానములోను, గృహస్థుడైన కుటుంబపోషణకార్యములోను, ఇతర జనుల దుఃఖ నివృత్తి పరమగు కార్యము చేయుటలోను, బోధించుటలోను కాలము గడపవలయును. జీవనోపాయ కృత్యము దోషవివర్జితముగాను, ఆత్మజ్ఞాన ప్రతిబంధము లేనిదిగాను చేయుట ముఖ్యకర్తవ్యము.

5. ఈ సంఘమువారు ఆత్మాభివృద్ధికిని, ఇహాభివృద్ధికిన్ని చేయు కార్యములలో శక్త్యనుసారముగ సహాయము చేయుచుండవలయును. ఆలాగున మరి వేరెవరైనను చేయు పుణ్యకార్యములు సత్యమైనవిగా తోచినచో వారికి గూడ అనుకూలమగు సహాయము చేయవలెను. ఇహములో అనుకూలము లేనివారికి పరములోగూడ అనుకూలపడుట ప్రయాసమని మరువకుడు.

6. ప్రాణిహింస చేయకుండుటయు, ప్రాణివధ ఆహారములను మానుటయు, ఆలాగున గంజాయి, నల్లమందు, సురాపానము మొదలగు దోషపదార్థములను విడిచి శుద్ధాహారుడై, శుద్ధప్రవర్తకుడై బ్రహ్మసాక్షాత్కార పర్యంతము గురూపదిష్ట నిష్ఠలను ప్రతిదినము తప్పక అనుష్ఠించుటయు కలిగియుండవలయును.

7. విషయవిరక్తి, బ్రహ్మచింతనము, జీవకారుణ్యము, పరమశాంతము అను ఈ నాలుగు మహావాక్యములు వీరి వ్రతములు. దీనిలో గృహస్థపురుషుడైన తన భార్యతప్ప తక్కిన స్త్రీలందరిని తల్లుల వలెను, స్త్రీయైన తన పతిని తప్ప యితరపురుషులను తండ్రుల వలెను నిశ్చయముగా చూడవలసినదే కాక,

గృహస్థులకు విధించి యుండు విరక్తితో నుండుట శ్రేయస్కరము. ఇతరులు సంపూర్ణవిరక్తులై యుండవలయును.

8. ఈ ఆశ్రమములో చేరువారు పైనుదాహరించిన యావద్విషయములను తమ యావజ్జీవితము అనుష్ఠింప గలవారమని దైవసాక్షిగా ప్రమాణము చేయవలయును. సుగుణములు గలవారు ఏ కులము వారయినను దీనిలో చేరవచ్చును. పైనుదాహరించిన సంగతులలో అనివార్యకార్యము లేవైన తటస్థించి అనుష్ఠించుటకు సాధ్యపడకపోయిన సంఘములో ప్రధానమైన వారిని విచారించి మార్పు చేసికొనవచ్చును.



# సదుపదేశములు

1. ఆత్మ నియమనము కావలయునా? ఆహారనియమము నవలంబించ వలయును. 2. నిశ్చల ధ్యానము కావలయునా? నిర్మల భక్తిలో మునుగువలయును. 3. అగాధనిష్ఠలో ప్రవేశింపవలెనా? అఖండజ్ఞానము కలుగవలయును. 4. సోఽహంభావ ముదయించ వలయునా? అహంభావము నశించవలయును. 5. నిర్వికల్పసమాధి గలుగవలయునా? సవికల్పము క్షయించవలయును 6. సత్యజీవితము గడుపవలయునా? అసత్యలోకమును తృణీకరించ వలయును. 7. పరమశాంతితో జీవించవలయునా? అశాశ్వతమును విడువలయును. 8. కరుణామృతముతో బ్రతుకవలయునా? కారుణ్యము నవలబించవలయును. 9. విరక్తులై యుండవలయునా? సంస్కారము నొందవలయును. 10. దైవప్రేమ కావలయునా? లోకమును ప్రేమించవలయును 11. దైవత్వము నొందవలయునా? దైవమయమై యుండవలయును. 12. సాధింపవలయునా? సాధనలో అమరవలయును. 13. వృత్తులనెడు బీజములను దహింపజేయుటలో ప్రాణాయామమనెడు అగ్నికి సమానమైది మరియొండు లేదు. 14. మనస్సనెడు మాయా తమస్సును నశింపజేయుటలో ఆత్మజ్ఞానైక బోధమనెడు భాస్కరోదయమునకు సదృశమైనది మరియొకటి

లేదు. 15.అహంకారమనెడు రాక్షసుని సంహరించుటలో నిర్మలభక్తి యనెడు భగవంతునికి సదృశ మింకొకటి యుండబోదు. 16. భేదమనెడు బాధను తొలగించుటలో కరుణ యనెడు దివ్యరసాయనామృతమునకు సమమైనది మరియొండు లేదు. 17. సంసారమనెడు మాయాపాశమును ఛేదించుటలో వైరాగ్యమనెడు వజ్రాయుధమునకు తుల్యమైనది మరియొకటి లేదు. 18.ప్రసన్నమైన నిత్య సంతోషమును గలుగజేయుటలో శాంత మనస్సనెడు చంద్రోదయమునకు సాటియైనది ఒకటి యుండబోదు. 19. నియమ నిష్ఠలన్నిటిలోను సంయమమునకు సమానమైనది మరొకటి యుండజాలదు. 20. ఇంద్రియము లనెడు మృగములను నిగ్రహించుటలో వ్రతానుష్ఠాన మనెడు సింహమునకు సమానమైనది మరియొకటి లేదు. 21. తత్త్వబోధ మనెడు దివ్యజ్యోతిని స్థిరముగా నిలుపుటలో బ్రహ్మచర్యమనెడు ఓజస్సునకు సదృశమైనది మరియొకటి లేదు. 22. నిర్భయుడై వెలుగవలసి యుండిన సత్య నిష్ఠకు సమానమైన ఏకచక్రాధిపత్యము మరియొకటి లేదు. 23. ద్వైతము నశించి అద్వైతప్రభువై ప్రకాశించవలసియుండిన దైవత్వము నొందుట తప్ప మరియొక్క ఉపాయము లేదు. 24. సర్వత్ర విజయము నొంది నిశ్రేయస్సు నొందవలసి యుండిన నియమిత కృత్యమును నిశ్చిత కాలములో చేయుటకన్న గత్యంతరము లేదు.

లోకాస్సమస్తా స్సుఖినోభవన్తు.

ఓం శాన్తిః శాన్తిః శాన్తిః.

